కావ్యత్వమును కొంతగ కల్పించినది. ఇందలి తుదివాక్యము వ్యంగ్యోక్తికిని, చమత్కారమునకును నిదర్శన మగుచున్నది. "ఆకసమున తామరలు మొలుచునా!" వంటి నిదర్శనాలంకారములును వీరి రచనకు శోభనిచ్చినవి.

"నా కంఠవాతజాడ్యము ననుగ్రహించిన వెలయాలు, గొట్టాలమ్మ (కలరా) వేంచేయు, ఏపుణ్యాత్ముడో నా గావంచా కాజేసెను; విజయనగరమున హుక్కాసువాసన తప్ప మిగిలిన డెల్ల దుర్వాసన, అతడు నేర్పినవిద్య యెట్లున్నను మప్పినచుట్ట శాశ్వతమాయెను. ఏకాక్షి త్రితయ (సబ్ మేజిస్ట్రేటు, అతనిభార్య, అతని కుక్క) మొక్కచో ప్రోగయ్యెను." -మొదలైన ప్రయోగములు వ్యంగ్యచమత్కారయుతములై దాసుగారి పరిహాసచతురతకు సాక్ష్యములుగ నొప్పినవి. వారు క్లబ్బులో ప్రవేశించునపుడు " Love fifty" అను కేకలు వినిపించె ననుటయు, భీముడుగారి వేశ్యాశోధనము ముగిసిన పిమ్మట "సీతో పొందు చింతకాయ" అనియు, వైష్ణవమిత్రులయింట పెద్దగురుసేవ చేయునపుడు "ముండదేవుడు కుదిర్చెను కదరా ముగ్గుర నొకమారు" అను పాటను కల్పించి పాడుటయు నిట్టి చమత్కార విశేషములే.

శ్రీ నారాయణదాసుగారి భాషయందలి వైశిష్ట్యము విశేషముగ వారి ఉపమాప్రయోగమునందు కన్పట్టుచున్నది. వారి ఉపమలలో నూటికి తొంబదిపాళ్ళు స్వోపజ్ఞములు. ఇవి బాహ్యాంతరికములైన విశాలప్రపంచములను తమయందిముడ్చుకొని శ్రీ దాసుగారి నిశితభావనాశక్తిని, సంస్కృతీవిలసనను వెల్లడించుచు "ఉపమా కాళిదాసస్య" అన్నట్లు "ఉపమా ఆదిభట్టస్య" అన నొప్పుచు రసజ్ఞలోకమును గిలగింతలు పెట్టజాలియున్నవి. "చదువు కోటాకువేసిన గురుజుపిట్టలా తిరుగుట; దైవమువలె కూర్చున్న బ్రహ్మ (యజ్ఞమును చేయించువారిలో ముఖ్యుడు) పుణ్యపుంజమువలె భర్త చెంగట నున్న సోమిదేవి; ధవళమేఘములవలె వ్రేలు ప్రత్తిచేలు; వేదహిత ధర్మముల

మాడ్కి నొడ్డుచేర్పు నోడలు; వంగమూడికవలె పిలకర్ఘూడించు; కామే శము పంతులు సవారిడేగవలె వచ్చెను; [భార్య మరణానంతరము పునర్వివాహమాడుట] రాత్రిపడ్డ గోతిలో మరల పడినట్లు; డబ్బిచ్చి తద్దినము గొనినట్లు; వదలిన పీడను తిరిగి తెచ్చుకొన్నట్లు; పెండ్లిపిల్లలు బొడ్డుకోకతో నెండురొయ్యవలె గన్పట్టిరి; నీరు మింటివఱ కుప్పొంచుటచే పండుగుల ముందు వెనుకల నున్న మనస్సువలె పడవ లాకున నున్నతమై పిదప మామూలుస్థితి వహించెను; పరపతి పోగొట్టు దబ్బరపల్కులరీతి గాలింగూడనీని తెఱచాపల ఛిద్రములు; కేసుగెల్చుటకు వాదించు ప్లీడర్లవలె భోగేచ్ఛం బోరాడు వృషభంబులమాడ్కి నొండొరుల మీరి రాగతానపల్లవుల బాడుచుంటిమి; సొరంగమునుండి రైలు బయటపడినపుడు కష్టము గడచినట్లు నిద్రమేల్కొన్నరీతి, రహస్యము నెఱిగినట్లు ననుభూతి నొందితిమి; [భీముడుగారు తిరిగి మమ్మాదరించుటచే] క్రొత్తకుండలో జోరీగచొచ్చిన ట్లైనది మాపని; వారింట భుజించి చెట్టువిడిచిన భూతమువలె తిరిగితిమి; — ఇట్టివి వారి సహజ సిద్ధములైన ఉపమలకు అల్పనిదర్శనములు. శ్రీ దాసుగారి బాల్యదశ బరంపుర మద్రాసుప్రయాణాది వర్ణనలకు చిత్రవిచిత్రములు, బహుసంఖ్యాకములు నైన ఉపమలు ప్రాణప్రదములు. శ్రీ దాసుగారు "రూపాజీవలు శ్మశానకుసుమములవలె వర్జనీయలు, పూలతావి మోసికొని వచ్చుటచేత సంతర్పణము తిన్న బ్రాహ్మణునివలె గాలులు మెల్లగ వీచుచున్నవి" — వంటి ఉపమలను పూర్వకవి గౌరవమువలనను, దేశాచారాభిమానమువలనను ఆదరింపకపోలేదు. పరిశీలింపగా ఔపమ్య, తర్క, న్యాయమూలాదులైన సర్వాలంకారములకు దాసుగారి "నా యెఱుక" యందు ఉదాహరణములు కన్పట్టకపోవు.

శ్రీ దాసుగారు ఆంధ్రజాతి సంస్కృతికి సుస్థిరసాక్ష్యములై యున్న సామెతల నెన్నింటినో "నా యెఱుక" యందు ప్రయోగించి తమరచనకు స్ఫూర్తిని చేకూర్చుకొనిరి. "నానాటికి తీసికట్టునాగంభట్లు;

జ్వరము తగిలి సందెకు దించినట్లు; దొంగిలింపబోయిన మంగలము దొరికినట్లు; దూదేకువారికి దుంబ తెగులు; గ్రుద్దులాడుకొన్నగాని కులము బయటపడదు; చేయునవి మాఘస్నానములు దూరునవి దొమ్మరి గుడిసెలు; వినాయకుని చేయబోయిన క్రోతియగు'' — వంటి ప్రసిద్ధము లైన పెక్కు సామెతలను సందర్భోచితముగ, కులవర్గపక్షపాతరహిత దృష్టితో శ్రీ దాసుగారు ఆదరించి ప్రయోగించినారు.

శ్రీ దాసుగారు బహుభాషాకోవిదులు. నేర్చినభాష లన్నింటను వానియందలి జాతీయ ప్రయోగ నైపుణ్యమును పుణికి పుచ్చుకొన్న వారు. చిన్ననాడే "All his love — in him"ను తరగతియందలి విద్యార్థు లందరును పూరింపజాలనపుడు "Centred" అని చెప్పి "that is very learned" అని ఆచార్యుని మెప్పుగొన్నవారు. అట్టి దాసుగారు "నా యెఱుక" యందు దేశీయములను, జాతీయములను, కోకొల్లలుగ ప్రయోగించి తమ రచనకు నిత్యతారుణ్యమును సంపాదించినారు. ఇందుకు "భరద్వాజవిందు, శృంగభంగము, కాష్ఠవాదము, కంకోష్ఠు పద్యము, శశవిషాణము, గగనకుసుమము, తిక్కశంకరయ్య, దాపు మూపు తెలుగకపోవు, లెంపకాయ ఖర్చునకిచ్చు, వేలంవెర్రి గవ్వగ ఖర్చుపెట్టు, తొమ్మిదవ అర్థము పారాయణముచేయు, గురుడు పన్నెం డింట నుండు, ఏకు మేకగు, బ్రహ్మానందమొందు" వంటి ప్రయోగ ములు ఇందుకు కొన్ని నిదర్శనములు.

"నా యెఱుక" యందు శ్రీ దాసుగారు సహజత్వమును సంపా దించుటకై మాండలిక శబ్దములను బహుభాషలనుండి స్వీకరించిన శబ్ద జాలమును ప్రయోగించినారు. ఆంగ్లభాషలనుండి వీరు "College, Magistrate, Scoundrel, thanks," వంటి ప్రత్యేకపదములనే గాక "Vice-versa, Love fifty" వంటి పదబంధములను, "It lulled me to sleep" వంటి వాక్యములను సైతము గ్రహించి ప్రయోగించినారు. ఆంగ్లభాషాశబ్దములతో "కంట్రీగురుడు" వంటి సమాసపదములను

కల్పించుటకును వీరు వెనుదీయలేదు. వీరి రచనయందు "సీదా, రస్తా, జరూరు, కరారు, కైజారు, ఉమ్మేజువారి, బిసాబాజు, కావేషీ, నిసీబు, తైనాతు, నాజూకు, సాహెబు, ఫర్మాయించు మొదలైన ఉర్దూ, పర్షియన్, అరబిక్ పదములు "నాయెఱుక" యందు అనంతముగ ప్రయుక్తములయినవి.

శ్రీ దాసుగారు "తుంబ, తరవాణి, వంతర, వాణము (బండి) ముత్తములు, పల్ల, (చేతి) రువ్వ, మదిని (వదినె), పెయ్యమ్మ (పెత్తల్లి), తోంచ్చి (పినతల్లి), ఆచ (అన్న), చిట్టి (పినతండ్రి), గోర్జెలు, లంకె, మప్పు, చీరె (వస్త్రము)", వంటి మాండలిక పదములను; "బ్రహ్మ, పురోడాశము, ఇష్టి" వంటి వృత్తిమాండలిక పదములను; బాణమిచ్చు (ఐదురూపాయిలు సంభావనయిచ్చు), గురుడు (నల్లమందు, గంజాయి బ్రాందీవంటి మద్యపదార్థము), గోవిందుడు (సారాయిసీసా), వంటి సాంకేతిక పదములను ఝుడితిస్ఫూర్తినాసించి ప్రయోగించినారు. "దిబ్బ భడవ, గుంటడు, స్కాంద్రలు, శుంఠలు (రసహీనులు)" వంటి తిట్లు సముచితముగ ప్రయోజితములైనవి. "నీ అమ్మకనులు మండ, గుంటడు" వంటి తిట్లు ప్రేమార్ద్రతను వెల్లడించుట యందును ఆంధ్రదేశాచారము ననుసరించి 'నా యెఱుక'లో ప్రయుక్తములయినవి.

శ్రీ దాసుగారు నైజముగ లక్షణవిరుద్ధమైనభాష నాదరింపని వారు. శిష్టభాషాప్రియులు. సామాన్య, సంశ్లిష్ట, సంయోగవాక్యములను ఆవశ్యకత లెరిగి ప్రయోగింపనేర్చినవారు. చర్చకు వచ్చినపుడు క్త్వార్థకము భిన్నకర్తృకమై యుండుటకు నన్నయ పెద్దనలనుండి ప్రయోగములు చూపనేర్చిన వ్యాకరణ పాండిత్యము కలవారు. ఐనను వీరు లోకభాష నాదరించుటచే "శివకోవెల, భరద్వాజ విందు, సర్పజెముడు, యుద్ధపుంజు" వంటి వైరిసమాసములు, "ముక్కోపి" – వంటి గ్రామ్య బహుబ్రీహి, "పాటకుడు (గాయకుడను నర్థములో దేశిశబ్దముపై సం

స్కృత ప్రత్యయమును చేర్చుట), అభినయకర్త (సంస్కృత శబ్దముపై తెలుఁగు ప్రత్యయమును చేర్చుట), సభికులు (జూదరులు సభ్యులను నర్థమున ప్రయోగించుట)" – వంటి వ్యాకరణవిరుద్ధ పదప్రయోగములు "నా యెఱుక" యందు ఎడనెడ కన్పట్టుచున్నవి. ఇట్టివానిని వా రాదరించుటకు వారి అనభిజ్ఞత హేతు వనుకొనుట విజ్ఞత కానేరదు.

"నా యెఱుక' సర్వతోముఖముగ ప్రశంసింపదగిన ప్రథమాంధ్ర స్వీయచరిత్ర. అపూర్వాంధమహాపురుషులై అనేక రంగములందు అనుపమస్థానమును ఆర్జించుకొన్న శ్రీ ఆదిభట్టవారి ఆత్మకథయగు నిది అనతికాలములో ముద్రితమై ఆంధ్రుల గౌరవానురాగములను చూరగొనుచు, అనేక ప్రయోజనములను ప్రసాదించుగాక !



“ఒకపండితోద్దండుఁడొక యోద్ధ
ఒక మహాసమ్రాట్టు నొకమహర్షి” — యస్వీ.

# వంశావళి

— శ్రీ నారాయణదాసు

కం. మునులందెల్ల విధంబుల
మొనగాఁడు గడింపరాని మూఁకలతో వ
చ్చిన శ్రీరామున్విందునఁ
దనుపు భరద్వాజఋషికి దండం బిడెదన్.

సీ. మూఁడువేలేండ్లకు మున్ను సౌరాష్ట్రి వి
ప్రులు మ్లేచ్ఛ సంపర్కమునకు రోసి
సాగిరి చోళదేశమున కవ్వారిలోఁ
బదుమూఁడు గోత్రము ల్వాయలుదేఱి
వేయివత్సరముల వెన్క గోదావరీ
తీరముఁ జేరె నత్తెగలయందు
పేరూరునుండి పిల్పించె నెన్నికఁజేసి
జయపురేశుండు కృష్ణప్రభుండు

రెండువందల యేఁబదియేండ్లక్రింద
బహు తపఃప్రభావున్ భరద్వాజగోత్రు
సత్కుటుంబి నఖిల వేద శాస్త్రనిపుణు
నాదిభట్టనాము మదన్వయాద్యపురుషు.

గీ. అఘము తెగఁగొట్టు దపమున కాలపట్టు
నీతిఁ గనిపెట్టుఁ బలికైన మాతిఁగట్టు
ప్రేమమిన్ముట్టు నీవికి వేల్పుజెట్టు
వైదికుల తుదిమెట్టు మా యాదిభట్టు.

మ. గురుఁడున్ శుక్రుఁడు దారగేహములలోఁ గొల్వుండ సుద్దిప్తుఁడై
హరిణాంకాత్మజుఁ డాడుచ న్మశికి స్వాయత్త స్థితిన్బొందఁగా
నరవిందాప్తుఁడు హర్షమంద శని భాగ్యంబేలుచున్ సౌమ్యునిన్
శరణొందన్ జనియించె మంగవిరాజద్గోవి లగ్నంబునన్.

కం. దేవతల శంకరుండున్
క్ష్మావల్లభులందు రామచంద్రుఁడు పేరూర్
ద్రావిడుల నాదిభట్టు ప్ర
భావంబున నెదురులేనివారలు జగతిన్.

శా. మారాకారుఁడు వేదశాస్త్రనిధి బ్రహ్మజ్ఞాని మాయాదిభ
ట్టారాజేంద్రుఁడు సత్కరింపఁగ మహాయజ్ఞంబులన్ జేయుచున్
దారాపత్య సమన్వితుండయి జగత్సన్మానితాచార్యుఁడై
పేరెక్కె న్గడుభక్తిమై నతనితోఁ బృథ్వీశ్వరుం డిట్లనెన్.

శా. దేవా నీవు సమస్తమంత్రముల సిద్ధింబొందినావంచు నీ
సేవన్జేయ నభీష్టమబ్బుననుచు న్జెప్పెన్ మహాత్ముం డొకం
డే వేఁటాడు వనాంతరంబున భవద్వృత్తాంత మెర్గించి నిన్
న్నేపిల్పించితిఁ గోరి కావున దయన్వీక్షించి రక్షించుమా.

కం. పెతల ఋణముఁ దీర్పఁగ సం
తతికల్గెడి వెరవుఁ జూపు దయతో భూదే
వతల కసాధ్యం బెయ్యది
వెతఁ దొలగించుము మహాత్మ వేఁడెద నిన్నున్

ఉ. కాలము మళ్లుచుండె ననఘా కులదీపకుఁడౌ తనూభవున్
మాలిమితోడ ముద్దిడుట మాత్రమ నా కిఁక నున్నకోర్కె యీ
లాలస మీవు తీర్చునెడ రాజ్యములో సగ బాలొసంగి భూ
పాలు నొనర్తు నీ సుతునిఁ దావక గోత్రమె నే వహించెదన్.

గీ. అనఁగఁ జిఱునవ్వునం బల్కె నాదిభట్టు
ధృతి యొసఁగ రఘునాథ కృష్ణదేవుతోడఁ
దపముగావించి యొక్క వత్సరములోనఁ
బుత్రుఁ నీ కలరింతు గాయత్రి సాక్షి.

చ. అని తన యెన్మిదేండ్ల సుతు నా ధరణీశున కప్పగించి భా
ర్యను దనవెంట వేసికొని యగ్గెఁ దపంబున కాదిభట్టుఁ నం
దన దశకార్థముం గడు ముదంబునఁ గాంచి చిరంబు రాజ్యమున్
బొనరిచి కాన కేగె నబుఖుండయి రాజును లోకులౌననన్.

తరువోజ

ఆదిభట్టాత్మజుఁడా హయగ్రీవుఁ డర్ధ రాజ్యంబున కధిపతియగుచు
వైదిక లౌకిక వైభవంబలరఁ బ్రథిత నందాపురిం బాలించు చఖిల
వేదవేత్తలను రప్పించి గ్రామముల వెలయించి శాత్రవభీకరుం డగుచు
భూదేవతలె మానవుల మిన్నలంచు భువనంబులన్నియుం బొగడరాజిల్లె

సీ. వెడఁద ఫాలంబునఁ దడియారెడు విభూతి
నెలవంకలోన గందలరురీతి
కంఠమం దొంటి మొగంబు రుద్రాక్షము
హరు గళమున హాలాహలము మాడ్కి
ధనువూని రణరంగమున శత్రులం బాఱఁ
దోలుచు నభినవ ద్రోణు తీవి
వేదవేదాంగము ల్వివరించు తఱి సర
స్వతి మగరూపునం బరఁగు చెల్వ
భూసుర క్షత్ర తేజము ల్మూర్తిఁ గొన్న
పొలుపు వెలయించి జనము లబ్బురము పడఁగ
క్షితిని బాలించి రఘునాథ కృష్ణదేవు
దొడ్డకొడుకగు రామచంద్రుడన కనె విటు

ఉ. ఏలుము నీవె రాజ్య మిది యెల్ల మహాత్ముఁడ రామచంద్ర! యా
యేలిక మాటఁ బట్టి యిటు లీకొనినాఁడను, బ్రహ్మగాఁడ నా
కేల నృపాల ధర్మ మిఁక నేగెద నందపురాగ్రహార వి
ప్రాళిగతిం బిత్తూణ మెడయన్నమకట్టి గృహస్థు నయ్యెదన్.

చ. అన విని రామచంద్రుఁ డనఘా! పితృతుల్యుఁడ విచ్చవచ్చు న
ట్లొనరుచు మీవు నీకరుణ యుంచుము నావయి రాజ చిహ్నము
ల్గనర యథేచ్ఛనుండు మన దబ్బన నందపురాగ్రహార పం
క్తిని వసియింప నేగె హయగ్రీవుఁడు బ్రాహ్మణచక్రవర్తియై.

సీ. బంగరుచాయ మాన్పల్లికి గ్గూర్చుండి
తూర్యధ్వనులు మీఱఁ దూర్పుదెసకు
నందపురమునుండి నలుదట్లఁ గొండదొ
రల్ బ్రాహ్మణులు గొల్వరయముతోడ
వెడలి పొట్టంగిలో విడిసి యూపయిఁ దాడి
వలసను మక్కువన్గడచి సీత
నగరమున్దాటి స్వర్ణముఖీనదీతటి
నజ్జాడ యనునూర నధివసించి

ద్రావిడాష్టాదశాగ్రహార ప్రభువయి
యజ్ఞముల్ గృహమేధియై యాచరించె
యబ్బయను పుత్రుఁగని నాకమరిగెఁ బత్ని
ప్రేమననుగమింపఁగ హయగ్రీవచయని.

ఉ. అబ్బయసోమయాజి సుతులౌరసు లిద్దరు వేంకటేశ వీ
రబ్బలు, వేంకటేశ్వరుఁడు యజ్వయు లౌకికుఁడన్నదాత, వీ
రబ్బఁడు పండితాగ్రణి యుదారుఁడు సత్వగుణప్రాధానుఁడున్
బెబ్బులినైనఁ బట్టుకొను విక్రమశాలి మదన్వయాద్యుఁడున్.

సీ. అన్నదాతలని దిగంతవిఖ్యాతులై
పరఁగి రజ్జాడాదిభట్ల వారు
బ్రాహ్మణప్రభువులై బహుయజ్ఞశాలలం
బన్ని రజ్జాడాదిభట్లవారు
కలవునవచ్చిన మనకుటుంబములఁ గా
పాడి రజ్జాడాదిభట్లవారు
విజయరామగజేంద్రు విందొనర్చిరి తమ
పట్ల నజ్జాడాదిభట్లవారు

శ్రీగలిపి యింటిపేర్ ఖకారించి చేతి
వ్రాలుపచరించి లక్ష్మిసరస్వతులకుఁ
బొందుగావించి యేలిన ప్రోడలెదిరి
వల్కనోప రజ్జాడాదిభట్లవారు.

సీ. తొంబదియేండ్లముందు విజయనగర నా
రాయణగజపతి సాయమంది
అజ్జాడఁ గాపాడె యజ్ఞేశచయని వే
సారి మరాటిపితూరి నుండి
నడురేయి నన్నయ్య నదియీఁది యిడువన్న
ఫలమున రక్కసి వ్వదలఁగొట్టె
గుండ్రాయిచేఁబట్టి క్రోల్పులి నెదిరించి
శక్తిమై వేంకటభుక్త కూల్చె

త్యాగులున్ భోగులు న్దపోధనులు పూర్వు
లందఱు న్మత్కులంబున నలరినారు
సుతుఁడు వేంకటభోక్తకు సోమభోక్త
మామకీన పితామహుఁ డామహర్షి.

కం. నాజనకుఁ డాదితప్పని
యాజానుభుజుండు భాస్కరారాధకుఁడున్
తేజోనిధి వేంకటకవి
రాజిల్లెడు జగతి నతనివ్రాఁతయుఁ జదువున్.

సీ. బహుదేశభాషలఁ బ్రభుల మెప్పించిన
మరువాడ వెంకన్న మనుమరాలు
పార్వతీశివులని ప్రఖ్యాతిఁగొన్న జ
గ్గయ్య - సీతమల నాల్గవకుమార్తె
గున్న ఏన్గులవలె నున్నతిగన్న యై
దుగురన్నదమ్ముల తోడఁబుట్టు
పసితనంబున భాగవతపురాణము నాకుఁ
గఱపి నన్నెంచు నాకన్నతల్లి

కడుపు చల్లఁగ నేవురు కొడుకు లమఱి
కూఁతుల న్నల్వుర న్గాంచి కులము పొదల
నైదువతనంబు మోయు నిల్లాలు చదువు
లవ్వయను బిరుదందు నాయమ్మ నరస.

కం. ఘనశంఖమువలెఁ గంఠ
ధ్వని యలర సమస్త కావ్యతతి విన్పించున్
జనులకుఁ బ్రత్యహము న్నా
జనకుఁడు గీర్వాణ వాగ్విశారదుఁ డగుచున్.

కం. అభినవ మదనాకారుం
డిభవైరి పరాక్రముఁడు మహేంద్రవిభవుఁడున్
సభలఁ జిరంజీవి మహా
ప్రభువనఁ దగి త్యాగభోగరాయఁడయ్యెన్.

సీ. అస్మజ్జనక శిష్యులై కావ్యపఠనము
చేసి లోకమునఁ బ్రసిద్ధిగాంచి
రల గంటి నీలకంఠావధానియు నా స
హాధ్యాయుఁడున్ జ్ఞాతి న్యాయతీర్థ
బిరుదముగొన్న కోవిదశిరోమణి యనే
కులఁ దర్క-వేదాంతముల విబుధుల
నలిపిన యాచార్య సార్వభౌముఁ డఖండ
కీర్తినొందిన రామమూర్తి శాస్త్రి

అగ్రజులు నాకు నల్వురు ముగ్రుతోడఁ
బుట్టు మాకెల్ల సంతానము విలసిల్లు
వంశపావనచారిత్ర స్వర్ణగాత్ర
నా పెద్దప్ప పాపమ సుగుణముల కుప్ప.

సీ. అస్మదీయ భ్రాతలం దేను గడసార
మగ్రజోత్తముఁడు జగ్గావధాని
స్వాధ్యాయవరుఁడనుపమ బలాఢ్యుండు మై
బంగారు మదపు చేనుంగుగున్న
విజయనగరమున విభవము సమకూర్చి
మమ్మిటకుం దెచ్చి మాకుటుంబ
ముద్ధరించిన మహాబుద్ధిమంతుఁడు సీ
తారాముఁ డిహపరతంత్రవేత్త

గోత్రపావనుఁడౌ నగ్నిహోత్రశాస్త్రి
చలువ పన్నీరు చల్లిన చందమనుచు
రాజు లందరు మెచ్చ నల్గోజవలెను
జోడుగూడి పేరన్న నాతోడఁబాడు.

గీ. కావ్యరచనకు వాల్మీకి కావలయును
తగును వ్యాసుఁ డొకండె శాస్త్రంబుఁ దెలుపఁ
శక్తిలేమి నెఱిఁగియు లజ్జ న్దొఱంగి
వేత్తవలె నటియించెద విధివశమున

గీ. తెలుఁగువారలకు న్దేట తెల్లముగను
దెనుఁగుతో నెల్ల విద్దెలఁ దెలుపనెంతు
అన్ని విధముల నను గాచు నాంధ్రదేశ
మునకు నాయచ్చియున్న యప్పనము దీర్తు

కం. నీమూలము నాగోత్రము
నా మంచియుఁ జెడ్డ నీదె నడిపించుము న
న్నీమది కొలఁది న్మాదృశ
పామరజనకల్పభూజ భారద్వాజా!

# నా యెఱుక

లోకులచే నేనెఱింగినదియు నాస్వయముగా తెలిసినదియు మదీయానుభూతి దెలుపఁగోరి యిద్దాని వివరించెద. బాల్యయౌవనదశలనుగల యనుభవము నన్నుగూర్చియు లోకముగూర్చియు నే దెలిసినమట్టుకు వ్రాసెద.

క్రీస్తుశకము 1883 (స్వభాను)లో విజయనగరమున నే మెట్రిక్యులేషను క్లాసులో మహారాజావారి కాలేజిలో చదువుచుండఁగా కుప్పుస్వామి నాయుఁడనునొక హరిదాసు చెన్నపట్టణమునుండివచ్చి విజయనగరములో నేనున్న వీధిలో కానుకుర్తివారి యింట ధ్రువచరిత్రమును బాడుచు విన్పించిన చిన్నపెద్దలెంతయు సంతోషించిరాయాట, యాతాళముల మ్రోత, యాగజ్జల ఘలుఘల్లా యభినయ మామాటల పొందు సభ్యుల చిత్తరంజకము. శ్రీ హరికథ యాట, కేవలము సంగీతము పాడుట కన్నను, ఉపన్యాసము లిచ్చుటకన్నను, నాటకములు, భాగవతములు, బొమ్మలాటలు, మొదలగు వీధినాటకములకంటె శాస్త్రార్థములకంటెను, సంగీత సాహిత్యము లొక్కచోఁ బ్రయుక్తంబులగుచో నుత్తమ సభారంజకమగునని యెంచితిని. అది వఱకుకూర్చుండి పురాణము చదువుట, చేత తాళము పట్టి మద్దెల యొద్దపాడుట, పల్లని పాడుచుంట, స్వరోచ్చారణము లేదుగాని కృతులు బాడుటయుగలదు. కవిత్వమునందు ప్రవృత్తి బుట్టెను.

కం॥ ఖరకరుని కరములను మధుకర నికరము తేనెపట్టు కైవడి గనుడంబర పదము .... ఇది నా మొదటి పద్యములోకొంత. నాకు హరికథలచే సభను రంజింపఁ గోర్కె పుట్టెను. ఆ రాత్రియే కూర్చుని మూడు పూటలకు చరిత్రమంతయు నల్లినాడను. కొన్ని కీర్తనములొక కవీశ్వరుడు ధన్యుడు విశాఖపురి నివాసుడు ధూళిపాళ కృష్ణయ్యగారు ధ్రువ చరిత్రమను యక్షగానమున సొంపుగా జెప్పెను. దానిలోనివి కొన్ని. కొన్ని భాగవతములోని పద్యములును, గొన్ని హితోపదేశమందలి కథలును,

గొన్ని ఇంగ్లీషు నందలి కథలును గూర్చినాడ - నా మొదటి కీర్తనము మొదలు :- ఖమాచ్ - చతురశ్ర :- ఏటికివాని జన్మమేటికే - నాకింగ్లీషు చెప్పించుచున్న మా రెండవయన్న సీతారామయ్యగారి కతపియింట్లో, చిన్నప్పటినుండినాతో మిక్కిలి గవగాబాడుచున్న నా నాల్గవయన్న పేరన్నగారు వెనుక పాట పాడుచుండగా విన్పించినాడను అతడు మిక్కిలి సంతోషించినాడు. మఱి పది దినములకు పేరన్న క్రొత్త కంచు మువ్వలు కూర్పించి కంచు తాళముల జతకూడ నా కొఱకై తెచ్చెను. సీతారామయ్య గారు తన మేడలో నాల్గుగంటల సాయంకాలమున హరికథనము చేసి నచో లోకులానందించెదరని పల్కుచు నాపాదములకు గజ్జెలుకట్టినారు. మొదటి హరికథ శ్రీ వేణుగోపాలస్వామి మందిరమున చిన్నపెద్దలకు విన్పించినాఁడ. సభ సంతోషించుటచే హెచ్చరికఁ గొంటిని.

1884 సంవత్సరము డిశంబరులో మెట్రిక్యులేషను పరీక్షకు వెళ్ళ వలసి వచ్చెను. శ్రీకాకుళమునకు పూడి పెద్ది సోమనాధమను నా క్లాసు మెటొకఁడును నేనునుబోయి పరీక్షలు వ్రాసినాము. పరీక్షలయిన వెంటనే పేరన్న నాయొద్దకు వచ్చినాడు. తిమ్మరాజు వెంకట్రావు పంతులుగారి యింట్లోకూర్చుండి ధ్రువచరిత్రమును వినిపించినాడను. పేరన్న శ్రుతి వేయుచు వెనుక పాటపాడుచుండెను. మద్దెల యింకొకడు వాయించు చుండెను. తాళములు వాయించుచు కథవినిపించినాఁడను. ఆపంతులు పెద్దసభచేసి నన్నాదరించి సభలోనన్ను మెచ్చి పదిరూప్యములు తాంబూల సహితముగా నాకిచ్చెను.

ఆమరునాడు బయలుదేరి ఉర్లామను గ్రామమున కేగితిమి. అచట కందుకూరు మహాలక్ష్మమ్మగారు మైనరుగానున్నారు. లింగము వేంకట రావు పంతులుగారు మేనేజరుగానున్నారు. అతఁడు కవిత్వము సొగసుగా జెప్పఁగలఁడు. ప్రొప్రైట్రిక్సుగారి యింటియొద్ద నాచేఁ బాడించి పది రూపాయలిచ్చెను. పిదప నరసన్నపేటలో నొకసబ్ మేజిస్ట్రేటు పాడించి పదిరూపాయలిచ్చెను. పిమ్మట టెక్కలి రఘునాథపురములో నొకపంతులు

పాడించి అయిదురూపాయలిచ్చెను. పిదప బరంపురమునకు వెళ్ళినాము. అచటనాకు స్వయము పెదతల్లి కుమారుడు మరువాడ జగన్నాథము పంతులు జిల్లా కోర్టు ప్లీడరుగానున్నాడు. పుస్తకము గిరగిర త్రిప్పుచు శరవేగమున గీర్వాణాంధ్రములు చదువుట - ఒక్కసారి వినిన మాత్రమున గీర్వాణాంధ్రాంగ్లేయ పద్యముల మఱలఁ జదువుట. కోరినతాళములను బల్లవి పాడుట - పెక్కురాగములాలాపించుట - గీర్వాణాంధ్రములన్నా నావృత్తములతో గవిత్వము చెప్పుట - అష్టావధాన మొనర్చుట-అపూర్వ కల్పనముగా నాంధ్రాంగ్లేయ భాషలతో వేలకొలది జనులుగల సభలపాడుచు నుపన్యసించుటయు నా విద్యలు. విద్యలందు గురుశిక్ష మిక్కిలి తక్కువ వగాని స్వభావముగా నాకుఁ జొరవయెక్కువ. నేనాడినదాట పాడినది పాటగా జనులు సంతోషపడుట నాయెడల దైవానుగ్రహము. నేనైదేండ్ల మొదలుకొని గీర్వాణాంధ్రములు శరవేగమున జదువనేర్చు గలవాఁడను. నాకు లోకజ్ఞానము బొత్తిగా సున్నయనియును, డబ్బు విలువ యేమియును దెలియదనియును వర్తన మపవిత్రమనియును నాయందు ప్రేమ గలవారు పలుసార్లు నన్ను మందలించుచు వచ్చినప్పటికి నా స్వభావము మాఱకుండెను.

నన్ను జూచినతోడనే మాయన్న జగన్నాధము పంతులునాతో "తమ్ముడా! జనరంజకమైన యెన్ని విద్యలు నీయందు కలిసియున్నవో" యని బ్రహ్మానందమగపర్చి నా శిరమును ముద్దాడెను అపుడతనితో "అన్నా! నా చదువునేమి చూచెదవు నా హరికథ చిత్తగింపుము. నీకు మరింత సంతోషము కలుగును" అనియంటిని. ఆ పిదప నతడు నాశము భీమరాజుతో నన్నుగూర్చి చెప్పెను. భీమరాజు తనయింట నాచే హరికథ చేయించెను, రెండుమూడువేల జనులు సభలో నుండిరి సాయంకాలము నాలుగు గంటలకు ధ్రువచరిత్రము ప్రారంభించి రాత్రి పదివఱకుఁ జెప్పి నాఁడను. అనాడే కాళ్లకు గజ్జెలు కట్టుకొని నృత్యము చేయుచు హరికథ యొనర్చుటకు మొదలు. ఆ భీమరాజు హరికథ ముగిసినతోడనే సభలో

వాకు నూటపదాఱు రూపాయలు నొక పట్టుపంచల చాపును బహుమతి చేసెను.

అయిదేండ్ల వయసునుండియుఁ బురాణము చదివి లయజ్ఞానముతోఁ బాడి యితరులను సంతోషపెట్టి డబ్బు సంపాదించు నేర్పు నాకుఁ గలదు.

భీమరాజుగారి యింట నే హరికథ ముగించిన వెంటనే సభలోనే కుప్పుస్వామి నాయఁడు విజయనగరములో హరికథచేయగా విని నేను హరికథ చేయ బూనుకొంటినో యాకుప్పుస్వామినాయఁడు నాకు సాష్టాంగపడి మ్రొక్కి నాతో "అయ్యా! మీరెప్పటినుండి హరికథచేయుచున్నారు" అని యడిగెను. అందుకు నేను "కుప్పుస్వామి నాయడను నొక మీపోల్కి మనుష్యుఁడు విజయనగరములో హరికథచెప్పగా విన్న మొదలుకొని హరికథ చేయబూనుకొంటిని" అని చెప్పగా నతఁడు చిరునవ్వు నవ్వి నేనే యా కుప్పుసామినయ్యా. నీవు బ్రాహ్మణోత్తముఁడవు. విద్య నీసొమ్ము. జగత్ప్రసిద్ధుఁడవయ్యెదవు. నీవు చెప్పిన కీర్తనలు నాకుఁగొన్ని నేర్పుము. నీవు చిన్నవాఁడవు. మాట యింకను నిల్కడగాఁ జెప్పవలయుము. రేపు నేను దేవరపేటలో హరికథ చేసెదను. వినుము "అని పల్కెను. ఆమఱు నాఁడతని కథ వింటిని. అతడు సంగీతమందుగాని సాహిత్యమందుగాని గొప్ప విద్వాంసుఁడు కాఁడు. గాని కొంత లయజ్ఞానముతో సభారంజనముగా పాడి మాటలు చెప్పగలవాఁడు. ఆ హరిదాసాయూరనుండి కథకొక యవతారమెత్తు చున్నాఁడు. అచటటికెట్టు సిస్టముపై మఱొకకథ చేసినాను. నా టిక్కెట్లకు నలుబది రూప్యములు దొరికియుండును.

పిమ్మట జయంతి కామేశముపంతులు యింటికివెళ్ళి యతనిని జూచినాను. అతడు చేయెత్తు పొడవగురూపసి లోకోత్తరుడు. భాగవతోత్తముడు, గొప్పపండితుడు, కవి, హైకోర్టువకీలు, పదిలక్షలరూపాయలకు పైగా నార్జించిన త్యాగభోగరాయడు. నాయెఱిఁగిన వారిలో నంత రసికుఁడు మఱియు నంతయుదార పురుషుడు నింకొకఁడు లేడు. ఒక మేడపై

నా పుణ్యాత్ముడు పందిరి కోళ్ళపట్టె మంచముపై కూర్చుండి యాంధ్ర భాగవతము చదివించుచు వినుచున్నాడు. నన్నుఁజూచిన తోడనే "కస్త్వమౌకుతోఽసి" అని ప్రశ్నింపగా "మానవగంధర్వానయం విజయనగరీతః" అని చెప్పఁగా పంతులు నిదానించి నడివయసు సింగమువలె నొసట ప్రేలాడు నుంగరముల పేర్లు ముంగురులు సటలుగా వెన్నెలలు గొల్పు చిరునగు మోమునఁదొలుత విస్మితుఁడయ్యెను. నాకు రెండు గజముల దూరముగాఁ దెలుపఁబడి చదువఁబడుచున్న భాగవతములోని శరదృతు వచనము నా చదువుచున్న వాని నా పుటమును జేతుల నతిత్వరితముగా నలుపుచుండుమని యతఁడట్లు చేయగా శరవేగముననేక రాగలయ తాళములతో లఘు గురునియమము తప్పక చదువుటకు కామేశము పంతులద్భుతామోదము లగపర్చి "దృష్టంద్రష్టవ్యం శృతతవ్యమా" అని నన్ను సత్కరింపగా మేముభయులము తివాచీ మీఁదఁగూర్చుంటిమంతట నా మేడయొద్దగడ యెక్కి విద్దెలు చేయుచొక్కయొద్దెపీటి సానిగడపైనుండి "యద్ధాత్రా నీజ ఫాలపట్ట లిఖితం స్తోకం మహద్వాధనం, తత్ప్రాప్నోతి" యనుశ్లోకమును సంపూర్ణముగాఁ దారస్థాయిని జదువునపుడాపంతులు కంట నీరుబెట్టుకొని తన మొలన్నుంగరు గొలుసు కొసనున్న తాళముతో జెంగటి దంతపుపెట్టె తెఱచి పదిరూప్యములా పీటిసానికిచ్చెను.

పిదప సాయంకాలమైదు గంటల సమయమునకు కుప్పుసామినాయడను హరిదాసుపంతులు యొద్దకురాగా నతఁడు నాతో అయ్యా! ఈ నాయడు గొప్ప హరిదాసితని వలన నాలుగు హరికథలు వింటిని. మిగుల సభారంజనముగా హరికథ వినిపించును. "అనెనందుకు నాయడతనితో నన్నుగపర్చి" ఈ మహానుభావుని యెదుట హనుమంతుని ముందు కుప్పిగంతులన్నట్లుండును నా పని. ఇదివఱకు వీరి కథ మీరు చిత్తగించలేదు కాఁబోలును. అనఁగా పంతులు నాతో మీరు హరికథకూడ చెప్పగలరా? ఏదీయెట్లు చెప్పెదరో నేటి రాత్రి యిచటనే భోజన మొనర్చి హరికథ చెప్పవలయును." అనెను.

నేను తొమ్మిదిగంటలు రాత్రి ధ్రువ చరిత్ర చెప్పుటకై పరీక్షిన్మహారాజునకు శాపము కలుగుట యా మహారాజునకు శుకమహర్షి భాగవత ముపదేశించు కారణము వివరించుచు నుపోద్ఘాత మొంటిగంట రాత్రి వఱకును బిమ్మట ధ్రువ చరిత్ర మదియు మేడుగంటల వఱకును జెప్పినాను. రెండువేలకు పైగా పిన్న పెద్దలందరు సావధానముగా నాలించుచుండిరి. సభ మేడ వరండా క్రిందజరిగెను. మృదంగ సాహాయ్యమున బేరన్న ఫిడేలు శ్రుతివేయుచు వెనుక పాటపాడగా నాడుచుం బాడుచు శుధారావైచిత్ర్యమగపఱచుచు మంగళము పాడినాను. ధ్రువుని భక్తి మెచ్చి తాంబరవశుండై యానందబాష్పములు రాల్చుచు ఎత్తిన నడ్డివంచక, చుట్టకాల్చుకొనుటకైన లేవక నా హరికథ తుదముట్ట విని, పంతులు సభలో లేచి నిలువబడి "సంగీతవిద్యనుగూర్చి నాకుమిక్కిలి తెలియదుగాని యీతనిపాటయు చదువును నృత్యమును మిక్కిలి మనోహరము లితని కవితాశక్తి యపారమితడు కథప్రారంభించి ముగించు నందాక నేబొందిన యానందమునకు మేరలేదు." అని చెప్పినాతో "అయ్యా! రెండు నెలలవఱకు నా యొద్ద నుండుము. నీ పెండ్లికిందగినంత ద్రవ్యము నీకిచ్చెద" ననెను. నా పెదతల్లి కొడుకు జగన్నాథము పంతులా సభలో" "తమ్ముడా! కామేశముపంతులు గారంతవారు నిన్నుమెచ్చినారిక లోక ప్రసిద్ధుండ వైతివి" అని సంతోషపడెను.

జయంతి కామేశము పంతులు వెలనాటి వైదిక బ్రాహ్మణుండు. నా తొమ్మిదేండ్ల వయసున నేను పేరన్న మాతలిదండ్రులు శ్రీ జగన్నాథయాత్రకు బోవునపుడు బరంపురము కోర్టుపేటలో నీ జయంతి కామేశముపంతులుగారియింటి సత్రములో దిగినాము. మాతండ్రి గారీ పంతులుపైని సంస్కృతమున నుపజాత్యష్టకము చెప్పినారు. మాయుభయుల మన్నదమ్ములము దాశరథి శతక పద్యములు చదివినాము అప్పుడీపంతులు మా తండ్రిగారితో "శాస్త్రిగారూ మీరీ చిన్న పిల్లనికింగ్లీషు నేర్పించుడీ. వీఁడు తప్పక గొప్ప విద్వాంసుండై జగత్ప్రసిద్ధుండగును" అని మాతండ్రి

గారికి నలువది రూప్యములు సంభావనమిచ్చెను ఆ సంగతి యీ పంతులుకు జ్ఞాపకము తెచ్చి చెప్పినపుడు "ఔనౌను, నాకుఁగూడ నీ చిన్ననాటి చదువు జ్ఞప్తికి వచ్చెను." అని సంతోషమున నతఁడు తలయూచి యాశుధారగా గద్య పద్య రూపమున నీ జ్ఞప్తి కొలఁది నీ పదియేండ్ల వయసు లోపలి చర్యను వర్ణించుమా' యని నా కవితాప్రతిభన్దెలియఁ గోరినంత.

సీ॥ పరమ భాగవతశే - ఖర! శ్రీ జయంతికా
మేశ్వర పండిత - ఋషభ! భూమి
దేవతా చక్రవ - ర్తీ! దాతృమూర్ధన్య!
వెలనాటివైదిక - కులవతంస!
కవి సార్వభౌమ! ని - ష్కపటాంతరంగ - స!
ర్వస్వ తంత్రా! పంచ - బాణరూప!
సంతత తారకమంత్రాక్షరద్వయా -
భ్యాసలో లాంగుళీ - పద్మరాగ!

ప్రథితసత్కీర్తి! నవరస - రసికమౌళి!
సమదపంచాననబల! యా - జానుబాహా!
న్యాయవాది ప్రధాన! యి - హపరవేది!
యాగమజ్ఞా! వినుముత్యాగ - భోగరాయ!

మొట్టమొదట మదీయత్వక్శ్రోత్రరసనా ఘ్రాణచక్షుః ప్రవృత్తి హేతువు మజ్జననియయ్యెను. నాచూపులకు నా తల్లి మోము, నా చెవులకు నాతల్లి పల్కరింపు, నాజిహ్వకు నాతల్లిచన్బాలు, నా మేనికి నాతల్లి పొదిగిలియును దొలుదొల్త యనుభూతములయ్యెను. క్రమక్రమముగా నాజ్ఞప్తి పెరిగినకొలఁదిదప్పటడుగులతోనె నా తలిదండ్రులు మొదలగు ప్రాణబంధువులను, సంతతపరిచారకులను, గ్రామీణ జంతువులను, మిఱ్ఱుపల్లములను, చీకటివెల్లడులను, పృథివ్యప్తేజో వాయువులను, ఆతంకావకాశములను, క్షుత్పిపాసలను, హేయాదేయ వస్తువులను, ప్రియాప్రియ కృత్యములను,

భయశోకకారణ విషయములను గుఱుతుపట్టగల్గుచుంటిని. అమ్మ – అయ్య అన్న – అవ్వ – అప్ప – అత్త – అమ్మ – అవు – అది – అబ్బ మొదలగు అకారాదిశబ్దము లుచ్చరించ గల్గి నాఁడను. 'అ' మొదలగు స్వరములకు మాత్రమే మొదటిప్రవృత్తి. పిదప 'క' మొదలగు వ్యంజనప్రవృత్తి కల్గెను. స్వరములలో అకారమును వ్యంజనముల మకారబిందు మధ్యశ ములై పశుపక్షి మనుష్యులనుండి ధ్వనిభేదంబుల వెలువడు సహజశబ్దప్ర వృత్తి కాబోలును. నిశ్చయముగా 'అంబా' శబ్దమే 'ఓమ్' అని పరిణ మించెను. మఱియును అంబా శబ్దముయొక్క వివర్త స్వరూపమే సర్వ జగత్ప్రకృతి, అమ్మయను వావికన్న బురుషునకు తండ్రి సోదరులు పిల్లలు మొదలగు తక్కిన వావి వరుసలు సంశయాస్పదములు. అమ్మ కన్నఁ దనయెడ నెనరుగల దేహులుగాని అంబాశబ్దము కన్నను పాస్య మగు మంత్రముగాని అంబకన్న నిత్యసత్యమగు పదార్థముగాని వేఱెద్ది యును ముమ్మాటికి న్లేదు. అంబయే సర్వజగచ్ఛక్తియును సకల పదా ర్థప్రకాశికయును త్రిమూర్త్యాత్మికయును త్రిలింగరూపిణియు త్రిగుణ సామ్యమును త్రిభువనమూలమును.

పెద్దల దయచేత స్వయముగా శబ్దశక్తి నాకు బొడముటచే మూడేండ్ల వయసునుండినా జాగ్రత్స్వప్నానుభూతి నాకు మూడువంతులు జ్ఞప్తిలోనున్నయది. రెండు క్రోసుల దూరము చెట్టుచేమల నిండినడుమ నడుమ నవకాశముగల మెట్టలు పశ్చిమోత్తరములకు మఱియుదక్షిణ మందు నానా ఫలవృక్ష భరిత తీరమైస్వచ్ఛ మధుర జలపూర్ణమై మిక్కిలి సమీపముగా బారుచున్న సువర్ణ ముఖియను జీవనది దక్షిణమున విల సిల్లు నజ్జాడయనుగ్రామము నాజన్మ భూమి. తూర్పుపడమర్లకు రెండువరు సలు నలువది బ్రాహ్మణ గృహములును బ్రాహ్మణ వీధికి దక్షిణ మందేటి యొడ్డునందును దూర్పునందు నుత్తరము వైపునందును కలగల్పుగా కళింగ వైశ్యులు, నానావిధ శూద్రులును, కంసాలులు శిల్పులు, నుత్తర

ప్రాంతమందంత్యజులుగల మూడు నాలుగు వందల యిండ్లతో నిండిన మూడు నాల్గు వీధులు నాయూరగలవు.

అచ్చటి బ్రాహ్మణులలో నా సన్నిహిత జ్ఞాతులే యీ యజ్ఞాడాగ్రహారమునకుఁ బ్రభువులు. మఱియు నా నేతు హిమాచలమువఱకు నిరతాన్నదాతలని ప్రసిద్ధిగన్న వారును, మొత్తముపై నచ్చట భారద్వాజగోత్రముగల మా యాదిభట్ల వారి కప్పుడు ప్రతి సంవత్సరమున కైదువేలరూప్యముల రాబడిగల యగ్రహార వసతికలదు. కొండజయపురమేలు రామచంద్ర దేవుగారి వలన మా యాదిపురుషుడగు నాదిభట్టు నందాపురాగ్రహారములకు పదునెన్మిదింటి కధిపతి కావింపఁబడి బ్రాహ్మణ ప్రభువై భవమున నలరారి, యగ్నిష్టోమాది వేద చోదిత కర్మములాచరించుచు నాయజ్ఞాడన్ని వసించి తన వంశమున్మిక్కిలి విస్తరింపజేసెను. వారికి నా కన్నయగు నాజ్ఞాతి యాజానుబాహు తెల్లటి నలువదేండ్లవాడు, పెద్ద వెల్ల గుఱ్ఱముపై మూడేండ్ల వయసుననున్న నన్నెక్కించుకొని, యీ గుఱ్ఱమును బరుగెత్తించుచుంటయు, నేను వెనుక జూచినపుడా గుఱ్ఱపు డెక్కల నెరిగిన పెన్ధూళితక్క నింకెద్దియును నాకగపడకుండెను. మరియు నతడు తన కొడుకు పుట్టిన నాటి రాత్రి పలుమార్లు నా దోసిలిన్ డబ్బులతో నింపెను. ఆతని పోల్కిగానున్న కురుపాముదాజుగారితో తన మిద్దెటింట కూర్చుండి, పెక్కుసార్లు నన్నెత్తుకొని ముద్దాడి కమలాఫలములు నా కొసంగెను.

నా వెనుకబుట్టి యాఱు మాసములు మాత్రమే బ్రతికిన నా యనుజుని పురుడు పోయుటకై నా కన్న నాఱేండ్లు పెద్దయైన నా మూఁడవ సోదరియును నేనును సందెజామున మంత్రసానిని బిల్చుటకై నెగిడివీధికి వెళ్ళినాము. తొంబదేండ్ల ముసలిది. తుప్పతల యేటియుత్తరపు టొడ్డంచున దాని యొంటి కంబపుమేడ. ఆ యేఱు సువర్ణముఖి. పలురంగుల సన్నని యిసుకపై జిలజిల బారు కూత మేరమాయింటి ముంగట నేటి యొడ్డు. దక్షిణముగానేగినచో వానకాలమున గలకయెఱ్ఱవండునీరు, ఆకెర

టముల పొర్లు, కొందరీతగాండ్రొక మా తండ్రి శిష్యుడును నా గురువును తాతన్న యతనిపేరు. రేబదరువదియేండ్లవాడు, నీటిపై మఠమువేసుకొని బక్క పలచటివాడు, కారునల్పు, నైషధాంతము పాఠములు చెప్పును. తెనుగు శతకములు మాకడపారన్నదమ్ములకు నేర్పె, నాతడీదుటకద్భుత మాయెను. మాతండ్రి యాజానుబాహువు. కడుదోర్బలశాలి. మేఘ గంభీర మంద్రమున శంఖము పూరించినట్లు మా తండ్రి సురటరాగమున నెద్దియో తరుచు బాడుచుండును. శ్రీరాగము, సావేరీరాగములతో వాల్మీకి వ్యాసవిరచితములగు రామాయణ భారతములు చదువుచు నర్థము చెప్పుచుండును. బ్రాహ్మణ వీధికిరుదెసల యరుగులపై నుదుటన్గంధాక్షతలు, తెల్లని జందెములు, దంతములు, మందహాసములు, నీరుకావిధోవతులుగల బ్రాహ్మణులించుమించు నూటికి తక్కువ సంఖ్యకానివారు మాయూరివారును మరి సమీపాగ్రహారముల వారును నాసన్నిహిత బంధువులు నడివయసువారు వృద్ధులు నాలించుచుందురు. మాతండ్రి నైషధాంతకావ్యములు నలంకార గ్రంథములు పెక్కుశిష్యులకుఁ జెప్పెను. శరవేగమున బులికండ్ల వంటి యక్షరములతో ఘంటముబట్టి యరువది తాళపత్రములొక రెండు గంటలలో వ్రాయును. శ్రీ మహాభారతము, శ్రీ మద్రామాయణమును, విష్ణు పురాణము కొన్ని యలంకార గ్రంథములు వ్యాఖ్యతో వ్రాసెను . మాకు వ్యవసాయముండెను, మేమైదుగురన్న దమ్ములము. నలువురక్క చెల్లెండ్రు. నాలుగేండ్ల వయస్సులో అక్షరములు వ్రాతరాదుగాని సంస్కృతమును దెనుగును నదెట్లో యెంతయో వేగముగ జదువఁజాలితిని.

చిన్నప్పటినుండి యొరులమనసు స్వభావముగా సంతోష పెట్టు మాటలు కలవాడను. మూడు నాలుగేండ్ల వయసప్పుడు ఒక యతి మా యూరునకు వచ్చె నతని పేరు బాలసుందరస్వామి. అతడు నాపద్యములు విని నాకొక రూపాయియిచ్చెను మాతండ్రికా రూపాయి స్వామియిచ్చెనని చూపించినాడను. "సన్యాసులనుగూడ దోచుకుంటివా?" యని మా తండ్రి పక్కున నవ్వెను. మా యూరనేమరి యొక యతి పేరన్నకును

నాకును రెండు శాటీలిచ్చెను. కురుపామురాజు మా యూరికి వచ్చి నా పద్యములు నాపాటలువిని యొక యరటిపండ్ల గెలయును నాల్గు రూపాయ లొసంగెను.

నాకు నైదవయేట వడుగు చేసిరి. నల్లగాజుల పేర్లవలె ముంగురులు పెద్ద కుంకుమ బొట్టు నెనరులవెల్లి మాతల్లి నన్నెత్తుకొనుట, మౌంజీ బంధనము, దండము, పీత కౌపీనము, పంచ శిఖలు, నొజ్జగాయత్రినుపదేశించుట. సంధ్య వార్పించుట యపుడెంత నమ్మకము? భిక్షమిష నైన భాగ్యవంతులకు దొరకునుగాని మాబోటి సామాన్యులకు నాలుగైదు రూపాయిలు పళ్ళెములో వేసిరేమో! సిరిగలముష్టి కోమటి వెలమ ముష్టి రాజముష్టి మరచినాను నియోగపుముష్టి. ఈ ముష్టి బాపంద్రకునియతమనుటకు నాలుగై దేండ్ల నడుమ, గుంపలో శివకోవెలకల దుత్తరమున నాగావళీనది, దక్షిణమున ఝంఝూవతి నడుమదీవి యాగుంపక్షేత్రము. బండ్లద్దె యివ్వ జాలక మాతల్లి నన్ను కొంత లెక్కయెత్తుకొని కొంతలెక్క యితరులచే నెత్తికొని పించియును గొనిపోవ పార్వతీపురముదాటి కొండల నడుమ శివరాత్రినాడు గుంపకోవెలలో దేవుని సేవించి రాత్రి జాగరము యెంతో తదవు నేను జేసినాడ. మరునాడుదయమున పసుమర్తివారు కొందరు వైశ్యులు, రాజులు సత్రములు వేసిరి. వంకాయముద్ద, యరటికాయ పనసకాయ కూరలు బూరెలు పప్పు పులుసు దానధర్మములు, నాచేతఁగూడఁ గొందరు పుణ్యాత్ములు అయాచితముగా డబ్బులుపెట్టిరి. అప్పటి కానీకి ఇప్పటి మోహరు తగు. తిరిగి బయలుదేరి కొంతదవ్వు నడచితిని. కొంత దూరము మాతల్లి నన్నెత్తుకొన్నది. కొండలనడుమ భయంకరమగు నడవి దారి కొండసెలయేళ్ళు బండరాళ్ళం ద్రుళ్ళింతలిడు పిల్లతరంగముల నాగావళి మొలలోతున నీటిపుర్వువలె సహజముగా నీదఁజాలుదు. పార్వతీపురమునకు వచ్చినాము.

ఒకపుణ్యాత్మునింట తల్లి చల్ది పెట్టించెను. పాతావకాయముక్క, ముత్యాలవంటి తరవాణియన్నము తామరాకులో నెంతనూనెవేసిన నంత

రుచిగా కడుపునిండఁదివి పరిశుద్ధుడనై తొమ్మిదిగంటలవేళ నుదయము కొండసమీపమందలి మొగఁ బార్వతీపురము బజారున నాతల్లి భాగవతము (తెనుఁగు) కొనుటకు నన్నుఁదోడ్చుకొని వెళ్ళినది. రామానుజుల రంగయ్య సాతాని పుస్తకములకొట్టు నడుబజారున. తెల్లనినామముల యెత్తుముసలి వాడు, తెల్లపాగాకలదు "భాగవత మెంత కిచ్చెదవోయీ!"యని నాతల్లి యనగా 'ఆడుదానవు, నీకెందుకమ్మా భాగవతము? చదువురాదుగదా' యన మాతల్లి "యీపిల్లడు చదువును. నేనర్థము జెప్పినఁ బుస్తకము నూరకే యిచ్చెదవా?" యన నబ్బురమంది 'సరియే' యని నాచేతికిఁ బెద్దపుస్తక మిచ్చెను. తెల్లటి గుడ్డయట్ట వర్షర్తువర్ణనము దశమమునందు శరవేగ మునఁ జదివినాడ. బజారంతయు నద్భుతముగా వినుచుండిరి. మాయమ్మ యర్థ మొకసారి వచనమంతయు విని చెప్పుచుండెను. రామానుజుల రంగయ్య సంతోషించి యిరుగుపొరుగు దుకాణముల సహాయముగోరి పుస్తకమునకు వెంటనే తోలుమూయించి నాకు బహుమతియొసఁగెను. పచ్చితోలుపై చిత్రచిత్రములగు ముద్రల పుస్తక మింటికి పట్టుకొనివచ్చి నాము. మాతండ్రి సంస్కృతమేగాని తెనుఁగు చదువుకొనలేదు. కాని తెనుఁగుపురాణము చదివించి వినుట కెంతయో వేడ్కపడును. మా మేన మామలలో నొకఁ డాజానుబాహుఁ డతిసుందరుఁడు. వేలకొలదిజనులకు రంజనముగాఁ దెలుఁగుపురాణము చదువగలఁ, డింకొకఁడు బాగుగా నొక క్రోసు వినబడునట్లు సొగసుగఁ బాడఁగలడంట. నేఁజదివినపుడెల్ల మేన మామలపోల్కి నాకు వచ్చినదని మాతల్లిదండ్రు లనుకొనువారు,

పేరయ్యయొజ్జలు మాకుపాధ్యాయులు. వేదముసంహిత యొకటి రెండట్టములవరకు పాఠముచెప్పుచుండు. ముక్కోపి, యెబువదేండ్లవాఁడు, పిలకజుట్టు, తురుమట్టపువాఁ డౌడలెల్ల విభూతి, రుద్రాక్షతావళము, తరుచుగఁ జేత దర్భకట్టలు, తద్దినమంత్రములు చెప్పుచుండును. జన్నిదము లొడుకుట, విస్తళ్ళు కుట్టుట, యాకులీనపుడుకలు సంపాదించుట, గేదెకు గడ్డితీసికొనివచ్చుట, జపముతపము, వేదపాఠములుచెప్పుటయతని దినచర్య

అన్నిటికన్న నతనిగూర్చి జ్ఞాపకమతని చేతిరువ్వ. జిల్లుమని రక్తము చిమ్మని దెబ్బయొకటైన నెంతదయాళుడోకాని కొట్టియెఱుఁగఁడు. ప్రతి శిష్యుని ప్రతిదిన మొక యఱగంటకు తగ్గకుండ మర్దించువాఁడు. మొత్తము మీఁద నెట్టులైననేమి కొట్టినంతసేపు రోదనము తప్పించుకొని దెబ్బలు మఱచి యాట, పెంకెతనమునావృత్తి. ముక్కుమూఁత మెప్పుడును దప్పు లేదు. కాళ్లుపట్టనని, బట్టలుతకనని, ఆకులు తేననీ, విస్తళ్ళుకుట్టనని దెబ్బలకోర్వఁగలనని పూటకొకసారియైన చింతరువ్వ బరిణికనోఁగ నాపై విరువకమానలే దాఛాందసుడు. ఒకనాఁడు నాదొట్టి పదుగురు శిష్యులతోఁ దెలదెలవారినతోడనే యొకక్రోసుదూరము నడవి కాకులకై తీసికొని పోయెను. మొలబంటి యెత్తుపండు నీటిలో దిగి యేరుదాటి యేటియావలి తోట-యాకసమంటు మామిడిచెట్లు, పిదప పలుజాతుల వ్యవసాయములు మెట్టుపయరులనడుమ నెడతెగకపారు చెర్వువాల్గొమ్ముల నీటివరద పొర్లు పొంతదారిని బోవుచుండ పొడవగు వెలగచెట్టు-దాని కాయ లంతరిక్షమున నుండి నక్షత్రములవలె వ్రేలాడుచుండినను గురినిదాన మెంతయోగాని పట్టెడురాతితో దెబ్బ కొక కాయ పడవలసినదే. జబ్బపుష్టి చేతిలాఘవ ముత్సాహము-చెప్పనలవికానిశక్తి పరుగిడుటలోను దుముకుటయందు బ్రహ్మచారులము. చదువునకేమిగాని యొజ్జ కాకులు మెండుగగోసి కట్టలుకట్టుచుఁ, జీపురుపుల్లలుదీయుచు, పలుదోముపుల్లలు విరుచుచు, మెప్పుపుట్టించుట మాపని నాఁడు కృష్ణాష్టమి. చలివేళ యగుచున్నది. వాకపండ్లేరితినుట కుత్సహించుచున్న నాతో "నోరీ నేడు కృష్ణాష్టమి. నేడు తిన్న కృష్ణుని యెముకలు తిన్నట్లగును" యని పండ్లుతినువేళలో పనులు చేయరేమోయని కాఁబోలు గురువుగారు శిష్యులకు బోధించి ఫలాశనము నకు దూరముచేసిరి.

చీకటితోనె యుదయమున లేచుట, సగముతెల్వితో పనసవర్లించుట, పిదప దంతధావన మొనర్చి యేటిలో పెద్దలు రమ్మనికోపపడునంతదనుక త్రుళ్ళియాడుట, గోచీ యుతుకుకొనుట, సందెవార్చుట, యింటికివచ్చి

చల్దితినుట, చల్దిగిన్నె యేటిలో కడుగుకొనుట. పదేండ్లలోపు పిల్లలమం
దర ముజ్జీలుగట్టి పోరాడుట గోణీబిల్ల కొంచెము ప్రమాదకరమయినను
మొదటియాట. అమ్మ, అన్న, యవ్వ, బావ, గురువులని పిల్చుటయే
గాని మగయాఁడుపోలిక లెరుగము. చింతపిక్కలొకవైపరగదీసి గవ్వ
లకుమారుగఁ జిత్తుపక్కలాడుట, టెళ్ళపిక్కలు, తాండ్రపిడసలు, గవ్వలు,
గచ్చకాయలు మా మూలధనములు. గొట్టికాయలపందెము, కుండబంతి
యాట, యందులో గెల్చినజట్టు కడితగులు టొక భారతయుద్ధము.
పెద్దయుజ్జీ నోడించు టొకసైంధవవధ. మాతండ్రికి సామాన్యముగా
నెయ్యదియుఁ బురాణోపమ లేనిది చెప్పుట యలవాటులేదు. రెండెనుబో
తులు పోరాడిన వందులో మాదొకటి, రెండవపోతును మాపోతు దూర
మునఁజూచియెనవెట్టి వెన్దరిమి తగిలితగిలి పొడిచినప్పుడాహా రామబాణము
వలె నప్రతిహతముగా జయించెనురా యని యనువాడు. జోగిచయనుల
యింట ప్రతిదినమురాత్రి జాముపై సంస్కృతభారతము నేఁజదువుట,
మాయయ్య యర్థముచెప్పుచుంట. చయనులు పొడుమునకు భగీరథుఁడు.
నూర్గురు రాత్రింబవళ్ళుపేల్చిన తరుగని పొడుముగొట్టము, వ్రేలాడు
కుండలములు, మాయూళ్ళో మాతండ్రికి నాచయనులుకును గలవు. ఆతడు
యజ్ఞమును జయనము నొనర్చెను. తిండికిరాళ్ళబండి పురోడాశము
నేతిలోఁదడిపిన నదెంతరుచి యని మనవిచేయుదును!

పురోడాశము రుచి మరిగియేకాబోలు పున్నమ కమావాస్యల కిష్టి
జరుపుచుందురు. కుమ్మరివాండ్లు కత్తిమేకపోతును దర్భపైఁ బడ
ద్రోసి ముక్కునోరుచెవులుమూసి కన్నులవెంబడి ప్రాణము పశువునకుఁ
బోకొట్టుచుంట యతిభయంకరము. చూచుట కష్టము. స్నానములుచేసి
కమురుకంపు లక్ష్యము సేయక శ్రౌతక్రియలు నడిపించుచు, సోమిదేవ
మ్మను గుంజీలు తీయించుచు నగ్గికి నెండకుఁ బుట్టిల్లగు యజ్ఞశాలలో నొక
వైపున స్త్రీలు మరొకవైపున వపాహోమదర్శన లాలసులు, ద్విజులు,
పైయూళ్ళనుండి కానుకలు పట్టుకొని వచ్చిన చూపరు లొకవైపున. కని

స్టీబు ఖవాయతు దిరుగుచు చమసాధ్వర్యులు, స్వర్గమును దేవతలను జను లకుఁ జూపునట్లు ముఖ్యాధ్వర్యుఁడు, దైవమువలెఁ గూర్చున్న బ్రహ్మయు, వీపున మృగచర్మము వ్రేలాడ లేడికొమ్ముతో గోకికొంచు దేవతలను జూచుచున్నట్లు నటించుచు కానుకలందుకొనుచున్న సోమయాజులు, మొగిలిరేకులవంటి తెల్లనికాంతితో పుణ్యపుంజమువలె నాథునిచెంగటనున్న సోమిదేవియు, గడియగడియ కులికిపాడు నుద్గాతలను, తాబేళ్ళవలె నానా విధపక్షులవలె నచ్చొత్తిన యిటుకలచేఁ గూర్పఁబడిన వేదికపై చిత్రము లగు నగ్గిగుండముల నేయిపాలును మొదలగునవి హోమముచేయుట యును, జేటతో నామంట శాలకంటకుండ నాపుచుంటయు యజ్ఞము చూడ వచ్చిన వారికై యొకబజారుకూడ పెట్టబడెను. మాపెంకుటిలోగిలి యుత్త రమువారుసలోని తూర్పుమొదటియింట్లో రాజులను రెడ్లను దండితెచ్చిన యర్థముల నుంచిరి, ఏమోచీపరపాపర పందిళ్ళు వేసి మేకలను జంపుట, పాలు నేయి యన్నము మొదలగువాని నగ్గిన్వేల్చుట, బ్రాహ్మణులకు భోజనములిడుట, యగ్రతాంబూల మందుకొనుట సోమయాజుల పని.

మాయింటిముందు పశులశాల కల దాయరుగులపై పంచకావ్య ములను జిన్నపెద్దలకు మాతండ్రి పాఠములను చెప్పుచుండును, రామా యణ భారతములలోని కథలన్నియును గరతలామలకములుగ నేనెఱుఁ గుదును. ఉభయభాషలయందు పద్యములు కొంచెము రాగవరసతో వేగ ముగాఁ జదువనేర్చితినిగాని యొకయక్షరమయినను వ్రాతరాదు. నేను మాసోదరులలో కడసారము. నాకంటె పెద్దసోదరుడు నేను మేమిద్దరము గవగా చదువుకొనుచుంటిమి. అయిదుగురన్నదమ్ములలో మొదటివారి ద్దరు మాపెద్దక్కగారింట వేదాభ్యసనము చేయుచుండిరి. మూడవ యతఁడు భారవి తండ్రిగారియొద్దనే నేర్చుకొనుచుండెను. రఘువంశము మాతండ్రిగారు మాకు చెప్పుచుండిరి. దాశరథీశతకము, భూషణవికాస శతకము, రుక్మిణీకల్యాణము, తెనుగుపద్యములు మాతండ్రిగారి శిష్యుడగు

తాతన్నగారు చెప్పుచుండిరి, కరణపుబడిలో నక్షరములు వ్రాయుటయు, గుణించుటయు నేర్చుకొనుచుంటిమి.

అనామికాంగుష్ఠములఁ బొడుముపట్టుపట్టి "ఘనుఁడా భూసురుఁ డేఁగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో చెయనమ్మగారూ!" అని మాతండ్రిని బిలుచువాఁడు. మొదట యేదోరామయ్య పిదప వరాల రామయ్య, తుదకు అయిదువందల రూపాయలు ప్రతిసంవత్సరము రాబడి గల దివ్యక్షేత్రము నమ్మి యొక్కదినములో బ్రాహ్మణులకు వరాలి చ్చెను. "చెడెదవు, భూములమ్ముకొనకు, తలకుమించినయీవి తగ"దను రాయమ్మగారు, బ్రాహ్మణరాజు మాయూరిలో గొప్పయన్నదాత. వారి సన్నిహితుల లజ్జాడన్నయ్యగారు. ఒకనాఁడు మాలవానికి నేటియావలి యొడ్డు నుండి గాలివానలో "అన్నమోతండ్రీ" అని మొఱవెట్టిన నేస్గుంపు లోతున నొడ్లుతీసిపారు యీయేరీది యన్నము వెట్టి మా యాదిభట్టవంశము నకు వన్నెదెచ్చిన వదాన్యసత్తము డన్నయ్యగారు. రెండుజాములరాత్రి చిమ్మచీకటివేళ నెత్తిని జల్దిగిన్నెనోటఁ గొరకంచు పాగాలో నూరగా యయుఁ బొగాకును, జంకలో నానపకాయతుంబతో తృటిలో నేరీది యీ మాలవానిఁ బిలిచినంత నాకటిచే మిక్కిలిచలిచే ప్రాణావశిష్టుఁడగువాఁ డన్న ముభుజించి సంతసించి యేఁగెను. జయపురపురాజు కూతురు దయ్యము ఆ యన్నదాన ఫలము ధారవోయుటచే వదిలెనట. అట్టి రాయమ్మతాతతో రామయ్య చెప్పినది "నీకన్ననన్నెక్కువగ బొగడెదరేమో యని వోర్వ కుంటివో? మా తల్లి స్వర్గగమనమున కాదినమున రూపాయిలు వరాలు మెట్లు కట్టెద"నని పండువంటియాస్తి తెగనమ్మి ప్రతిదినము పెట్టెలోని రూకలను బైకిదీసి నెరపుటయు లెక్కించుటయు నడిగినవానికి లేదనక నూఁడునాల్గిచ్చుటయు, పాలు పెరుగు నేయి రెండుకూరలు పప్పుపులుసు ఎంతచవులతో దినుట మాయెఱుకను దీనదరిద్రదశనొందెను. అతడు మా తండ్రియుపదేశము వినువాడు. మాదగ్గర జ్ఞాతి. ఒకనాడిద్దరు మా తండ్రి రామయ్యగారును కట్టెలకావడివానితో మాతండ్రి "యెంతరా కావడి!"

"బాబూ రెండణాలు" _ రామయ్యగారు "చెయసమ్మగారూ! నాల్గణా లిచ్చినగాని బాగుండదు. పాప మెంతకష్టపడి తెచ్చినా డెండలో చెమ్మట యేళ్లేరులై పారుచున్నదో" అని చల్ది, యావకాయ, మజ్జిగ దాహశాంతికి నిచ్చెను. 'తక్కిన రెండణాలు నేనిచ్చెదను, మీరు పావలా వానికిం డనెను. ఒడలినిండ వెంట్రుకలుంటచే వెంట్రుకలరామయ్యగారని పేదఁశలో పిలువఁబడెనాతడు. ఎట్లు పిలువఁబడినను మరెట్టికష్టము లబ్బినను రామయ్యవంటి దానవీరుడు కర్ణునివలె నాపదలకు జంకబోఁడు.

గొప్ప కరువుపెట్టెను. మా కొట్లో నైదుగరిశల ధాన్యముండెను. ఎందుకోగాని కొంతధాన్య మమ్ముట కెవరికో మాటయిచ్చి ధాన్యము కొలిపించుటకు సిద్ధపడుచున్న మాతండ్రితో మాతల్లి 'పిల్లలవారము, ధాన్యమమ్మవద్దు' అనునపుడు 'నాలుకా తాటిపట్టా!' మాటయిచ్చి వెనుదీయుదునా! 'యని కొట్టుత్తచేసెను. పదునాలుగు వందల రూపాయలు మా తండ్రికి ఋణముండెను. బల్జిపేటలో నొకబల్జి మా తండ్రితో 'శాస్త్రిగారూ! రామాయణమొకసారి మాయింట చదివి యర్థము చెప్పెదరేని మీయప్పు తీర్చెదను'. అనఁగ విని మాతండ్రి 'కేసరి జీర్ణతృణంబు మేయునే? శూద్రునియింట నేఁ జదువనొల్లను' అని కొంతభూమి యమ్మి ఋణము తీర్చుకొనెను,

ఎనిమిదితొమ్మి దేండ్ల వయస్సులో వడ్డి (ఒడ్డెఁ ఓఢ్ర) టీకాలవాడు వచ్చి గ్రామమున నాతోడి పిల్లలకందరికి టీకాలు వేసెను. అందరికన్నముందు ముంజేతిపై నాకు టీకాలు పొడిచెను. చలిదియన్నము తిని యేట్లో మున్గమని చెప్పెను. అప్పుడు నాతో పలువురు సాయంత్రంవరకు జట్టుదారు లేటయీదుచుండిరి. కాని నాకుమాత్రమే రాత్రి జ్వరము తగిలి మరునాటికి చిన్నయావాలవలె టీకాలమచ్చలచుట్టు నమ్మవారు పొడచూపెను. క్రమక్రమముగ నొడలెల్ల నిండెను. తుదకు సూదిమోపుటకుఁగూడ సందు చూపక పెద్దముత్తెములవలె మశూచికము వ్యాపించెను పొగవేయుట,

దండకము చదువుట, యనటియాకులపై బరుండబెట్టి పాలు పంచదార యన్నము కడుపునిండ దినుట జ్ఞాపకమున్నది. తుదకు నెలదినములలో తేలినాడను.

నాచిన్ననాటికి మాకు నూటముప్పదిరూకల శిస్తుపెట్టు భూమి మాత్రమే మిగిలి యుండెను. ఆయిదుగు రన్నదమ్ములము, నల్వురక్కచెల్లెండ్రు, తల్లి తండ్రి యిందర మారాబడిపై బ్రతుకవలయును. మా తండ్రి వ్యవసాయము పెట్టెను. ఇద్దరు పాలికాపులు, ఒకయేరు పోతులు, ఎడ్లొకయేరు, రెండుమూడు గేదెలు మాకుండెను. ఒక గజమెత్తు గజము న్నర వెడల్పు ముప్పదిగజములపొడవు మడిగట్టు వంచిననష్టి యెత్తుకుండ మాతండ్రి వేయుట యసాధారణవుపని యనుకొనువారు.

ఒకప్పుడు పోతులు కాచుటకు నన్ను నియమింపఁగా పొలములో మేపి యేటిలో బోతులు కడుగుచుంటిని. ఏరు వడిగా రెండొడ్లుతీసి పారు చున్నది. పోతుతోక పట్టుకొని నట్టేటనీదుటకు నాకు వేడ్కపుట్టెను. నట్టే టికి నన్ను దీసికొనిపోయి పోతు తలముంచెను. దానివీపుపై తోకపట్టుకొని నిలుచుంటిని. కాని కొంతమేర పోతు మునిగిపోవుటచే నేఁగూడ మును గుచుఁ దేలుచుంట తటస్థించుచుండెను. ఇటులొకయరమైలు కొట్టుకొని పోతిని. తుదకు పోతునన్నంటక ప్రత్యేకము పోవుచుండెను. ఈదుచుంటిని కాని యొడ్డుచేరుటకు శక్తిచాలకుండెను అంతట వార్తతెలిసి మాపెద్దన్న మొదలగువారు కొందరు వచ్చి నన్గాపాడిరి.

నాకును నాకన్న పెద్దతనికిఁ దెనుఁగు చెప్పించుటకు మాతండ్రి యాసించుచుండెను. తెనుఁగు పురాణము ప్రశస్తముగ జదువుచుంటినిగాని వ్రాఁతరాకుంటచే మమ్మొక కరణపుబడిలో వేసిరి శిష్టుకరణము తెల్లని నామములు - నల్లని జునపాలు అబడి యుపాధ్యాయులు. తరుచుగా నాటల సందడిచే నాలస్యముగా బడికివెళ్ళుటచే నన్ను బెత్తంబుచే మొత్తుచుండు వాడు. అప్పటియయ్యవార్ల చే దన్నులుతినుట యిప్పటివారిచే బాఠములు

చెప్పుకొనుటకన్న మేలు. ఒకనాడు మాయమ్మ సంజకడ నన్నుఁబిలిచి 'నాయనా పుచ్చపూవువలె విచ్చపావలా నెలకిచ్చుచున్నాము కరణమునకు. ఇదివర కొకయక్షరమయినను వ్రాయఁజాలవు, శ్రద్ధగాఁ జదువు తండ్రీ పనికివచ్చెదవు' అని మందలించెను. 'పుస్తకము తలక్రిందుగాఁ జదువు నా కక్షరములు వ్రాయగల్గుట యొకగొప్పా'యని నే బదులాడి మరిరెండు పూటలలో నైదుబడు లాపెకు నేను బలకపైని వ్రాసి చూపఁగా నాతండ్రి తో 'నీ సూరయ్య నిఁక మీరెన్నడును గొట్టవద్దు. చూడండి రెండుపూటల కెట్లు వ్రాతయంతయు నేర్చుకొన్నాడో' యని యాపె చిరునవ్వున బల్కఁగా 'అత్తా శరవేగమున ముక్తాఫలములవలెఁ దిన్ననిపంక్తులతో తాళపత్రసంచి కల స్సంస్కృత రామాయణభారతాది బహుగ్రంథముల నామూలాగ్ర ముగా వ్రాసిన మా మేనమామగారితో నా యీదిబ్బని వ్రాతతెల్పిఁ గొని యాడుచుంటివి' అని పౌరాణికులగు నా రెండవ మేనమామ కొడుకు లనిరి. వారిరువురు పెక్కురాగవరుసలతో నాకన్నమిక్కిలి వయసునఁ బెద్ద వారగుటచేఁ దెలుఁగుపురాణము లర్థస్ఫూర్తిగాఁ జదువగా, 'ఓర్చుడోర్చుడు మరికొన్నాళ్ళకు మీకన్న నెక్కువుగా నేఁగూడ రాగవరుసతోఁ జదివెదను' అని నేను ప్రజ్ఞలుపల్కితిని.

మాజ్ఞాతులలో భాగ్యవంతులు మాయూరి యజమానులు. వారి పిల్లలు నాతో యీడుజోడువాండ్రు చొక్కాయీలతో మాతండ్రియొద్ద రఘువంశము చదువుకొనుచుండిరి. రిక్తదశ వచ్చుటచేత మాకాపిల్లల తండ్రులు కొంచమేమైన సహాయము చేయుచుండురు. గ్రామములో మిక్కిలిచదువుకొన్నవాఁడు, తగుమనుష్యుఁడు, సత్యనందుఁడు, తపశ్శాలి యగుటచే మాతండ్రి నెంతయోగొప్పగా మాయూరివారేమి యితరులేమి మర్యాద చేయుచుండెడివారు, దుర్దానదురన్నములు వెలిగా వ్యవసాయపుఁ బాటుపయి మాతండ్రి మిక్కిలిశ్రమగాఁ గుటుంబసంరక్షణ నేయుచుండెను. చొక్కాయి కుట్టించుమని మాతల్లితో నొకనాడు మొఱపెట్టుకొంటి నప్పు డొకచిన్న యిత్తడిచెంబు జంగమువానియొద్ద కొదువబెట్టి చొక్కాయి

కట్టించెను. దానికి మెడచుట్టూ యెఱ్ఱగుడ్డ వేసి యెఱ్ఱ గుడ్డగుండి పెట్టి యాజంగము చొక్కాయి తొడిగింపఁగా నేఁ బడిన వేడ్క పట్టాభిషేకమునాఁడు చక్రవర్తిగూడ పొందనేరఁ డనుకొనెద, నద్దిరా పసినాటిసంతుష్టి.

గంటెకట్టినాముగనుక నేను నాకన్నపెద్ద పేరన్నయు వ్యవసాయపు పనులుచేయుట పద్యములు జంటగాఁ జదువుచు దగ్గరియూళ్ళలో నుండు భాగ్యవంతులనడిగి గడ్డికూరలు సంపాదించుట, సంభావనలకై పొరుగూళ్ళకు వెళ్ళుచుంట, యిట్లు కుటుంబరక్షణమునకు దోడుపడుచుంటిమి. ఒకనాఁడు బొమ్మికజగన్నాథపురమను నొకగ్రామమునకు సంభావనకై బయలుదేరినాము. రాత్రి పదిఘంటల కిరువది జట్టుదారులు మేమును నడక ప్రారంభించి యైదుక్రోసులు నడిచి యొకవలస వీధియరుగుపై నిద్రించి కోడికూసినతోనే తిరిగిబయలుదేరి జామున్నరప్రొద్దున కాయూరు చేరినాము. చిన్నవాండ్రకు పావలా పెద్దల కర్థ సంభావన యిచ్చినారు. మన్యము శీతకాలము మూడుజాములకు సంతర్పణభోజనమైనది. వేలకొలది బ్రాహ్మణులము. కెవ్వనకేకలు వేయుచుంట, యెవనికి తగిన జోడీతో వాడు పట్లుపట్టుచుంట, యొండొరుల నెక్కిరించుచు హాస్యముతో నుడికించుకొనుచుంట చలిగాచుకొనుటకై ముళ్ళకంచెలుపీకి నెగడిలోఁ బడవైచుచు పొలముకాపులతో పోరాడుచుంట, యొకశాఖవారి నింకొకశాఖవా రాక్షేపించుకొనుట, యిట్లు కొంతరాత్రివఱకు చలికాచుకొని తిరిగివచ్చుచుంటిమి. సుంకెగ్రామమునొద్ద నాగావళియనునది యొడ్డుతెగఁ బారుచున్నది. ఇంచుమించొక మైలువెడల్పున శరవేగముగాఁ గరటములతోఁ బారుచున్నది. తలకు రెండుకానులు పుచ్చుకొని పల్లెవాం డ్రోడ గడపుచుండిరి. ఆంధ్ర బ్రాహ్మణులు పెక్కం డ్రోడయెక్కి పోవుచుండిరి. కానిమాద్రావిడులు విడిచేతులతో నీదుచు బల్లెవానికెగసక్కెముగ పలువుర నోడవాండ్ర రాబడిచెడునట్లేరు దాటించుచుండిరి. పదేండ్లలోపు వయసుగల కుఱ్ఱవాండ్రము నలువదిమంది నాబోటిద్రావిడుల మీత బడినాము. అందులో దిగినరేవునకు దిన్నగగోలవేసి నట్లావలియొడ్డునకీదిన వారిలో మా పేరన్న

యొకడు. నేనొక సాపుమైలు ప్రవాహమునకు దిగుదలగా నావలియొడ్డు జేరితిని. కొందరు కొట్టుకొనిపోవుచు రక్షణకై మొఱ్ఱపెట్టుచుండిరి. కొందరువచ్చి చెడి యున్నమైదరిచేరుచుండిరి. కోడెవయసు వాండ్రుకొందరు నలుబదియేండ్లవారు నదిలో నీదుచు కొట్టుకొనిపోవు వాండ్రను గాపాడు చుండిరి. తుదకు ప్రాణహాని లేకుండ మేము నుంకెకు వచ్చినాము. ఆ గ్రామ ములోని యన్నదాతలు మాదగ్గర బంధువులు. ఏమికూరలెట్టి భోజనము! మరెంత యాదరణము; రెండువేల రూపాయిలు రాబడిగల వాని భార్యకున్న నగ, పుస్తెయొక్కటియే. ఆమెపని, నడుమునకు బట్టపినిచుట్టుకొని, వండి. వేలకొలది బ్రాహ్మణులకు వడ్డించుచుంట. భళిరా! పూర్వకాలపు కులాం గనలిప్పటి నారి సింగారము, వీరి సోమరిపోతుదన మింక దురాశ, యీ లోభము, నుంతయు నెరుగరుకదా! సాయంకాలమున కిల్లుజేరితిమి. తెల్లని పావలాలు మా యిద్దరివి కరణమునకు జీతమునకై యిచ్చివేసినాము.

శ్రీరామనవమి, నృసింహజయంతి, పెద్దేకాదశి, కృష్ణాష్టమి, మొద లగు పుణ్యదినములందు జలదికఁడుచుటమాని, నదీస్నానమొనర్చి నీట మునిగియు, నొడ్డున గూర్చుండియు, నభీష్టదేవతా మంత్ర జపమొనర్చు చుందుము. దుష్టలోక సంసర్గము, నూత్నయౌవనదోషము, సంసార దుఃఖమున్నంతయు నెరుగక బ్రహ్మానందమున బుణ్యమూర్తిభవించి నట్లు సకలలోకోపకారముగా సంచరించుచుంట, జనులంపరాఁ త్తులే: దాపు మూపులెరుగకుంట, బాలార్క్యము బ్రహ్మవాత్య మున్నట్లు లేదెనిమిదేండ్ల లోపు వయసున జీకటి తెలియని మూర్ఖునివలె కల్లయెరుగని నిర్మల హృదయము దృష్టియు నవ్వును మొదలగు చేష్టల నలరారుచుండును.

పేరన్న యింటిపనులలో మిక్కిలిచురుకు. మాయూళ్ళో యందరి కన్న జదువులోనే జురుకు తప్పకుండ వచనగాని శ్లోకముగాని తెనుగు పద్యములుగాని యొకసారి విన్నమాత్రమున దిరిగి యొప్పచెప్పగల సామ ర్థ్యము నాకుంటచే నన్ను ముద్దుగ జూచువారు కాని వ్యవసాయపుపనికి

దొంగ నొటచే నన్ను దరుచుగ మా తండ్రి మర్దించుచుండువాడు. మా తండ్రి మిక్కిలి ప్రథమకోపి. చేతులో గర్రయుండనీ, కంపయుండనీ, విడిచేతులుకానీ, దెబ్బకొట్టిన దయ్యేమున్నర యూడిపోవును. ఒకనాడు పొలములో బాలి కాపులు దున్నుచుండిరి. ముచ్చటకు మేడిపట్టుకొని నే దున్న సాగితిని. "బ్రాహ్మణులు దున్నరాదు. మరెన్న డిట్లు దున్నవు కదా" యని మా తండ్రిగారరచేత నన్ను జరిచిన చరుపింతవరకు మరువ జాలను.

ఒకప్పుడు ఆరుక్రోసుల దూరమునుం డిద్దరు మోయుబరువు రూపాయి పావలా ఖరీదుగల వంగనారు పేరన్న తెలవారకట్లబోయి రెండు జాములకు మోసికొనివచ్చెను. మరునాడా మొక్కల నెంతయో వేడ్కతో దున్నిన యేటి బాడువలో మా తండ్రి పేరన్న సహాయముగా నుడపదొడగెను. మొదటి మొక్కయుడుచుచుండ నేను బెద్దగొంతుతో "అయ్యా! యెంతో ముచ్చటబడి వంగచెట్లు వేయుచున్నావు కాని యీయేడీ వంగలు పనికిరావు సుమా" యంటి, నందుపై మా తండ్రి కోపమువచ్చి "పట్టుకోరా దిబ్బబడవను" అని నా వెంట బడెను. నేను నా శక్తికొలది పరుగిడ దొడగితిని. పదడుగులలో నన్ను బట్టుకొని, మీది కెగరవేసి నేలపై బడులోపల వీపుపై రెండడపులడిచి, జుట్టుపట్టుకొని, గిరగిర ద్రిప్పి, యేటిలో బడునట్లు కాలితోదన్ని విసరెను, పదిపన్నెండడుగుల నేటినీటిలో బడినను, జప్పునలేచి, యొడలు దులుపుకొని, యింటికి బర్విడి పారిపోయి, మా యమ్మతో నీ సమాచారము చెప్పగా నాపె నాయొడలంతయు నిమిరి, కన్నీరునించుచు నెంతలేసి దెబ్బలు కొట్టినారు క్రూరులనినన్నోదార్చెను. పదిమంది పిల్లలనుగన్నదిగాని, యెంతకోపము వచ్చినను 'నీయమ్మ కనులుమండా' యనుటతప్ప, మా తల్లి మమ్మెప్పుడైన తిట్టిగాని కొట్టిగాని యెరుగ దెంతశాంతురాలోగాని. కొన్నాళ్ళ కా వంగచెట్లు బాగుగ బలిసి పూచి గొప్పగగాచుటకు సిద్ధముగ నున్నవి. ఒకనాటిరాత్రి పెద్ద యేరువచ్చి వంగతోటను సమూలముగ దుడిచివేసెను. పాలికాపావార్త

తెలవారినతోనే, మేమమరము చింతనము నేయుచుండగా, మా తండ్రితో జెప్పెను. మా తండ్రి చిరునవ్వుతో "సూరిగాడన్నట్లే యైన దాశ్చర్యము" నియెను.

మా తండ్రి నాయెరుక నైదారేండ్లు వ్యవసాయము చేసెనుగాని, యొకయేడైనను బాగుగ ఫలించలేదొకవేళ్ల ఫలించినను, అతని సులభ విశ్వాసము సందుచూచుకొని పాలికాపులా పంట చాలా భక్షించువారు. మా యైదుగురన్నదమ్ములలో రెండవయతడు, విజయనగరములో నివసించి యుండిన గంటి పట్టాభిరామయ్యగారను ప్లీడరునకల్లుడై, యచటనే కోర్టుపనిపాట్లు మరొక ప్లీడరైన వెదులమూడి రాయప్ప పంతులుగారి యొద్ద నేర్చుకొనుచుండెను. మా రెండవ యన్నపేరు సీతారామయ్య. క్రమము కొంతవరకు వర్ణించెను. వేదమడిగినచోట తప్పక చెప్పువారిలో నీవైపున నతడొకడు. మా పెద్దన్న జగ్గావధానికూడ క్రమాంత స్వాధ్యాయవేత్త. ఈ యిరువురు, మా పెద్దక్క యత్తవారి యూరును, వేదపాఠమునకు ప్రసిద్ధికెక్కినదియు, నగుపిడిసీల యగ్రహారములో జదువుకొన్నారు.

మా పెద్దన్నయు మూడవయన్నయు పేరన్నయు నేనును. మా గ్రామములో మాతండ్రి వ్యవసాయమునకు తోడుపడువారము. మా పెద్దన్న యొక పెద్ద కమ్మిబండి యుండపై, కోడెవయసు వాండ్రను పదుగురను కూర్చుండబెట్టి, పైకి దోడుటనేనెరుగుదును. ఆ బలమునకై యచటి చూపరులందరు మిక్కిలి యాశ్చర్యము నందిరి. మరొకపుడు. రెండు గజముల రేవటియూబిలో గూర్కొని, యుదుపుటాకు కట్టలతో నిండుకొన్న కమ్మిబండి కొకవైపు, పెద్ద యెనుపోతును బూన్చి. యద్దానిన్గాపుల నదల్చమని, తానొక వైపున గుండెనాని, మా పెద్దన్న యొక్కడును నూరుగజముల మేర, నా బండిని మడిగట్టునకు లాగుకొని వచ్చినపుడిది యమానుష బలమని మా యూరు వారందరును గొనియాడిరి. అట్టివాడు బలమునందు మా తండ్రికి లోకువయట. ఒకనాడు మా యెడ్లబండి యొక్క మొగపై

నేను గూర్చుండి మిత్రుపల్లములనుండి యా బండిని వేగముగా దోలుచు, "నర్జున రథమునయ్యా! కృష్ణుడిట్లు గడిపెనా"యని మిక్కిలి యరుదుగా నవ్వెడు నా తండ్రికి నవ్వుబుట్టించితిని.

మా యూరికి దూర్పున నసిరమ్మవనమను నొకరావి చెట్టుకలదది మా పొలమునకు వెళ్ళు దారిలోనున్నది. నేనొంటిగా బొలమునకు బోవుచున్నపుడు ఆ చెట్టు, దానిక్రింద పసపుబొట్లుగల గ్రామదేవతయొక్క కొయ్య బొమ్మలు, భయంకరముగ గాన్పించునవి. నాతల పొడవున బెరుగుగంటె చేలనడుమ బోవుచు, నక్కడక్కడ రాతిదేవుళ్లను చూచి, భయమునబ్బురము బొందువాడను. ఊడిక డొంకలపై దలలు పంకించుచు ద్రుళ్లింతల నెగురు తొండలును, పుట్టలచెంత పరస్పరము నొడళులగలుపుకొని పైనిక్కు పెనగుపాములును. పనిలేక యార్చు కోమటి కంసలిపిట్టలును, స్పృశించిన మాత్రమున జుట్టచుట్టుకొను రోకలి బొండలును, కాకులును, గ్రద్దలన్వే నుదరుముచు పసుల మూపులపై సవారీచేయు నెత్రింతలును, పోట్లాడు యెద్దులును, దున్నపోతులును, పొర్లు దగిలి పరువిడు పడ్డలను వెంటాడు కోడెలును, చట్లు దొంతితలనిడి నిబ్బరముగా మెట్టచేల నడుచు కాపుచేడియలును, పట్టు మెత్తని కుంకుమ పుర్వులును, బురద బుక్కడములు చప్పరించు కప్పల యార్పులును, యెండ్రకాయలను బొడుచుకొనితిను కాకులును, చేపలనెగరదన్ను గ్రద్దలును, వరివెన్నులను గన్నములోనికి గొంపోవు పేరెలుకలును, బీరగుమ్మడి పాదులచే నిండు చెర్వుగట్లులును, లేళ్లమందలు పర్విడు మెరకలును, ఆకసమున నంచుకట్టి మాటిమాటికి సూర్యునకు జాటువచ్చు మేఘంబులును, ఉండుండి కొమ్మలను గదిల్చి రొదవెట్టు గాలియును, రెండవజాము వేడి తళ్కుటెండలో గాన వచ్చు మృగతృష్ణలును. మాయూరికి బడమట యుత్తరములకు రెండు మూడు క్రోసులమేర కొండల వరుసలు గలవు. వాని శిఖరములపై మేఘములు శ్వేతాభ్రకపుటచ్చులవలె, నేకిన దూదినెరపినట్లుంటయు, పెక్కురకములుగ రూపములు మారుచుంటయు, మేఘముల నీడలు భూమి

పై ప్రాకుచుంటయు, గ్రద్దలు మింటరెక్కలు చాచి తిరుగుచుంటయు. నేటి గుల్మములో నీతకంపవేసి యెండలో నూజలతో శూద్రులు చేపలు పట్టుచుంటయు, పోతులు గేదెలు చల్వకై యేటిలో బడుకొంటయు. ఒంటిగ బోవు నా లేతమనస్సునకు వింత వింత సంకల్పములను బుట్టించు చుండును. ఒకపుడు నేనొంటిగా నున్నపుడు నా మనసులో గొంతెమ్మ కోర్కెలు గోరుచుంట యెట్లన నాకు రెక్కలు వచ్చునట చెట్లపై నుండి యెగురుచు గావలసిన పండ్లుకాయలుదినుచు ఎవరికైన నందక కొండల శిఖరములపై నుండి మేఘములలోనికి దిరుగుచుందునట, యీ కండ చీమ యెందుకు చెపుమా యీలాగు బ్రాకుచున్నది? దీనిని జంపెదను మంచి జన్మము దీనికి వచ్చునేమో! సూర్య చంద్రబింబముల వరకు హను మంతుని వలెనెగిరెదను. మేఘముల చాటున మేఘనాధునివలె సంచరించె దను; కొండలు బంతులవలె నెగరవైచెదను; డబ్బులు రూపాయిలు కుప్ప కుప్పలుగ గల్పించి జనులకు విందొనర్చెదను. నా చిత్తము వచ్చినట్లు జంగమ స్థావరముల నడిపించెదను. ఇంత గొప్పవాడేడీయని నాతోడి పాటి వారందరును నన్నత్యాశ్చర్యముతో మెచ్చునట్లమానుష ప్రజ్ఞలగపర్చెదను. ఇట్టి సంకల్పములతో, నే బొలమునకు వచ్చినపనిగాని, వేళనుగాని, తుదకు నాయాకలినిగాని, మరచి యాత్మారాముడనై క్రీడించుచుందును. దరుచు సంకల్ప శరీరముతో నానందించువాడను. మనుష్యులను మాత్రము తప్ప, తక్కిన సర్వలోకము యొక్క చోద్యములను గనిపెట్టుచుంటయును, మనుష్యులనందరిని, నిర్లక్ష్యముగ బరికించుచుంటయును నా శైశవాను భూతులు.

ఆకసము - సూర్యచంద్రులు - చుక్కలు - మబ్బులు - వానలురు ములు - మెరపులు - ఇంద్ర ధనుస్సులెండ - వెన్నెల చీకటి - శీతోష్ణ వాయువులు పరగడ - మంచుపాటు - దిక్కులపోల్కి - రేబవళ్లయందలి సమయ విశేషజ్ఞత - అడవులు - కొండలు - తోటలు - పొలములు - బీడులు - నదులు - కాల్వలు - చెరువులు - బండలు - బావులు - నక్క

గోతులు - గొడిరాలదిబ్బలు - బాడువలూచిన నేలలు - గోర్జెలు - కంచెలు - బండ్లదారులు - కాలినడకత్రోవలు - మిశ్రుపల్లములు - లోతువెలితి నీటి పారుదలలు - మడుగులు - వాల్గొమ్ములు - గుమ్ములు - సుళ్లుఅలలు - సున్నని ప్రవాహములు - పొర్లుతగులు పోరంబోకులు - గ్రామోపాంతములు - పాటినేలలు - ఇళ్ళువాకిళ్ళు పెరళ్ళు - పాడుకొంపలు - క్రొత్త కట్టడములు - వీధులు వాడలు - రచ్చలు - సావిళ్ళు - భజనమందిరములు - గ్రామదేవత గుళ్లు - గోపురములు, దేవాలయములు - సత్రములు - బడులు - పఠన మందిరములు - నాట్యశాలలు - పందిళ్లు పసులదొడ్లు - గుమ్మములు - పుస్తకములు - మరియు నెల్లపనిముట్లు వాద్య విశేషములు - వేయేల మనుష్యులు మాత్రముతప్ప తక్కిన పెక్కు చరాచర ప్రాణి విశేషములన్నిట దేవతామహిమనుగని పెట్టి యానందించుచుందును.

"హరిహరీ నారాయణ" పద మాలించుచుంట, వరాల రామయ్యగారును మా పెద్దన్నయు దరుచుగా పాడుగంగా, వివాహము దాసరి రామదాసు కాలుగుంటి వెంకటస్వామి, వీరిభాగవతములు వినుచుంటయు మాపని. పొలములో మేపి పోతులెక్కి యింటికి దోలితెచ్చుచు భాగవతపు దర్వులు మా యిద్దరన్నదమ్ములము పాడుచుందుము.

సమానవయస్కులతో బురికొల్పబడి పోరాడుచుంటయు, శత్రువులపై బగదీర్చుకొనుచుంటయు, బడియొజ్జలి చబుకున కందక పరుగిడుచుంటయు, నేమేమో పెంకితనములు చేయుచుంటయును, ఈతాడుటయును, గంతులిడుటయును కోతిపిల్ల, చాకిబాన, గుడుగుడు కుంచములు, గుజ్జనగూళ్ళు, వెన్నెలకుప్పలు, దాగుడుమూతలు, గొట్టికాయయాట యుయ్యేలలూగుట, కుండబంతి, గోనెబిళ్ల, కిఱ్ఱుగానగు పరుగుపందెములు, కడి తగులుటయు, మఱేమేమో బాలక్రీడా విశేషముల దగులుచుంటయును, కాయగూరల దొంగిలించుచు దెబ్బలకు దిట్లకు లక్ష్యముసేయకుంటయు, శిక్షకు దప్పిన దొంగతనమునేర్పు, నెచ్చెలికాండ్రతో వర్ణించుచుంటయును, దొంగత

నము కమ్ముకొనుటకై దబ్బరలు బన్నుటయును, బొల్లెడ్పులు, కోరిజగ డము తెచ్చుకొంటయు, నకారణకలహము. ఇండ్లమీదరాలు రువ్విక్రొవ్వి దెబ్బలుగాచి యొడలు దులుపుకొని మొండిగొనుటయును; అటకలలోను, కూరపాదులలోను దాగుంటయును, గోడలు దుముకుటయు; జెట్టుకొమ్మల డాగి చప్పున క్రిందికి దుమికి పట్టుపడక పరుగులిడుటయును, యేటి నీటి కెదురుగ నిలువబడి ప్రవాహ వేగమున ముందు పరుగిడుచున్నట్లు చెందిన భ్రమమును యథార్థముగా నమ్ముకొన్నట్టు లాడుకొనుటయును, లోతునీట శరవేగమున బారలు చాచి యీతాడుటయును, మిక్కిలి యాసతోర తన ములు ప్రోవుచేసికొన్నట్లు చెరువుల సాహసమున నీది పలురంగుల కలువ పూలు సంపాదించుకొంటయును, కలువకాడలతో నీరు పీల్చుకొనుచుంట యును, రెండు మూడు క్రోసులలోపగు పల్లెటూళ్లలో భోజనములకేగి వచ్చుచు, బలురకముల కూరగాయలాకులు పలుదోముపుల్లలు చెఱకుగడలు సంపాదించుకొని. యుల్లాసగర్వములతో సాయంకాలమున కిల్లు జేరుచుం టయును, రెండు యోజనముల మేరకు లోపుగా బ్రాహ్మణ సంతర్పణముల కపరాహ్ణ భోజనములు చేసికొని, దబ్బులు సంభావనము తెచ్చుకొనుచు, మిక్కిలి యుల్లాసముతో శ్రద్ధగా నాలించిన భాగవతపు దరువులు, తోడి వారలకన్న సొగసుగాపాడి మెప్పులు గొనుచుంటయును, గిఱగిఱ పుస్తక ములు ద్రిప్పి చదువుచు, వివిధరీతుల యాటపాటలనుకరించుచు, జాతినీ తులు, గొప్ప కొద్దులు, మెప్పులు, తలవంపులు, ఖేదమోదములు, కలిమి లేములు, జీవన్ముక్తులవలె నంటియు నంటక తిరుగుచుంటయును, ఏమేమో నాపసితనము నందలి యనుభవ మెంతకని జ్ఞప్తి తెచ్చుకొని వర్ణింప గలను?

మహానుభావా! వదాన్యశిరోమణీ! జయంతి కులకలశాంబుధి సంపూర్ణ రాకాసుధాకరా! బ్రాహ్మణప్రభూ! సమవాప్తకామా! కామేశ నామా! చిత్తగించు.

నాజన్మ కుండలిదిగో, రక్తాక్షి సంవత్సర శ్రావణకృష్ణ చతుర్దశి

రాత్రి పదిగడియలపై మఘానక్షత్రమున జన్మించితినట! వృషభల
గ్నము, కేతు దశాశేషమొక సంవత్సరము నాల్గుమాసములు. వృషభ
మున మంగళుడు, సింహమున రవిచంద్ర శుక్రులు. కన్యయందు బుధశ
నులు, తులయందు రాహువు, వృశ్చికమునగురుడు, మేషమున గేతువిద్ది
రాశిచక్రము. నవాంశకుండలి; మేషమున గుజరాహువులు, వృషభమున
బుధుడు, కర్కాటకమున గురు చంద్రులు, సింహమునరవిశనులు. ధనువున
శుక్రుడు, తులయందు కేతువు ఇది నవాంశచక్రము.

శుక్ల సంవత్సరములో నా తలిదండ్రులు ఆరు నెలల యీడు గల
నా చెల్లెలిని పెద్దప్ప పెద్దన్నను మాత్రము వెంటదీసికొని, తక్కిన పిల్లలలో
రెండవ యన్నను నాపెద్దక్క యత్తవారియింటను, తక్కిన యిద్దరప్పలను
అజ్జాడలోనే వారి వారి యత్తల యింటను, మూడవ యన్నను అజ్జాడలోని
నాజ్ఞాతులగు దివాణముచెంతను, నాజన్మ స్థానమునకు సమీపము గానున్న
నా పెదతల్లి యింటనన్ను మాయైదుగురు మేనమామలలో కడసారమగు
బుచ్చిమేనమామ చెంత వంతరాము గ్రామము నందును, విడిచి పెట్టి,
కొందరు బందుగులతో గూడి కాశియాత్రకు బోయిరి. నాపెద్ద మేనమామను
బుచ్చి మేనమామను మాత్రమునే నెరుగుదును. ఆరుగురు నా తల్లులలో
నైదుగురిని మాత్రము నేనెరుగుదును. అందరు మేనమామలును, నాతల్లి
కన్నచిన్నయాపెతప్ప, దక్కిన నాతల్లి తోబుట్టువులందరును గంపెదేసి
పిల్లలగన్న తల్లిదండ్రులే. మాబుచ్చి మామ యెనిమిదడుగుల పొడవు
పొడవు దగులావుగల ముప్పదియైదేండ్ల వయసు వాడు. కడు దొడ్డవాడని
యతని మాళ్లో తగు మనుష్యునిగా దగవులకు బిల్చుచుందురు.

వంతరాములోని మా మేనమామ యింటి ముందున్న పెద్దరావిచెట్టు
దాటి పెద్దయలలతో హోరుపెట్టి వాన కాలమున యెఱ్ఱని వండు నీటితో
ఏరు వచ్చుచుండును. ఈనుచున్న మొక్క జొన్న చేలనడుమ, పూచికాచు
నీటి వంగతోటలకునడుమ, యుల్లి బచ్చలి మిరప. పాదులకు జెంగటక్రిరు
పెట్టుచు వంగిలేచు నేతమునకు దీయ నీరందిచ్చు చెరువు, నూతిచెంగట

వానగాలులకు మ్రోగు కొబ్బరియనంటి మొక్కలతోడి పొందరి పెరటి చెంతనున్న నాతల్లి పుట్టింటి పూరికప్పుపై పెంకులు విసరుచున్న నన్ను జూచి నా పెద్దమేనమామ పెద్దకొడుకు "ఔరా! సూరిగా యింటిపై పెంకులెందుకు విసరుచుంటివి?" యనగా బుచ్చిమామగారి యిల్లు పెంకుటిల్లు చేసెద"నని బదులు చెప్పితిని. ఆయూరు నందలి కొందరినడకలును, కొందరి యేడ్పులును, కొందరి పొడుము పీల్చుటయును, కొందరి మాటలును మిక్కిలి నవ్వుపుట్టించుచు వెక్కిరించుచుంటిని. ఏటియావలితోటలో డేరావేసికొని దిగిన బొబ్బిలి రాజోద్యోగిచెంత పురాణము చదివి యదివరకెన్నడును నే జవియెఱుగని పటికబెల్లము పట్టెడు ముక్కయు నాలుగణాలును బహుమతి తెచ్చుకొంటిని.

ఒకనాడు మా బుచ్చిమామ యూరలేడు. నాలుగుగంటలవేళ సాయంత్రమున మా యత్త మల్లిపందిరిచెంత పెరుగుకలిపిన చలిది యన్నము నాకు బెట్టెను. ఆపెకన్న మధికముగా బెట్టుటయలవాటు. కడుపు తుంబవలె మీదికివచ్చువరకు దీనగా జూచుట యాపెకిష్టము, నేను కావలసినంత యన్నము దిని తక్కినది కాకులకు జల్లుచున్నాను. ఆపె వెర్రిదానివలె కోపముతో నన్ను జితకమొత్తెను నేనాదుఃఖము పట్టలేక యేరుదాటి యొంటిగా గోగుచేనునడుమ గొంత జంకుసు గొంత ధైర్యమును బెనగొన నడచుచు, సమీపముగా రెండు తలలతోనున్న కొండకొనను బరికించుచు; కాలిన పెనమువలె నెర్రగా గ్రుంగుచున్న సూర్యబింబమును వింతపడిజూచుచు, నే యొక్క దారి గుర్తుగా నించుమించొక క్రోసుమేర నడిచి, చీకటిపడకముందు చంద్రమ్మపేట యను నాపెద్దమేనమామగారి యూరుచేరుకొంటిని. అచట నా ముగ్గురు మేనమామల కన్నకొడుకు లయిదుగురు కలరు. "గుంటడా ఒంటిగా భయములేక వచ్చితివెంతదారుణము" అని నా పెద్దమామ డెబ్బదేండ్లవాడు, నాయెడగల సహజబంధు ప్రేమ కలంకారమగు చిరునవ్వున నన్నలంకరించి, ఇదుగో

చూచితివా సూరిగా డెట్లొంటిగా వచ్చినాడో !" యని నన్నురువదేండ్ల యీడు గల నాపెద్దత్త కప్పగించెను.

ఆ యింటికి దూర్పుగా నే బదిగజముల మేర వేరుపనసలు, చెన్నంగి కొబ్బరులు, బొంతయనటులు, గన్నేరుమామిళ్ళు దబ్బలు నిమ్మలు మొదలగు చెట్లవేళ్లకు నీరందిచ్చు వేగవతియను చిన్నేరు జిలజిలబారుచుండెను. నా తండ్రివంక బంధువులకన్న నా తల్లివంక బంధువులు నన్ను ప్రేమించుట సహజమని యపుడు నే దొలుసారి తెలుసుకొంటిని. ఆ మరునాటి యుదయ మెనిమిది గంటల వేళకు. నా యున్కిగానక వంతరాములో రాజామునకు బనిమీద వెళ్లివచ్చిన నా బుచ్చిమామ వెదకించుచుండగా, నా పినతల్లి నే యున్నయూరికివచ్చి నారెక్కలు బట్టుకొని ప్రేమమూలముగా నగపర్చిన యాపెకోపము, నగవు, దుఃఖము, నొచ్చుకొంట, నన్ను జీవాట్లిడు తీరాత్మైకవేద్యముగాని తెల్పశక్యముగాదు, ఆపె నాచెయి పట్టుకొని "ఔరా ! యెంతపని చేసితివెవ్వరికిని చెప్పకిట్లు పారిపోతివి. బుచ్చి, నీవు వచ్చినగాని నే నన్నము తిననని నీ రాకకెదురుచూచుచున్నాడు." అని నన్ను దిరిగి వంతరామునకు దోడ్కొనిపోగా, నాకై వీధిగుమ్మమున నిరీక్షించుచు మోముద్రేలవైచుకొనియున్న యాజానుబాహువు నాబుచ్చిమామ నాతో "నౌరాగుంటడా ! యెంతయపకీర్తి ! నరసప్ప నిన్ను నా కప్పగించెనుగదా" యని, నా యత్తతో "ఎందుకంతలేసి దెబ్బలుకొట్టినా వంతవెర్రికోపమా ! యాడుదానవుకావా !" యని చీవాట్లిడెను.

కాసికిబోయిన నా తల్లిదండ్రులు వచ్చుచున్నారను వార్తవిని వారలకే నెదురేగుచు గొంతదూరమున వేణీదానముచేయుటచేత నప్పుడే పొడముచున్న జుట్టుకలిగిన మాయమ్మనుబోల్చలేక యాపెతో "మాయమ్మయయ్య వచ్చుచున్నారట, యింక యెంతదూరముగా నున్నారో" యని యనగా, యాపెయును, బేరండుటకై మా బుచ్చియత్త నన్ను బయలి

పెట్టుటచే గుర్తుపట్టలేక, తుదకు పోల్చి నన్నెత్తుకొని, నేనే నీ తల్లిని నాయనా, నన్ను బోల్చజాలకుంటివా ?" యని యాపెకంటనీరిడి, కలకల నగవుల నాతండ్రివంక కనుగొన్న ప్రేమచూపిట్టిదని వర్ణింపదరమా ? మా తల్లి యొకసారి, నాతండ్రి యొకసారి, నన్నెత్తుకొనుచు, నన్ను ముద్దిడుచు, నేమేమో నన్ను బ్రశ్నించుచు, నరక్రోసుమేర నా బుచ్చి మామగారి యింటికి నన్ను దోడ్కొనివచ్చుచున్నపుడు నాకున్నయానం దమేనిస్సంశయముగా నాజన్మమంతలోను నేననుభవింపగల బ్రహ్మానంద, మదియాత్మైక వేద్యమనిర్వాచ్యమవాఙ్మనస గోచరమోరసికాగ్రణీ పండిత శిరోమణీ ! వదాన్యశేఖరా ! నాపదియేండ్ల బాల్యదశలోని నాతీరు వర్ణించి చెప్పుమంటి వద్దిరా చిత్రకారుడాకృతి ననుకరించి వ్రాయగలడుగాని చైతన్యము వ్రాయగలడా ! కవిశుష్కకల్పనముతో పంచేంద్రియ వ్యాపారము వర్ణించి చెప్పగలడుగాని, యాత్మన్దెల్పగలడా ? బ్రహ్మానంద మతీంద్రియమని మాత్రము వర్ణింప శక్యమగును. చిత్తగింపుము.

అజ్జాడ గ్రామములో మాజ్ఞాతి చిరంజీవులను నతడు గొప్పబలశాలి; సంవత్సరమునకు మూడునాలుగువేల రూపాయిల రాబడిగల బ్రాహ్మణ ప్రభువు; మన్మథసుందరుడు; రాయమ్మగారి మూడవకొడుకు; ప్రశస్తముగా నీతనేర్చినవాడు; నన్నుగుఱ్ఱముపై గూర్చుండబెట్టుకొని యపుడపుడు తిరుగుచుండువాడాకస్మికముగా నొక మ్రాను తీయుటకై యేటబడి యీదుచు, బ్రమాదమున మునిగి గతించెననువార్తవిని, మాతలిదండ్రులుదయమున నన్నుతీసుకొని బయలుదేరి రెండుజాములకు వెళ్లిరి. అంత యీతగాడాకస్మికముగా నేటబడి మరణించుట యతి ఘోరముగాను మిక్కిలి యాశ్చర్యముగాను జెప్పుకొనిరి.

ఒకప్పుడు ముప్పిడి కన్నయ్యదొరగారి యొద్దకు మాయయ్యయు. మేమిద్దరమన్నదమ్ములును, మధ్యాహ్నము నరసాడకేగితిమి. ఏటియొడ్డున దూర్పుగా నొక గంట నుత్తర రామాయణము జదివించి సంతోషించి మా యూరియేటి యావలి తోటలో నొక పండ్లపనసచెట్టు పారితోషికమిచ్చెను.

ఉర్లాము బసవరాజుగారి కొడుకుపనయనమునకు సంభావనకై బయలుదేరినాము. మా యూరినుండి యిరువదిమంది పిన్నపెద్దలు, సీతారామపురం, వెంకమ్మపేట, నీలముపేట, ములుకులాముర్లాము, నడుత్రోవను రాత్రి చిమ్మచీకటిలో చోడిచేల నడుమ నడుచునపుడు, ముందుజట్లు, యీవలిమడిచే నావలిమడిచేనికి ముడిపెట్టి దారి నిరోధించుట, యట్లు పెక్కుచోట్ల నురిబన్నుట, వెనుకవచ్చు జట్టుదార్లకు మోకాళ్లకుదగిలిబడి లేచుచుంటయు, త్రోవలో జెరుకు పెరళ్లలో రెండుజాములరాత్రి యమానాస్యమందు చొరబడి, కర్రలు మొదలనుండి విరిచితీసి, పెద్దబలుసుముండ్లకు లక్ష్యముసేయక, దాటుచు భక్షించుటయు, పెద్దపెద్ద కథలు వినుచుంటయు, ప్రతిసత్రమునందమృతోపమానముగ రెండుజాముల పగలైన, మరి రెండుజాములు రాతిరియైన నారు క్రోసులు లేక యెనిమిది క్రోసులు మజిలి కన్న యొకప్పుడు రాత్రి పదిపదకొండు క్రోసులు నడచుట తటస్థించినపుడు, ఏడెనిమిది క్రోసులకు మునుగులు క్రుంగును, వెనుకజట్టుదారులు చెంతకువచ్చువరకు ఒకగంటనుండియు, విశ్రాంతి తీర్చుకొనుచున్న ముందు జట్టుదార్లు, వారినిజూచినతోడనే లేచి నడక ప్రారంభింప వెనుకటివారి యవస్థయడుగనేల ? ఎండ జామున్నరపైగా నెనిమిది క్రోసులకుపైగా నడిచివచ్చి, విశ్రాంతికై కూర్చోనాసింప, దిరిగి నడువవలసివచ్చెగదా యని, విధిలేక నడచివచ్చు మాబోటి పిల్లబాటసారులను పెద్దలు దయచే త్రోవ నడిపించిరి, మాపెద్దన్నయు బేరన్నయు నేనును ఉర్లాము బసవరాజుగారు సంభావనయిచ్చు ద్వారము తూర్పుచెర్వుటొడ్డు, తేనెకై బాతరపడు తెట్టెలుగట్టు నెర్రచీమలవలె దలలుమాత్రమగపడునుగాని క్రిందెరుగరాదు, ఆద్వారమున మీదిమెట్టున నీలముపేటపడుచు బ్రాహ్మణుడొకడు కాచి తన వెలనాటివారిని మాత్రమే లోపలికి రానిచ్చుచు దక్కువారిని మెట్లు దిగువరకు బడద్రోయుచున్నవాడు. మత్తగజమువలె మాపెద్దన్న యందరికన్న నౌన్నత్యముతో. బెద్దకెరటముపోల్కిగుంజులాడు వెనుదీయు పిల్లకరటములన్వెనుబెట్టి ద్వారమునకు సమీపించి మఱికొమ్మబట్టి విరుచు

ఖండాలము పోల్కి-గరమున శిరమంకించి వానిని క్రింది మెట్టలంకరింప జేసెను, అంతరాళపు కట్టురతనములవలె జనులసందున నిరికి క్రిందుకాళ్లందవు, మీదనేమి జరుగుచున్నదో తెలియదు; కాని ప్రవాహ వేగమున నెటులనో ద్వారమునకు సమీపించు నంచెలుగా మావాళ్లు బంతులవలె మనుష్యులపైనుండి విసరుచు గ్రమక్రమముగా లోపలికి విడిచిరి, బండరాళ్ల యిరుకుద్రోవను బ్రవహించు కొండ సెలయేటి దిగువ నీదువానివలె లోననొక సన్నవరుసగట్టిపోవు జనులకొబడినారము, ఆవల ఒకరు విచ్చురూపాయి ప్రతిజనునకు జేతబెట్టుచుండెను,

ఉర్లామునకు నలువైపుల రెండు మూడు ఫర్లాంగులవరకు విస్తృత పంక్తులు దీర్చి బ్రాహ్మణులందరు యించుమించొక లక్షయర్థులు; పర్వతములవలె నన్నరాసులు, పశువులులంకెలనగాని విడిగగాని, కళ్ళమునూర్చినట్లు ఇరువది ముప్పదిమంది వంకాయ ముద్దగలియగ్రుమ్మట, విస్తరి పడినతోడనే నాలుగు కూరలు నాలుగు పచ్చళ్ళు పప్పు అన్నము పిండి వంటలునెయ్యితో సమస్తము వేలకొలది వడ్డించు వాండ్రతో బ్రతిబంక్తిలోను బసవరాజుగారు వెనుక భజనపారకులతో చండశాసనుడయిదిరుగుచుండెను, ఆ భోజన మహోత్సవము ధర్మరాజు రాజసూయయాగమును జ్ఞప్తికి దెచ్చెను. నాల్గుపూటలందుండి క్రమక్రమము గతిపయ ప్రయాణంబుల నిల్లు చేరితిమి,

కరువు పెట్టినది. పంటలు పోయినవి, మా భూమికాక యరువది రూప్యముల కప్పనము చెల్లించుటకు మాజ్ఞాతి, యూరిలోనిభుక్త, పెద్దబ్బాయి, యొక బ్రాహ్మణప్రభువు రాయమ్మ మనుమ డాతని భూమికూడ మా తండ్రి కౌలునకు బుచ్చుకొనెను. అప్పనము చెల్లించుటకై మా తలిదండ్రులు పేరన్నయు నేనును శ్రీ జగన్నాథయాత్రమిషపై బయలుదేరితిమి. నా పుట్టుటకుముందు మా తండ్రి యతవి సతీర్థ్యులయింట సంస్కృత మహాభారతమును జదివెను. చీకటితోడనే స్నానముజేసి, సంధ్యావందనాది కృత్యములాచరించి, గడియప్రొద్దెక్కినతోనె పుస్తకము ప్రారంభించి

చదివి యర్థము చెప్పుచుంట, సాయంత్రమునకు జాలించుట, పిదప భోజనముచేసి తిరిగి చదివి రెండు జాములరాత్రికి జాలించుట, నాలుగైదగ్రహారముల జనులు వినుచుంట, యిట్లు పదునెనిమిది నెలలకు మహాభారతమంతయు ముగించెను. మా తండ్రి కతని సతీర్థ్యులు గంటి గోపాలకృష్ణయ్యగారు కుండలములిచ్చి బహుమతి చేసిరి, ఆ చదువు కారణముగ మా తండ్రికి నేత్రావరోధము కలిగెను. ఎన్నో సాధనములు చేసినను కొంచెము పనిపాట్లకడ్డులేకుండ దృష్టియున్నదిగాని స్వచ్ఛముగ దృష్టి రాలేదు,

మొదట గుడివాడ యగ్రహారము వెళ్లినాము. తగినవాడు పేదపడినాడని చుట్టము లేమి పై వారేమి మాకు భోజనముపెట్టి యథాశక్తి ద్రవ్యముకూడ నొసంగుచుండిరి. అణాకు తక్కువగాని రూపాయికి ఎక్కువగాని మా కెన్నడును సంభావనముట్టలేదు. అచటనుండి వెంకమ్మపేట వెళ్ళినాము. అచట మాయమ్మ చెల్లెలుండెను, ఆపె భాగ్యపాటివారి కోడలు, బహుసంతానవతియు. యజ్ఞముచేసెను, ఆమెయు నామెభర్తయు మిక్కిలి మమ్మాదరించిరి. మూడు నాలుగు రోజుల పిదప నటనుండి సాయంకాలము నకంబఖండీయను బొబ్బిలివారి సత్రము జేరితిమి. పూర్వము బొబ్బిలివారి సత్రములో భారద్వాజ విందువలె భోజనములు పెట్టువారు. అటనుండి కప్పగంతులపేట గృహస్థుల యిండ్ల రెండు పూట లుండి దూసి మీదుగ శ్రీకాకుళము వెళ్లినాము. అచట పదేనుదినము లుంటిమి. అదివరకు నప్రతిగ్రహీతయగు మాతండ్రి యిపుడు తా వ్యవసాయముచేసిన యొరులభూమి కప్పనము కట్టుటకై యాచనమునకు బూనుకొనెను. ఉదయముతోడ స్నానముచేసికొని, విభూతియురుద్రాక్షతాపళమును ధరించి. చేత నెర్రని యక్షతలు పట్టుకొని, పేరుగల గృహస్థులను జూచి మాతండ్రి యాశీర్వాద శ్లోకము చదివి యర్థము చెప్పుట. కొందరాహ్లాదముతో విని నమస్కరించి తోచిన దిచ్చుట, కొందరు సమయముకాదని చీదరపడుట, కొందరు "రేపు రా మాపురా" యని త్రిప్పి

పంపుట, యెట్లైననేమి శ్రీకాకుళము విడిచినపుడు పదేను రూకలకు దగ్గ కుండ మాతండ్రి మొలజోలెలోకి సొమ్ము వచ్చెను.

అటనుండి యామిదాలవలస కేగినారము. అట మేకావారన్నదాతలు. పిదప సిద్ధాంతముమీదుగా శ్రీముఖలింగము ప్రవేశించినాము. మా బంధువులు పలువురచట గలరు. వారి యాదరణముపొంది పర్లాకిమిడెకు వెళ్ళినార మచటనుండి టెక్కలి రఘునాధపురమునకు బోయితి మటనొకరాజునకు దివానుగనున్న మా సన్నిహిత బంధువు మరువాడ లక్ష్మీనరసింహాముపంతులు మమ్ము మిక్కిలి పదిపూటలవర కాదరించి యన్నముపెట్టి తోచిన సంభావన మొసగెను. పిదప నిచ్ఛాపురమున కేగితిమి. రాలి తుంబయ్యభుక్తయన్నదాత; యంతట దసరా దినములు వచ్చినవి. చిన్నకిమిడెలో నబ్బూరి సూరయ్య భుక్త నవరాత్రములు సేయుచున్నాడనివిని యచ్చటికి వెళ్ళినారము. మాతండ్రికి మాయిద్దరన్నదమ్ములకు జపమునకు వరుణలిచ్చెను. శ్రీరామనామ జపము మాతండ్రికిని మాకిద్దరి కెవ్వియో దిక్కుమాలిన జపములును వరుణ యిచ్చెను, ఆ యబ్బూరి సూరయ్యపంతులు చిన్నకిమిడేదివాను పట్టుపురములో నవరాత్రులు చేయుచున్నాడు. రాత్రి యేకభుక్తముగా నవరాత్రులు గడిపినాము. మాతండ్రికి నాలుగు రూపాయలు మాయిద్దరికి చెరియొక రూపాయి యిచ్చినాడు. అచటనుండి సేరుగడాకు వెళ్ళినా మాదారిలో మాతండ్రియు బేరన్నయును ముందు నడుచుచున్నారు, మాయమ్మయు నేనును వెనుక నడుచుచున్నాము. కథలు చెప్పుచు, వింతవింత భవిష్యద్వార్తలు చెప్పుచు, మాతల్లికి మార్గాయాసము మరపించువాడను. "అమ్మా! ఇంకముదు మనమిట్లు కష్టపడి కాలినడకతో బోవనక్కరలేదు ఎడ్లుగాని పోతులుగాని కట్టకుండ నిరువది ముప్పది పెట్టె బండ్లు యంత్రములచే నడిపెదరట. శ్రీకాకుళమునుండి యిక్కడికి యొకగంటకు రావచ్చునట. ఒకడు బండిపై కూర్చుని కాళ్ళాడించిన మాత్రమున నాబండి యిష్టమువచ్చినట్లల్ల పరుగిడునట. విమానమెక్కి మనుష్యులాకాసమున దిరిగెదరట" యని యద్భుతములు చెప్పుచు

మాయమ్మను నడిపించుచుండువాడను. మాకన్న మాతండ్రియు బేరన్నయు రెండు ఫర్లాంగులు ముందైనారు. అడవిదారి ఒకచోట పట్టెడాట వేసి యున్నారు. దొంగలు వాండ్రు. తమలోదాము దెబ్బలాడుచు, నేపందెము గెలిచెనో చూడుమని మాయమ్మను తగవడిగిరి, ఆమె మెడలో దీగె చూచిరి. గాన వాండ్రా మిషపై మమ్ములను మాతండ్రికి దూరము సేయుటకై యెంచిరి. మాయమ్మ సత్యకాలపుది. ఆ యాటచూచి వీడుగెల్చినాడు వాడోడి నాతని తగవు చెప్పుచున్నది. ముందేగుచున్న బలశాలి నా తండ్రి వెనుక దిరిగిచూచి "యుండుడుండుడు" నేను బందెమొడ్డెదనని యా పచ్చెపువాండ్ర నదలించి, యినుపపొన్నులున్న తనచేతి వెదురు దుడ్డెత్తి పరుగిడిరాగా, నాపచ్చెపువాండ్రు, నాతల్లి నవ్వుకొనునట్లు పటాపంచలై పరుగిడసాగిరి. ఉదయము జాముప్రొద్దునకు నేరుగడా చేరితిమి. అది మన్యము, చిన్నచిన్నకొండయేరు దానిచెంత బారుచున్నది. వోఢ్రము తప్ప తెలుగుమాటలేదు. పసపునూనె పట్టించుకొని స్త్రీలు పురుషులు మురికిదుక్కబట్టలతో స్నానములు చేయుచుండుటయు వారికి బట్టెదేసి గుండుజోళ్ళు చెవులకుంటయు నాశ్చర్యమయ్యెను. ఆ యూళ్ళో మాసన్నిహిత బంధువు మరువాడ వెంకయ్యగారు మూడు దినములు మమ్మాదరించి రెండు రూపాయలు మాతండ్రికిచ్చి పంపిరి.

బరంపురమునకు బిదప వచ్చితిమి. బరంపురమునందువలె నతిథిసత్కార మింకొకచోట జరుగుట నేను చూడలేదు. అంత సౌకర్యమైన భోజన మింకొకయెడ దొరకదు. అచటి గృహస్థులందరు నన్నదాతలే. ప్రతి గృహమునం దొకడో. యిద్దరో, ముగ్గురో, నలుగురో, యతిథులుండువారు. ఆ యూర దిగుమర్తివారి యింట విడిసిన నా యన్నదాత మాకు షడ్రసోపేతముగా భోజనముపెట్టి, నారాత్రి అతని సావిడిలో పడుకొన్నపుడు టక్కు టిక్కుమని మ్రోగు గడియారమునుజూచి, నా తల్లితో నా తండ్రి చూచితివా టక్కు టిక్కు ధ్వనులతో కాలముపోక చెప్పు నీ జంత్రమునంటిదే యాయుఃక్షయ ముచ్ఛ్వాస నిశ్వాసములదెల్పు

నిర్దేహము. అహా కాలము జరుగుట కనిపెట్టినట్లు రానున్న కాలమును దెలిసికొనరాదుగదా ? యని పల్కెను. అచట అయిదారు రూపాయల వరకు సంపాదించి యసికాకువెళ్ళి, యట మూడు పూటలుండి రసూల్కొండకు వెళ్ళినాము. ఆ చిన్నపట్టణమొక గుట్ట చుట్టుకొని దబ్బకాయచుట్ల వంటి వీధులతో రమ్యముగా నున్నది. అద్దానికి దక్షిణముగా వంతెనతో నొక చిన్న తీయనీటియేరు పారుచున్నది. అ కొండమీద సంపెంగచెట్ల నడుమ నాంగ్లేయపాఠశాలయును, వైద్యశాలయును, పురరక్షక భటాధ్యక్షాయుధశాలయును గలవు. చిన్న తాలూకా ప్రదేశములలో రసూల్కొండ వంటి యందమైన స్థలములేదు. అచట మా యమ్మకన్న పెద్దయాపె మా పెదతల్లియున్నది. ఆమె భర్త మరువాడ తమ్మయ్యగారు. వధూవరు లిద్దరు పండుముసలివారు, మమ్ముల నెంతయో యాదరించిరి. ఒక నాడచటి శిక్షణాధికారాధ్యక్షుడగు బచ్చు నరసింహస్వామి పంతులుగారి యింటికి మా యమ్మయు మేమిద్దరన్నదమ్ములము వెళ్ళినాము. ఆపంతుల భార్య తెల్లగ లావుగనున్నది. నేను భాగవతము చదివినాను. మాయమ్మ యర్థము చెప్పిన, దందుకు సంతోషించి యా యిల్లాలు మా యమ్మకు రెండు రూపాయిలును క్రొత్త చీరయును మా యిద్దరికి చెరియొక మాతులుంగ ఫలమును దయచేసెను, తిరిగి యసికామీదుగ బరంపురమునకు వచ్చినాము.

కోర్టుపేటలో నోవదాన్యశిరోమణీ ? బ్రహ్మకులమండనా! జయంతి వంశ పారావార సుధాకరా ! సకల విద్వజ్జనవిధేయా! కామేశాభిధేయా ! చిత్తగింపుము. నీ యింట రెండుపూటలును షడ్రసోపేతముగా ముులగ కాడలు, పంపాయ ముక్కలు లంకజీడిపళ్ళానపకాయబద్దలు వైదికులకు, నుల్లిపాయలతో లౌకికులకును ప్రత్యేకముగా ప్రశస్తముగా గాచబడిన పప్పు పులుసును, వివిధశాకములు, బహ్వాన్నములు వెలయ వందలకొలది బ్రాహ్మణులతో గలిసి నెల పదేను దినములు హాయిగానుండి, మీ యొద్ద నా తండ్రి" శెలవు దయచేయుడు శ్రీజగన్నాథము సేవింప నేగెద"

ననగా "శాస్త్రిగారూ! తిరుగుదలలో నన్ను జూడుడు. నా శక్తికొలది మిమ్ముల సత్కరించెదను" అను నీ పల్కులు నా కర్ణామృతములయ్యెను,

## ఛ త్ర పు ర ము న

పిమ్మట మేము ఛత్రపురమునకు వెళ్లి కొద్ది రోజులచట నాగితిమి ఆ యూర ముప్పది నలువది రూప్యములవరకు మాకు వైదిక సంపాద నముగా లభించెను, ఆ చెంగటి గంజామున నొక యింట నొక రేయి గడిపి తెల్లవారిన పిదప శ్రీ జగన్నాధమువైపు నడువసాగితిమి. మూడు నాల్గు క్రోసులు నడిచి, పదునొకండు ఘడియల ప్రొద్దున కొక యొద్దె పల్లె చెరువుకడ, నా యూరి యొక పుణ్యాత్ముడిచ్చిన సీదా తెచ్చుకొని, వండుకొని భుజించితిమి, ఆ చెరువు నీరెర్రగా జలగ నెత్తురువలె నుంట నా యెర్ర బియ్యమునకు మరింత యెర్రరంగువెట్టెను. "ఆకలి చవి తెలియదను సామెత మనయెడ నెంత నిజమయ్యెను" అను మా తల్లి మాట యచ్చెరువు కావించెను. అటనుండి సాయంకాలమునకు జిలక సముద్రపు పడమటి యొడ్డుననున్న రంభయను గ్రామమునకు జేరు కొంటిమి. రంభ సత్రములో నారేయి గడిపి మరునా డుదయము పదు నొకొండు గంటలకు రుచ్యముగా వంకాయ ముద్దయును పప్పును జిక్కని పెరుగుతో హాయిగా భోజనము చేసికొని, మిక్కిలి యుత్సాహముతో జిలకసముద్రపుటొడ్డునందలి యోడరేవులకుబోయి, మానల్వుర కింకమించు పది రూప్యములు సుంకము చెల్లించి, యొక పడవలో గూరుచుండి, మేమిల్లు విడిచినది మొదలు జరిగిన వృత్తాంతములు చెప్పుకొనుచు, మమ్మాదరించిన పుణ్యాత్ముల న్గొనియాడుకొనుచు, శ్రీ జగన్నాధస్వామి సేవ దొరుకును జన్మ సాఫల్యమగునని యుప్పొంగుచు, మా కుటుంబమందలి తక్కినవారిగూర్చి తలంచుకొనుచు, చిలకసముద్రము నభివర్ణించుచు, శ్రీ జగన్నాధావతారముగూర్చి మా తండ్రి చెప్పగ వినుచు, శ్రీ జగన్నాధ క్షేత్ర వృత్తాంతమును రంభనుండి మమ్ము శ్రీ జగన్నాధమునకు దోడ్కొ

కొని పోవు పండాలు నిన్పించగా భక్తి శ్రద్ధలతో నాలించుచు, నప్పు డపుడు నీటిపై నుండి యగపడు పెద్ద పెద్ద తాబేళ్ళు మొదలగు జల జంతువుల గని యబ్బురపడుచు, నడురేయియం దిద్ది మిక్కిలి సంకట స్థలము పడవలకు ప్రమాదకరమైనది "శ్రీ జగన్నాధా! పతిత పావనా! కాపాడుము గాపాడుమని యాత్రికులందఱు దేవుని భజించుకొండ"ను నావికుల యుపదేశమును విని భయ భక్తులతో శ్రీజగన్నాధుని స్మరించుకొనుచు, యాకలి, బడలిక, భయములచే బట్టీపట్టని నిద్రుతో, నారేయి తెల్లవారగా నేమముగా నరసింహఘట్టము సమీపమున నోడలు దిగి యొడ్డు చేరుకొంటిమి.

## శ్రీ జగన్నాధస్వామి సందర్శనము

రెండుమూడు క్రోసులమేర నిసుకదిబ్బలపై నడిచి, నరసింహ ఘట్టమునందు ముమ్మరముగా రాలిన గచ్చకాయలు కావలసినన్ని యేరుకొని, శ్రీజగన్నాధాలయ స్వర్గశిఖరము గాంచి మ్రొక్కుచు "జయ జగన్నాధా" యని భగవన్నామోచ్చారణపరవశులమై, దూరమార్గగమన శ్రమమంతయు మఱచి, పదిగంటలప్రొద్దునకు శ్రీజగన్నాధముదేవాలయముచెంత సీతగుండముదరి మమ్ము దోడ్కొనివచ్చిన పండాలగ పర్చిన యింట దిగి, యాకుండికయందలి యాకుపచ్చని చిక్కని మురికి నీట బున్నెముకై ముక్కుమూసికొని మునిగినాము. ఇప్పుడు కోటి రూపాయిలిచ్చినను అంతమురికి పసరునీటిలో గాలైన పెట్టుదునా? ఇప్పుడు భక్తిచెడి వేదాంతము ముదిరెనుగదా అబారగా బ్లౌబుడ్డ లావీధులలోని మురిగినయున్న ముకంపాగుండములోని కుళ్లునీ రచటి పండావాండ్ర దురాశయు నిర్దాక్షిణ్యము చెప్పనలవికాదు. భక్తిమూర్తిభవించినట్లు కోవెలకు బోయి, జగన్నాధుడు, బలరాముడు, నడుమ సుభద్ర యనెడు మూడువిగ్రహములను దర్శించి, మ్రొక్కి తోచిన దక్షిణ సమర్పించుకొని, యొక చిన్నకుండప్రసాదము నువ్వకాయపులుసును కొని

బసకు వచ్చి భక్షించినాము. సాయంకాలము నాలుగుగంటల కూరుమాచు టకు బైలిదేరినాము. మా యమ్మ యొకయర్ధణా యిచ్చి రెండు కుంభా శప్పములు కొని మాయిద్దరన్నదమ్ములకు జెరియొకటి జేత బెట్టెను. నాయప్పము నే దినుచుండగ నొకగ్రద్ద తన్నుకొనిపోయెను. శ్రీజగన్నాథ ధ్వజమగు గరుడమూర్తి సాక్షాత్తుగా స్వీకరించెనని అప్పము పోయినం దుకు ఖిన్నుడనగు నన్ను నా తండ్రి యోదార్చెను. ఒక మఠముచెంత బెద్ద గడ్డములు. మీసములు, జడలతో నున్న యోగులు కట్టిన కొండ ముచ్చులలో నొకదానిచెంగటకు బోయి నాచిన్నగావంచాతో దానిని గొట్టు చుంటిని. ఆహనుమంతు సాధుజంతువుగనుక నూరకొన్నది, అదిచూచి యచటి బైరాగి నాతో నాకోతిని గావంచాతో గొట్ట మనెను. నే నట్లు సేయగా దురుసుగ నటించు నాముక్కిడిక్రోతి నా క్రొత్తగావంచాను ముక్కముక్కలుగ జీర్చెను. పిదప నింద్రద్యుమ్న మనుకోనేటిని జూచి తిమి, నీరాకుపసరుగనున్నను స్వచ్ఛముగ నుండెను, పెద్దతాబేళ్ళుకొలనులో నుంచి వచ్చి మేమందిచ్చు పేలాలు తినుట వింత యయ్యెను. సాయంకా లము నొక ఇన్స్పెక్టరునొద్ద మాయిరువురన్నదమ్ములము కలిసి జోడుగా పద్యములు చదివి ప్రహ్లాదనాటకములోని కీర్తనలు పాడినాము, తీయని లేత శారీరములకు నీతియు భక్తియు బోధించు మాపద్యముల కాయు ద్యోగి మెచ్చుకొని మాయిద్దరికి జెరిరెండురూపాయిలు దయచేసెను. "ఆహా! తీయనిపాట యమకింకరులవంటి వారికిగూడ మనసు కరిగించును గదా!" యని మాతండ్రి యాశ్చర్యపడెను. ఆరాత్రి మరీప్రసాదపు ముతక యెర్రకూడు భుజించలేక వండుకొని తిన్నాము. ప్రభాతవేళ నన్ని కుండికలలోను సముద్రమందును వివిధ తీర్థస్నానములు చేయుచు, మూన్నాళ్ళు శ్రీ జగన్నాథమున వసించి, శ్రీజగన్నాథపటములను, పతిత పావన మృత్తికయును. దులసిపూసలపేర్లు మొదలగు శ్రీ జగన్నాథమున సంపాదించవలసిన సమస్తవస్తువులను బట్టుకొని శ్రీ జగన్నాథమును విడిచి రక్తమట్టి యనుస్థలమునకు జేరుకొంటిమి. అప్పటికి మాయయ్య కేబది

మూడేండ్లు మాయమ్మకేబది, పేరన్నకు పదునొకొండు నాకుతొమ్మిదేండ్లు పైగా ప్రాయము. అచట వండుకొని తిన్నమీద మాచెంగట వండుకొని భోజనము చేసిన కొందరు సాధులు కాలినడకపై మోకాలి నీటిబంటి లోతు దారిన సముద్రముదాటి గంజాము పోవచ్చును. బదిపదేనురూపాయి లోడవా రలకీయవలెను. మీరు మావెంబడి రాగలరా? యనగా సత్యకాలపునాతండ్రి మంచిదని యంగీకరించెను. కాలినడకతో బోవుచుంటి మయ్యయో యేమి చెప్పగలను? మాశ్రమ దేవున కెరుక.

పిమ్మట నాజోగులవెంట నందంద మొణుకుబంటి, తొడబంటి, బొడ్డు బంటి రొమ్ముబంటి నీళ్ళుగలదారి గడచుచు జగన్నాధా నీవేమాకుశరణమని మాటిమాటికి జగన్నాథుని స్మరించుచు, శ్రీకృష్ణుని కళేబరము సర్జునుడు ద్వారకాసముద్రమున వైవ నాకబంధము శ్రీజగన్నాథమురేవున దేలి యచట యింద్రద్యుమ్నమహారాజునకు దొరికి దేవాలయమున స్థాపింపబడుట మొదలగు శ్రీజగన్నాధక్షేత్రమహాత్మ్యకధను నాతండ్రి నాతల్లికి విన్పించుట భక్తిశ్రద్ధలతో నాలించుచు, రెండుప్రక్కలను లోతునీట జల సముద్రమున నెగిరి త్రుళ్ళిపడు జలజంతువుల వింతపడి పరికించుచు నందంద బలిసి నిలువులకొలది పెరిగి ధవళమేఘములవలె గాలికి జలించు, పూచిన రెల్లుచే లతిక్రమించుచు, సాయంకాలమునకు బదిక్రోసుల మేరను చిలకసముద్రపుత్రోవ నడిచి యొడ్డెపల్లెలలో నేడుగంటలరాత్రికి జేరు కొంటిమి. వీధిలో నామార్గశీర్ష పూర్ణచంద్రిక న్మిగుల శీతబాధ తగిలియు నిశీధ సమయమున నటుకులు పెరుగులో నానవైచుకొని భుజించివేకువజాము వరకు నిదురించి. తిరిగి యాజోగులవెంబడి కొబ్బరితోటలతోడ, సము ద్రపు తంపరలతోననంటితోటలతో, సర్పచెముడు తుప్పలతో, మొగలి డొంకలతో, నిసుకదిబ్బలతో నిండిన సముద్రపుటొడ్డు రెండుమూడు క్రోసుల దూరముగా, నిరుకు జంతులు కురుచ పూరియిండ్ల వాసలతో, పచ్చని మురికి నీటిగుంటలతో, బేడిస తోరణములు చేతుల నెత్రనీళ్ల కుండికలు జంకల ధరించి ముతకచీరముసుంగులతో నీళ్లరేవున రాక

పోకలుసల్పు వాడిచూపుల యొద్దెగరితెలను వీనులవ్రేలాడే బంగరు గుల్ల గుండు జోళ్ళ, మూపున జన్నిదములు పొగాకుతమ్మలమున లక్కపిడతల నగపడునోళ్ళ, చేతమునికోలలు వెలయ దున్నుకొను నొద్దెబ్రాహ్మణులను సన్నవు పొడవు పత్రములతో మిగులచుల్కనగు శకటములకు బూన్పు బడి పరుగుతో నడకయెరుగని తెల్ల పొట్టి యాలగిత్తలను, గుడ్లగూబల వలె నుల్లాసమున నూలలువేయుచు బాడు బండితోలునొద్దెకాపులను, గను గొనుచు బొత్తిగ దెలుగుమాటతెలియని పెక్కొడ్డెపల్లె లతిక్రమించి గంజామునకేగు రాచబాటసంతోషముతో జేరుకొంటిమి.

మాకు దోడువచ్చిన సాధువులు “మేమిక రంభకేగెదము మీరు క్రోసెడుమేరనున్న గంజామునకు దక్షిణముగా బొండ”ని చెప్పి యదృశ్యులైరి. అప్పుడు పగలు రెండుజాములవేళ మించెను. గంజామునకు రంభకు మధ్యగా రోడ్డుపైనున్న యేదోయొక కోటపేరుగల గ్రామమునకు జేరుకొంటిమి. అచటసదావృత్తి యిచ్చిరి. మాతండ్రి చెంగటిచెరువులో స్నానమాడి యొకచెట్టుక్రింద నత్తెసరుడికించుచు మాతల్లితో “ఏమే నీవు తినెదవా లేదా?”యనెను. అందులకు మాతల్లి “అయ్యో రోడ్డు జనసంచారమింతయనాచారముగా నెట్లు తినగలను?” యని మారుచెప్పెను. అందుకు మాతండ్రి తినెదవా లేదా ? తినెదవా లేదా?” యని ప్రత్యుత్తరముగానక కోపముతో నుడుకుచున్న కుండను నేలకొట్టి వేసెను. అయ్యో పిల్లలకైన లేకుండ వ్యర్థముగా నన్నము బుగ్గిపాల్జేసినారని మా తల్లి విచారించెను. “రారా పేరయ్యా” యని మాయన్నను బిల్చి మాతండ్రి ముందునడువ సాగెను. అడుగామడగా శ్రమతో మెల్లమెల్లగ మా యమ్మయు నేను వారివెంబడి నడువసాగితిమి. గంజామున కారుగంటలు మించకుండ జేరితిమి. ఒక బ్రాహ్మణగృహమున వంకాయముద్ద, పెసర పచ్చడి ప్రశస్తమైన సన్నబియ్యపుటన్నము మాయమ్మ వండగా మిగులరుచ్యముగా బేరాకటను జవిరెట్టించినయా పదార్థముల నెయ్యిబెరుగులతో గడుపునిండహాయిగా గుడిచి, యేయాపదలురానీక దారిగడిపిన శ్రీజగన్నాథుని వేనోళ్ళ గొనియాడుచు, మిగులబడలుటచే గాఢనిద్ర నారేయిగడిపి తెల్ల

వారినదనుక మిక్కిలిదూరముగ సంకటమార్గమున నాకలినిద్రలుమాని నడచుటచే బులిసి పగిలి వాచినకాళ్లకు జముదు రుద్దుకొని, వేడినీళ్ళ న్పెన్దడవు తోముకొని స్నానముచేసికొని యాపూటకూడ గంజామున నాగితిమి. సంసారుల పిల్లలకు భాగ్యవంతుల బాలకులకన్న మొత్తముపై దేహబలము, బుద్ధిబలము నధికముగా గలిగియుండుటయును, లేమిచే జపి రెట్టింపబడిన భోజనముచే శ్రీమంతులపిల్లలకన్న నెక్కుడు సంతుష్టియు నారోగ్యమును గలిగి యుండుననియును నాయూహ.

మరునాడుదయమున గంజాము విడిచి యేరుదాటుచున్నప్పుడు గంజాము రెండునాళ్లకు బాడైన ముచ్చట మాతో నొకపథికుడిట్లు చెప్పెను. ఒకనాటిరాత్రి యేటియావల పెద్దధ్వని యూళ్లోవారికి వినబడినదట. ఆ ధ్వని చెవిదాకినవాడెల్ల అనగా నూరిలోబదేనువీసములజనులు విశూచిచే జచ్చిరట. ఒకనల్లనిముసలిది చీపురుకట్టపట్టుకొని వీధులలో సంచరించెనట. ఆపెయే గంజాముముసలమ్మ. గొట్టాలమ్మ, మారమ్మ యనుపేర్లతో గంజామునుండి పలుదెసలకు బ్రయాణము సేయుచు, భూభారము మాన్పుచుండును. ఈ ముచ్చట విన్నతోడనే గంజాము ముసలమ్మ నాకనులబడినట్లు నాకు భయముపుట్టెను. పిదప మేము ఛత్రపురము చేరితిమి. అచ్చటినుండి మాయూరికేగు నొకబంధువునిచేతికి నూరురూపాయిలిచ్చి యాద్రవ్యము మాయూరిభుక్తకు జానీయవలసిన భూమియప్పనము చెల్లించుమని యతనితో నాతండ్రి చెప్పిపంపెను.

పిదప నచ్చట నున్నవ రామలింగము మొదలగు వారియొద్ద పది పదేనురూప్యములు సంభావనమంది. యోదాతృమూర్ధన్యా ! తృణీకృత పురందరా ! సర్వస్వతంత్రా ! నిస్తుల సౌందర్య విద్యా సంపద్భోగబల వైభవా ! యంతరంగ భక్త శిఖామణీ ! చిత్తగింపుము.

నీయనుజుని సంవత్సరీకకర్మములను గస్పీరొలుక గావించుచున్న నీయొద్దకు వచ్చినార, మపుడు పెద్దవెండిగిన్నెనిండ రూప్యములు పట్టించు

కొని శ్రోత్రియులకు దానమొనర్చుచున్న నీవు మాతండ్రిగారిన్గని "శాస్త్రి గారూ! సమయమునకేతెంచితిరని" పల్కరించి నూరురూపాయిలు దాన మొసంగితిరి. తమయింటిసత్రమున రెండుదినములాగి మీయొద్ద సెలవు నాతండ్రితీసుకొన్నప్పుడు తమరు నన్ను నాతండ్రి కగపర్చి "శాస్త్రిగారూ! వీడు గొప్పవాడగును. వీని కింగ్లీషువిద్య యెట్లైన నేర్పించుడు" అని సెలవిచ్చిరి. పిమ్మట దమకొామార్తె నత్తింటికి దిగబెట్టుటకై మాయూరి చెంగటి గ్రామమునకు బయలుదేరి, మాపెదతల్లియు నాపెభర్తయును తోడరా కతిపయ ప్రయాణంబుల వారుకుదిర్చిన బండిపై ముఖలింగమను గ్రామము మీాదుగా వారాగిన మద్దివలస యను మాయూరు చెంగటిపల్లె మూడు దినములు వసించి, మాపెద్దన్నయు, మూడవయన్నయు నాముప్పు రక్క చెల్లెండ్రు నొకక్రోసుమేర మాకెదురురా, సంతోషము మూర్తీభవిం చినట్లుమాగ్రామస్థులందరనుకొన పదినెలలకు దిరిగిమాయిల్లుజేరుకొంటిమి. ఇరువురుపిల్లలతో గూడ నారెండవ యప్ప యిరువదిరెండేండ్ల వయసున ముత్తైదు గతించుట తప్ప నాతండ్రి దుర్భరగర్భశోక మెరుగడు. ఆపె మాతలిదండ్రులు కాశీయాత్ర కేగినపుడు నన్ను మామేనమామగారి యూరి నుండి పిలిపించి చల్లపాలకాయలు వండి కడుపు నిండ బెట్టెను. మేల్మి బంగారు వంటి దేహమును మనస్సును గలది.

మాపెద్దక్క యత్తవారి యూరైన పిడిసీలయగ్రహారమునకు మాతల్లిదండ్రులు కార్యాంతరముపై వెళ్లినపుడు వారువచ్చునంతదనుక మాబుచ్చిమామగారింట్లో నచ్చునంచుటకు వంతరామునకు వెళ్లిరి, మాతల్లి పుట్టింటి వారు కొంచము భాగ్యవంతులు; ఆడబిడ్డలయందు వారి సంతాన ములయందు ప్రేమకలవారు మాతల్లులార్గురిలోను మాయమ్మ యత్తవారే కొంచెపు స్థితి కలవారు. కాబట్టి మాతల్లికి గావలసిన ధనసాహాయ్య మాపె పుట్టినవారిలో ముఖ్యముగా మాబుచ్చిమామ నేయుచుండును. మేము వంతరామునకు వెళ్ళిన మరునాడచటికి వాసా సాంబయ్యగారను బొబ్బిలి సంస్థానవైణికుడు వచ్చెను. మాబుచ్చిమామయ్యగారి యింటికి దరచుగా

నతిథులు వచ్చి సత్కారముపొంది యేగుచుందురు. ఆసాంబయ్యగారు నన్ను జూచి నేను పద్యములు చదివి కూనిదీర్ఘములు తీయగా నాశారీరమునకు సంతోషించి మాయమ్మతో "అప్పా! ఈచిన్నవాడికి సంగీతము చెప్పెదను. వీడు పనికివచ్చునని నానమ్మకము నాతో బంపుము" అనెను, అందుకు మాతలిదండ్రు లొప్పుకొని నన్నతనితో బంపిరి.

గురుశిష్యులము మేముభయులము 'జామురాత్రి యుండగా బైలుదేరి మామిడివలసయగ్రహారమునకు నొకకావిడివానిని దీసికొని నడువసాగితిమి, మాగురువుగారప్పటి కిరువదియారేండ్లవయసువారు. అపుడు నావయసు తొమ్మిదిపదేండ్లనడుమ, మాగురువుగారి చెవులకు బంగారు దుద్దులు కలవు, బొబ్బిలిలో చలువచేయబడుటచే నీలిరంగుపట్టిన తెల్లని ధోవతియు జల్తారుత్తరీయమును నాకువింతగ నున్నవి. అతనికి బలాత్కారముగా వంగుటకై కాగితములతోగట్టిన గేరా కలదు. ఎముకపుష్టి గల తెల్లని షరాకువంటివాడు కడుదొడ్డవాడు, అతడు కావడినొకకొమ్మున వీణతో నొకబట్టలమూటయు నింకొకకొమ్మున నొకపెట్టెయును, ముందు కావడివాడు, వెనుక సాంబయ్యగారా వెనుక గోచియు, నడ్డికిగట్టిన చిన్న గావంచాతో బరుగిడు నేనును, పొలములు మెఱక, వేళ్ళు, గడ్డలు, చెర్వు, లడవులు, తుప్పలు తోటలు మెట్ట లతిక్రమించుచు, మాటిమాటికి వెన్దిరిగి జూచుచు రారా యబ్బాయి యని మాగురువుగారు ప్రేమతో నన్నుబిల్చుచుండగ, మధ్యాహ్నమునకు బది క్రోసులమేర గడచి మామిడివలస చేరుకొంటి, మది యతని యత్తవారి యూరు. నిషేకమునకై యతడా యూరికి బోవుచు ద్రోవలో సులభముగ జిక్కిన నన్ను శిష్యమిషపై పరిచారకునిగ గొనిపోయెను,

తామరాకుసందలి నీటిచుక్కవలె జగమున నామనసంటియు నంటకుంటచే జీవన్ముక్తునివలె నైదేండ్ల మొదలుకొని పదేండ్లమించిన వయసు వరకు తల్లిదండ్రులపైగాని, యితరబంధువులపైగాని, మరి యేమమత్వముగాని నాకు లేనేలేదు, వర్తమానముతప్ప భూతభావికాలముల

తలంపే నాకు లేదు. ఎద్దియో విచిత్రసంకల్పమూర్తినై, జగద్వికారముల బరికించుచుండియు నొక్కింతయు న్దగులు లేక చరించుచు, శరవేగమున సంస్కృతాంధ్రకావ్యముల గొంతయర్థస్ఫూర్తిగా, యథేష్ట రాగ లయలతో జదువుచు, సంతతానందమున దిరుగులాడుచున్న నన్నద్భుతానురాగముల పెద్దలందరు బరికించుచుండిరి.

మామిడివలస వెళ్ళినతోనె యొడలు గడుగుకొని చల్ది భుజించి మిక్కిలి బడలియుండుటచే హాయిగ నిద్రించినాడను. ఆయూర పదేను దినములున్నాము. గురువుగారును గురుపత్నియు నన్ను గన్నకొడుకువలె పోషించుచుండిరి. అచటి గ్రామదేవత పండుగకు నాచే వాలకము కట్టించి మాగురువుగారు నవ్వుచుందురు. పన్నెండేండ్ల వయసువరకు గోచీతప్ప వస్త్రము నే గట్టియెరుగను. మాగురువుగారచటినుండి నన్ను పాలకొండకు దీసికొనిపోయిరి, అచట వారికిశిష్యురాండ్రు వెలచేడియలు కలరు, అచట నొకయొడుగు జరిగెను, మాగురువు నన్ను బ్రహ్మచారిగా నేర్పర్చి యొకపసపుగావంచా యిప్పించిరి. గావంచా నడ్డికి జుట్టుకొని మందువేసవి రాత్రి నడివీధులో యొడకయుత్సవములో నాచురంగు జూచి చూచి నిద్రించితిని. ఎవడో యొకపుణ్యాత్ముడు నా గావంచాను దొంగిలించెను, తెలవారినతోనె గావంచా గోలుపోయినందుకు దీనాననముతో మా గురువు గారి చెంతకు బోయినాడను. మా గురువుగారు నవ్వుచు "ఏదిరా" నీ గావంచా పారవేసినావా యేమి ! అనెను. అందుకు నేను అయ్యా ! ఎవడో దొంగిలించెను" అని బదులుచెప్పినా నప్పుడు "పోలేదిదిగో యొడలు మరచి వీధిలో నీవు నిద్రించుచుండ నెవడైన దొంగిలించునేమో యని నేనే తీసినాను" అని నాకు జలిది పెట్టించి తనశిష్యురాలియింటికి నన్ను దోడ్కొనిపోయెను.

ఆమె మొగిలిరేకువంటి తెల్లని వెలపొలతి. పదునారేండ్ల వయసు కలది, ఆమె మంచముక్రింద మా గురువుగారివీణె యున్నది. ఆమె యద్దాలబీరువాలో మా గురువుగారాపెకై తెచ్చి గుల్‌కందుసీసా నుంచిరి,

వారుభయులు వేఱుగా ముచ్చటించుకొనుచుండగా నేనాగుల్ ఖంద నదివర కెన్నఁడు నెరుగను. మిక్కిలి రుచిగానుండుటచే మూడువంతులు భక్షించి తక్కినది గూడ భక్షించుచుండగా నాపె యెందుకో యాగదికి వచ్చి నన్ను జూచి తిట్టుచు గొట్టబోయెను. మా గురువుగారు దబ్బునవచ్చి "వానినేమియు ననకు పిల్లవాడు" అని యామెను గదిమెను, పిమ్మట వీణవాయించెను. అతంత్రీనాదము మొట్టమొదట నాజన్మములో శ్రవణ పర్వము గావించెను.

పిదప మాగురువుగారు మాయూరునకు నాలుగుక్రోసులదూరమున నున్న నారాయణపురనివాసియగు తనితోడియల్లుని తోడిచ్చి నన్ను మా గ్రామమునకు వెళ్ళి బొబ్బిలికి రమ్మని పంపెను. నేను నారాయణపురము నుండి యొంటిగా బయలుదేరి యచటికొక క్రోసునన్న పల్లపుచాకరా పల్లి యగ్రహారమునకు వచ్చి మాపెదతల్లి కుమార్తె సీతమ్మగారియింట్లో దిగినాను, తల్లి వంకవారికన్న ప్రేమతండ్రివంకవారి కుండదు గదా? ఆపె కుందమట్టపు దంతపుబొమ్మవంటిది. బహుసంతానవతి, తమ్ముడు తమ్ముడా యని నన్నెంతో యాదరించి యన్నముపెట్టెను. మరునాడుమధ్యాహ్నము తన పెద్దకొడుకునకు సహాయముగా నన్ను దనపుట్టినైన బొమ్మికపాడను గ్రామమున కంపెను. మేముభయులము బైలుదేరి, చిన్నచిన్నవలసలు దాటుచు, తుప్పడవి మెట్టదారిని మూడుక్రోసులమేర బూచిన యాడికచెట్లు కాచినమామిళ్ళు జూచుచు, వాకపండ్లేరికొని తినుచు వెర్రిమొర్రిపాటలు పాడుచు బలురకంబుల పిట్టల కూతలు వినుచు నేటియొడ్డున గొంతదవ్వు నడిచి తుదకొక గొడ్డురాళ్ళదిబ్బపై నేటియొడ్డున నున్న బొమ్మికపాడు నకు, గడియమెరుగుండగా జేరుకొంటిమి. మా పెదతల్లి విశాలాక్షమ్మ డెబ్బదేండ్లది యామెభర్త కుంద్రని మెరుపు పెద్దకనులు గల ముసలి వాడు ఆ పుణ్యదంపతులు పెద్దకుటుంబముకలవారు. సంవత్సరమున కారు వందల రూపాయిల రాబడిగల భూస్వాములు. అచట రెండుమూడు పూటలుండి నేను మాయూరునకు జేరుకొంటిని. నాతలిదండ్రులు సోదర

సోదరీలు నన్ను మిగులసంతోషముతో లాలించిరి. మాయమ్మ నన్ను జేరదీసి అన్నా యెంతసంగీతము నేర్చుకొన్నావు" అని యడిగెను. నే నందుకు "అమ్మా! వీణవాయించగలను చూడు మిదిగో యెట్లుపాడెదనో" యని మునపటికన్న పెద్దగొంతుపెట్టి వింతవింతదీర్ఘములు దీసినాడను. అందుకు మా యమ్మ నవ్వి "ఓరి నీయమ్మ కనుబుమండ నీకింతటిలోనే సంగీతమంతయు వచ్చినదనుకొన్నావా ?" యనెను. మా తండ్రియు నే నొంటిగ దేశసంచారము చేయగల ధైర్యవంతుడనైతినని చిరునగవుతో నాపయిమీద గావంచా చూచి "ఇదెక్కడ సంపాదించినావురా ?" యనెను. అందుకు "దీనిని మా గురువుగారిచ్చినారు" అని యంటిని. గురువును మెప్పించిన శిష్యుడవైతివా ? యని నవ్వుకొనెను.

మరికొన్నాళ్ళకు నన్ను మాగురువుగారు బొబ్బిలికి రమ్మన్నారని నే జెప్పగా, బలువురకు దిండిపెట్టి పోషించుట కష్టమని గాబోలు జదువు మిషపై నన్ను మా తలిదండ్రులు మా పెద్దన్న జగ్గావధానులును తోడిచ్చి బొబ్బిలికి బంపిరి. భాగ్యవంతులపిల్లలు నాతోడివారు హాయిగా మాయూ రనే యుండగా, మాతండ్రి మొదలగువారు పలువురు విద్వాంసులుండగా, నాకు మాత్రము పై యూరు చదువెందుకు ? ఆహా రిక్తదశ యెట్టికష్టము లైన సహించును గదా ! మేమిద్దరము తెలతెలవారుచుండగా బయనమై గున్నలేన్గువలె ముందు మాపెద్దన్నయు వెన్క పరువిడుచు నేను బోవుచు జాముప్రొద్దునకు బొబ్బిలి కేగితిమి. నన్ను మా గురువుగారి కప్పగించి రాజసత్రమునకు భోజనమునకై మాపెద్దన్న వెళ్ళెను. నాకు మాగురువు గారు చలిది కడుపునిండ బెట్టించినారు.

మాగురువుగారి పెద్దన్న సర్వయ్యగా రతని కేడువందల గీతములు మరియు నెంతో సంగీతగ్రంథము వచ్చునట. కాని తా బాడలేడు, పరులు పాడినరాగము లెవ్వియు బోల్చజాలడు. రెండవయన్న యప్పయ్య, ఆతడు జగదేకవైణికుడని ప్రసిద్ధిపొందెను. గాని నే బొబ్బిలికి వెళ్ళకముందే స్వర్గస్థుడయ్యెను. మూడవయన్న కామయ్యగారు. అతడు గొప్పవైణి

కుడు. ప్రశస్తమైన సంగీతగ్రంథకర్త. అతనికొకకొడుకు నొకకూతురు గలరు. భార్య కాలముచేయుటచే విరక్తుడై గడ్డముపెంచుకొనెను. పెద్ద తవ్వవంటి పండువెదురుబొంగున కొక యుక్కుతీగెమాత్రము కట్టి శ్రుతిచేసి యొకవెడల్పు చాయకత్తికి గుంకుమము పూజచేసి, మూరెడు పొడవు తెల్లని పెద్దగడ్డముతో, గట్టిపొట్టిశరీరముతో, సింహమువలె రౌద్రరసముప్పతిల్ల, "హరిహరి"యనునాద మాకసమవియ భజనచేయుచు వాసాసాంబయ్యగారియన్న కామయ్యగారు నుదుటగంధమును బెద్దబొట్టుతో భీకరాకారముతో గొండల న్గొలకుల ప్రతిధ్వనింపచేయుచు బలువురశిష్యులకు వీణాగాన ముపదేశించుచుండును. నాల్గవయతను మాగురు వైదవయతడు కృష్ణమూర్తిగారు. అతడు గొప్పవైణికుడు, ద్రుతవాద్య విశారదుడు. వారి తల్లి బ్రతికియున్నది. బిందెకుండవలె కుంద్రని తెల్లని యాపె. కడుమంచిది. మా బోంట్ల కందరికి జల్దిపెట్టి యాదరించుచుండును. పప్పువెంకన్న కట్టుసూరన్న ముదిగంటి సూర్యనారాయణ మొదలగు నిరువది ముప్పదిమంది బ్రాహ్మణులు తక్కినజాతివాండ్రు మరికొందరు శిష్యులుండిరి. కొందరు వీణ కొందరు గాత్రము నభ్యసించువారు. నాకు మాగురువుగారు వారములు చెప్పించిరి. అయిదువారములు మాత్రమే కుదిరినవి.

ఒకనాడు వారమెక్కడను లేదు. భోజన మెక్కడదొరుకునోయని వెదకుచు నొకనియింట్లో జొరబడినాను. అల్లమరాజు దుగ్గయ్య పంతు లనునతడు స్నానముచేయుచున్నాడు. అతనికై యతనిభార్య వడ్డించెను. అతను లోనికిరాకముం దతనివిస్తరికి దలపడి పరిషించి భోజనము నేయుచున్నాను. ఇంతట నతడు వచ్చెను. అతనిభార్య యతనితో చూచితిరా ! వీడెవడో నన్నముపెట్టెదవా యని యడుగగా నేను లేదు పొమ్మంటిని. వీడు వీధి గుమ్మమువరకు మళ్ళి నేను వడ్డించుట చూచి తిరిగివచ్చి యెట్లు విస్తరకు గలపడి తినుచున్నాడో?"యని యనెను. అందుకాపంతులు "వీడెవడా మనపాలిటి సూర్యనారాయణమూర్తియే. మనకు బిల్లలు లేరని

యీరూపముగా వచ్చి తినుచున్నాడు. పాపమెంత 'యాకలివేసెనో" యని కంట నీరిడుకొని నేయి వడ్డించు ముత్తయన్నము బొక్కుచున్నాడు" అనెను. అందుకాయిల్లాలు నేయి వేసెను. ఇంకొక విస్తర వేయించుకొని పంతులు కూడ పరిషించి భోజనము నేయుచు నాసంగతి యడిగి నాచే దెలిసికొని "నేటినుండి నీకాదివార మిచ్చినాను. నీవీయూర నుండి నన్నినాళ్ల నీకభ్యంతరము లేదు" అనెను. భోజనమైనపిదప నచట నా కంటబడిన భారతము తీసి శరవేగమున జదివితివి. ఆవధూవరు లిద్ద రెంతయో సంతోషించి యప్పటినుండి నన్నుజూచినపుడెల్ల కన్నకొడుకు వలె నాదరించుచుండువారు.

బొబ్బిలి నేనదివరకు జూచిన పార్వతీపురము పాలకొండలకన్న రాజుకోట కలిగియుంటచే మిక్కిలి వైభవముగ నుండెను. నేనచట క్రొత్తగా నేన్గులు చూచియుంటచే మిక్కిలి యద్భుతపడితిని. ఎఱ్ఱకుచ్చు బొందులతో, బెనవెట్టి వైచుకొన్న పొడవు పెద్ద సికముళ్ళతో, మూరెడు వెడల్పు జల్తారంచుల నీలిఖండవా వలెవాటులతో. నొంటిచేత బంగరు కడియములతో, నోట మూరెడుచుట్ట నొడ్డుపొడవుల పరువుమాటగోటు లతో. బైజారునీటులతో సంచరించు వెలమదొరలును, దిక్కులు పిక్కటిల్ల ఘంటానాదం బిరుదెసల మ్రోయ. వీధులవెంబడి నిండ్లకన్ననెత్తుగ నడుచు పెద్దేనుంగులును. రౌతులతో శరవేగంబున బర్విడు తురపుగుఱ్ఱము లును, పెద్దచెంపకొప్పుల బంగరుచేమంతిపూలు మెరయ, కోటనుండి రాక పోకలు సలుపు దాసీరత్నములును గలబొబ్బిలి పరువు న్సిరియు మూర్తీభ వించినట్లున్నది.

మా గురువుగా రొకనాడు నాచే సాపాయని మంచిముహూర్తము చూచి యనిపించినారు. సాయంకాలమున గురన్నచెర్వులో గామయ్యగారు స్నానముచేయుట, యా జీకటివేళ తెల్లవిసబ్బుతో శిష్యులతనియొడలు దోముటయు గొండకు జట్లుకట్టి కామయ్యగారితో ఫలహారములు పట్టుకొని

వెళ్లుట యప్పటిగురువులయందు శిష్యులకుగల భక్తి నుగ్గడించును. ఒక
ప్పుడు రెండుజాములరాత్రికి బాలతేరుగ్రామములో సంభావనమిచ్చిరి,
నాకొక యణా దొరికెను. కామయ్యగారి మంచముపొరలో దాచుకొంటిని.
దాని నతనికుమారుడు దొంగిలించి చిన్నపేకకొని వేసెను. అదితెలిసి
కామయ్యగారితో నే జెప్పగా గొడుకును జీవాట్లుపెట్టి యణాక్రింద నాకొక
చిన్నగావంచా యిచ్చెను. బాజారులోని మిఠాయి చూచి యెంతో నోరూరగా
దుకాణములచెంత దిరుగువాడను. కానీయైనను నాయొద్దలేదు. మిఠాయి
యెట్లు చిక్కును ? ఆహా! చెల్లనపుడు భోగేచ్ఛ మెండుగదా ? ఒకనాటి
వేసవిసంజకడ కోటలోని కుల్లాసముగ బాడుకొనుచు, భోజనమునకై
బోవుచుండగా, నెర్రని దుప్పటి కప్పుకొని యొకకంట బూవున్న యొక
యేబదియేండ్ల పచ్చనిముసలి బాహ్మణు డచట గూర్చుని నన్ను దగ్గరకు
రమ్మని పాడ మనెను. నేను మరింత బిగ్గరగా నుల్లాసముతో రాగము
దీసితి, నందుకతడు చెంతగలవానితో "వినుడీపిల్లవాని కెవరునేర్పి రెంత
చక్కగా బంధవరాళి పాడినాడు ? పూర్వజన్మవాసన యుండవలెగాని
సంగీత మొరులు నేర్పిన నేపాటి కుదురును" అనెను. అందులకు నే
నతనితో "నీమెప్పులకేమిగాని యొకవారము తక్కువగ నున్నది, చదువు
కొనుచున్నాను వారమిచ్చెదవా?" యంటి, నతడు "నీకెప్పుడు భోజనము
దొరకదో యపుడెల్ల మాయింట నీకభ్యంతరము లేదు" అనెను. అతడు
సుప్రసిద్ధభాగవతుడు, అంతసొగసైన శారీర మింకొకనికి లేదట. ఆతని
పేరు తుమరాడ వెంకయ్య. బొబ్బిలిలో నెలపదేను దినములుంటిని.
సంరక్షణముచాలమి, చిక్కిపోతిని. మాయమ్మ నాసంగతి విని నన్ను
బిలిపించి యెంతోప్రేమతో సంరక్షణ మొనరించెను.

సుంకెలో యజనము జరిగెను. అప్పుడు చమసాధ్వర్యులలో
నేనొకడను. వింతగ నార్చుచు గంటి జొన్న కొఱ్ఱ వెన్నుల దిన
నుంకించు పలురకముల పిట్టలను, చట్లదొంతుల నటవొద్దు చుట్టకుదుళ్ళ
నెత్తుల ద్రోయుచు పొలముల కేగు కాపుచేడియలను, దమ్ము వట్టిన

మళ్ళ కుడుపునారకట్టలెక్కించిన కమ్మిబండినుండి నలుదెసల బురద నెగ జిమ్ముచు, మోకాలుబంటి యూబినీట గ్గదలాడు నెనుపోతులబట్టి నడు మంత్రపుబ్బరసిరిన్దిని క్రౌవ్వజనులవలె నుబ్బు జలగలను, గార్కొనుచున్న ధవళమేఘంబులవలె బ్రేలెడు ప్రత్తిచేలను, దబ్బుదిబ్బని పడు తాటిపండ్లను కూరపాదులనలముకొని క్రమక్రమముగా నున్నతస్థలములకెగబ్రాకి ప్రాయోపవేశంబుచేయు కంబళిపుర్వులను, దళవిధగమకంబుల ద్రిస్థాయి భేదంబుల నానావిధశ్రుతుల గౌతుపంబుచూపు పిన్న పెద్ద కప్పలను, నానా విధ సస్యకబళనోత్సుక పశుపక్షిమృగంబుల నదల్చుచు నరపపాకలనరచు పొలముకాపులను, బెడ్డలురువ్వి తాటాకుగొడుగుల జించుచు గుమ్మములం బల్లెమునుఖ్ఖోయిచు తిట్లుదీవనలుగా భావించు పెంకెబుడుతలను. గౌరి వ్రతముల గై చేసికొని, నానవైచిన పెసలు నెనగలు వాయినంబులిడు కన్నె పడుచుముదుసలిముతైదువులను, నిరతాన్నదాతలవలె చేరువన్నులభ జీవనము చేతికందించెడు జలాశయంబులను. లేజవ్వనముమాడ్కి జిగురు బలిసిన యుద్యానవనంబులను, వేదవిహితధర్మములమాడ్కి నొడ్డుచేర్చు నోడలను, నునుసిగ్గు వలపుక్రేగంటిచూపుమాడ్కి బ్రతిక్షణాహ్లాదకరము లగు తీగమెఱపుగములను, మంటలక్రమోగుఫిరంగులవలె మెఱుపులన్ గర్జిలు కారుమబ్బులను, రేబవళ్లం దెఱపిలేక జీవనసంతుష్టిసలుపు సత్రా హంబులవలె విలసిల్లు మునుల్లను, విధివిహితంబుగ సకలజనాహ్లాదకరం బుగ జరుగు గణపతినవరాత్రంబులను, లుబ్ధగేహంబులమాడ్కి పథిక సంచార విరహితంబులగు మార్గంబులను, పరువు మాలిన పామరులవలె జెలరేగి తిరుగు కుక్కురమిథునంబులను, డంబముగపర్చు లంచగొండుల వలె బురివిప్పెడు మయూరంబులను, బయల్పడనిమునులవలె దల చూపని కోయిలలను. గన్నేరు, మామిడి, యనటి, జామి, కాకర, నేతి దొండ, మొక్కజొన్న. సమృద్ధిగా మఱికొన్ని కాయగూరలు, మొగిలి, నందివర్ధనము పట్టెవమండ్ల గోరింట తుమ్మిక గన్నేరు మాలతి మొద లగు పలుతెఱంగులపూలు, మోదుగు లొలుగు పనస యనంటి యద్దంతు

మొదలగు విస్తరాకులు, నారుగాలువు నువ్వులు చోళ్లు, గంటెలు చామలు మొదలగు కొన్నివిధముల నవధాన్యములు, బలిసిన పచ్చికబయళ్ల నెమ్మరలెత్తక కడుపునిండ మేసి పొదలినపసరములతో, మతిమతి యావ కాయయూట భోజనములతో శ్రావణభాద్రపదములు గడువగా, జీవన సమృద్ధికల్మిఁ దనిపి సుప్రసన్నములగు సకలప్రదేశములను సాయంకాల మునమాత్ర మన్నదానము జరిపెడు దేవీనవరాత్రములను, పుస్తకములకు జతుర్విధ వాచన యంత్రములకు, ధనభాండారములకును, గలువపూదండల నొనర్చుపూజలను, మహాలయమంత్రతంత్రములను, జూజములపున్నమయును, గౌరమ్మజాతరయును పటాకీలసందడియును, రామలీలామహోత్సవముల విజయదశమినాటి అంబారీయేనుగెక్కి రాజులుజమ్మినరకుటయును, కొర్కొని చూలుదగిలిన వరిపొలములం బనిచుల్కనపడిన సేద్యకాండ్ర తీఱుబడిరచ్చ వేడుకలను. సమృద్ధమగు పాడిపంటలను వివిధమృష్టాన్నభోజనములను, జంపతులకు దీరనిపొత్తుగలుపుచు ముదిరుడి శీతవాయువులను, సీతాఫలములయుమ్మరియును, అట్లతదియయును దీపావళిపండుగయును నాగులచవితిం బుట్టలయొద్ద స్త్రీపురుషులొనర్చు పూజలను, సోమవారనక్తవ్రతములను, వనసంతర్పణలను, బాల్యమందహాసములవలె నిర్మలా[illegible] శరచ్చంద్రికలను, అయిదేండ్లబాలురదెందములవలె నిష్కంటకమార్గములను, విరతాన్నదాతలమాడ్కి సుప్రసన్నజలాశయంబులను గలిగి కాలపురుషోత్తమాంగమువలె విలసిల్లుశరదృతువు మిథునంబులకు బల్మిం బొత్తుగలపుటుత్తరపుముదుఁ సీతుగాడ్పులను, మిక్కిలి హితమగు నెగడిమంటలను, శరీరమంతటనిండు ముతగ యున్ని దుస్తులను, కడు వృద్ధులవలె పనిలేక మూలపడిన విసనకఱ్ఱలను జవ్వనముమాడ్కి నాలింగనప్రియంబులగు కుంపటులను, చలిచేతను వన్నియచేతనుగూడ నెల్లఫలముల న్మించి సద్మినివాతెఱవిధమున నొప్పారు కమలాఫలముతొనలను, పగిలిన దానిమ్మపండులతీరున మంచునకు బీటవాఱిన మూతులను. అసందర్భకావ్యములపోల్కి విస్తరిలుకలలను; లుబ్ధునిహస్తములవలె ముడిగిన

సకలావయవంబులను, సంక్షిప్తములగు త్రిషవణస్నాననిష్ఠలను, రుచ్యా రుచ్యంబగు చింతకాయధప్పళమును, గర్భచిహ్నాలగపర్చు మట్టువేసిన మామిళ్లను. భాగవతసమాజముకరణి మందీకృతతృష్ణలను, దరిద్రమనోరథము తెన్నున దీఱనియాకలియును, పోకిరిముఖములాగున నసహ్యాకర హిమకరబింబమును, పెకలినవ్వుమాడ్కి ననిష్టంబగువెన్నెలయును, అలసట నెఱుగని సకలవ్యాయామములును, సకలవిద్యాసాధకములును, క్రవ్యాదరుతభయంకరాశీతనిశీథులును, వరిగుప్పలసందుల నొడలుమఱచి నిద్రించు కళ్లముకాపులను, రుచికరములగు పెక్కురకముల చిక్కుడుకాయల పొదులను, ప్రదీప్తములగు సకలాంతర్బహిర్వహ్నులను, మందీకృతోష్ణకర నీరపిపాసలను, ధనుర్మాసోత్సవములను, వాకిలిముంగిళ్ల ముగ్గులచిన్నెలను, తీయగుమ్మిడిపండ్ల యావులను, అత్తింట నల్లునియుక్కుముచ్చటలను, భోగిమంటలు, మకరసంక్రాంతిమూనాళ్ళపండుగవేడుకలు, కమ్మజాతర విందులు మున్నగు సకలజనుల యుల్లాసములను, కోడి గొఱ్ఱె పందెములను, వన్నెక్కెకాకులెనుములు; కమ్మతావులబుష్పించిన మామిడిచెట్లను, సకలధనధాన్యసంగ్రహ విశేషములను, రథసప్తమిరేగుకాయ జిల్లేడాకుల స్నానంబులను, సూర్యునకు నైవేద్యమిడి చిక్కుడాకులపంచిపెట్టు గోక్షీరాన్నములను భీష్మైకాదశివ్రతనిష్ఠలను, ప్రాతస్స్నాననిష్ఠలను, లేజవ్వన పలుచాలుతెఱగున వన్నెమీఱి తలచూపిన మల్లెమొగ్గలను, జాగరము పూర్ణముగా జేయలేనివారలమోముల నామములుంపించిన రుద్రాభిషేకంబు శివరాత్రి జాగరణోత్సములను, లేజవ్వనపుకూమిపోల్కి నూత్నప్రియంబులగు మామిడిపిందెలపచ్చడిముక్కలను, మామిడి, నేరేడు తక్కుదక్కిన సకలఫలములసమృద్ధియును. మాఘపాళీవర్షములను, జ్వాలాతోరణములు, కామదహనములు, డోలోత్సవములు, హోళీపండుగ వసంతములు, నౌకావిహారసంగీతము, ముదిరిన మావిడికాయలు, కోయిల కూతలు, పనసనేరేడుపండుసంపదలు, సంవత్సరాది క్రొత్తయుడుపులు, వింతముచ్చుమచ్చులు, దోరమావి యూరగాయలు, మల్లెపూల యుమ్మిరి

యును, శ్రీరామనవమీమహోత్సవములు, కేజంగిరేకులనల్లిన జడలు, గ్రామదేవతపండువు, పీర్లపండుగసందడిన్ పంతులుగాఁ్రమోగు సుషిరానద్ధ వాద్యముల జగడములు, పులివేషములయల్లరనాపు నెఱ్ఱపొగాల రాజభటుల తునకాలదుడ్లు, సివమెత్తినయాటలు, మారిపిటికిరేయి భజనములు, తొల్కరి పరగటిగాలులు, క్రొత్తయాలుమగలకూటమివలె నతిరభసములగు మెరపు లుఱుములు ఒడగళ్లవానలు, మావి పనస పెద్దనేరేడు తీయపండ్ల విందులు పలుతెరగుల తొలకరిచేలు, వదాన్యులచెంతకు యాచకులమాడ్కి క్రొత్త నీటికెగఁబ్రాకు చేపలు, దుష్టమైత్రివలె క్షణభంగురములగు నీటివరదలు, జాలరిసందడులు, నీటివంతుపోట్లాటలు, అవివేకిదానమువలె విచిత్రవృష్టులు, నృసింహజయంత్యుత్సవములు, వైశాఖపూజలు, ఆతపత్రవ్యజనోపానహ దానములు, రాల్పగులునట్లుకాయు మండువేసవి చుఱుకుటెండలు, మంద మలయానిల సమ్మిగ్ధ ప్రభాతనిద్రలు, సాయంసంధ్యావిహారములు, పాణి గ్రహణమహోత్సవములు, ప్రణయకలహములు, చెమ్మటలసడలువిగి కౌగిళులు, సకలమిధునపరస్పరదూరశయనములు, సకలజనాశ్రిత వాతా యనములు, అన్యోన్యావలోకన కుతూహల కాముకాక్రాంత బహిఃప్రదే శములు, ప్రవర్ధమాన శిరఃస్నానవ్రతంబులు, పలుచని తడివుట్టంబుల మనములారించు తరుణాంగక లావణ్యంబును, శ్రీజగన్నాధరధోత్స వంబులు నిర్వాతంబయి యాకైననల్లాడనీక యొడలుడికించు గ్రీష్మంబును క్రమక్రమంబుగ సకలర్తు విశేషంబుల గుర్తెరుగుచుంటిని.

ఒకప్పుడు మాతండ్రి నక్కనుకాల్పించి సాగబొడిపించుచుండగా నెఱ్ఱగగాలిన నక్కముక్క తుళ్ళి మాతండ్రిపాదముపై బడెను. చెంత గలవారెంతపని యెంతపని యనుచుండగా లేదులేదని మాతండ్రి పాదమును విదల్చి చిరునవ్వుతో బ్రాహ్మణులగ్నికనుక నగ్ని నాకు జురకలేదని చెప్పెను. కాలినచేరెడు నక్కముక్క పాదమునబడి యొకక్షణమున్నను పాదమేమియు జురకకుంట కచటివారెల్ల యాశ్చర్యపడి మాతండ్రి సత్యముచే వట్లయ్యెనని యనుకొనిరి. మాతండ్రి మాపొలమునెట్టు

తోటలో నూయి త్రవ్వించెను. దానికై రాళ్ళు బెద్దూరుకొండనుండి బళ్లతో దెచ్చుకొంటిమి. ఆరునిల్వులు త్రవ్వినను నీరుపడలేదు. ఒక దినమున మాతండ్రి యుదయముతోనే స్నానముచేసి విభూతి ధరించి చేత గంటము తాటాకులు పట్టుకొని నన్ను వెంటబెట్టుకొని నూతిగట్టున గూర్చొని "త్రవ్వరా నేడు నీరెట్లుపడదో చూతము"అని "ఏహ్యేహి గంగే తవ దర్శనం హఠాత్" అన నొక అరగంటలో గంగాష్టక మొనర్చి నంత పెద్ద నీటిసెల నూతినుండి ముమ్మరముగ నుబికెను. మిక్కిలి నాబోటిచూపరులు ఆశ్చర్యము చెందిరి. "ఇది నాలుకా తాటిపట్టా! అబద్ధము నానోట వచ్చునా!" యని సింహారావమున నాతండ్రి యపుడపుడు పల్కుట నేనెరుగుదును. అతడు మిక్కిలి నిష్కపటుడనియును, నిరంతర తపశ్శాలియనియును. గోపముబట్టజాలని బలశాలనియును మాయగ్రహార జనులందరును భయభక్తులతో నాతనిగ్గనుచుందురు. అతడు కొన్నియష్టకములను ధనంజయవిజయమను నొకప్రబంధమును సంస్కృతమున విరచించెను. అతని శిష్యులలో నిపుడున్న సుప్రసిద్ధులు ఆదిభట్ల రామమూర్తిశాస్త్రి యనుతార్కికుడు కర్రా పాపయ్యశాస్త్రి యను పౌరాణికుడు, గంటి నీలకంఠావధాని యనుఘనపాఠి మొదలగువారు.

ఒకనాడు జన్నిదములపున్నమకు పార్వతీపురములో నాకొక బేడ సంభావన దొరికెను. అర్ధణాకొకపిట్టకలము మరియొక యర్ధణా కారు కాగితములు తక్కినయణాకొక సిరాబుడ్డియును గొని రెండుజాముల కింటికి వచ్చి కలము సిరాలో ముంచుచు కాగితములపై బెద్దసున్నలను వ్రాయుచుంటి నంతట మాబుచ్చిమామ తన యూరినుండి వచ్చి నావ్రాత జూచి "గుంటడా యేమీవ్రాత కాకితముసిరా దండుగకా"? యని నవ్వెను.

మా భూవ్యవసాయము ఫలించకుంటచేతను, మిక్కిలి కుటుంబము ప్రబలమై పెండ్లికాబడిన నామువ్వురపెద్దన్నల భార్యలు కాపురమునకు వచ్చుటచేతను, నా తలితండ్రులు క్రమక్రమముగ లేమి ననుభవించవలసివచ్చెను. భైరవపురగ్రామములో వంకాయల బలరామభుక్త యన్నము

పెట్టి చదువుచెప్పుచుండెనని విని పేరన్నను నన్ను నచటజదువుకొమ్మని మా తండ్రి పంపెను. మేమిరువురము లక్ష్మీపురములో గొప్పయన్నదాతలును మాజ్ఞాతులునయిన పెద్దయ్యబాబుగారి యింటభోజనముచేసి సాయంకాలమున కేటియొడ్డుననే పడమటిదెసకు నడిచి భైరపురమునకు వెళ్ళినాము. ఆ భుక్తలిద్దరన్నదమ్ములు. వేగినాట్లు. స్థితిపరులు. అందులో బెద్ద బలరామభుక్త భామవేషగాడు. చతుర్విధవాద్యముల ప్రవీణుడు. కవియును. దంతపు బొమ్మవలె నుండును. అచట రెండుదినములుంటిమి. "నీవు భామవేషము కట్టెదవేని నిన్ను దయారుచేసెదను. లేకున్న నీవిక్కడ నుండనవసరములేదు" అనెను. చదువుమిషచే దిండిసాగించుకొనుటకు మేమందుకొప్పక లక్ష్మీపురమునకు దిరిగి వచ్చినాము. పెద్దయ్యబాబు మాకు గడుపునిండ బనసతొనలు బెట్టి యచ్చమ్మపనసపండొకటి మాతండ్రి కిమ్మని మా చేతి కిచ్చెను. సాయంకాలమున కిల్లుచేరి మాతండ్రికి జరిగినస్థితి చెప్పినాము.

తులసిరామన్నవలస యను నడవిగ్రామమున మాపెద్దన్న యత్తవారున్నారు. మాపెద్దన్న భార్యను మలిసారి తీసికొనివచ్చుటకు నన్ను బంపిరి. ఆవలసలో మూడు పూట లున్నాను. అచట ఒకపిల్లిపిల్లను గోడకు కొట్టి చంపినానదియే నాజన్మలో చేసినజంతుహత్య. పుల్లేరుపండ్లు పిసివాకపళ్ళేరి తినుచు బొమ్మకచ్చికలేరుచు నడవిగల చెట్లు చేమలు పిట్టలు జంతువులు చూచి యాశ్చర్యపడుచు మాపెద్దమదినియు నేను కూలివానిని తీసుకొని మాయింటికి వచ్చితిమి. మాలో వదినకు మదిని యనియు బెదతల్లికి బెయ్యమ్మ యనియు పినతల్లికి తోచ్చి యనియు బెదతండ్రికి బెయ్యన్న యనియు చిన తండ్రికి చిట్టి యనియు అన్నకాచ యనియు సంజ్ఞలు. మాపెద్దమదిని వచ్చిన సాయంత్రమే యాపె వంటకు ప్రారంభించెను. మాయమ్మ పినతల్లి కొన్నాళ్ళును మాపినతల్లి కొన్నాళ్ళు మా పెద్దవదినె కాపురమునకు వచ్చిన తరువాత యాపెయును మాయింట వండుచుందురు. కాని మాయమ్మ వండుటయరుదు. మాయమ్మకు నలువ

దేండ్లకుబైన కోడండ్రుండి యింటిపనులు జేసికొనుచుండిరి. మా మూడవయన్న భార్యకూడ కాపురమునకందెను.

నాపదేండ్ల వయసప్పుడొక మాలవానితో దెబ్బలాట జరిగెను. వాడు నాయీడువాడు. కాని నాకంటె బలవంతుడు. ఏటిలో నడుచుచున్నవాడు వానినీరు నాపై ద్రుళ్ళినందుకలిగి వానికి లెంపకాయ కొట్టితిని వాడుకూడ నాపై గలపడెను. ఇద్దరమొకగంట ముష్టీముష్టి బాహాబాహి కేశాకేశిగా బోట్లాడినాము. తుదకు వాడు నా జన్నిదము ద్రెంచివేసెను. జన్నిదము తెగిపోయినందు కొకదినమెల్ల విచారగ్రస్తుడనైతిని. స్వభావముగా నే యుద్ధప్రియుడను. నేను బదునొకొండేండ్ల యీడుననుండి యేటియావల బసులమేపుచుండగా బేడకళ్ళేరుడకువచ్చిన పదారేండ్ల కరీషకరండ వాహినితో నెట్లో జగడమువచ్చెను. మేమిరువురమే యామెరకపై నుంటిమి. అదియాడువని శంకించి నాచేతికివచ్చినట్లు నేగొట్టజాలకుంటి నదినాయశక్తిగ నెంచి నన్ను బేడతట్టతో గొట్టినకొట్టిదివరకు నాకు మరపు రాదు. మడువాడ వెంకటావధాని యనువాడు మాకామప్పమరిది. ప్రస్తుత మొడలెల్ల రుద్రాక్షలు ధరించి భూతిపూసికొని యోగియని ప్రసిద్ధిపొంది ఉర్లాములో బోషింపబడుచుండెను. వాడునాతో నాపదునొకండవయేట దండె పట్టుపట్టి తలక్రిందుగా బడి తిన్నదెబ్బ యిదివరకు మరచిపోడు. పురాణము చదువుటయందును, పోట్లాటయందును, ఎవనినైన జోరవగా నడుగుటయందును నాకు సాహసము స్వభావముగా మెండు. నాబ్రతుకేమగునో యనికాని లోకులు నన్నేమో చేసెదరనికాని భయము నాకెన్నడును లేదు. అడవియందైన నిర్భయముగ నొంటిగ నాత్మారాముడనై యుంట నానైజము.

పిడిసీలలో నొకప్పుడు వైదికశిరోమణియగు నాపెద్దబావ అయ్యగారి ప్రకాశావధాన్లు నూనె మిక్కిలి ఖర్చగునని యెంచి బలవంతముగా గోష్పాదమంత మాత్రముంపించి తక్కిన జుట్టంతయు మంగలిచే గొరిగిం

చెను. నల్లగాజులపేర్లవలె ముచ్చటగా నున్న సందెడుజుట్టు నాకనిష్టముగా దీయించివేసిన మాబావ నాదినమెల్ల దిట్టుచు నాదుఃఖముచేత నేటికి బోయి పోతిని. ముణికెడునీటిలో బట్టలుతుకుకొనుటకై వేయబడినరాతిపై దిండు పెట్టుకొని శరీరము నీటిలోబెట్టి నిద్రించుచుంటిని. భోజనమునకు రాలే దని నన్ను వెదకుచున్నారు. "వానికొప్పుజోలి మీకెందుకు ? ఎంతపని చేసినారు ! ఆదుఃఖముచే వాడేనూతబడెనో ? మరెక్కడికి బోయెనో ? యెంతయపకీర్తి ?"యని మాపెద్దప్ప ఆమెభర్తను మందలించుచుండెను. రెండుజాములయెండ పిడుగులు దూలుచున్నది. అప్పుడే యెర్రవంతు బుర దతో నేరు పొంగుచుండెను. నాశరీరములో నాభిక్రిందిభాగము నీటమునిగి యుండెను. ఊర్ధ్వభాగము చాపరాయిమీద నుండెను. ఏరుపొంగుటచేత శిరస్సుతక్క తక్కినదేహమంతయు నీటిచే నాక్రమింపబడెను. ఆయేరు గంటలో నిలువులకొలది పొంగి వెంటనే తీసిపోవు స్వభావముకలది. అపుడు జయంతి అప్పావుధానులెందుకో యేటికి వచ్చి చాపరాతిపై తల మాత్రమగపడగ నిద్రించుచున్న నన్ను బోల్చి నాయొద్దకు వచ్చి యెలు గెత్తి "సూరన్నా, సూరన్నా"యని బిగ్గరగ బిల్చి కొట్టిలేపెను. అప్పటికి నానోటికి నీరు దాకుచుండెను. నే లేచి యతనివెంటబడి మాయప్పగారింటి కేగినపై నాకొరకు వెదకుచున్న మాయమ్మతో "అమ్మా! ఏమి నీచిన్న కొమారుని యమానుషచేష్ట యెంతహాయిగా నొంటిగా నేటినడుమ నిదు రించుచున్నాడు! వీని ముక్కున కొక్కంగుళము తరువాయిగా వడినీరు పారుచున్నదెంత దీర్ఘాయువమ్మా నీకొడుకు!" అనగా నాతల్లి కంటనీరిడి నన్నెత్తుకొనెను. ఒడలెరుగని వెఱ్ఱినిద్ర నాచిన్నప్పటిగుణము.

ఒకప్పుడు మాపూవవయన్న యత్తవారియూరైన శివపురమునకు మాతలిదండ్రులతో వెళ్ళినాడను. ఒకరాత్రి పదిగంటలవేళకు పిల్లలను దెచ్చి తిండిపెట్టి తిరిగినిద్రపుచ్చుచున్న మాపెద్దక్క యొక్క పక్కపై బరుండి యొక యాడుదులోనున్న పేరన్నకు నాకు దిండిపెట్టనెంచి మొదట నన్నిచ్చుకొం పోయి వీపుపై నొక గ్రుద్దుగ్రుద్దగా నోరుతెరచితినట. గ్రుద్దుతోడ ముద్ద

చొప్పున గడుపునిండ నన్నము తినిపించి పక్కపై బరుండ పెట్టెను. అవటబెండ్లి సందడికి పల్లెటూరు నూరుమంది యొకయింట్లో విడిదిచేసి యున్నారు. దీపములకాంతి తక్కువగా నుండెను. మఱియొకగడియకు మాపెద్దక్క పేరన్నయనుకొని నన్నే తిరిగి విస్తరింట యొద్దకీడ్చుకొని మామూలుగా దెబ్బకొకముద్దపెట్టెను. ఆపెపెట్టినయన్నమంతయు దిని కన్నులువిప్పకుండిన నన్ను జూచి రెండుసార్లును వీనికే తినిపించితివి పేరన్నకన్నము పెట్టితివా''యని యెవరో యడుగగా "అయ్యో! వీడే పేరన్ననుకున్నాను. దీపములచాటు"అని మాపెద్దక్క నోరుమూసికొని యాశ్చర్యపడగా నచటివారెల్ల పక్కలు పట్టుకొని నవ్విరి. అప్పటినుండి నాభోజనపుష్టిగూర్చి యాసంగతియెరిగినవారిదివరకు నన్నుహాస్యముసేయు చుందురు.

ఒకనాడు మాయూరికి జేర్పునన్నున్న మురగడామను గ్రామము కొబ్బరితోటలో బేరన్నయు నేను నాజట్టుదారుడుయోగియు కూర్చుని యున్నాము, దీక్షితులను మాజ్ఞాతి యొకడు మమ్ములను జూచి "పుట్ట విమ్మకాయలు దినుటకు వచ్చినారా!"యనిచింతరువ్వతో మర్దించుచు గాళ్ల చేతులను గ్రుమ్ముచు చెవులుబట్టి మీదికెగవైచి క్రిందపడులోపున నర చేతితో వీపున జరచుచు మొదట యోగిని సత్కరించెను. మావాడుకదా మమ్ములను గొట్టునా యని నిబ్బరముతో మేమిద్దరన్నదమ్ములముంటిమి. కాని యాయవివేకి పేరన్ననుగూడ యోగికివలె సత్కరించి చావచంపి చెవులుమూసి నాయొద్దకు వచ్చెను. "చూడు నీచేతులు విరిగిపోవును నను గొట్టకు"అని తప్పించుకొని పారిపోతిని. మాతండ్రితో నీ సమాచారము చెప్పినాము. అతడు వానిని దళవాయుజీవాట్లుపెట్టెను. ఎంతసత్యవాక్కు డనోగాని మరిపదిదినములలో మమ్ముగొట్టిన యాదిభట్లదీక్షితులు పనస చెట్టెక్కి పడెను. చేతులు రెండును విరిగి సొట్టయిపోయినవి.

మాపెద్దక్కపెద్దకుమార్తె మొదటికుమారునిపుట్టుకకు ఆశీర్వ తండ్రితో నన్ను జెప్పబంపిరి. ఒకకుంగలివాని సహాయముదీసికొని పిది

సీలనుండి సోంపురము గ్రామమునకు మధ్యాహ్నము రెండుగంటలకు బైలు దేరి పోవుచుంటిని. నాకు బన్నెండేండ్ల వయస్సై యుండును. బుడతనపల్లి దారిని బోవుచు చిన్నచిన్న కొండగడ్డలు దాటితోటలు చిరుతుప్పయడవు లూప్లు వలసలతిక్రమించుచు సాయంకాలమునకు కొఠాము గ్రామమునకేగి నాడ. వేదులవారు మాతండ్రివంక చుట్టములచట గల రందుల్లో నాయింటి పేరు నా పేరు నాయూరు తెలిసికొని యొకముసలిపేదవాడు "కొడకా" యని నన్ను బిలిచి యాదరించి యన్నము పెట్టెను. అతడు తెల్లని చిన్న గావంచా కట్టుకొనెను. పేదవాడుగాని మర్యాదావంతుడు, సద్బ్రాహ్మణుడు. మరునాటియుదయమునకు సోంపురమునకు వెళ్లినాడ. మా పెద్దప్ప గారియల్లుడు కర్రా సుబ్బారాయుడు. అతడు వానితండ్రియు దక్షిన యింటిలోనివారు మూడుపూటలు నన్నుంచుకొని నాకు రెండురూపాయ లిచ్చిరి.

మా రెండవయన్న సీతారామయ్య విజయనగరములో తెలుగు ప్లీడరై శ్రీమంతుడైన గంటి పట్టాభిరామయ్యయను తనమామగారియొద్ద గుమాస్తాగా యుండి యచ్చటనే కాపురముండెను. ఆపట్టాభిరామయ్యగారు సిరిసంపదగల పెద్దకుటుంబి. విజయనగరము చెంగట సిరిపురమను గ్రామమున నా మూడవయన్న యత్తవారుండిరి. విజయనగరముదరి పిడిశీల యను గ్రామము మా పెద్దక్కయత్తవారియూరు. సింహాచలయాత్ర చేసి కొనుటకు, వీరకాంద్రవీరకత్తెలను జూచుటకును అజ్జాడనుండి మా స్వంత బండికి గూడుకట్టి మా వ్యవసాయమునకై కొన్న బలముగలగిత్తలను పూన్చుకొని, చిన్నచిన్నమజిలీలుచేసికొనుచు మా పెదతల్లులున్న బొమ్మిక పాడు, కలవరాయి యనెడు గ్రామముల చుట్టపువిందులారగించి మాతలి దండ్రులు. సీతారామయ్యగారును నాపెద్దక్కగారును దక్క దక్కిన మా యమ్మకన్నవారందరమును బయలుదేరినాము. కోమటిపల్లికి బొబ్బిలికి నడుమపల్లమునందు బండియుండ విరుసులు మోయ్య, నెడమోరలుతప్ప, దక్కినభాగమంతయును మున్గిపోవునంత బాడిబురదలోనుండి యెడ్లను

విడిచిపెట్టి మాపెద్దన్న జగ్గావధాని యాబండిమొగను దానొక్కఁడే మొల బంటిరేగటిజిగటమంటిబాడిలోనుండి యరక్రోసు మేర జూపరులబ్బురపడునట్లు భీమునివలె లాగుకొనివచ్చెను. బొబ్బిలిలో నొకదినముండి రామభద్రపురములో మాకు మిక్కిలిదూరబంధువులగు వడ్లమాని సుబ్బారాయుడు, లక్ష్మీనరస, న్నప్పలను సోదరత్రయము ఒకపూట యాదరింప ఆరేయి చిమ్మచీకటిలో బయలుదేరి నడిరేయికారికతోట యనుకొండ దారిని బడిపోవుచుంటిమి.

పూజువంటి పెద్ద యినుపకట్టలదుడ్డు బుజముపై వేసికొని గున్నయేనుగువలె మాపెద్దన్న బండివెంటబడి వచ్చుచుండగా, పదిపదేనుగురు దొంగలు బండిని సమీపించియు బెబ్బులి గర్జలతో బండినడల్పుచున్న మాపెద్దన్నను జూచి "యిదెక్కడిమనిషిరా కొండలాగున్నాడు" అని దారి యొసిలిపోగా" యేమిరా! బండి యొంటిగానున్నది. దొంగలు కాబోలు రండిరండి!" యని మాపెద్దన్న పల్కరించగా "బాబూ! మాకు ప్రాణములపై నాసలేదా" యని యాచోరులు బుద్ధులుచెప్పి పరుగిడిపోయిరి. మాపెద్దన్న యారడుగులపొడవు, ఏనుగుతొండములవంటి చేతులు, సందిట విమడని తొడలు, సన్నపునడుము, భుజము మూపురములనడుమ నించుమించు మూడడుగులవెడల్పు వక్షము మూడడుగుల చుట్టుకొలతగల బాహావులు నంతయే పరిమితిగల గళము. పెద్దవెడల్పైన మొగము, కర్ణములు, శిరస్సు. నేలసమముగా మోయు నేనుగుపాదములు. వేయేల యతనిజూచినవారందఱు నిలుడుగున్న యేనుగగాని నరునకింత విగ్రహముండునా యని యచ్చెరుపడుచుందురు పదిమంది యొకవైపుపట్టి యెత్తిన దూలము తానొక్కఁడే రెండవవైపుపట్టుకొని నలువదియేండ్ల వయసుగల యానదనాయాసముగా నడుచుట నెఱుగుదును. అతడు క్రమాంతస్వాధ్యాయవేత్త. యుర్లాముపరీక్షలో సుత్తీర్ణుఁడు. భోజనమునకు తగిన విగ్రహపుష్టి. విగ్రహమునకు దగిన యమానుషబలము, బలమునకు దగిన ధైర్యసాహసములు, బలపరాక్రమమునకు దగిన వైదికా

చారసంపదయు నోర్పును గల సత్పురుషుడు నవ్వులకైన నబద్ధమాడవి సజ్జనుడు, అంతబలవంతుడై నప్పటికీ, నంతధైర్యశాలి యైనప్పటికీ, నంటసత్వగుణముకలవాడు జగములో మిక్కిలి యరుదు.

రామభద్రపురమున మధురాడాగ్రహారములో మధ్యాహ్నముగడిపి, సాయంకాలమునకు మాపెద్దక్క యత్తవారియూరగు పిడిసీలకు వచ్చుచున్నపుడు, మొలబంటి యేటి దొంగయిసుకలో కూరుకొని కదలని యెడ్లతోడి బండిని మా పెద్దన్న బండినొగలకును దనమొలకును బెద్దమోకుచుట్టబెట్టుకొని యొడ్డున నిలపడి సుళువుగ నొడ్డెక్కించుట నిజముగ నమానుషచేష్ట. పిడిసీలాగ్రహారములో నైదాఱుదినములున్నపిదప విజయనగరమునకు వచ్చి మాయన్న సీతారామయ్యగారి మామగారైన గంటి పట్టాభిరామయ్యగారి యింట దిగి నాల్గుపూటలున్నపిదప సింహాచలయాత్రకై పోయినాము, మాతో మాయూరినుండి వెఱ్ఱిప్పిగాడని యొకకాపు వచ్చినాడు. వాడు వెఱ్ఱిమొఱ్ఱి పాటలుపాడి నవ్వించుచు మార్గాయాసము మఱపించుచుండును.

## బా ల్య ద శా వ ర్ణ న ము

ఓహో బ్రతుకులో బాల్యదశయే నిక్కముగా దివ్యదశ యనదగును. యౌవనమున్మత్తదశ, వార్ధకము పనికిమాలిన యొంటెత్తుదశ, బాల్యదశలో దేవాలయములందును, దేవతావిగ్రహములందును, దివ్యకథలయందును, బెద్దలమాటలయందును, నిక్కముగా నెంతనమ్మకముండును!. "నానాటికి దీసికట్టు నాగంభట్టూ" అన్నట్లు క్రమక్రమమున నట్టిదివ్యవిశ్వాసమును, మఱియట్టి దివ్యానందమును నశింపగా, రోగభూయిష్ఠవేదనాకరమగు శరీరమువలె దుఃఖభూయిష్ఠమై శంకాస్పదమగును. మనస్సు వయసు ముదిరినకొలది క్రుగులుచుండును. సకలజంతువులను, చెట్టుచేమలను నైతము మనుష్యులవలె బల్కరించుచు, మాటాడుచాడుకొనుచుంట, సకలబదార్థములందు దేవతామూర్తి యున్నట్లు నమ్ముకొంట, శరీరమునకు

దెబ్బతగిలినప్పుడు నొప్పి. శత్రులెదిరినప్పుడు వెనుదీయనిబీర మాకలి గొన్నప్పుడు తిండికై దేవులాడుట, తప్ప నితరమైన సంసారబాధ లెవ్వియును లేక నవ్యక్తానంద మనుభవించు పన్నెండేండ్లలోపు బాల్యదశయే నిజముగా బ్రతుకుయొక్క సారము. పుప్పిలేని పండువంటి బాల్యమును స్మరించుకొనుటచే గొంతమనస్సంతుష్టి, తక్కిన వయస్సులందు కొంత మనఃక్లేశమున కుపశాంతి కావించును.

సింహాద్రియప్పన్న సందర్శనము

సింహాచలముమెట్లు మొట్టమొదటిమా రెక్కుచున్నపుడున్న జోక యింతంతా. ఆకాశధార, గంగాధార, కాకిధార, పిచ్చుకధార, హనుమద్ఘట్టము, ప్రతిధారక్రింద నిలపడి తానమాడుచు, ద్రుళ్లుచు, నవ్వుచు, గంతులిడుచు, దలిదండ్రులు మొదలగు ప్రాణబంధువులచెంత దనశరీరలాఘవ సామర్థ్యములగపర్చి బడాయిగా సంచరించుచు, గుంపుగుంపులుగా గొండెక్కునపుడు మిక్కిలి శ్రమ్రనోజుచు దిగునపుడనాయాసమగపర్చు వివిధ యాత్రికుల నుల్లాసమున జూచుచు, మెట్టుమెట్టునకు బట్టలు పర్చుకొని నానావిధవేషముల నడుగుకొను పేదల చెంత నొక్కొక్క గవ్వ ధర్మము చేయుచు, సింహాచలమందు చిత్రింపబడిన ప్రతిదేవతా విగ్రహమునకు జేతులెత్తి మ్రొక్కుచు, దారికిరుప్రక్కల నరక్రోసులోతుగానున్న పర్వతపార్శ్వములపూచి, కాచి, ఫలించిన, నానావిధఫలవృక్షములగుంపుల కద్భుతపడుచు, మా పల్లెలో నెన్నడెఱుగని రాతిచప్పరములకును, వింతగోపురములకును, దేవాలయముల చిత్రములకు నబ్బురవడుచు, "స్వర్గమార్గమట్లు శ్రమకరము. తుదకిట్లానందదాయక"మని మెట్లెక్కుచున్నపుడు, కోవెలచెంతకేగినపుడు నగుమోమున నాతండ్రిపల్కుటచే సింహాచలమువలె స్వర్గముండునని నిశ్చయముగా నమ్ముకొనుచు, బులిహోర, కోవెలగారెలు, మొదలగునవి ప్రియముగా భుజించి, వంకకొప్పు కప్పస్తంభము, గర్భకోవెల మీదుక్రిందులయందలి వివిధచిత్రములు, రాతిరథములను చూచితివి, లోనికి జనసమూహముమధ్య నిరికి యంతరాళమున జనసమూహ

ముచే నడుపబడి, తుదకు గ్రిందబడి, గర్భకోవెలను జొరబడి, చెమ్మట గ్రమ్ముచున్నట్లు ఘర్మబిందువులు రా గోడప్రక్కలను స్రవింపుచుండగా, ఘనచందనములో నిమిడియున్న వరాహనరసింహమూర్తి నేడు నిజరూప దర్శనమని కొంత వంకమూతితోనున్న మూరెతుపొడవుగానున్న సింహాద్రి యప్పన్నను జేతులారా బుణికి మ్రొక్కి మ్రొక్కి, జనుల నలుపులాట లక్ష్యపెట్టక, ఘోరయుద్ధమున నెగ్గివచ్చినట్లు, చేబారలతో క్రొత్తేటి నీది వచ్చినట్లు, జన్మమీడేరినట్లు. స్వర్గముజూరగొన్నట్లు. సంతోషముఖవికాస ములతో దేవుని సందర్శించుకొని కోవెలనుండి మళ్లీ యుత్సవిగ్రహ ములను వేర్వేర దర్శించుకొని మ్రొక్కుచు, మూకమూకలుగా పసుపుకుంకు మలు గంటముల్వలచే నలంకరింపబడి యచ్చువిడిచిన మ్రొక్కుబడిగిత్తల వెంబడి దివ్వటులటువంటి యగ్గిమంటలకోలల చముఱుజల్లుకొనుచు నగ్గి జ్వాలలు తులసిపేరుల నెసగుగుండె లొరజేతుల ద్రిప్పుకొను మూఢభక్తి న్దాశములు తప్పెట్లు పట్టి దైవసంకీర్తనముచేయు శూద్రులును, నెనరు మాలి తనుముఱుకులకు దలాని. కత్తిపిడుల న్నెత్తులంగొట్టి బిగించుచు, మేటిగా శిరోజములగొరిగి ప్రోగొనర్చు మంగళ్లచెంత కుప్పకుప్పలుగా నున్న రాగిడబ్బులు, మంత్రములు చెప్పుచు స్నానమాడించి దక్షిణలకై చేతులుచాచు నీటికాసుబాపండ్రు "నోహో యేమి లయజ్ఞానమురాపీనిది ? చూడు మెట్టులుదరమునే మర్దలముగా వాయించుచు భజనము చేయు చున్నాడు" అని మాతండ్రి రెండుడబ్బులు బహుమతి యిచ్చిన యుదర వాదకునివిద్య కబ్బురపడుచు సాయంకాలమున కడివివరమునకు గొండదిగి వచ్చి తిరిగి విజయనగరము చేరుకొంటిమి.

మా రెండవయన్న మామగారికి ఒకకొడుకును నలువురు కొమార్తెలును కలరు. అందులో మూడవది గున్నమ్మ యనునామె మా రెండవ వదినె. మా రెండవయన్న తనమామగారియొద్ద గుమాస్తాగా నుండి యార్జనము ప్రారంభించెను. అప్పటికేడెనిమిదివందల రూకలు గడించెను. అతని మామగారతనికొక యిల్లు కట్టించి యిచ్చెను. మేము మూడుపూటలు విజ

యనగరములోనుండి సింహాచలయాత్ర చేసికొని తిరిగి విజయనగరము నకు వచ్చినాము, మా రెండవ అన్న మారెండవయన్న నన్ను దన యొద్ద నుంచుకొని చదువుచెప్పించుట కుద్దేశించెను. అపుడు మా తలి దండ్రులు మా రెండవయన్న మామగారి యింటి కెదురుగానున్న యింట్లో నద్దెకుదిగిన వీణాఘూటము కృష్ణయ్యగారను మహారాజుగారి పాటకునకు సంగీతము నేర్పుమని నన్నప్పగించిరి. మాగురువుగారు పాడునపుడు తల చేతులు మొగము కను లెట్లు త్రిప్పుకొందురో గడియలో నాయభినయ మంతయు నాకువచ్చెను. మాగురువుగారికన్న నెక్కువుగ ద్రిప్పుకొనునన్ను మాగురువుగారు కనిపెట్టి మాతండ్రిగారితో "శాస్త్రిగారూ! మీవాడు పాటలో నాకన్న నెక్కువుగ రంజుకొనుచున్నాడు. నన్ను వెక్కిరించుచున్నాడు. వానికి నే జెప్పను" అనెను.

మాతలిదండ్రులు పేరన్నయు మాయూరికేగిరి. నేను విజయనగర ములో చదువుకై యుండిపోతిని. పేదస్థితిలోనున్న మాకుటుంబమును చిన్నపుడు దారిద్ర మనుభవించిన రసజ్ఞుడు, ప్రాజ్ఞుడునగు గంటి పట్టాభి రామయ్యగారు గొప్పయింటివారనియును, చదువుకొన్న సత్పురుషులని యును మమ్ములను మిక్కిలి గౌరవముచేసి పంపెను.

కం॥ ఇది నాపది పన్నెండేం
డ్ల దినంబులచర్య సజ్జనస్తవనీయా
సదమల జయంతికులవా
రిధి సంపూర్ణౌషధీశ - శ్రీకామేశా॥

మాఅన్న సీతారామయ్య నాకు వారములు కుదిర్చినారు గంటి పట్టాభిరామయ్యపంతులుగారిఇంట సోమవారం, ప్రభల సుబ్బారాయుడుగారి ఇంట ఆదివారం, కాపరపు శంకరముపంతులుగారిఇంట మంగళవారము, చింతక్రింద గంగన్నపంతులుగారిఇంట బుధవారము, వేములకొండ సీతా రామయ్యపంతులుగారిఇంట గురువారము. వేదులమూడి రాయప్పపంతులు

గారిఇంట శుక్రవారము పాలెపు లక్ష్మణరావుపంతులుగారిఇంట స్థిరవారము, వేములకొండ గోపాలస్వామిగారిఇంటను, వంకా వెంకప్పపంతులుగారి ఇంటను, గుదిమెళ్ళ వెంకట్రామయ్య పంతులుగారి ఇంటను గూడా వారములభోజన మప్పుడప్పుడు తటస్థించుచుండెను. ప్రబల సుబ్బారాయుడు గారు, వేములకొండ సీతారామయ్యపంతులుగారున్ను మిక్కిలి భోజన ప్రియులు. వారిండ్ల భోజనముమిక్కిలి గణనీయము. నాకింగ్లీషుచెప్పించి ఉద్యోగముచేయించుటకు మాఅన్నగారు నిశ్చయించి, ఇంగ్లీషు మొదటి పాఠపుస్తకము నాకు కొనిపెట్టెను నాకు పదమూడేండ్లవయసు, విజయ నగరమంత పెద్దపట్టణ మిదివరకు జూచియుండలేదు.

## నా ఆంగ్ల విద్యాభ్యాసం

పదునాల్గవయేడు దాటువరకు నేస్కూలులో ప్రవేశించలేదు. ఉప్పు మళ్ల గోవిందరావుగారు నాకు ఫస్టురీడరులో గొన్ని పాఠములు చెప్పిరి. ఆతనియొద్ద "మఖంజీదార ఉద్యోగములోనే మనవిభవములెల్ల" అని పాడుచు నవ్వించుచుండువాడను. పట్టణములోఉండుటచేతను, స్కూలులో చదువ నుద్దేశించుటచేతను. అదివరకు మామూలుగా గట్టుకొనుచున్న గోచికి సెలవిచ్చి, చిన్నగావంచా గట్ట ప్రారంభించినాడను. విజయనగర ములో వారముల భోజనమునకు స్కూలు వేళకు జతపడకుండుటచేత అది వరకు మారెండవఅన్న వేరింటికాపురము స్థిరపడకుండుటను, నేబడిలో ప్రవేశించి, పైగా పాఠములు నేర్చుకొనుచుంటిని. మారెండవఅన్న భార్యాసోదరుడు గంటి లక్ష్మినరసింగరావు కూడా నా కింగ్లీషు పాఠములు నేర్పుచుండును. అతడు నేర్పిన ఇంగ్లీషెల్లన్నా అతడు మప్పిన చుట్ట శాశ్వతమాయెను. మొదట జుట్టుకాల్చినపుడు కక్కుకొని ఎంతో బాధ పడితిని. క్రమక్రమముగా జుట్టలకు గురువైతిని.

నాకు వారములొసంగిన వారిలో వేములకొండ సీతారామయ్య పంతులు మంచి కవీశ్వరుడు. గొప్పవక్త. వకీలు, నాభినిషా కలవాడట,

ప్రతిదినము తెలకపిండికూర, ఇంగువనూనె పులుసు పాటోలి, వంకాయ ముద్ద మొదలగు బహురకముల భోజనము సేయువాడు. పరమ భాగవతోత్తముడు. అతని భార్య తెల్లని ముసలిది. కృష్ణా యని అతడు భజనచేయుట పాడుట, ఎంతోదూరమువరకు వినబడును. అతడు సానినిగూడ ఉంచెను. వేములకొండ గోపాలస్వామి ప్లీడరు. అతనికి రెండవపెండ్లి అగుటచేత ఆతనిభార్యకు నాఈడు గలదు, భార్యాభర్తలు తలిదండ్రులవలె నన్నాదరించుచు, నాచే బురాణము వినుచుందురు. వేములమూడి రాయప్ప పంతులు, చిగురువంటిభార్య, ముత్తెములవంటిపిల్లలు కలవాడు. ప్లీడరు. మారెండవఅన్నకు కోర్టుపనిపాట్లు నేర్పెను, గుదిమెళ్ళ వెంకట్రామయ్య పెద్దమీసాల పొట్టిపంతులు. కోటలోనుద్యోగి పేకాట ఎంతయో అతనికి వేడుక. అతని ఇంటిభోజనముకూడ మిక్కిలి బాగుండెడిది ప్రభల సుబ్బారాయుడు మిక్కిలి భోగశీలుడు. సంతతము చందనచర్చితమగు శరీరము, తాంబూలచర్వణ సువాసిత మగు ముఖము. గొప్ప జుట్టుముడి. రంగుపంచలు, సొగసైన ఆకారము కలవాడు. అతనితల్లి సుబ్బమ్మవంటి అమృతోపమానము అతడు ప్రైవేటువకీలు, అతనికుమారుడీవుడు. విశాఖపట్టణములో జిల్లాకోర్టువకీలు, కాపరపు శంకరముపంతులు మంచి భూస్వాస్థ్యము కలవాడు. కోటలో ఉద్యోగి, నల్లనిమీసములు, తెల్లని జన్నిదములు, పావుకోళ్లతో ఇంటిలో బచారుచేయుచుండును. వారిఇంట నేను తరుచు బోజనము చేయుచుంటిని. చింతక్రింది గంగన్నపంతులీ ఊరి అమీను "ఓరీ! పెద్దగొంతువాడా!" అని నన్ను బిల్చుచుండును. తెల్లనిపాగా. అంగరఖా, ఆకుచెప్పులు, చేతజపతావళముతో కచ్చేరికి వెళ్ళునపుడపశకునమైనచో దిట్టుచుండును. పాలెపు లక్ష్మణరావుపంతులు కోటలో ఉద్యోగి, కనుబొమ్మలనడుమ పెద్దకుంకుమబొట్టు తలసుగేరా కలవాడు. ఆదరించి అతిథుల కన్నముబెట్టును. గంటి పట్టాభిరామయ్య పంతులు మారెండవఅన్న మామగారు. తెల్లటివాడు. కోర్టు ప్లీడరు. మాటలనేర్పుచే మిక్కిలిఆస్తి సంపాదించెను. వంకా వెంకన్నపంతులు

వేములకొండ సీతారామపంతులుకు శిష్యుడు. ఒకబండికి సరిపడునంత తెల్లనిశరీరము కలవాడు. తపశ్శాలి వీరిలో వేములకొండ సీతారామ పంతులు వేదులమూడి రాయప్పపంతులును దప్ప తక్కినవారందరును స్మార్తులు. పూర్వపుస్కీడరీకింగ్లీషు రానక్కరలేదు. కావుననే వారికి బట్టల ఖర్చు తక్కువ. తరచుగా అన్నదాతలుగా ఉండువారు.

పదునాల్గవఏట బడిలో ప్రవేశించి ఫస్టుక్లాసు 'ఎ' డివిజనులో ఫస్టుగా ఉండువాడను. మాకుమాస్టర్లు కడియాల వెఱ్ఱికామయ్య. అతడు లెక్కలు బాగుగ జెప్పగలవాడు, కాని నిష్కారణముగ మండలపై రూళ్ల కఱ్ఱతో బడగొట్టువాడు. కంసాలి పైడన్న బ్రాహ్మణుల మరపించి ఉండు వాడు. కంసాలి గంగయ్య గుండ్రనిమొగము, పెద్దకన్నులు, సొగసైన పాగా కలవాడు, మృదువైన మాటలాడువాడు. కంసాలి గంగయ్య గోళ్ళలో గోళ్ళువెట్టి చిక్కి బాధించువాడు. మంచియొజ్జ శీలము వెంక టాద్రినాయుడుగారు మూడే క్లాసులుగల ప్రైమరీస్కూలున కధికారి. ఇరువదిరూపాయల జీతగాడు. స్కూలుపిల్లలకేమి, పై వారికేమాతని యందు మిక్కిలి గౌరవము. మంచి మాటకారి. ఎన్నదగిన బోధనశక్తి కలవాడు. పణతుల నృసింహశాస్త్రి మూడుక్లాసులవరకు మాకు తెనుగు మాస్టరు నాకు ఫస్టుక్లాసునుండి డబుల్‌ప్రమోషనుచేసి మూడవక్లాసులో వేసిరి.

## నా "క్లాసుమేట్లు"

అప్పటి నాతో చదువుకున్నవారిలో జొన్నవలస మైనరు విసుపు లేక రాజపౌరుషముతో ఠీవిగా ప్రతిదినము రెండుపూటలు నిలువబడు చుండును. పులపాక కోదండరావు పిచ్చుకలు నీటిలోను, చేపలు చెట్లమీద ఉండునని జవాబు చెప్పి యెన్ని దెబ్బలు కొట్టినను కన్నీరుపెట్టని జడ్డి వాడు. బండారు రామమూర్తి యెద్దుమోపికబర్వు పుస్తకములు మోయుచు నంతతమేదో చదువుచుండును. ఒకతీరు బుద్ధిశాలి పీతాంబరము హను

మంతరావు నా లెక్కలు కాపీకొట్టి నేను కాపీకొట్టితినని మాస్టరుతో చెప్పి నన్ను గొట్టించిన తెలివితేటలు గలవాడు. చిరకాలము నాతో కలిసిమెలిసి తిరుగువాడు, మండపాక వీరరాఘవస్వామి. క్లాసులో ఫస్టు మంచి తెల్వితేటలుకలవాడు. కోలకొట్లచలపతి కోమటులలో నీవైపున నంతచదువునందు తెలివికలవాడింకొకడు లేడు. బొడ్డు వెంకటేశము, జుబ్బా షరాయితో ఉండు మంచిబాలురలో నొకడు. చదువునకేమిగాని వర్తన మంచిది. నిడుకొండ వరహాలు. చదువు రాదుకాని వన్నెకాడు, లంక గడ్డెన్న. ముక్తాఫలములవలె రెండుభాషలును వ్రాయగలవాడు. పులిగెడ్డ సుబ్బారావు. చదువురాని పెంకెవాడు. కానుకుర్తి వెంకటరావు. ప్రశస్తమైన తెల్వితేటలు కలవాడు, అతనితమ్ముడు కానుకుర్తి కృష్ణారావు తెలివిగలవాడే. భాగనరపు సూర్యనారాయణ తెలివితేటలు కలవాడేకాని రా పలుకదు మజ్జి జగ్గయ్య. ఒడ్డుపొడవులకు నాపాటి. మూడవక్లాసులో కొందరు నాకన్న బెద్దవాండ్రు పలువురు నాకన్న చిన్నవాండ్రును గలరు. భాగవతుల అప్పడు, కామాపంతుల సూర్యనారాయణ, ఈ ఇద్దరు మిక్కిలి తెలివితేటలు గలవారు. నాకు ఛందస్సునేర్చి పద్యములల్లుట మప్పిరి. నిష్ఠల సూర్యనారాయణ, మల్లాజోస్యుల వెంకన్న, క్రొవ్విడి వెంకన్న, కుచ్చర్లకోట వీరరాజు, చేకుపళ్ళ రామారావు, అంగర వెంకట్రావు, వేములకొండ దాసుపంతులు మొదలగు క్లాసుమేట్లు చురుకైనవారు.

వెంకటాద్రినాయుడుగారు ప్రతిరాత్రి తనఇంట్లో నాచే భారతము చదివించి వినుచుందురు. అతనిభార్య పెరుగు, పాలు, అరటిపండ్లు నాకిచ్చుచుండును. నాకు దరుచు స్కూలుజీతముగూడ నతడిచ్చువాడు. మూడవ క్లాసునుండి అప్పుడు ఫోర్తునకు నన్ను డబుల్ ప్రమోషను చేసిరి. గుండాల రామచంద్రరావు, అతనితమ్ముడు తాడూరు రామచంద్రరావు, పూళ్ల వీర్రాజు, సరస్వతుల సుబ్బయ్యశాస్త్రి, చిక్కవోలు స్వామి, కోటేశ్వరరావు. అరిపిరాల గౌతమి, చింతామణిభట్ల వెంకటరెడ్డియు, మంథేన భాస్కరుని మేనల్లుడు నాక్లాసుమేటు మరికొందరిని మొగముచూచి

పోల్చగలను. కొందరిపేర్లు పరాకుపడినాను. కొందరు బొ_త్తిగ జ్ఞాపకము లేదు బాలగురువు కొల్లూరు సోమనాథముగారు, ఆతీ వెంకట్రామయ్య నూతి పట్టెయ్య. వెర్రి సూరయ్యానాయుడు, భాగవతుల రామమూ_ర్తి శాస్త్రియు అతని అన్నయు. కొల్లూరు సోమనాధశాస్త్రి (ఏనుగంతవాడు) నరసింహాముపంతులు, చేకుపళ్ళ గోవిందరావు, వాసుదేవరావు, కంసాలి అప్పయ్య, అనాసపురపు రామమూ_ర్తిపంతులు. మాధవరావునాయుడు. కూరెళ్ళ వెంకన్న. నిష్టల వలపతి, శ్రీనివాసాచార్యులు. విజయరాఘవా చారి, అప్పారావు, కూరెళ్ళ సూర్యనారాయణ, రామానుజాచారి, ప్రడవ_ర్తి సూర్యనారాయణ (గొప్ప బలశాలి, మాటలపోగు, భూస్వాస్థ్యము కల వాడు, శిష్యవత్సలుడు, సద్బ్రాహ్మణుడు), బాలగురువు దేవాంగి (కడు దొడ్డవాడు) ఆతీ వెంకట్రామయ్య (పెద్దపాగాజుట్టి గున్నచేస్తువలె స్కూలుకు వెళ్లువాడు) నూతి పట్టెయ్య (కీచుగొంతువాడు) సూరయ్య నాయుడు (ఈయన దస్తూరీవంటి సొగసైనదస్తూరీ తరుచు గానరాదు). రామమూ_ర్తిశాస్త్రి (తెలుగుటీచరు). కోట రామమూ_ర్తి (జ్యామెట్రీలో తెలివిగలవాడు) గొల్లపల్లా అప్పలస్వామి. లంకజనార్దనమును వాని తమ్ముడును, హస్నామర్కాదు ఇజాల్ పటాలంసిపాయి కొడుకు. వెంకట స్వామి. మజ్జి జగ్గయ్య. లొల్లా నీలాచలము ఫస్టుక్లాసులో 'బి'లో మాని టర్ భైరరాజు అప్పలరాజు (మిక్కిలి ఉడుకుప్రీతి) దాట్ల అప్పలరాజు (అతడెంతచదివినను పాఠములురావు), భానోజీరావు (మొద్దెంతకొట్టినను కంటనీరు పెట్టని మొండి). కందుకూరి భూషణరావు, వ్యాసుల జగన్నా థము (మంచివాడు). వెల్లటూరి లక్ష్మాజీ, వసంతరావు, అనంతరావు. కాకినాడ గున్నయ్య, గురడాల నారాయణమూ_ర్తి ఉపద్రష్ట వెంకటరమ ణయ్య, అంగర వెంకట్రావు, గోల్కొండ వేపారి నారాయణమూ_ర్తి, నాకబిందు అప్పలస్వామి. గంగాధరభట్ల సుబ్బారావు, కోలకొట్ల అప్పల నరసయ్య, చంద్రశేఖరశాస్త్రిగారు అతని తమ్ముడు సుబ్రహ్మణ్యము. సాలూరి సన్యాసిరాజు, గొంగాడ మల్లయ్యశాస్త్రియు అతని అన్న గోపాల

శాస్త్రియును, వడ్డాది పోతనపూడినుండి వచ్చిన జగన్నాథము అతని
తమ్ముడు సుబ్బారావును. కందాళ నీలకంతము వాని అన్న సుబ్బయ్యయు.
వేగినాట్ల సుబ్బారావు అతని అన్న జగన్నాధము. పోతనపూడి నివాసులు
పూళ్ల వీరరాజు. వీరమల్లేశము, మండపాక రామదాసు షరాబుఖానా కృష్ణా
రావు. నడివింటి నరసింహము, చట్టి అప్పారావు, ఓరుగంటి సోమయ్య.

1880 సంవత్సరమున మాతండ్రిగారు కాలముచేసినారని విని నేను
మా రెండవ అన్నయు బయలుదేరి యజ్జాడకు వెళ్ళినాము. మా తండ్రికి
నలువదేండ్లవయసులో క్షయరోగము కలిగెను. దాని నివృత్తికై అతడు
సూర్యోపాసనము చేసెను. అప్పుడు పుట్టిననాకు సూర్యనారాణ అని పేరు
పెట్టెను అతని ఏబదితొమ్మిదవయేట తిరిగి క్షయరాగా అతడు మృతుడ
య్యెను. మాతండ్రియొక్క మరణసూచనములు కనిపెట్టి మాతల్లి వాతనొ
ప్పులచే బాధపడుచుండునది. ముసిడినల్లమందునూనె కలిపిత్రాగి సన్న
సన్నగా మా తండ్రి మా పొలములో ద్రవ్వించిన నూతపడిపోయెను
మా తండ్రి కాలముచేసినవెంటనే ఊరిలోనివారందరు మాతల్లికొరకు
రాత్రి వెదకివెదకి తుదకు తెలవారినవెన్క నూతన మొదటనడుకంటి
ఎట్లో పైకిదేలి స్మారకముదప్పి సన్నపునూయి అగుటవలన ఒకవైపు
శిరస్సును. మరియొకవైపు పాదములను రాళ్లనడుమ చిక్కుకొనబడి
ఉన్న మాతల్లిని బైకితీసి ఊపిరి ఉంటచే మాఇంట ఒకమూల బడ
వైచిరి, మా తండ్రిని దహనముచేసిన మలినాడు మాతల్లికి స్మృతి
వచ్చెను. మాతండ్రిగూర్చి వర్తమానము దెలిసికొని ఆపె ధైర్యము
వహించి మృతిచెందుట కుత్సహింప కూరుకొనెను, ముషిడి నల్లమందు
త్రాగుటచే క్రమక్రమముగ నదివరకాపెకున్న వాతనొప్పులు నశించి
పోయినవి. మా రెండవఅన్న రెండువందల రూపాయలు ఖర్చుపెట్టి
యుత్తరక్రియలాచరించెను, పిదప మాపెద్దఅన్నయు మూడవ అన్నయు
నాల్గవఅన్నయు వ్యవసాయముపెట్టుకొని కాలక్షేపముచేయుచున్నారు.
మారెండవ అన్నయు నేనును విజయనగరమునకు మళ్ళివచ్చినాము.

## నాటి విజయనగరము

నా వయస్సప్పటికి బదేనేండ్లు. నూత్నయౌవనపు శాఖామృగ చేష్టలు దుస్సహవాసబలమున నా కంకురింప దొడగెను. శరీరమునకు సరియైన పోషణ లేకుండెను. మా రెండవవదినె భాగ్యవంతులపిల్ల అగుట చేతను పుట్టిల్లెదుట ఉండుటచేతను దరుచుపుట్టింటఉండునది. మా అన్న కోర్టుపనిచేసికొనుట రెండుపూటలును వండుకొనుటయు దటస్థించుచు వచ్చెను. మా అన్న నాకు వారములు మాన్పించి ఇంటనుంచుకొనెను. మా వదినెగారు పుట్టింటికి దయచేసినపుడెల్లా తరుచు నేవంటచేయువాడను. కానుకుర్తివారివీధిలో దక్షిణశ్రేణిలో చట్టి వెంకట్రావుపంతులుగారి తూర్పు పొరుగు మా అన్నగారున్నయిల్లు దాని నతనిభార్య కతని మామగారు కట్టించి ఇచ్చిరి. అప్పటి విజయనగరపు మ్యునిసిపాలిటీ స్థితి ఏమిచెప్ప గలను. నాచుతోను గల్వలతోను నిండినఅయ్యకోనేట్లో అన్ని జాతుల వారును స్నానముచేసి బట్టలుతుకుకొనుచుందురు. పెద్దమహారాజుగారు వీధులవెంబడి గుర్రపుబండిపై వచ్చునపుడు వారి హుక్కాసువాసనతప్ప తక్కినవేళల నన్నివీధులందును సహింపరాని దుర్వాసన నిండిఉండును. దోమలబాధ చెప్పదరముకాదు. పెద్దచెర్వునీటి మొదటిదుర్గాంధానుభవము స్కూలుది. బ్రాహ్మణవీధులన్నియు కుళ్ళుకాలువలకు, చెత్తలకు పుట్టిండ్లు. మహారాజాగారిప్రాపున పై డబ్బు, మున్సిపాలిటీమహిమచేత గ్రిందిడబ్బును లేనిపురుషుడరుదు. మూడువంతులు స్త్రీలకు బూరగాళ్ళు, బూరచేతులు కలవు ఇట్లు పిన్నపెద్దలు ముప్పాతికమూడువీసములిట్టి దుష్టరోగములకు బాలైరి. ముఖ్యముగా బ్రాహ్మణులకే ఈ రోగములు మెండు. గవర్నమెంటు ఉద్యోగులేమి, తక్కినజనులేమి మహారాజపోషణమాశించి ఉండువారు. పల్లెలలో జరుగక పట్టణవాసము చేరి, నానావిధజనసంఘ సంపర్కముచే పూర్వాచారములు చెడగొట్టుకొని, బ్రాహ్మణవీధులనెడబాసి, భోగవాంఛచే డబ్బుకై కానిగడ్డుగరచుచు, విగతలజ్జులై, కోర్టులలోను. గోటలలోను, బేటలలోను ఇచ్చకములు పల్కుచు, గూటసాక్ష్యములు

బన్నైచు నీచసేవలు సేయుచుండు దుష్టులను దేవుడట్టి రోగములచే శిక్షించుటవింతకాదు.

## విజయనగరమున ఉత్సవములు.

పెద్దమహారాజుగారికాలమందు నిత్యోత్సవము పచ్చతోరణముగా ప్రతివత్సరము పొడవున నేవో ఉత్సవములు జరుగుచుండునవి. గణపత్యుత్సవమున మహారాజుగారు మామూలు దయచేయించెదరని కొందరు, తమ యింటివైపుకి దయచేయుదురని కొందరు. ఒకరిఇంటికి వచ్చునపుడు మహారాజుగారు తమసంగతికూడా కనిపెట్టుదురని కొందరు ఇట్లు వేలము వెర్రిగా గొందరు కోలాహలముగ, బలిజాతులవారు గణపతి నింటనుంచి ఉత్సవములు చేయుచుందురు, గణపత్యుత్సవములు జరుగుచోట ముఖ్యముగ వెలచేడియ పాటయు, స్వస్తివాచక ఘోషయు, భజనయు దప్పకుండును. మూడుగంటలరాత్రివరకు స్కూలుపిల్లలు సంస్కృతవిద్యార్థులు, పోకిరీలు వీధులవెంబడి తిరుగుచుందురు. మా ఊరిమహారాజులు దేవీభక్తులు కనుక దేవీనవరాత్రములు మరింత బాగా జరుగుచుండెను. నా ఎరుకను రాజగురువు చిరవూరి రామసోమయాజులుగారు అతనికి బొగాకు నమలుటయే యలవాటు. మంత్రశాస్త్రవేత్త. శరవేగమున నాగరీచదువు దొడ్డవాడు, లంబోదరుడు, దేవీపూజ వామాచారముగా బలువురు జరుపుచుండిరి. వామాచారమనగా సారాయి మాంసమును దేవికి నివేదనసేయుట, ఆ ప్రసాదము సేవించుట మతిలేకుండుటయును, మహారాజుగారిది స్కూలు. మహారాజుగారి నౌకర్లు స్కూలుమాస్టర్లు కనుక మహారాజుగారి ఉద్యోగుల ఇండ్ల జరుగు ఉత్సవములందు స్కూలుమాస్టర్లు శిష్యుల సహితముగ రాత్రులు నిద్రమాని ఉండక తీరదుగదా! మహారాజుగారి చిత్తమునకు వ్యతిరేకముగా విజయనగరములో నొకచీమఅయిన ఉండవాటముకాదు, గవర్నమెంటు ఖాయిదా మునుపంత ముదరలేదు. నవరాత్రిదినములలో రామలీల జరుగుచు వచ్చెను లంకాపట్టణము అయోధ్య జనకపురి అను పేర్లుగల స్థలములు విజయనగరమునకు సమీపముగా మూడువైపుల

గలవు. సాయంకాలం మూడుగంటలుమొదలు రాత్రి ఏడువరకు నాస్థలముల గల వైభవము చెప్పనలవి కాదు. పలువిధముల సింగారించుకొని కులాంగనలు, వెలచేడియలును, అంచలములపై గొందరును, బండ్లపై కొందరును, బాహాటముగా కొందరును, జాటుగా కొందరును, అరచాటుగా గొందరును అన్యోన్య సందర్శన సంభాషణ కుతూహలంబులం జొక్కి-తిరుగు స్త్రీపురుషులును దొమ్మిగా ఉండునపుడు పరస్పర శరీర సంపర్క-జనితసుఖావేశపరవశులై ఒడలిసొమ్ములను గోలుపోవువారును, మహారాజుగారు ఏన్గుపై గూర్చుని ఉత్సవస్థలమునకు విచ్చేయునపుడెంతచూచినను దనివితీరని వారి సౌందర్యవిశేషమును గనుగొంటకు మోములెత్తి తమపై బట్టబు జనసంఘములో జిక్కువడిపోవ దడుముకొనువారును, వందల కొలది నడుచు జుల్మతీ గుర్రంబులకు బెదురు పసులచే నీడ్వబడి గొడుగు పాటందిన బండ్లలో దెబ్బలుతగిలి మొర్రో మయ్యో అనువారును, దులసీ రామాయణము చదువు బొందిలీడోలకు వాద్యఘోషయును, కించిద్భోగో భవిష్యతి అనునట్లు రామలక్ష్మణసీతావేషములతో ఏన్గుపై గూర్చొను పేద బ్రాహ్మణకుమారులును, చూపరులను భయమును హాస్యమును బుట్టించుచు నాకసమంటు రక్కసి బొమ్మలును, కుంభకర్ణాది వేషములపై బడు మర్కటవేషంబులును రావణశిరస్సులం దహించుచు ఎంతోదూరంగా వెల్లడినీను బాణాసంచాయును, ఇంటికి మళ్ళివచ్చునప్పుడు జరుగు విటవిటీ చమత్కారంబులును, దొంగతనములును వర్ణింప ఒకపెద్ద చాప భారత మగును.

### సహవాస దోషములు.

నన్ను బట్టవాసపుపిల్లలు బెదిరించి జెల్లలు కొట్టుచుందురు. నేసమర్థుడనయ్యు ఊరు కొత్తదగుటచే పోరాడుటకు భయపడువాడను. కూపంబుల గూర్చుంటయు, మునుపటివలె వ్యవసాయపుపాటు లేకుంటయు, దుస్సహవాసమున లభించిన నూత్నయౌవనపు దుశ్చేష్టల కలవడుటయు. మురికిఇండ్ల దిరుగుచుంటయు, రాత్రులం తరుచు నిద్రమాని ఉంటయు నాశరీరమునకారోగ్యము తప్పించెను. ఒకప్పు డొకరిపై క్రిమినల్ కేసు

వచ్చినపుడు వారిపక్షమున వ్యవహరించు మా రెండవ అన్నతోగూడ విశాఖపట్టణమునకేగితిని.

అచట నాకొకవైపు అండము వృద్ధిఅగుచుంట కెంతయో చింతించి తిరిగి విజయనగరమునకు వచ్చినమీద, ఒంటితాడి యగ్రహారమను సమీపగ్రామమందుండి విజయనగరమునకు వచ్చి, వాతనొప్పులు వాత ప్రకూపితాండములను దోమి బాగుచేయుదునని చెప్పుకొనుచు, గొలుసులుత్రిప్పువిద్యకై తోడానందిన ఒక దూదేకులసాహెబున కొకపావలా ఇచ్చి ఒకమారుమూలచోట పదేనుదినములవరకు బ్రతిదినముందోమించితిని. నాచేత మొత్తముపై రెండు రూపాయిలుగొన్న సాహెబు మునుపటి కన్న రెండురెట్లు నావ్యాధింబెంచి పోయెను. కాని లాభమెద్దియును లేదాయెను.

జుట్టునకుచుట్టు సొగసుగ బిల్లవరుస నిడుకొంట, కొంగు పాదము వరకు విడిచి బట్టకట్టుకొంటయు, నిట్లు శృంగారచేష్టలకలవడియు సత్తువ పట్లకు కురుజుగా నుంటిని. ఎవరితోనైన దండపట్లు పట్టినపుడు పైకి నేచెఱకినతోనే పదిగజముల దూరముగ దెబ్బన తలక్రిందుగా బడుటయు, బడినరెండునిమిషములవరకు స్మృతిలేకుండుటయు, వారు పిదప నామెలపు కొనియాడి మరెన్నటికి నాతో దలపడకుంటయు నాకు జ్ఞాపకము మున్నది. ఒకప్పుడు పదుగురతో ఒకరితరువాత నొకరితో బట్లుపట్టి అలసటలేక ఓడించువాడను. నన్నోడించిన ఇద్దరివలన నేబడినపాట్లెదివంకు మరపు రావు. శనివారము, ఆదివారము ప్రతిదినము వచ్చిన బాగుండుననుకొను వాడను. బడి వదలినతోనే లక్ష్మీకాంతం పంతులుగారి తోటగడ్డలోనో, అయోధ్యదిబ్బలమీదనో, వ్యాసనారాయణమూర్తిమెట్టచెంతనో, జట్టుగట్టి చెడుగుడు ఆడుచుండువారము.

మిడిల్ స్కూల్ రెండవక్లాసులో సంస్కృతమువభాషగా పరీక్షలో దేలినాడను. నా కప్పటికి బదారేండ్లయినవి. మొదటి రెండు మూడు క్లాసులవరకు మారెండవఅన్న నాకు పుస్తకములు బడిజీతమిచ్చెను. కాని,

పిదప బురాణముచదివియు, బాడియు బడిజీతమునకును బుస్తకములకును సంపాదించుకొనువాడను. ఇదివరకు బేర్కొనినవారిందక్క జీవితము దోషావిష్టమగుంగాన నిటుపదారేండ్లలోపున దెలిసినవారిందప్ప దక్కిన వయసున నెరిగినవారి నాయెరుకంగలవారిపేర్లు చెప్పనొల్ల నటులైనంగాని గుణదోషముల జెప్పవాటముగాదు.

స్పష్టముగ గొంతవ్రాసియు నంతలో మేల్కొని సర్దుకొనుచున్నాడ. సానిమేళములయొద్ద శ్రద్ధగా గూర్చొంట వెలపడుచులంజూచి కనుగిల్పి మెలపున జావళీలుబాడుట మొదలగు నేర్పులబ్బెను. అయ్యకోనేటి మఠమురేవున నొకనాడుదయమున స్నానమునకేగి యొకహితుని గలుసు కొంటిని. వానికి వెన్క గేరాయును వెడదకనులును, గంజుమొగమును కలవు. నేనొకకూనిదీర్ఘము తీయగా వాడొకదీర్ఘము తీసెను. గాన మా యిరువురకును స్నేహము కలిగెను. అతడదివరకు బడిపాడవాయై షోళంగి ముచ్చుల సహవాసమున జదువు కోటాకువేయగా గురుజుపిట్టవలె దిరుగును నాబోటివారిజట్టు కల్పుకొనుచున్నాడు. కాన అతడు నన్ను దన యింటికి దోడ్కొనిపోయెను. కొందరు రసికులకనికి జట్టుదార్లు. గేరా కట్టుకొనుటయు, పుర్మాడుంచుకొనుటయు, ఇస్త్రీజుబ్బాలు తొడుగు కొనుట జల్తారుచెడావులు దొడుగుకొనియు, బొడవుచుట్టకాల్చుచుంటయు, సన్నెగంటిసరసములు నేయుటయు, వేడివేడిజవ్వనమున నవివేకము మదించి తిరుగుటయు, చిన్నచిన్నవిషాలు నేయుటయు వారి వృత్తులు, మాయన్న తన్ని తగిలివేయునను భయమున బడివిడువరాదు. దుస్సహ వాసమున తెల్లవార్లు దిరుగుచుంట నారుచి మానలేకుంటివి. పెద్దప్రభువు వారు స్వర్గస్థులైనపుడు సంభావనకు మావైపునుండి పలువురు బ్రాహ్మ ణులు వచ్చిరి. నాపసినాటిస్నేహితులు నా నాజూకువేషముచూచి "అప్పుడే పట్టవాసపు మెరుగులలో బడినావా ? నీపవిత్రతయు నీయారోగ్యమును జెడుపుకొన్నావా" యనిరి. అందుకు నే "పోరా పల్లెటూరి బచ్చా" యని పక్కున నవ్వితిని, చిన్నప్రభువువారు పెద్దప్రభువువారికి బొత్రము లిచ్చు

చుండ జూచితి, వైదికవేషముతో నువ్వను నాప్రభువెంతో సొగసుగ గన్పడెను. మా జట్టుదారులలో నొకడప్పటిషోళంగిముచ్చులలో నగ్రేసరుడు. వానిం గన్నకొడుకువలె నొకధర్మాత్ముడు జూచుచు వానికిష్టము వచ్చినట్లెల్ల ధన మిచ్చుచుండెను. ధన మేమిషను వచ్చినను భోగార్హమే కదా ! అతడు పెచ్చురేగి విచ్చలవిడి సొమ్ము వెచ్చపుచ్చుచుండెను. అతని వెలయాలు నాచేతనొకనెలవరకు భాస్కరరామాయణము చదివించి పట్టాభిషేకము చేయించి యొకపంచలచాపు నొకచీరె పదిరూప్యములు కట్నమొసంగెను. అంతసొమ్ము నాచేతికదివరకొక్కసారి యట్లు చిక్కలేదు. ఆ చీరెమాత్రము నాకుయమషట్పది నుపదేశించిన మారెండవమేనమామ పెద్దకొడుకున కిచ్చివేసినాడ.

సాయంకాలము బడివిడిచినతోడనె జట్టుదార్ల కడకేగుట వారు కరుణించి దయచేసిన చిన్నగుపుని సేవించుట చిల్లరపాటలు బాడుచు వెలపొలతుల యింట నుచ్చగిత్తవలె వారివెంటదిరుగుచుంటయు నాపని. మానాల్గవయన్నయగు పేరన్ననుగూడ మారెండవయన్న రప్పించి యింట నుంచుకొనుటచే మునుపటివలె నవసరమైనపుడు వంట నాపై బడకుంటన్నాయదెచ్చుగా రాత్రింబవళ్లు దిరుగుచుంటి. నా దుశ్చేష్ట లగుపడినపుడెల్ల మారెండవయన్న నన్ను వందమూడుటోళీలు జేయువాడు. ఒకసారి చూచిన పుస్తకమంతయు జ్ఞాపకముండునాకు న్యూలుపూటపాఠములన నెంత ? గాని రాత్రియంతయు మేల్కొనియుంటచే నిషాకలవడుటచే చల్దితిన్నతోనె బడికిబోయి నిద్రయాపలేక తరుచుగ గనుపడకయు లేక మంచిచేసికొనియు బోర్డుబల్ల వెన్క బడి నిద్రించువాడను. మాపేరన్న మాయన్నవదినెలు చెప్పుపనులు సేయుచు కొందరియొద్ద సంగీతమునేర్చుకొనుచుండెను.

## వ్యాధి చికిత్స

అంతట నాయెడమ పార్శ్వమునందండవాతము మెండయ్యెను కచ్చకి మడనంత పెద్దదాయెను. స్వర్గమున గురుడొకడుగాని విజయ

నగరమున బలువురు! గురుసంపర్కమున శిష్యుడుగూడ గురుడయ్యె. క్రింది
మీదులకూడ గురుడుండెను. అది కనిపెట్టి మా రెండవయన్న నొకపసిణి
గంటి తురకను బిల్పించి వాని కిరువది రూకలొప్పుకొని శస్త్రచికిత్స
చేయించెను. ఆచికిత్సకుడు మిగుల మృదుభాషణము నేర్పరియు. కోడి
కత్తి తొలుత నండములో దూర్చి నీరుకార్చి అందులో క్షారపువత్తివేసెను.
మరునాడు ముమ్మరమైన జ్వరము తగిలెను. మూడవ నాడా వత్తింబైకి
బెరకివైచి కలబందుతెలక పిండికట్టుతో కుళ్ళగట్టి కుళ్ళిపోయిన పిదపపిండి
కట్టునమాన్పెను. రెండవవైపుగూడ నండవాతము మెండుకొనుట దానిం
గూడ శస్త్రముచేసి వత్తిదూర్చెను. అవివరకు నాకు మిక్కిలి పరిచితమగు
నొక వెలచేడియయింటికి దాని యప్పకూతురువచ్చెను. నే నచటికిబోయి
మన్మథబాణమువలెనున్న దానింజూచి యూటలూరుచు జావళీలు బాడుచు
నా పెదయకు బాత్రుడనై నాకుగల వ్యాధికిం దానిబాగునకు లక్ష్యము నేయ
కుంటిని. నాడే నా కలవిగాని జ్వరము తగిలి సందెకుదించెను. లోపల
మాత్రము చెరుపు మరుపు తెల్వికలదు. అపుడు మా రెండవయన్న నా
చెంతకువచ్చి "యయ్యో యెంతపని జరిగెను? మరి బ్రతుకడు కాబోలు,
వీడు పనికివచ్చునని యెంతకష్టమైనను సహించి చదువుచెప్పించుచున్నాను.
మొన్ననే వీనికై పదునెనిమిది రూపాయిలిచ్చి బౌరిన్సు డిక్షనరీ రెండు
భాగములును గొన్నాను! అని కన్నీరిడెను. దేవుని కృపవలన నాకా
జ్వరము మళ్ళెను. మరునాడు నే సుఖముగా గూర్చునియుండగా తొలినాడు
నన్ననుగ్రహించిన వెలయాలి పినతల్లి తోడుతెచ్చుకొని నన్నుజూడ
వచ్చెను. మొన్న నీ యొద్ద పాడిన జావళీ యింత జేసెనని నవ్విన నన్నుం
జూచి "ఇంత శ్రమపడుచున్నను నీ పోకిరీతనము మానవైతి"వని యొక
కంట కోపము మరియొకకంట సంతోషము నభినయించిన సొగసెట్లు
వర్ణింపగలను? అండ వ్యాధికుదిరెను. గాని లంబకోశుడనై యుంటిని.
ఎప్పటి లాఘవము వచ్చెను.

## నా లాఘవ శక్తులు

నా లాఘవమనగ మునువేళ్లందిన మాత్రమున గోడపై కెగురుట, నా మూరతో బన్నెండు మూరలు దాటుట. వెనుకకు గాని ముందునకుగాని పాదములు మాత్రము మోయునట్లు తలక్రిందు మొగ్గలువేయుట, యయ్యకోనేటి యీవలివద్దనుండి యావలియొడ్డువరకు గజమెత్తునాచు విడిచే తుల జింపుచు నీదుట, సామాన్యపు పొడవుగల యిండ్లపైనుండియు మిద్దెలపైనుండియు చప్పుడుసేయక క్రిందదుముకుట, మైళ్ళకొలది పరుగిడుట, రెండు గజముల యెత్తుగల యరుగులమీదికి గుప్పించి యెగురుటయును.

మిడిల్ స్కూలు సూర్యనారాయణ యనుపేరున బరీక్షలో నెరవేరినాడను. వాసుదేవరావుగారు హిస్టరీ జోగరఫీలు నింగ్లీషును సొగసుగ బోధించును సోమనాథశాస్త్రి బూతులబుంగగాని శిష్యవాత్సల్యమును మేటిబోధనశక్తి కలవాడు. దేవునివంటివాడు నరసింహాము పంతులండవాతము శస్త్రముచేయించుకొని మృతుడయ్యె. నాకు బాగుచేసిన సాహెబే యతని ననుగ్రహించెను. ఆనాసపురపు రామమూర్తిపంతులు తనయింటికి నన్ను గొంపోయి యెంతోదయతో బనిపాటులు చేయించుచు జదివించుచు బాడించుచుండును. గాన బడిలో నన్ను గొట్టినట్లు మరెవరిని గొట్టలేదు. కూరెళ్ల వెంకన్న మంచివక్త. కూరెళ్ల సూర్యనారాయణశాస్త్రి బేదవాంధ్రనైన భాగ్యవంతులైన నొకపోల్కి దిట్టుచుండును. నేనెప్పుడోతప్ప సంతతము బడికాలస్యముగా వెళ్ళువాడను. నన్ను జూచినతోనె శ్లోకమప్పచెప్పుమనును. "ఫస్టు వానిచే జదివించుడు పిదప నేజదువకపోయిన నన్ను తమచిత్తమువచ్చినట్లు శిక్షింపవచ్చును." అని నేననగా "నోరీ నీ పెంకెతనము నా కెరుక యొకమారు విన్నమాత్రమున నీకువచ్చునని నాకు దెలియదా ! కాటుకెంతసొగసుగా బెట్టుకొన్నావురా నీయంద మడుగుకొని తిన్నట్లున్నదామట్టుగ బెంచీయెక్కు. ఎక్కెదవా ప్రిన్సిపల్ గారికి వ్రాయమన్నావా" యని బెంచీయెక్కించి నిద్రపోవుటకు సెలవిచ్చుచుండును,

"దొక్కచించి రాళ్ల కొట్టెద"నని పలుమారాశాస్త్రిగారు కోపమువచ్చినపు డెల్ల శిష్యులతో వచించుచుందురు. ఒకనాడు వారొకటికై పైకిజనినపుడు బల్లమీద వారుంచిన వారిసులోచనములదొక్క చించి దానిలో రాళ్లు దిగ గొట్టి తిరిగిబల్లమీద నుంచినాను. అతడు వచ్చి సులోచనములదొక్కస్థితి జూచి "మీతలమంత నాడొక్కేచించి రాళ్ళుకొట్టినారా!" యని కోపమును నవ్వును గన్పర్చెను. భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రియును రామమూర్తి శాస్త్రియును మృదుభాషులు. అప్పయ్యగారు సౌజన్యనిధి, మంచిటీచరు. చలపతిశాస్త్రిగారి బోధనాశక్తి గడింపదగినది. ఎటులైన మైత్రిక్యులేషను పేసయి చదువుమానివేయుట నా యభిప్రాయము. అయిదవ క్లాసునందు చదువుచున్నపుడే రెండునెలలు వేసవిసెలవులు వచ్చెను. అపుడు మాపెద్ద న్నయు, బేరన్నయు, నేను గంజాంజిల్లా కార్జనకై బయలుదేరినాము మా తండ్రిగారు కాలముచేసిన రెండేండ్లకు మా వ్యవసాయపుబాధ పడలేక మా పెద్దన్నయు. మూడవయన్నయును మాతోగలిసి జీవించుటకై, భూములను శిస్తులకమర్చి విజయనగరము చేరుకొనిరి.

## సంస్థాన సంస్కృత నాటక సమాజము

మహారాజుగారు సంస్కృతనాటక ముంపించిరి. ఆ నాటకములో మా పెద్దన్నయు, మూడవయన్నయు, బేరన్నయు నాలుగేసిరూపాయిల జీతమునకు కుదురుకొనిరి. అప్పటి నాటకపు మేనేజరు నల్లనివాడు, మిక్కిలి యున్నతమైనవాడును, మాటలనేర్పు మిగులకలదు, వైద్యము చేయును. గొప్పరసికుడు. నాటకపు మట్లు నేగ్రహించి, వెల్లడిచేయుదు నేమోయని, నాటకము ఉపేక్షి జరుగునపుడు నన్ను వినవిచ్చుట కొప్ప కుండును. అప్పటికి విజయనగరమున సంగీతసాహిత్యము లత్యున్నత దశలో నుండెను.

## విజయనగరమందలి సంగీత విద్వాంసులు

ఆస్థాన విద్వాంసులలో నొకడు [ఒకదినమంతయు మిగులశ్రావ్య

ముగ సభాసదు లౌరాయనునట్లు రాగము పాడగలడు. ఒకడు ఫిడేలు ప్రశస్తముగ వాయించును, మృదంగము సొగసుగ వాయించును, సభ్యు లౌనన బాలుజాలును. ఒకడు ఫిడేలునందు, వీణయందు నిరుపమానముగా బల్లవి వాయించుచు జంత్రగాత్రముల కభేదముగా మిగులరుచ్యముగా బాడును, మరియు నతనికి సంగీతసాహిత్యములు కరతలామలకములు. ఒకడు నిరుపమానముగ వీణవాయించును, సొగసుగ గవిత్వము చెప్పును, గరిడీసాములో నేర్పరి మంచి మాటకారి. ఒకడు పల్లవిలో జాతులు మార్చి స్వరము పాడుటయందు గొప్పవాడు, మరియు మృదంగరాయడు. మరియిద్దరు రుద్రవీణ వాద్యమున నిరుపమానులు. ఒకడు రుద్రవీణ యందు సమర్థుడు, ఇంకొకడు చితారునందును రుద్రవీణయందును మిక్కిలి నిపుణుడు. గంధర్వుల మెప్పింపజాలు మహామ్మదీయుడు. నాటకములో పప్పువెంకన్న వేయిశోయిలలు మ్రోగున ట్లొకమైలు వినబడు నట్టి దివ్యశారీరముతో సభకామోద మొనర్చువాడు. అతడు వీణగూడ గడురుచ్యముగ వాయించును. పెక్కేల విజయనగరమున సంగీత మెరు గనివారరుదు. సంస్కృత విద్యకు రెండవకాశీయని ప్రసిద్ధి పొందెను. విజయనగరమా లేక విద్యలనగరమా యని విదేశీయులాశ్చర్యపడువారు. ఇద్దరు మూవురు వెలయాండ్రును ఇద్దరు ముగ్గురునట్టువవాండ్రును సుప్రసిద్ధులుకలరు. అప్పటికి నాకు స్వరముపాడుట రాదు. గాని లయస్వభావముగ వచ్చుటచే ఒక్కని పై దప్ప తక్కినవారినందరిని బల్లవిలో ఢీకొనుచుండువాడను. నూరుజావళీలవరకు వచ్చును. కొన్ని కృతులుకూడ వచ్చును. నాటకపుమట్లుకొన్నివచ్చును.

## నా పెద్దన్న బలపరాక్రమములు

మా పెద్దన్న బలమునకు నతనివిగ్రహపుష్టికి మరియు నతనిక్ర మాంతస్వాధ్యాయవేత్తృత్వమునకు భోజనసామర్థ్యమునకు సోమనాధముగారు సంతోషించి దన కోట్లలో మంచిదొకటి బహూమతి యొసంగెను. సోమనాధముగారి కోటు మా పెద్దన్నకు దప్ప తక్కినపలువురకు పదులు

మా పెద్దన్నబలముంగూర్చి చెప్పియున్నాడ నతనివిగ్రహము గున్నశేన్గు
న్మరపించు నతఁడుతినుచలిది మావంటివారికి బదిమందికి సరిపడును. ఒక
ప్పుడు ప్రభువువారతనిం జూచి "యేపాటి భోజనముచేసెదవయ్యా"యని
నాటకశాలద్వారమున గావున్న మా పెద్దన్నతోననెను. అందుకు మా
పెద్దన్న "మహాప్రభో. నాతో దండెపట్లలినవారుగూడ బట్టలేరని నాయభి
ప్రాయము. క్రమాంతస్వాధ్యాయవేత్తను ఏలినవారు చిత్తగించినచో
నాభోజన వైభవము దెలియును" అనె నందుకు ప్రభువువారు సంతోషించి
కోటకు రప్పించి చిక్కఁగ గాగినపాలును పట్టెడేసి లడ్డువులు నొద్దపెట్టిం
చిరి. పన్నెండు సేర్లపాలును తొంబదిలడ్డువులును దిని యిదిరాత్రిపూట.
మధ్యాహ్నమునందైన నింతకు రెట్టి పుచ్చుకొందు ననెను. అందుకు
ప్రభువువారాశ్చర్యపడిరి. పెద్దమహాప్రభువువారి మొగదాల్లు చుల్కఁగా
ద్రిప్పెను. మా పెద్దన్న యీత చోద్యమయినది. యోడవలె గదలక
మెదలక నీటిలో వెదికలబడుకొంటయు నతనిపై పదిమంది కూర్చును
టయు ఇందరిని భరించుచు నెంతమాత్రము చలించక కాలిపట్టి యెటులా
గిన నటువచ్చుటయును మిక్కిలియద్భుతము. అతనికెంతబలమో యంత
ధైర్య మంతశాంతగుణమును గలవు. వలసినంత యాహారసౌఖ్యమును
గసరత్తుచేయుటయును మొదటినుండి యతనికున్నయెడల నంతబలా
ఢ్యుడు లోకమందుంట యరుదనుకొనెదను.

మా పెద్దన్నయు, బేరన్నయు, నేను ఆర్జనమునకై గంజాంజిల్లాకు
బైలుదేరినామని మనవిచేసినాడనుగదా. విజయనగరము బయలుదేరి రణ
స్థలమునకు నడచినాము. చింతాకుచారుతో నెత్తివిముతకయన్నము
తిన్నాము. సత్రములో మరేదియు లేదు. శ్రీకాకుళములో నాలుగు
రూపాయలు సంపాదించుకొన్నాము. అచటినుండి దేవాదిసత్రములో భోజ
నము పుష్టిగ జేసి, యెత్తురాళ్ళపాడు సత్రమున రాత్రి నిలిచి మరునాడు
పదుకొండుగంటలువేళకు మంచియెండలో రఘునాధపురమునకు సమీపించు
చుంటిమి, మండువేసవి. ఐదారుసార్లు కనపడిన నీటిలోనెల్ల మునుగుచు

నీరు ద్రావుచు, నీడల నిలుచుచు నెంతో కష్టమున రఘునాథపురము చేరుకొని యొంటిగంటకొకసత్రములో దిన్నాము. రాత్రికి గ్రొత్తగ్రహారము చేరుకొని మరునాడు హరిపురంసత్రములో నాగి, యిచ్ఛాపురములో రెండు పూటలుండి బరంపురమునకు జేరుకొంటిమి. బరంపురంకాదది బ్రాహ్మణులపాలి బంగారుపురము. ప్రతిగృహస్థును భోజనముకావలసినవాళ్లు షడ్రసోపేతముగ బెట్టి సంభావననిచ్చు పుణ్యాత్ముడే. అచట ముప్పది రూపాయలు సంపాదించుకొంటిమి. అచటినుండి రసూల్కొండ కేగ దలచితిమి. జాముర్రాత్రి కొకబండి గుదుర్చుకొంటిమి ఆవైపు బండ్ల పట్టెములు మిక్కిలిసన్నములు. ఇద్దరు మనుష్యులుగూడ బండిలో సుఖముగ గూర్చొనజాలరు. గూళ్లుకూడ కడుపొట్టివి. మాపెద్దన్న బండితో ముందుకూర్చున్నచో నరక వెనుకనున్నచో లేగ గనుక సరిగ బండినడుమ మఠమువైచి కూర్చొనెను. మేమిద్దరము చెరియొకవైపున నున్నాము. అది తిరుగుబండి కావున నశికాకు మూడుపావలాలకు మాట్లాడుకొన్నాము. ఇంటలిగట్టు దాటినపై నాల్గుగంజలరాత్రైనది. బండియిరుసు విరిగిపోయెను. ఇంతలావుమనుష్య దేనుగువలె గూర్చుని నాబండి విరిచివేసెనని బండివాడు మొఱ్ఱబెట్టుచుండగా వాని కొకపావలాయిచ్చి, కాలినడకన జాముప్రొద్దువ కొక కుగ్రామము జేరికొన్నాము. అచట సదావర్తి దొరికెను. ఎఱ్ఱటికుండ కఱ్ఱలముట్టె, చింతపండు, మిరపకాయలుప్పు నెఱ్ఱని ముతకబియ్యము తీసికొని వచ్చినాము. కాని వంటమాకెవరికిం జేతకాదు. మాపెద్దన్నయ్యే యెట్లో యొక చెర్వుకడ నాబియ్యమునుడికించెను. ఆ చుట్టుపట్ల తెనుగువచ్చిన వారే లేరు. సగముడికీయుడకని యన్నము కొంచెముగా దిన్నాము. అంత యన్నము భుజించుమాపెద్దన్న యొక చిన్నపట్టెడన్నము మాత్రము తిని నీళ్లు ద్రాగుటకు నాకు దుఃఖము వచ్చెను. ఎండమళ్లినతోడనే బయలుదేరి ఓఢ్రపుపల్లెలెన్నో దాటి ఋషికుల్యయేటి యొడ్డుతోటలో నడిచినడిచి తుదకు మిక్కిలిడస్సి, ఎంతోకష్టమున నశికా జేరుకొంటిమి. అచట మాబంధువొకడు మున్సబుకోర్టు గుమస్తా మమ్మా

దరించి పెట్టినయన్న మిదివరకు జ్ఞాపకమున్నది. అచట నాలుగైదు రూపాయిలు సంపాదించినాము. అచటినుండి రసూల్కొండకు బండి కుదుర్చుకొని పోతిమి. ఆ రసూల్కొండలో మాపెదతల్లియు నా పెభర్తయు నిద్దరుకుమాళ్లు నుండిరి. పెద్దకుమారు డిరువదిరూపాయిలు జీతము పుచ్చుకొనుచున్న స్కూలు మాస్టరు. అదివరకు మాతలిదండ్రులతో నచటి కై దేండ్లక్రిందట వెళ్లియున్నారము. తగినవాని నొకని దర్శించి మేమిద్దర మన్నదమ్ములము పాడుట యేమిచ్చిన నది చేకొనుట ఇట్లచటగూడ పదిరూపాయిలార్జించుకొన్నాము. మాపెదతల్లి నాకొకదుప్పటి నిచ్చెను. మాపెదతండ్రి యొకయుత్తరీయమును రెండురూపాయిలిచ్చెను. మాపెదతల్లికుమారుడు మాపెద్దన్నకు రెండురూపాయిలును కట్టుకొనుట కొకగావంచాలచాపు నిచ్చెను అచటవారముదినము లున్నాము. రసూల్కొండకు దక్షిణముగా నొకచిన్నయేరున్నది. ఊరినడుమ కొండ యున్నది. కొండచెంత మాయన్న టీచరుగానున్న బడికలదు. చిన్న తాలూకా ప్రదేశములలో రసూల్కొండవంటి యందమైన స్థలమే లేదు. అచటినుండి యశికామీదుగా బరంపురమునకు దిరిగివచ్చి యిచ్ఛాపురము మీదుగా ఫలాసకు వచ్చుచుంటిమి. అచట గొంతచెంగటి తోటలో జాము ప్రొద్దునుదయమున మాపెద్దన్న మొలజాలలో దాచిన సొమ్ము నాచేతికిమ్మని యడిగినాను. నీవుపారవైచెదవు నాయొద్దనే యుంచనిమ్మనెను. నేనందు కొప్పక నీవన్నిరూపాయలు హరింపదలచినావిచ్చినగాని యొప్పనంటిని. అందుకు మాపెద్దన్న, పటపటపండ్లు కొరికి, "వినవుగదా! పోనీ పుచ్చుకొమ్మ"ని యెంతశాంతుడోగాని మొలజాలే విప్పి నాకిచ్చివైచెను. ఎంత సొమ్ము దొరికెనో లెక్కించుటకై యామిషవన్ని సొమ్ములెక్కింపగా డెబ్బదిరూపాయిల చిల్లర కనబడెను. లెక్కించుటకై యట్లంటినిగాని మరేమియు గాదంటిని. పిదప పలాసా జేరుకొన్నాము. అచట జయంతి కామేశము పంతులు లేడు గనుక కతిపయప్రయాణంబుల కిల్లు జేరుకొంటిమి.

## హరికథలకంకురార్పణ

స్వభానుసంవత్సరములో నేను మెట్రిక్యులేషను చదువుచుండగా కుప్పసామినాయడను హరిదాసు చెన్నపట్టణమునుండి వచ్చి కొనుకుర్తివారి యింట ధ్రువచరిత్రమును బాడుచాడుచు విన్పించెను. సభ్యులు మిక్కిలి యానందించిరి. కొనుకుర్తి హనుమంతరావు పంతులుగారు హరిదాసునకు సభలో వెండిపళ్లెమందు డెబ్బదిరూపాయిలు పట్టుకండవా యుంచి బహుమాన మిచ్చిరి. సంగీతసాహిత్యవిద్వాంసుడు మిక్కిలి ప్రశస్తముగ నృత్యగీత వాద్యములతో నాటకవిత్ప్రజ్ఞ నగపఱ్చ హరికథ చేసినపుడు జనులిహపరతారకము శ్రీహరికథయని యెంచి మంచివర్తనము కలిగి పండితపామరరంజకుడైన హరిదాసుని మిక్కిలి యాదరించెదరని నాకు తోచినందున నామరునాడే యుపవరకేసంగీతమందును, పురాణముచదువుట యందును, మిక్కిలి యారితేరినవాడనై కొంచెము పద్యములు పాటలు నల్లగల కవితాశక్తి యుండుటచేతను ఇంగ్లీషుభాషకూడ నభ్యసించుట చేతను హరికథలు నేచేసినచో లోకులానందించెదరను ధైర్యముతో ధ్రువచరిత్రమును కొంత నాకవిత్వముతోను కొంత ధూళిపాళ కృష్ణయ్యగారు రచించిన ధ్రువచరిత్రమందలి కీర్తనలతోను ఒక్కనాటికి రచించి ధారణమొనర్చి మారెండవయన్న సీతారామయ్యగారింటిలోను, శ్రీవేణుగోపాలస్వామి మఠములోను, చిన్నప్పటినుండినాతో గవగాబాడుచున్న నానాల్గవయన్న పేరన్నగారు వెనుక పాడుచుండగా విన్పించినాడను. శ్రోతలు మిక్కిలి యానందించిరి.

ఇంతట మెట్రిక్యులేషను పరీక్షకై శ్రీకాకుళము వెళ్లినాడను. పరీక్షలయిన తరువాత నేనొక పెద్దపంతులింట బసచేసి యతనికి ధ్రువచరిత్ర కూర్చుని వినిపించినాడను. పిన్నపెద్దలు సభలో సంతోషించిరి. నాకాపంతులవతారమెత్తించెను. పిదప పేరన్నయు నేను గ్రామునకు వెళ్లినాము. మేనేజరు మాచే దర్బారులో బాడించి యవతారమెత్తించెను, అటుపయిని మేము దేవాదిలోదిగి నరసన్నపేటకు పోతిమి. అటనొక సబ్‌రిజిస్ట్రారు

వినవిచ్చగించి కోవెలలో గధ చేయించెను. అచట సత్కారమొంది రఘునాధపురము జేరితిమి. ఒక పుణ్యాత్మునివాకిట, శీతాకాలము చిన్నపందిరి క్రింద మంచుకురియుచుండెను. ఏకాదశిరాత్రి తెల్లవార్లు బాడి కధచెప్పినాడ నాయన యొక బాణ (5) మిచ్చెను.

క్రొత్తగ్రహారమున సాయంత్రము భోజనముచేసి పలాసకేగినాము. కామేశముపంతులుగా రచటినుండి బరంపురము వెళ్ళిరి. అచటనుండి యిచ్ఛాపురమునకేగి యొకపుణ్యాత్ముని యింట మునిగకాడలు, వంకాయ ముక్కలు వేసిన పప్పుపులుసు, రెండుకూరలు రెండుపచ్చళ్ళతో భుజించితిమి. నిరతాన్నదాత యతడు. కాశికి రస్తావెంటకొలది బ్రాహ్మణులు కుటుంబములతో దిగుచు పోవుచుందురు. ఆయన వారందరికి షడ్రసోపేతముగ నన్నదానము చేయును. అతని యింటి కెదుట నొకతొంబదేండ్ల ముసలి వాడు "చెలియ నీతోపొందు చింతకాయ"యని సారంగిపై పాడుచుండెను. అచటినుండి బరంపురమునకు బోయినాము. మా పెదతల్లి కుమారుడు జిల్లా కోర్టుప్లీడరుగా నుండెను. మమ్మాదరించి యన్నము పెట్టెను. కడుదొడ్డవాడు. నన్నుజూచి "యిన్నివిద్యలకాంబినేషన్" అని సంతోషించెను. బరంపురములో ఒక హరికథ టిక్కెట్టుపై చేసినాము. అప్పుడునాకు హరికధతీరగపర్చిన హరిదాసాయూరనుండి కధకొక యవతారమెత్తుచున్నాడు. నా టిక్కెట్లకు నలుబదిరూప్యములు దొరికియుండును. ఆ హరిదాసుడు నా కధకువచ్చి "చిన్నవాడవుగాని యికముందు గొప్పవాడవయ్యెదవు" అని నాకీర్తనములు కొన్ని వ్రాసి యిమ్మనెను. ఇంతట కామేశము పంతులు ఛత్రపురమునుండియో టొంగడామనుండియో వచ్చెను. కామేశముపంతులు దానకర్ణుడు. చేతికెముక లేదు. మూర బార యొకటియే. సింగపునజరు. ఏడడుగుల వాడాజానుబాహువు. మన్మధసుందరుడు. ప్రొఫిషియంటు వకీలు, వేలకొలది, లక్షలకొలది మృష్టాన్నములు పెట్టించుట దోసిళ్ళతో రూపాయిలు సంభావన లిచ్చుటయు. ఒకప్పుడొకడు పంతులు దయమున కూర్చుండనిచ్చి పెండ్లిచేసుకుందు ననెను. వైష్ణవుడు ఘనమున గొప్పవిద్వాంసుడు.

అప్పుడు నలువదివేలుగల గోనెసంచిలో దోసిలిపట్టి (పంతులు వ్రేళ్లు మిక్కిలి పొడవైనవి. దోసిలి రెండువందలకు తక్కువుబట్టదు) అయిదారు దోసిళ్ళిచ్చి, తుదకు గోనెసంచి పళ్లెమునుంచి యెత్తెను. బ్రాహ్మణునకు రెండుమూడువేలు ముట్టెను. అతడు పదిపదేనుచోట్ల సత్రము లుంచెను. చెన్నపట్టణము మొదలు బరంపురమువరకు బసయిండ్లు. అచట వందల కొలదితో భోజనములు. పదిరూపాయిల జీతగాండ్లు, పదార్గురు సవారీ మోయువాండ్రు, ఇద్దరు వంటబ్రాహ్మణులిద్దరుమంగళ్లు, దేగవలెను నొకమూలనుండి యతని సవారివచ్చుటయు కన్పడకుంటయు నాకస్మిక ములు. రాత్రి తొమ్మిది మొదలు దయమేడుగంటలవరకు ధ్రువచరిత్ర చెప్పినాను. బరంపురమునందలి పిన్నపెద్దలందరు సావధానముగా నాలించు చున్నారు. కామేశముపంతులు నాకథకుబ్రహ్మానంద మొంది "నీవుపళాసకు రమ్మ, పదేను దినములకచట కలుసుకుందాము" అని యానాడే యతడు పర్లాకిమిడెకు బోయెను. పిదప నాళమువారియింట నొకకథచేసినాను. మాటపదార్లు నగదు నొకపట్టుపంచలచాపు నొసగిరి.

బరంపురము వర్ణనము

చల్లనిగాలులకు దలలూచుచు నతిథులను బిల్చునట్లున్న కొబ్బరి చెట్లును, కలువతామరలతో నిండిన బెక్కుకోనేళ్ళును, జనుల జీవన బాహా శ్యము తెల్పు బలుకోవెలలును, ఆస్తికత గన్పరచు మణుగులకొలది కంచుతొడవు నొప్పుచేతుల గిండీలుపట్టి పైవారిదృష్టితాకని కొప్పులతో చూడామణులను ముచ్చెతిలకములును, చెక్కుటద్దముల ముంగురులును, చివురువాతెరలును, మేల్ముసుగుచాటున దోబూచులిడ నీళ్లకేగు వోఢ్ర కాంతలును, జనులకే మాత్రమును చెదరక ఇల్లరికమున్న పడుచునల్లురవలె వీధులవెంబడి యథేచ్ఛగ దిరుగుచు రాచశీవిం గడియకొకయడుగు వెట్టుచు, గృహస్థులు వెట్టుగడ్డి తవుడు మొదలగు విందారగించుచు, దంద్వయుద్ధ ములచే వీధులను జనులరాకపోకల నిరోధించు నాంబులను, నాంబులవలె దలిదంద్రులకు లక్ష్యము నేయక బడికినామముబెట్టి మసాలాఖిల్లీలు బుగ్గల

నమర్చి త్రోవల న్వసంతమువలె నుమియుచు దిరుగు కోడెగాండ్రును. నీగలు ముసురుచుండ, చెంగట కుక్కలల్లాడుచుండ పలురకముల తిను బడివస్తువులుగల కజ్జెపుదుకాణములును;

బంగాళాకులు, దేశియాకులు. ఖారాకొంత మీఠాకొంతయు మసా లాతో గడియగడియకు వందలకొలది ఖిల్లీలువాను బీడాదుకాణదార్లును, లయతప్పక తలలంటు వడ్డెమంగళ్ల కరతాళధ్వనులును, కామముమూర్తీభ వించినట్లు మెరుపు దృష్టులతో నరచాటుగ దలుపుసోరలనుండి నటించుచు యగుపడీయగపడనట్లు వింతనగవులందోచు కామయుద్ధవిశారదలగు వెల చేడియలును, ముప్పిరిగొన్న యవయవంబుల కందమురెట్టింప దలలనెంతో భారముమోయుచు నడుచుగంపకూలీలును;

తమయొడళులకాంతులు దిక్కులను వెన్నెలలు గాయ చిన్నజంతు వులయ్యును మిక్కిలిచురుకుగ బండ్లతో బర్విడుగిత్తలును, ముంపుగా ళ్లకు బందముతో కుప్పిగంతులు పెట్టుచు, పెంటుల వెంటాడుచు వానితా పులం దలవాయ దినుచు, నెగురుచు బర్విడు కంచరతట్టులును, నేల యదర నడుగువిడుచు, హీనవర్ణముల కోసరిలుచు బరువుకావిళ్లతో బర్విడుచు వచ్చు గంగాధరులును, వడ్డిమంగలి సొగసుగ జల్తారు పట్టెలగుపడునట్లు పింజెపెట్టిన వాణీలు భుజముల నొప్ప దలలం బాగాలు మెరయ గుఱ్ఱపు బండ్లనేగు భాగ్యవంతులును, అద్దైకై యరవలేడ్చునట్లు కూలికై వీధులం బడి చీవాట్లుదినుచు మొగముపై నుమిసినం దుడుచుకొనుచు, పరమత ముల దూషించుచు, బొల్లిచేతులు పిల్లికనులు ద్రిప్పి యభినయించుచు, వచ్చీరాని భాషలతో నుడువుచు, దేవుని కొడుకొకడే రక్షకుడని తరుచుగ కూటికక్కుర్తిచేగాని, వివాహసౌలభ్యమునకుగాని తమలో గలిసిన ఖుంతల వెంటనిడుకొని యక్కరగాని మొఱ్ఱవెట్టు క్రీస్తుమతబోధకులును;

తమ యిష్టానుసారముగ దమకేలను ద్రిప్పుచు హైకోర్టులాయర్ల కన్న నెక్కువగ సబబులు చెప్పుచు బార్టీలను దడుముకొనుచు, దమ

యజమానులకన్న నెక్కువయసులు చూపు ప్లీడరుగుమాస్తాలును ముందు ప్యూనులు జనులనోసరించుచు లాంతరుగొనినడువ, పగలు పన్నెండు రాత్రి యేడెనిమిదిగంటలవరకు డస్సిడస్సి సేవకులయ్యు యజమానుల వలె డాబుచెలాయించుచు వేతనముకన్న నింటిఖర్చు పదిరెట్లయ్యు నైదా రేండ్లపిదప నేబదివేలకుబైగా రొక్కమునిల్వ. భార్యకు మోయగలిగినన్ని నగలు, భూస్వాస్థ్యము. ప్రశస్తమైనలోగిలి. పిల్లలకుబాపలకు బరిచారకులు, వంటబ్రాహ్మణులు నౌకర్లు, వచ్చిపోవుచుట్టాలతిధులు, గుఱ్ఱపు బండ్లు, హరిదాసు, భజన. దేవతార్చనవాడు, సత్యము పౌరుషము హృదయమునందును: మోమునందు లజ్జయుతప్ప, తక్కిన యైశ్వర్యములన్నియుగల ఉద్యోగులును; ఉదయముతోనే స్నానముచేసినట్లు నటించుచు వంగమూడికవలె బిలక ఝాడించుచు, విభూతిపట్టెబెట్టి, ముష్టిచెంబులు కొందరు, పంచాంగములుకొందరు, ధర్మశాస్త్రములుకొందరు, బురాణములుకొందరు. దర్భకర్రలుకొందరు పట్టి పూర్వాచారములను బోధించుచు, దమపవిత్రత నుగ్గడించుచు, డబ్బునకై యెట్టికక్కూర్తియైన బడుచు, గోడమీది మార్జాలమువలె సమయోచితముగ నడచువైదికులును;

కొన్నవారికన్నము కూరలిచుచు. గడియగడియకు గురుకటాక్షము నందుచు యజమానులంగూడ చీటికిమాటికి గోపబడుచు నధికారము సేయు పాచకులును ఉద్యోగములుసేయ నర్హులమని తమకున్నసర్టిఫికేట్లు చూపుచు, నధికారులదయ సంపాదించుకొనువారలంబోలి మొండిచేతులు, పొట్టికాళ్లు, గ్రుడ్డికనులు. ముసలివయసు నగుపర్చి యడిగికొను ఖైరాతీలును; రానినవ్వులు, లేనిసొగసులు, దొంగవలపులు గన్పర్చుచు బలవంతపుసంగీతమునుదీయు వెలబోంట్లను. చాటున గడుసు బాజాలును, పసపునూనెయు బూసికొని ముక్కి దుక్కబట్టలతో మునుగుచు, నీరు పసరుముద్దగజేసి. గొట్టాలమ్మంగోరిపిలిపించుకొను నొద్దెలును. న్యూసెన్సుకేసులు మిక్కిలి చురుకుగా బట్టుకొను కానిస్టేబులును, వర్తకమునందలి యనృతదోషము దానధర్మమునను ధర్మశ్రవణములను దుడిచికొననాసించు

బేహారులును, వదలరాజువలె సుకుమారముగా బెరుగుచు, విరాగులనడుమ
గూఢసంచారముసేయు మహంతిమఠమున జెవులకు విందొనర్చు పలు
రంగులపిట్టలును, ఎడతెగక తీయనినీరందిచ్చు చేరువునూతులం దోడుచు
ప్రతియింటిగుట్టు బయటపెట్టుచు బ్రహ్మచారులతో నెగసక్కెములాడు
వంటలక్కలును, తప్పుసాక్ష్యంబుల బన్నుచు నాకాళరామన్న యర్జీలు
వ్రాయుచు మూఢులగు పల్లెటూరివాండ్రకు కలహములు కల్పించి పిల
కలుముడివెట్టుచు పొదివలె జంకను రుమాలింప గట్టబడిన కాగితముల
దస్తరము చెవిసందున గలమును కాకిచూపులును నధికారి యెదుటబడనీయ
కున్నను పైనుండి తాళహంగుజేయు చెట్టుక్రింద నమలువలాయించు
పై)వేటువకీళ్ళును: "అర్ధరూపాయివకాల్తీ సావలాపలంట్రీ సాక్షిబత్తెముబు
పదుకొండురూపాయిలయేడ్పైసలది పట్లీకుకదా కేసుగెలిచిన పైగట్నము
నీయిష్ట" మనుచు డస్కబల్ల తివాసితో దుకాణముపర్చి కూర్చొను ప్లీడరు
చుట్టు మూగి "మాగడ్డి మేము కరచుకొన్నామిక యెన్నటికిట్టి తంటాలకు
రా మిదెక్కడి న్యాయమయ్యా యిన్నివాయిదాలువేసిన సంసారులము
చితికిపోమా" యను పార్టీలును- సాక్ష్యములు చెప్పుచు డబ్బుసంపాదించు
కొనుటయే జీవనోపాధిచేసికొని ప్రతియధికారిచే చీవాట్లుతినుచుండియు లజ్జ
దొరగి తగుమనుష్యులవలె దిరుగు దుష్టసాక్ష్యులును- పలువురు బంట్రో
తులు తన్ను సేవింప బడాయిచూపు నాజర్లును- పన్నెండు జీతముగాని
తమయుపాయవైభవముచే నెలకు నూర్లు సంపాదించుకొను ఆమీనాలును-
అధికారిదయ కాపించి వారియొద్ద నష్టమైనచాకిరీలు సేయుచు తగవులు
దిద్దుచు డబ్బు సంపాదించుకొను కమిషనర్లును- డబ్బులదుకాణమువలె
ముద్రలమ్ము వెండర్లును— పులుమర్తి నారాయణా, వడ్డి గురవడు, మాల
యచ్చయ్యా, కుచ్చర్లపాటి సీతారామరాజు, ఆకుల బైరాగి, దీనబంధు
పట్నాయుడు, చాకలి వెంకా, కొడవంటి బుచ్చెన్నశాస్త్రి, మంగలి యెల్లిగా
బులుసు వెంకటసోమయాజులు, బారికి పోలిగా వడ్డాది పేరిదీక్షితులు" అని
పొలములో పిట్టల బెదిరించువారివలె నరచు కోర్టుప్యూనులును - వరుసలు

గట్టి యతిత్వరితముగ విస్తళ్ళుకుట్టు కలింగోమిటియేవచలవలె మోపెడేసి కాకితములు వ్రాయుగుమాస్తాలును- కోర్టుభాష తెలియక యేతెల్వితేటలును లేక మమ్మీలవలె గూర్చొని తలలాడించుచు దమతగవరితనమునకుబ్బు నసినర్లును- అవ్వాకులో చెవ్వాకులో పార్టీలను సంతోషపెట్టుటకై గబగబ మాట్లాడుచు నొండొరులయుక్తులన్నీరుచు దోషావిష్టులై వాదించుచు గుంజీలుతీయు ప్లీడర్లును- పాటకునిచెంతనున్న యుమ్మెత్తిగానివలె నధికారికి సహాయపడు బెంచిక్లార్కులును, — చేయి పీక దస్తరములకొలది వ్రాయుచు నోరునొవ్వ మాటాడుచు చెవులు చెవుడెక్క సందర్భముకొంత యసందర్భమంతకునూరురెట్లుగ వినుచు జాములకొలది ఖాయిదాదుకాణపు వర్తకునివలె కూర్చొని కదలక తల కాళ్లు చేతులుమాత్రము ద్రిప్పుచు అధికారము జీతముమాట దేవునకెరుకగాని యాయమచర బెంచిపైనుండి దిగి యెప్పుడు బైటికూడిపడుదునురా దైవమాయని పాతవారును, క్రొత్త కాపురపుపడుచులవలె, యెంతోవేళవరకు బైకిరాని నవీనులునగు న్యాయాధికారోత్తములును. - బండ్లకుగట్టబడి దేవుడు మొలిపించినగడ్డి మేయుచు దేవుడిచ్చిన నీరు ద్రావుచున్న మనకేమీగ్రహచరమయ్యో! పరువుమాలిన వారిని కూటసాక్షుల నుబ్బరదిని గాదెలవలె బలసిన సోమరిపోతులను కురూపులను మరియు నడ్డమైనగంపువట్టిన యీదుష్టరోగభూయిష్ఠ మానవుల మోయ వ్రాసితోపాడువిధీ! యని నెకిలింపుమిషల నేడ్చు బండి గుఱ్ఱములును, - రండురండిట్లో మీపాటు కుక్కలొల్లవు మీదుంపతెగ నిసుమంతయైన గనికరములేకెండలో మమ్ము తగిలికగిలి కొట్టెదరు లెండులెండు మీదిక్కుమాలిన బరువులు మాపై మోపుడు అపరాధరహితుల మొరులజోలి పెట్టము దీనజంతువులము మమ్మన్యాయముగ బట్టికట్టి బాధించెదరా జంత్రములులేవా? మతిలేదా? మీకు గాల్సేతులులేవా? మాకు బుట్టకమానరు చేసినదికుడువకతీరునా? యని తలలూచు నెడ్లును, చలువ నీడ లొసంగు చెట్లనడుమ దుర్జనసంచారమునకును సహింపనోపనట్లు పెంధూళి వేడినిటూర్పులుచ్చు రోడ్లును. - కూతురకూతురకూతురాయని

పుణ్యభూమికన్యకం బిలుచునటులార్చు మొదటి బిగులునకు ద్రస్సులం దుపాకులు సవరించుకొని లయతప్పని జోళ్ళచప్పుడుతో నాకసంబునందు పగటిజాము ప్రొద్దున నానావిధముల గుంపులు గట్టుచు పడబడుచుండు నెత్తి గౌటులవలె నిజమైన భయభక్తులతో ప్రతిక్షణము మృత్యువున కెదురేగుచు సర్కసులోని జంతువులవలె కూటికై విద్దెలాడుచు దిన్నదిండికి దగుకాయ కష్టముతో దక్కినవారివలె వివిధమనఃపీడలెరుగక ఖాయిదాతప్పక నడుచు శిపాయిలును, - మరియు బలుతెరంగుల నొప్పు నప్పట్టణమునం బడుచు లంగని బోరవిరచి బోరచూపులుచూచుచు, నూత్నయౌవన మదంబున నెట్టి వారినైన నలక్ష్యముగ గనుచు, గడియగడియ కద్దముచూచి కొని గేరా దిద్దుకొనుచు సిగకు బూలుముడుపు కనులకు గాటుక మెడలో బూలదండ. మొలకు బట్టుధోవతి కాళ్లకుగజ్జెలం చేతుల జిరుతాళములు ధరించి గావుకే కలువేయుచు నందరిని హాస్యములు నేసి వెక్కిరించుచు పిట్టకధలచే బామ రులను సంతోషపెట్టుచు శివాచారివలె గోలబెట్టి దిరుగుదాసునిరీతి పోతు పేరంటాలపోల్కి, సానిపాప కైవడి శృంగారరసమును, శక్తిహీనునిభంగి మెట్టవేదాంతమును. ఆపన్ననిగతి భక్తియుం దెలుపుచు హరికధల జెప్పుచు నొకనెల యచటగడిపి పళాసకుబోయినారము. నావయసప్పుడు పందొమ్మిదేండ్లు.

## పంతులు స్థితిగతులు

పలాసాలో కామేశము పంతులు మమ్ముల నిరువురం జూచి "వచ్చి నారా యక్కన్న మాదన్నగార్లిద్దరు రండి" అని యెంతో యాదరించెను. ఆయనకు పెద్ద భార్యయు చిన్నభార్యయు నొకసానియుం గలరు. ఆ సాని నన్నుండవాత జాడ్యమున ననుగ్రహించిన యాపె పెద్దమ్మకూతురు మిక్కిలి చక్కనిది, అనటి మోవువంటి తెలుపు నాణెము త్రైముల ధాళధ ళ్యమును సొగసైన చిన్న కన్నులు, కొంచెము చప్పి ముక్కు నింద్ర నీలములబోలు కురులు కలది. యాపెవయ సిరువదియైదేండ్లై యుండు.

"నాతిస్థూలా నాతికృశా నదీర్ఘా నచవామనా" యను శ్లోకలక్షణము నకు సరిపడియుండెను. పదివేలరూపాయల ధమధుగా విలువగల నగలాపెకుండెను. వెలచేడియ యగుటయు నంతవాని ప్రాపకమున నుంటయు నాపెసౌందర్యమునకు వేయిరెట్లు మెరుగు దెచ్చెను. ప్రన్నెకాడను చాటకాడను వేసగాడను క్రొవ్వాడివయసు వాడను గనుక మొదట నాపెజూచిన సొలపు చూపు లిదివరకు ములుకుల వలె నెడదను నాటి యున్నట్లు భ్రమించు చుందును.

పంతులు పెద భార్య కొకప్పుడు కనులు జబ్బుచేసి నిమ్మళించకున్నవి. అపుడు పంతులు తల్లి యతనితో "నాయనా! నీ భార్య షుమారు గ్రుడ్డిదైపోయినది, యింకొకతెను బెండ్లాడు మనె నంత ఆయన "అమ్మా! నేను గ్రుడ్డివాడనైనచో నాపెకింకొకని పెండ్లి సేయ వచ్చునా? యని బదులు చెప్పెను. అంత ధర్మాత్ముని మది విరిచి యతని వెలయాలి యతనికిని బెద్ద భార్యకు నన్యోన్య సంపర్కైన సంభాషణములైన లేకుండ నింద కల్పించి వేసెనట. ఔరా వెలయాండ్రెంతకైన దగుదురు. అతని రెండవభార్య యప్పటికి బెద్దపడుచు కాలేదు.

మేము చూచినప్పటికి పంతులు వర్తకములో మిక్కిలి నష్టము పొంది యాస్తికిదగు నప్పులతో దులదూగు చుండెను. వేయిరూపాయలకు తక్కువ ఫీజు పుచ్చుకొనకుండుటచే నతని ప్రాక్టిసితరులకు బోవుచుండెను, ఎటువైపు చూచినను నష్టమేకాని లాభము దోచకుండెను. వేలకొలది కుక్షింభరు లతని జుటుకొని యుండిరి. ఇందరి పోషణ మొకవంతును దనభోగ మొకవంతు గనుక నందరికి దగుధనాదాయమునకు దగుదారి పొడగట్టకుండెను. తనకంటె నెక్కువ సమర్థుడగు తమ్ముడు కాలము చేయుటచే గోలదాకిన సింహమువలె శోకహతుడయ్యెను ఆశోకము మట్టుపడునని యుపదేశించిన దుష్టుల యుపదేశమున నదివరకే రెండేండ్లనుండి పెద్ద గురున కలవడియెను. ఆయలవాటు మితిమీరెను, వేలకొలది నిచ్చు వారికి వందలు. వందలవారికిపదులు, పదుల వారికొకటియు నిచ్చుచుండెను.

దానము మానలేదు. తన భోగము వదల జాలడు. రాబడి బొత్తిగా దగ్గి పోయెను, అప్పటికతని వయసు ముప్పదెనిమిదేండ్లు. తమ్ముని శోకము ధననష్టమునకు మనఃక్లేశమును. పెద్దగురు నియమిత కటాక్షము చేత దేహ పీడయు, గలిగెను. కాని సంపూర్ణానందమే యతనిమోమును సంతత మలంకరించెను.

కామేశము పంతులు సంస్కృతాంధ్రముల ప్రశస్తముగ కవిత చెప్పగల దతడొనర్చిన జానకీవరశతకము రామశతకమును ముద్రింపబడి నవి ఇంగ్లీషున వోఢ్రమున మేటిపాండిత్యము కలదు. లాయదు మిక్కిలి నిపుణుడు. రామరామయని యహోరాత్రములు నిదురనైన సద్వేళ్లపై వ్రాయు చుంట యతని యసాధారణప్రజ్ఞ. శ్రీరామభక్తాగ్రేసరుడు. మేటి యంతర్ము ఖుడు. ఒకప్పు డొకరాజు కోపము వచ్చి పంతులును ఫైసలు చేయుటకై యడవిదారిలో నలుపది మందిని కాంపుంచెను. చేత రివాల్వరు మొలను వాల్గత్తితో గుఱ్ఱమును బరుగెత్తించుచు వచ్చుచు దారికడ్డుపడిన రాజభటు లతో "మీరాజును బౌరుషమున్న రమ్మనుడు. మీరేయూరక చచ్చిపోయె దరు." అనుచు బోవుచున్న నెద్దియు దోచక రాజభటు లూరకొనిరి. అంత సాహసవంతు డీమచ్చట నాకతడు స్వయముగ జెప్పెను. అభీష్టభోగంబు లనుభవించి సంసారము నిస్సారమని యెంచినయతని యంతస్సార మింతం తయని వాకొన దరముకాదు. తృణీకృతపురందరుడగు జయంతి కామేశము పంతులును బోలిన పౌరుషజ్ఞానకీర్తులు కలవా డెందైన నల్లేడిది నిశ్చయము

ఛత్రపురములో నొక గొప్పయుద్యోగియింట వివాహము

పలాసాలో దనసాని వినుటకై యొక హరికథ నాచే జేయించెను. నే నమర్చుకొన్న దొకధ్రువచరిత్రమే. యెచట జేసిన నదొక్కటియే చేయుచుం టిని. ఛత్రపురమున నొకగొప్పవాడు వివాహము మనుమరాలికి జేయుచు పంతులకాహ్వానము బంపెనందుకు మమ్ముగూడ దోడ్కొని ఛత్రపురము నకు బంతు లేగెను. పంతులు నన్ను దనబండిలో గూర్చుండ బెట్టుకొనెను.

సంస్కృతమున దెనుగున నింగ్లీషున నతనికి వచ్చిన ప్రస్తావనలు లక్ష లను కొనెదను. పెండ్లి పందిటిలో భోజనమునకై కూర్చుంటిమి. గొప్ప వారు కొద్దివారు మొదలుగ బ్రాహ్మణులందరు భోజన మారంభించిరి. ఆ పెండ్లిపెద్ద కొందరు గొప్పయుద్యోగస్థులు వెంటరాగ బంక్తుల వెంబడి దిరుగుచు బదార్థములు తినక విడిచివేయువారలను శిక్షింతునని బెత్తముబూని గద్దించుచుండెను. "ఏమి తాతగారు! ఎందరిఫొటోలో దెప్పించి దేశదేశమంతయు వాడివడపోసి తుదకు "దొంగిలింపబోయిన మంగలము దొరికె" నన్నట్లె క్రోతినా నాకు బెండ్లిచేసితిరి" అను మనుమ రాలి మాటలకు వచ్చినకోపము భుజించువారిపై జూపునతని వైభవము గాంచి యతడు మా పంక్తికి వచ్చినతోడనే "వంకాయముద్దో, వంకాయ ముద్దో" యని కేక వేసితిని. అపుడొకడు వడ్డించువాడు రెండుపట్టెళ్ళ ముద్ద నాయొద్దకూర్చున్న కామేశముపంతులు వంటబ్రాహ్మణుని విస్తరిలో వైచెను. ఇంతట సమీపించిన ముసలియజమానునితోఁ "జూచితిరయ్యా! యెంతముద్ద దిగద్రోయుటకు వేయించుకొన్నాడో" యని కొండెముబల్కి నాడ, అందుకు కోపమువచ్చి, 'ముద్దపారవేయనీ తన్నెద' ననెను. పంతులు వంటబ్రాహ్మణుడు మాపేరూరిద్రావిడిగనుక, యిదిగో పార వైచినాడ నేమి సేయగల వనెను. అందుకావృద్ధుని చెంతగల ఉద్యోగి కొట్టబోయెను. పంతులు బ్రాహ్మణుడుకూడ చేయెత్తి వానిని జరువబో యెను. అపుడు కొంతగడబిడ జరిగెను. పంతులు మొదలగు గొప్పవా రందరు మాకు కొంతదూరములో భోజనముచేయుచు నల్లరినివారించిరి. అర్థ, పావలా సంభావనమిచ్చుటకు బెండ్లిపెద్ద నిశ్చయింపగా పంతులు రూపాయికి దక్కువయివ్వరాదని సలహాయిచ్చినను బెండ్లిపెద్ద యంత కెక్కువ యివ్వననెను అందుకు బంతులసహ్యపడి బరంపురమునకు మమ్ములను వెనక దమ్మని, సవారీలో గూర్చొనిపోయెను.

ఒక్క రాత్రికి అంబరీషోపాఖ్యానము రచన

మరునాడుదయమున నొకగొప్పయుద్యోగిని జూచుట కతని కొక



సింహసంహననుడు

" కమలకు రక్తిరాజు కళలకు రేరాజు
వడగెత్తైంది ఆవిర్భుష్టి పోజు "—యస్వీ



మైసూరు దర్బారు సన్మాన సందర్భము

" గంధసింధురమ్మపై గంధ సిందుర మొందు
కొల్వుదీరిన యట్టి చెల్వుచూడు "—యస్వీ.

గొప్పవాడిచ్చిన సిఫార్సుత్తరము బట్టుకొని మేమిద్దర మేగితిమి. గడచిన దినము భోజనములయొద్ద జట్టీలోనున్న నన్నొయుద్యోగి కనిపెట్టి, యెవరు నీవనెను, అందుకు హరికథ చేయువాడ' నని యంటిని. అపుడు కోప ముతో 'బోపో, భోజనముకడ నీ హరికథచేయు' మనెను. అందుకలిగి, 'ఇదిగో యీ సిఫార్సు మీకుఁదెచ్చినాఁడ"నని యతనియెదుట పత్రుగ నుత్తరము జిన్నవాడనగుట జింపివైచి, మళ్ళీ పెండ్లిపెద్దయొద్దకు వెళ్ళి హరికథచేయించు మనగా, రాత్రి నాకథ పెట్టించెను. ధ్రువచరిత్రమును జెప్పినాడ నందరును సంతసించిరి. కాని, పెండ్లిపెద్ద నాయొద్దకు వచ్చి "యింతసొగసైన కవిత్వము గుంటడవు నీకెట్లు వచ్చును ? ఇదెవరో మీయూరం జేసినారనుకొనెద నీవే కవిత్వము చెప్పగలవాడవైనచో నంబ రీషచరిత్రము నాకొడుకున కిష్టము. కవిత్వముచేసి విన్పించగలవా ? నీకు ఐదిదినములు గడవిచ్చినా'' ననెను, అందుకు చిత్తమని యొకగృహస్థు నింట రాత్రి భోజనముచేసి పెన్సలుతో తెల్లవారులు వ్రాసి చరిత్రను ముగించి ధారణచేసి యుదయముతోనె పెండ్లిపెద్దయొద్దకేగి 'యయ్యా అంబరీష చరిత్రమును రచించితిని. నెలవైనచో నిపుడు పుస్తక మక్కర లేకుండ వినిపించెద''నంటిని, అందుకాశ్చర్యపడి యత "డిదిగో తొమ్మిదిగం టలకు కలెక్టరు నతనిభార్యయు వచ్చెద రపుడు నీ హరికథ విన్పించుము" అనియె. వెంటనే చద్దితిని హరికథ ప్రారంభించినాడ, కలెక్టరు మొద లైనవారు శరవేగమున మాట్లాడు నాధోరణికి నాపాటయాటలకు మిక్కిలి సంతోషించిరి. పిదప సాయంకాలమున నన్పిలిపించి యావృద్ధుడు ఇదుగో నలువదిరూపాయలు నీకు గట్నమిచ్చుచున్నా" ననెను, అపుడయ్యా యిట్లొకరాత్రి కొకచరిత్రమును యక్షగానముగా రచించి ధారణచేసి పుస్త కము నపేక్షింపక వినిపించుట మిక్కిలిదుస్తరము. మీబోటి లక్షాధికారు లిట్లు నాచే చరిత్రము రచింపించి నావలన బాటయాటలు చిత్తగించి యింత చిన్నచూపు చూచుట భావ్యమా ! యంటినందుకు కోపముతో "బుచ్చు కొన్నబుచ్చుకోలేకున్నపొపొమ్మ" నెను "మరి ధన మార్జింపజాలరు కడు వృద్ధులు, పెండ్లిఖర్చునకు మీరే యుంచుకొండ"ని బసకు దిరిగివచ్చితిని.

ఊరిలో బలువు "రాపెండ్లిపెద్ద యంత కష్టపెట్టించి చిన్నయిూవి నిచ్చుట తగదవిరి,

## లోకనాధమను గ్రామములో అవధానములు

మరునాడాయూరిలోని కొందరుతగుమనుష్యులు లోకనాధమను చెంగటి గ్రామముదేవాలయముదాపున వనభోజనమేర్పరిచి మమ్మునుగూడ బిలిచిరి. ఉదయము తొమ్మిదింటికి బైలుదేరి పదింటికాలయము జేరితిమి. నడు దారిలోపొలములు దాటి గంజాముననదియొడ్డున నిసుకతిన్నెలపై నొకప్రశస్త మైన మామిడితోటలో శివకోవెలచెంత బసచేసినాము. ఆదేవాలయము చెంత నొకడు ప్రాయోపవిష్టుడై యుండెను. ఇదివఱకిరువది దినములనుండి యన్నపానములు లేకుండెను. గానచూపు నూపిరి మాత్రమేయుండెను. గాని వానికి మరేతెల్వి లేకుండెను. వానికొకకఠినవ్యాధి కలదట యదికు దిరినచో నట్టి ఘోరవ్రతము చేసెదనని మ్రొక్కుకున్నాడు. మరి మూడు రోజులటుజీవించినచో నావ్రతము సమాప్తియగునట.

అచట నాచేత నవధానములు చేయించిరి. అనగా ముప్పదిగంట ముల కొక్కొక్కచరణముగా గోరిన పద్యములు కవిత్వము చెప్పుటయు ముప్పదిరెండక్షరముల వ్యస్తాక్షరీ చేయుటయు, నోట నొకచిన్నలెక్క కుత్తరము చెప్పుటయు. బూవులు లెక్కించుటయు, నిషేధాక్షరి చెప్పు టయు, సంభాషణము నేయుటయు కోరినరాగములపై బురాణము చదు వుటయు. గంటలు లెక్కించుటయును, అష్టావధానము జురుకుగాను సరిగాను నెరవేర్చుట కచటివా రానందించి తమలో దాము చందాచేసికొని ముప్పది రూప్యము లొసగిరి.

పిదప సాయంకాలము బరంపురమునకు బండి మాట్లాడుకొని పోవు టకు సిద్ధపడినాము. అప్పుడు పేరన్న నాతో "నోరీ ! ముసలివాడు. నలు బదిరూకలుకంటె హెచ్చివ్వడు, వానివద్ద నాసొమ్మెలవిడువవలెను! వానితో నిక వియ్యమందబోముకదా ! నేబోయి తెచ్చెదను" అని యాపెండ్లిపెద్ద

వృద్ధుని కడ కేగగ "నీవెందుకు వచ్చినావు, వాడేడీ యనగా 'వాడు నన్ను బంపించెను" అనెను. అపుడావృద్ధుడిరువది రూప్యము లొసగెను,

పిదప మేము బరంపురమునకు వెళ్ళి యటనుండి పళాసకు బోయి కామేశముపంతులుతో సర్వేపనిమీద బోవుచున్న గ్రామములకు బోవుచుంటిమి. లమిడీపిల్లి యనుగ్రామములో నేను బంతులనని సవారీలో గూర్చుని సవారీవాండ్రు సవారీమోయుచుండ బంతులు నాయొద్ద గుమాస్తా వలె సవారీతో నడచివచ్చుచు నేనడుగులెక్కలు చెప్పుచుండుట యట్లు విలాసమొనర్చితిమి. కోటిపిల్లి యనుగ్రామమున పంతులు నేను గలసి యేబదిగంటములకు చెరియొకపాదముచొప్పున నేబదిపద్యములు కవిత్వము చెప్పితిమందులో నొకపద్యముదాహరించెద.

శా॥ నాళీకంబుల గేరుకన్నుగవ సన్నల్చెల్వు వాటింపగా
శ్రీలింతేసిపసందె చూత్తమనుచు న్జెన్నారు చందోయిపై
గాలిం బయ్యెద దూలగా జనులు దగ్గాంక్షించి వీక్షించగా
గాళింగాంగన జెర్వుజేరు హాయలుం గంటి న్మనోజ్ఞంబుగా॥

ఇందులో విషమచరణంబులు నేను సమచరణంబులు పంతులును జెప్పినాము,

పంతులుకు రఘునాధపురముచెంగటి తలగాంనివాసు డొకగొప్ప నాయుడు మిత్రుడు గనుక తలగాములో మూనాళ్ళుంటిమి, ఆ నాయుడు క్రొత్తగా నిల్లు కట్టించినాడు గనుక నా గృహప్రవేశమునకు నాచే నపుడు హరికథచేయించెను, పిదప బంతులవర్తకస్థలమైన పూడికి వెళ్ళినాము, నూటయేబదిమంది పంతులుతో నుండిరి, సముద్రతరంగములు హాయిగ నీటితుంపురులు జిమ్ముచుండ నొడ్డునిసుకదిబ్బ వెన్నెలసంజకడ చిన్నగురుడు పంతులు మొదలైన మాబోంట్లు నూర్వురకు పూడింటనుండగా హాయిగా గొంతయానందించి ఉదయమెక్కించిన యల్లిపాయపులుసుబాన యదివరకుడుకుచుండగా గట్టుపద్యములు చదువుకొనుచు బాటలుపాడుచు

కథలు ముచ్చటలు చెప్పుకొనుచు అన్యోన్యము హాస్యములు సల్లాపములు చేసికొనుచు ఎనిమిది గంటలకు మొదలుపెట్టి పన్నెండుగంటలవరకు భోజనములు సేయుచుంటిమి. కామేశపంతులవశమున నెందరో యాజిల్లా లోని రాజులుండిరి. కావున పంతులుండిన యడవి పట్టణముకన్న నెక్కు-వుగ శోభిలుచుండెను.

సుబ్బమ్మపేట యనుగ్రామమున విష్ణుకోవెలలో వైష్ణవులు తయారుచేసిన వివిధములగు మధురపదార్థము లొకనాడు తిని యాదినము పంతులు మొదలు పరివారజనమందరము ద్వాదశోర్ధ్వపుండ్రములు ధరించి హరికథాకాలక్షేపము చేసినాము. నామధారణమున మాకున్నకళయేవైష్ణవులకైన లేదని యచటి వైష్ణవులు ఉగ్గడించిరి పిదప నభీష్టభోగంబుల రాత్రి గడపినాము.

పంతులకు బెద్దగురునియెవాటు మిక్కి-లి కలదుగాన శ్రీకాకుళము నుండి యాసామగ్రి వచ్చుచుండెను. అదివరకు రెండు సంవత్సరముల క్రిందట విజయనగరములో బెద్దగురునికటాక్ష మొకసారి కొంచెము పొందియున్నాను, నాడు శివరాత్రి, యొకమిత్రునియింటికి బోయినాడను. అతనితల్లి తనకుమారునితో వచ్చిన జట్టుదారులను తన కొడుకులకన్న నెక్కు-వ ప్రేమగా జూచునది. చిన్నతనముచేత యథేష్టముగా సంచరించి రాత్రిబడలికతో భోజనము మరచి నిద్రించు తన కొడుకుస్నేహితులను లేపి కన్నతల్లికన్న నెక్కు-డు ప్రేమతో గడుపార భోజనముపెట్టినది. నాకెన్నోమార్లట్టు సంరక్షణ మొనర్చెను. కావుననే యాపుణ్యాత్మురాలు కడుపుశోకమెరుగక స్వర్గస్థురాలయ్యెను. ఆ చెలికాడు నేనును జోడుగ గలిసిమెలసి దిరుగుచుఁ బాటసాధనము చేయుచుందుము. అతడు నేను నాశివరాత్రి కొందరితో గలిసి పెద్దగురుకటాక్షము పొందినాము. ఇపుడు రఘునాథపురములో పంతులు వన్నుగూడ బెద్దగురువులో వంతు కలిపెను.

అపుడాయూళ్ళో గొట్టాలమ్మ వేంచేసి యున్నది. మాబసలోనే యొకడు చచ్చె నింకొకడు చావసిద్ధముగ నుండెను. అపుడు క్రిందకొరిగి గురుకటాక్షమున పరవశుడై పరిపూర్ణదశలోనున్న పంతులతో "నయో" యొకడు చచ్చె నింకొకడు చావసిద్ధముగనుండె నిట్లు కలరా చెలరేగెను మీ రిట్లున్నారని యతని కన్న నెక్కువుగ బెద్దగురుకటాక్షమొందిన నేన నగా నతడు నన్నిలిచి యోరీ యీలోకము మనఃకల్పితముగాని వాస్తవము కాదు. మనోజేతల కాత్మకన్న వేరు లేదుసుమా యెందుకట్లు జంకెదవు" అనెను. అతని ధైర్యమాజ్ఞానమాత్యాగభోగము లాయుదారత యారస జ్ఞత యాదైవభక్తి దేవతలకైన నుండునా యని శంక వొడుమునపు డతనితో మానవులన నేపాటిసాటి? అటనుండి పర్లాకిమిడెకు బోయి నారము, ఖావుసోళా యనుచోట పంతు లొకకంచములో నాతో భుజింప వేడ్కపడెను.

పర్లాకిమిడెలో సబ్ మేజిస్ట్రేటు కచేరీకి నన్గూడ దోడ్కొనిపోయి యింటికి వచ్చినపై నన్జూచి నీవుకచేరీలో జూచిన చిత్రమేమో చెప్పుమ" నెను. అందుకు "నేకాక్షిద్రితయ మొక్కచో బొగయ్యె" నంటిని. బాగుగ జెప్పితి విదిగో యీ సబ్ మేజిస్ట్రేటీప్లీడ రితనికుక్క నీవుచెప్పినట్లై యొకచో నెట్లుసమకూడిరో, నాకు తోచినచిత్ర మిద్దియె యాహా కవిగాన నిచో రవి గాన నేర్చునే" యని యనెను. అచట నాకొరకై సింహల లాటములు చేయుటకు కంసలిని నియమించి పంతులు బరంపురమున కేగెను. మేమచట సబ్ మేజిస్ట్రేటుగారియొద్ద రెండుకధలు చేసి యెను బది రూపాయిలు సంపాదించుకొని బరంపురమునుండి తిరిగివచ్చిన పంతులతో గలిసికొన్నాము.

ఇట్లు పంతులు తనతో నాల్గునెలలకు బైగా మమ్మెంచెను. సింహలలాటపు బంగరుమురుగులు యొకపట్టుపంచలచాపొక బనారస్సుఖండవా యొక జల్తారుతాజు నాలుగువందలరూప్యములనగదు నాకిచ్చి. సూరన్నా పెండ్లి చేసుకొనుము. చంద్రుని కొక నూలుపో గన్నట్లు నీకిచ్చినాడ.

ఋణస్థుడనై యున్నదశలో వచ్చినా వింకొకమాటు నేఁబ్రతికియున్నచో నీకధికముగ నిచ్చెదను" అని మమ్ము సాగనంపుచు నొప్పడాలో మాబండి వెనుక నొక ఫర్లాంగు నడిచి వచ్చుచు గంట నీరిడెను. అపుడు "ఎందుకు శోకించెదవయ్యా!" యని నేనడుగగా సూరన్నా! లోకము నిన్నెరుగ జాలక నీకవజ్ఞత సేయుదురేమో యని కుందెదను అనియెను. నే జిరున వ్వున బంతులయొద్ద సెలవుపుచ్చుకొంటిని. దేవాదిసత్రము మీదుగా శ్రీకాకుళము చేరుకొంటిమి.

## శ్రీకాకుళములో హరికథ. అష్టావధానము

మొదట నాజబ్బులో నన్ననుగ్రహించిన వెలబోటి యచట గాపుర ముండెను. ఆపెయింట బసదిగి యొకధర్మాత్మునియింట భోజనము సేయుచుండగా ఆయూరి శిరస్తాదారు డొకగోల్కొండవేపారి నన్నాదరించి నాచే హరికథ చేయించెను. ధ్రువచరిత్రము చెప్పుచుంటిని. అపుడొక ముసలిపంతులకావేశము వచ్చినది. నన్ను వీపుపై పెద్దగ్రుద్దు గ్రుద్దెను. నేనదిలక్ష్యము సేయ లేదు. కాని పేరన్న యతని జరువబోయెను. అంతట నతనికావేశముంట తెలిసి నవ్వుకొని కథసేయుచుంటిని. అచటఁ బిల్లికి బిచ్చము వెట్టని యొకపరమలుబ్ధుడు మిక్కిలి ధనాఢ్యుడెను బదేండ్లవాడు నే హరికథచేయుచుండ జేతుల తాళము తట్టుచు భక్తిపరవశుడై యానం దించి నాకిరువదిరూప్యము లొసగుట కంద రాశ్చర్యమందిరి.

ఆ శిరస్తాదారునియింట విశాఖపురనివాసుడు పండితసార్వభౌముడు శ్రీ వైష్ణవు డొకమహానుభావుడునగు నొకనితో గలిసి యష్టావధానము చేసినాడ. నల్వురికి దెనుగు నల్వురికి సంస్కృతము చెరియొకచరణము వంతున కవిత్వము చెప్పినాము, చెరుముప్పది రెండక్షరములు వ్యస్తాక్షరి చేసినాము. తెనుగుఛందస్సునుగూర్చి యిద్దరము ప్రసంగించినాము. నిషే ధాక్షరిచేసినాము. మరిగొన్ని పనులు సేయుచు రెండుగంటల కవధానము ముగించినాము. ఆ వైష్ణవపండితుడు నన్సభలో శ్లాఘించి నాకవిత రస

వంతమైనదని మెచ్చెను. పిదప నా శిరస్తాదారు నరసవల్లిలోగూడ నొక కథ చేయించి నాల్గుతులముల మురిడీగొలుసులు నూటపదారురూప్యములు నగదు నొసగెను. అందుకు నేబసచేసిన యింటివారు మునుపటికన్న వేయిరెట్లు నన్ను జూచి సంతోషించిరి.

పిదప విజయనగరమునకు వచ్చినాము. అపుడు నన్ను జూచి" అబ్బో యీగుంట డెంతవాడైనాడని యాశ్చర్యముతోడ సంతోషముతో గొందరు మిత్రులు, కొందరిదియె వీనికి కడవరిదశయని యసూయతోను, బంధువులు శబాషు "ప్రపేదిరేప్రాక్త జన్మవిద్యా" యనునట్లు వీడెక్కడ నేర్చు కొనెను సంగీతసాహిత్యము లెట్లబ్బెనని యావింతతో గొందరింకమీద మరింతయభివృద్ధి నొందుననుచు దయతో బల్కుచుండిరి. ఒకమిత్రుని యింటికి నేబోగా నతడెంతయుగర్వముతో నన్నాదరించెను. గంజాము జిల్లాలోనే నామెట్రిక్యులేషను డిసట్రిక్టులో బోవుటకెంతయో నొచ్చుకొంటిని మేము తెచ్చినరూపాయలకు మారెండవయన్న మాయిద్దరిపేరట గరిక వల్సలో నొకభూమికొనెను.

## పెండ్లి సంబంధములు

నాకుఁబెండ్లి నేయుటకై మావారు యత్నించుచుండిరి. పెండ్లిచేసు కొనువేడ్క నాకుకూడ మెండుగ నుండెను. సంస్కృతనాటకపు మేనేజరు తనయన్నకుమార్తెను దాబెంచుకొని నాకు గన్యధార బోసెదనని యాపి ల్లనే పెండ్లాడుమని నాతో దరుచు నొంటిగ జెప్పుచుండెను. పిల్లల నెంచు కొనుటకై నేను, మాయమ్మయు మామూడవయన్నయును బయలిదేరి నాము. గజపతినగరములో మారెండవయన్నమాటచొప్పున నచటి గొప్ప వైశ్యులు నాకు నాల్గుంగరములు బంగరుటుట్ల పొగడాల తావళము. చెవు లకు ముత్తెపుతమ్మెట్లు నెరువొసంగి రెరువునగలతోను నేగడించుకొన్న మురుగులు గొలుసులతోను మిక్కిలివన్నెగ బ్రయాణమై సంస్కృత నాటకపు మేనేజరు యన్నకొమార్తె కొకచిన్నగావంచాగోచీకట్టుకట్టి

యనటితడపతో జడవైచి నాకుజూపెట్టి రంతసొగసుగలేదు కానియక్కన్నె యసహ్యము రాలేదు, కాని మామూడవయన్న యాకన్నెంజూచి తేనె లూరుపెద్దకనులు, నెర్రనిపెదవులతో సొగసైనదేయని నాతో ననెను. కృష్ణారాయపురమను నగ్రహారములో నొకకన్నెం జూచితిమి. అదియెంతో చక్కనిదేకాని పిల్లికనులు. మూడువందలరూపాయి లలంకారము పెట్టు మనిరి, మాపెదతండ్రికొమార్తెకూతు నొకతె నిచ్చెదమనిరి. కానియది కారునలుపు నొంటినిండ బొచ్చుకలది రెండువందలలంకార ముంచుమనిరి. బొద్దుకోకతోనెండురొయ్యవలె గన్పించెను, మరికొందరి కన్నెలంజూచితి గాని యలంకాలముంచుటకు నాకిష్టము లేదు కాళ్లుకడిగి కన్యాదానము చేసిన కన్నియనే పెండ్లాడుటకై మనసులో నిశ్చయించికొంటిని.

నాజన్మస్థానమగు నజ్జాడగ్రామములో నాచిన్ననాటి స్నేహితులు నాజ్ఞాతులునగు పెదయజ్ఞేశచైనమ్మ చిరంజీవులబాబు యోగిరామన్న మొద లగువారందరు నన్నుగని పరమామోదముం బొందిరి. శరీరమందున్న మురుగులుమొదలైన యలంకారముల సవరించుకొనుచు గేరాదిద్దుకొనుచు పలుమరు జుట్టుపెద్దముడివేయుచు దండెపట్లుపట్టుచు పట్టువాసపుబడాయి గొట్టుచు నచటివారి యనాగరికతం దిట్టుచు ఇంగ్లీషుమాటలాడుచు బాటలుపాడుచు బందులయిండ్ల దినుచుంటిని. పెదయజ్ఞేశచైనమ్మ చిరంజీవులబాబును అచట మిక్కిలి భాగ్యవంతులు నాజ్ఞాతులు, నాతో మాతండ్రియొద్ద చదువు కొన్నవారు. అందులో పెద్దయజ్ఞేశకు నాకు మిక్కిలిమైత్రి. మేమిరువుర మొకనాడు ఏటియావలితోటలో వెన్నెలరాత్రి యొకమామిడిచెట్టుమొదట నొకవిలాస మొనర్చితిమి. మాపెద్దన్న మేమిద్దరము యిసుకతిన్నెపై గూర్చుండుట కనిపెట్టుచుండెను. అచట మాజట్టుదారులమారణపుగిత్తల వలె దిరుగుచుంటిమి. పెద్దబ్బాయి యనెడు మాజ్ఞాతి (గ్రామభుక్తయు రాయమ్మగారిమనుమడు) నతడు నాచే నంబరీషచరిత్రమును బాడించి విని యెంతోసంతోషించి మాతండ్రిగారదివిన్నచో నెంతబాగుండునని చింతించెను.

నేను రామభద్రపురములో జూచినకన్నియను మాత్రమే నాకూరక కాళ్ళుగడిగి కన్యాదానము చేసెదమనిరి. కాని తక్కిన కన్నెల తలిదండ్రు లందరు నన్నలంకారముంచమనుచు వచ్చిరి. మాయమ్మకు దనమేనల్లుని కొమార్తె కలంకారముంచియైన జేసికొనుట కూహకలదు, చేతిసొమ్ము వదలుకొని యలంకారముంచుట నాయిష్టముకాదు, పిదప విజయనగరము దిరిగి చేరుకొంటిమి.

## డెప్యూటీ కలెక్టరుతో పేచీ

ఒకవైశ్యు డిచటికి డిప్యూటీకలెక్టరుగా వచ్చెను, మగటిపల్లి బుచ్చికామకవి కిచట సభచేయించి పురాణము చదివించి జాత్యభిమానముతో మూడునాల్గువంద లిప్పించెను. నన్నుగూడ జూచి మిగుల సంతసించెను. గాని చిన్నతనపుపెంకితనముచేత నతనిదయకు దూరమైతిని, ఒకనాడతడు పాడి యెట్లున్నది నాపాటయని నన్నడిగెను. అపుడు "వేరేయడుగవలెనా?" "యీఱగొట్టనుకోమటీరీసుమేసరి" యని యంటిని. అందుకు కోపమువచ్చి మూతివిరిచి లుచ్చగొట్టి మరికొంత నేపూరకొని "యెదీ నీకవిత్వమేదైన జదువుమా! యనెను. "మందహాసహసిత శారద చంద్రికా"యని చదువబోవుచుండగా నాపైగనులెర్రచేసి "తప్పుకవిత్వము చెప్పుకొనుచు బెద్దపిన్న యనక వెక్కిరించెదవు నీ ద్రావిడము మానవు" అనియె, అందుకు "అయ్యా! సెట్టిగారూ! తప్పెక్కడ"అంటిని. అందుకు "శరచ్చంద్రికా యని యుండును గాని శారదచంద్రికా యని యుండదు" అనెను. నే జిరునవ్వుతో నిదివరకు తమసంగీతప్రజ్ఞకు దోడే సాహిత్యవైభవముగంటి. కవిత్వముచెప్పుట బేర మనుకొన్నారా? ఇదికాక సంస్కృతమున బ్రాహ్మణుల నితరులు బెదిరింపరాదు"అంటిని. అప్పటి నుండి యతడు నన్నెరుసుగ జూచుచుండును.

మెట్రిక్యులేషనుపరీక్షకై మరి స్కూలులో జదువుటకిష్టపడక పై ్రివేటుగ జదువ నిశ్చయించి వలయుపుస్తకములు సంపాదించి పీఠాం

బరము హనుమంతరావును పూడిపెద్ది సోమనాథమును నేను మారెండవ యన్నగారి యింటి వీధిపంచపాళిలో రాత్రింబవళ్లన్యోన్య సహాయమున జదువుచుంటిమి. కాని షోకంగిముచ్చు జట్టుదారులతోగూడి బాటలుపాడుచు వెలయాంధ్రయిండ్ల దిరుగుచు రాత్రులు నిద్రమాని యుత్సవములు చూచుచు వన్నెలుచిన్నెలు చేసుకొని తటస్థించిన శృంగార మనుభవించు చుంటిని.

కోటపల్లి వారివీధులో నొకపంతులు స్నేహము కుదిరెను. అతడు సన్నముగ దీయగ బాడును. ఢోలక్కు వాయించును. ఆర్గురు అక్కల కొక్కడే ముద్దుతమ్ముడు. భాగనగరపు సూర్యనారాయణకు మేనమామ. నాయందెంతో దయతో 'అవ యాచ"యని పిల్చుచు నాదరించుచుండును. ఒక నా ప్రియమిత్రుడు నేను నచట దరచు భజనలునేయుచు బాడు చుందుము. ఈయూళ్ళో యిద్దరు మాధ్వులు పాటకులుగా నుండిరి. అందొకనికి గోటలో జీతము. వేణుగోపాలస్వామిమఠమునకు బూజారి. ఇద్దరును ప్రశస్తముగా బాడగలరు. మద్దెలవాద్యమునందు నిపుణులు. నామిత్రుడును నేను దరుచు మఠములోని విద్వాంసునిచెంత పాటయును ముక్తాయియును గ్రహించుచుందుము. నామిత్రుని శారీరము సన్నము,నాది ముతుకు, గావి పాటలో నేగురుజును.ఒకప్పుడరుదుగా నాకంటె సొగసుగ నామిత్రుడును బాడుటగలదు. మాటలపోగు వన్నెలవిసనశ్ర కృషికి జంకువాడు గనుక నామిత్రునిసంగీత మభివృద్ధి కాలేదు. దివానురాజుగారి యింట్లో మఠమువిద్వాంసుడుగాక రెండవమాధ్వుడు బాడుచుంట విని యంతసొగసుగా నేనెప్పుడైన దరంగములు పాడుదునాయని యూసించు వాడను.

సొగసు చేసికొనుట, నాజట్టుదారులవెంట దిరుగుటచే కాలము చాల కున్న చదువుట కవకాశ మెట్లు చిక్కును! కొంచెము కొంచెము స్వరము గూడ బాడ నారంభించితి, రాజుగారి విద్వాంసుడును సంగీతమున నిరుప

మానమగు ప్రజ్ఞకలవాడును నాలయకాగిన లయకలవాడునగు గాయక వైణికుని సంగీతమునకు గురువుగ భావించుకొని నతని సేవించుచు నాపాట యతనికి వినిపించుచుందును. ఆతడు పిసరుగాడు, సరిగమయన్న మరొక గంట కదివరకు గంటక్రిందట నోటనారిపోయిన చుట్టముట్టించుచు పధ నిధనిస"యని నాకు జెప్పుట వార్తాపత్రికలం బ్రచురించదగిన చిత్రము. అతనింబోలి యంత్రగాత్రము లభేదముగా బాడుటయు. లయతప్పక వీణ వాయించుట యభినయము నృత్తము మప్పుటయు, పదకవిత్వము చెప్పుటయు, వీణలుచేయుటయు, నింక కొన్నికళలలో నైపుణియు, విజయ నగరములో, నింకొకరికి లేవు. ముఖాముఖిగా నేర్చుకొనుటలేదుగాని, తరుచుగ జాలకాలమతనికి నాపాటవిన్పించుచు నప్పుడప్పుడతనిచే మెప్పు గాంచుచుందును.

## నా వి వా హ ము

సంస్కృతనాటకపు మేనేజరు తనయన్నకుమార్తెను దానభిమాన పుత్రికగ గైకొని యుభయమంగళసూత్రములు చేయించి నాకొక క్షీరాబ్ధి పట్టుచాపు కట్నమిచ్చి కాళ్లుకడిగి కన్యాదానముచేసెను. కన్యకకు మూడు తులముల బంగారుసరిగె మాత్రము మేముంచినారము. అప్పుడాకన్యకు దొమ్మిదేండ్లపైగా వయసుండు నావయసిరువదేండ్లు దాటి యుండును. అపుడు వేసవికాలము. అయోధ్యకడ దోటలో దిగినాము. ఏదురోజులు సంబర మైనపిదప శాయమాన్పలకీలో కూర్చొని పెండ్లి యింటికి వెళ్ళి నాము. పెండ్లియైదుదినములు ఎంతో వేడుకగా నుండెను,

## మెట్రిక్యులేషను పరీక్షలో నుత్తీర్ణత

ఆసంవత్సరము మెట్రిక్యులేషనుపరీక్ష యిచ్చుటకై విశాఖపట్టణమునకు బోయినాడను. మాయూరిప్రభువువారు గూడ సంస్కృతనాటకులం దీసికొని సపరివారముగా స్టీమరెక్కి మెద్రాసునకు దయచేసిరి. పరీక్షయైనపిమ్మట విశాఖపట్టణమున నేనొంటిగ హరికథలుచేయుచు,

సుమారు రెండునెల లుండిపోతిని. తొమ్మిదిగంటలరాత్రికి హరికథ మొదలుపెట్టి యొంటిగంటవరకు కుపోద్ఘాతము, మరి మూడుగంటలవరకు అసలుకథ చెప్పుచు మొత్తముపై దెల్లవార్చువాడను. వేలకొలది జనులు వినుచుందురు. పేరన్న చెన్నపట్టణమందు నాటకములో నుంటచే నొక ప్రశస్తమైన ముఖవీణవాదకుని వెంటనుంచుకొని కథలు చేయువాడను, కథ కిరువది రూపాయిలు చొప్పున బుచ్చుకొని యీరెండునెలలలో బన్నెండుకథలు చేసియుందును. నాచేతిలోబడిన రూపాయిలకు రెక్కలు వచ్చి యెగిరిపోవుచునుండునవి. అచట నాభోజన మొకజిల్లాకోర్టు ప్లీడరు గృహమున, అతడు దిమిలద్రావడి; యెంతోమంచివా డాశ్రితపక్షపాతి యును. అతడును నతనిభార్యయును కన్నతల్లిదండ్రులకన్న నెక్కువగ నన్నముబెట్టి నన్నాదరించుచుండిరి. పరీక్ష రిజల్టువిషయమై మువ్వురము కలసి మెద్రాసునకు టెలిగ్రా మిచ్చినాము. నాటి రాత్రి యొకమేడపై విజయనగరమునుండి వచ్చిన నాపాటజట్టుదారుడు నేను నొకచోట బాడి పాడి యలసి నిద్రించుచుంటిమి. తెలవారకుండ మమ్ములను లేపి బంట్రోతు టెలిగ్రాము తెచ్చియిచ్చెను. నాపరీక్ష ప్యాసైనదని నే జదువగ నామిత్రుడు సంతోషముచే నన్నాశ్లేషించుకొనెను. ఇకచాలు మరిచదువ నక్కరలేదని సంతోషముతో నేనొక కేక వైచితి. విశేషముగా బరీక్షలు ప్యాసయి యుద్యోగము సేయుదృష్టి నాకెన్నడును లేదు. హరికథలపై జీవించుటయే నానిశ్చయము. పరీక్షలో నెగ్గినందుకు శివకోవెలలో దెల్లవార్లు హరికథ మిగుల గట్టిగ జేసినాను.

విజయనగరములో సీమరాణీగారి జూబిలీకి నాహరికథ పెట్టించగోరి యొకడిప్యూటీకలెక్టరు నాకు టెలిగ్రాము వేసెను అతడు నియోగి బ్రాహ్మణుడు మిక్కిలితెల్వితేటలు గలవాడును. విజయనగరమువచ్చి బంకులదిబ్బమీద హరికథ చేసినాడను. ఒకనాడు పెద్దచెర్వుగట్టుమీద షికారుబోవుచు చంద్రశేఖరశాస్త్రిగారు "ఓయీ! సూర్యనారాయణ! నీపాటలు నీయాటలు. నీహరికథలు నీకాటుకలు, నీపోకిరితనము చూచి నీవు చదువవు

గనుక నీకు చదువు రాదనుకొంటిని. ఇపుడు నారాయణదాసుడను పేరును ప్యాసయినావా!" యని నాబుజమున దట్టి మిగులసంతోషముతో "రా ఎఫ్ ఏ లో చేరు" అనెను. నాకు ఎఫ్. ఏ. చదువుట కిష్టము లేదు. బడికి రెండుపూటలు వెళ్లుచుంట, టీచర్లయొద్ద కట్టుబడియుంట, నాకు సమాధానములేదు. కాని, మా రెండవయన్న ప్రోత్సాహముచేత జదువుటకొప్పుకొంటిని. పరీక్షలో నెగ్గినందు కాంజనేయస్వామికోవెలచెంత మ్రొక్కుబడి హరికథ చేసినాను.

## కళాశాలలో విద్యాభ్యాసము

జయంతికామేళముపంతులాసంవత్సరమే స్వర్గస్థుడాయెను. అతని వెలయాలు విజయనగరమున కెనిమిది తొమ్మిదివేల రూపాయిలతో జేరుకొనియెను. తొంటిపరిచయముచేత దరుచుగ నాపెయింట నుండువాడను. కాలేజీకి ఎపుడెన్నకై మొగము గన్పర్చుచుంటగాని, టీచర్లవలన నొకట్రిగ్నామెట్రితప్ప మరియేపాఠమును నే దెలిసికొనవలసిన యవసరమే లేదు. ప్రిన్సిపలుగారి పాఠమువేళలో దప్ప దక్కిన టీచర్లు చెప్పు పాఠములపు డుంటయే తరుచెరుగను. దివాన్‌సాహెబ్‌గారు నాచేత వరుసగా ప్రతిరాత్రి మూడేసిగంటలచొప్పున నాలుగైదురోజులు కథలు చిత్తగించి యొకనాడు సంతోషముతో నాకడుపుమీద దనచేతికర్రతో బొడిచి "యింతవిద్య నీకడుపులో నెట్లున్నదయ్యా" యని "నీకేమికావలయునో కోరుకొమ్ము" అనెను. అపుడు మామూడవ యన్నకు నాటకపుజీతము ఖాయముచేయించు మనియు, నాకు కాలేజీలో ఫ్రీస్కాలరీయిమ్మనియు గోరుకొంటిని. ప్రిన్సిపలుగారితో దనమాటప్రకారము నాకు 'ఫ్రీస్కాలరీ' యిమ్మని చెప్పుమనియెను. ఒకయింట నే హరికథ రాత్రియంతయు జేసి మరునాడుదయమున బడికిబోగా ప్రిన్సిపలుగారు నాతో "తెల్లవార్లు పాడియాడి నిద్రమాని, మిక్కిలియలసియున్నావు డబ్బుగడించుచున్నావు. దూదేకులవానికి దుంబతెగులన్నట్లు నీకెందుకీచదు" వనెను. దివాన్

సాహేబుగారు పంపినవర్తమానము జెప్పినాడ సందుకొప్పుకొనలేదు. పిదప దివాన్ సాహేబ్‌గారు తనయుంగరము నాకొనవాలిచ్చి ప్రిన్సిపాలుకు చూపు మనియె. నేనట్లునేయగా నన్ను ఫ్రీస్కాలరుగ జేసిరి. అసిరమ్మపండుగ పిడ్డిపండుగ జగన్నాధోత్సవములు, వసంతనవరాత్రులు, దేవీనవరాత్రులు గణపతినవరాత్రములు మొదలగునెన్నో యుత్సవములు విజయనగరమున నేవియో వచ్చుచుండును. అన్ని యుత్సవములలో జట్టుదార్లతోగూడి యెంతో ముచ్చటగ దిరుగుచుందును. రాత్రినిద్ర సాధారణముగ లేనేలేదు. ఒకనాడు శ్రీనివాసాచార్యులను వైష్ణవటీచరు ఆల్‌జిబ్రాలో ఈ క్వేషన్సు చెప్పుచున్నపుడొకలెక్క యసాధ్యముగ నుండెను. టీచరు దానిని సాల్వు చేయుటకు దంటాలు పడుచుండెను. బోర్డుబల్లవెనుక నిదురించుచున్న నే జప్పున లేచివచ్చి "నేనీ లెక్క సాల్వుచేసెద" నంటిని. అపుడతడు "పోపో వెర్రివాడా! నిద్రపో! నీకు చూడు లెక్కచూడు." అనియెను. అపుడతి త్వరితముగ బోర్డుపై సుద్దముక్కతో ప్రోబ్లమ్ సాల్వుచేసినాక. అందుకు టీచరుమొదలు క్లాసులోనివారందరు మిక్కిలి యాశ్చర్యపడిరి. ఒకప్పుడు ప్రిన్సిపలుగారి పాఠముసమయమున ఆల్ హెర్ లవ్......ఇన్ హెమ్" అని యతడు ఫస్టునుండి లేస్టువరకున్నవారికి జేయి ద్రిప్పుచు మాటపూర్తిచేయు మనెను. అపుడు లాస్టున యున్న నేను "సెంటర్డ"ంటిని. అందు "కేమీ ఎంటర్డంటివా?" యనెను. కాదు సెంటర్డంటి నని చెప్పగా "దటీజ్ వెరీ లెర్నడ్" అని నాకు ఫస్టుప్లేసిచ్చెను. ఈరెండును మేష్టర్లను నే మెప్పించిన సమయములు.

### పిఠాపురరాజసన్మానము

శీతాకాలము సెలవులలో దివానుగారు "నీకు సిఫార్సిచ్చెదను, పిఠాపురమురాజును జూడు" మని నాతో "నారాయణదాసుగారూ! మీది కడు పెద్ద కొప్పు. రాజునకు జుట్లు కత్తిరించుట యలవాటు జాగరూకతగ నుండవలయుజుండీ" యనెను. పిదప సిఫార్సు పట్టుకొని

పేరన్నయు, నేను పిఠాపురమునకు బైలుదేరి విశాఖపట్నము మీదుగా కసింకోట సత్త్రమున నాగి, నక్కపల్లి సత్త్రమున దిగి మరునాడుదయమున నన్నవరమున సత్రమునకు జేరుకొంటిమి. లోకమందు అన్నవరము సత్రమువంటి సౌఖ్యకరమగు సత్రమేలేదు. అతిథుల కభ్యంజనము చేసికొనుటకు వెట్టిమంగళ్లు వేడినీళ్లు సమస్తాభీష్టసామగ్రి రెండుకూరలు పప్పు పులుసు. పిండివంట యాసత్రముంచిన పుణ్యాత్ముల ధర్మగుణమేమి చెప్పగలను? సాయంకాలమునకు పిఠాపురము చేరికొంటిమి. నాడేకాదశి. మాయుత్తరము చూచినయచటి దివా నొక గోల్కొండ వేపారి, ఆరాత్రే మాధవస్వామిగుడిలో హరికథ పెట్టించెను దెల్లవార్లు వేలకొలది జనులు నిశ్చేష్టులై హరికథవిని యెవ్వడో గంధర్వుడు వచ్చెను లేకున్న నీతేజస్సు, నీ ధోరణి, యీపాట, యిట్టికవిత్వమెన్నడైన గంటిమే". యనుచు నన్నుశ్లాఘించి సంతసించిరి. దివానుగారు మాకొక బస యేర్పరిచి రాజుగారితో మన్వి చేసి, మమ్ములను రాజుగారియొద్దకు గొంపోయిరి. నన్ను చూచినతోనే రాజుగారు, "దయచేయుడు! దయచేయుడు! నారాయణదాసుగారు! మీరుతలంచినంతనే యీమేడ బంగారమగును. ప్రహ్లాదునివలె మమ్ము దరింపజేయ విచ్చేయుచున్నారు. విజయనగరము మహారాజుగారు క్షేమమా? వారిమంత్రిగారికి నాయెడ బుత్రవాత్సల్య మని నన్ను సత్కరించి హరికథ వినెను. పెద్దశిరస్సుగున్న యేనుగంత దారువు గొప్ప పాండిత్యము, నిరుపమానమగు నుదారతయు, నాప్రభువునకున్న యీవి యనన్యసాధారణ మని పల్కుచుందురు.

రాజుగారు నన్నట్లాదరించుటచేత భౌరులంద రెంతయో గారవించుచుండిరి. మరియొక కథకూడ చిత్తగించి రాజుగారొక యుదయమున మమ్ము రప్పించెను. రాజుగారును మేమిద్దర మన్నదమ్ములమును మాత్రమే మేడపై నుంటిమి. సందెడుంగరములజుట్టు పెద్దముడి సొగసుగ వైచుకొని యున్న నన్ను బరికించి, "కైజారేదిరా" యని కేక వైచెను. పేరన్న నావైపు భయముతో జూచెను. నేగూడ వింతపడినాడ. పిదప

నొక రొకకైజారును నూటపదారురూపాయిలు పాగాలు పంచలచాపులును తెచ్చెను: అపుడు రాజు కైజారుపైనుండి రూపాయిల పళ్లెము ద్రిప్పి నాచేతికిచ్చి "సంతుష్టి పొందుడు నే నప్పులలోనుంచి, చంద్రునకొక నూలు పోగు ప్రతిసంవత్సరము మీాకిట్లు ముట్టుచుండును. "అసంతుష్టో ద్విజో నష్టః" అని యనెను అందుకునేను "సంతుష్టఇవ పార్థివ" యని యచట నొక స్టేండునకు దగిల్చిన శహలుపై గన్నిడి జబాబు చెప్పితిని. రాజు గ్రహించి, యానెను, తాము తొడగదగిన దీయంగి గవర్నరు సభకు వెళ్లుటకై కుట్టించినాను ఇప్పుడే తయారైన''దని శహలులతో గుట్టబడిన యంగీనాకు స్వయముగ దొడిగెను. అచట మరి నాలుగైదుపూట లొక మిత్రుని కోర్కెను బట్టి యాగినాము. అతడు శ్రీవైష్ణవుడు, పదునెనిమి దేండ్లనాడు మంచి యుదార సాహసములు కలవాడు. ఒకమేడ నాయూ రిలో కట్టించెను. నా ప్రియ మిత్రులలో నతనొకడు,

విజయనగరము వచ్చినతోడనే దివాన్జీసాహేబునకు గనపడి, పితా పురముసంగతి తెలియబర్చినాడ. నవ్వుచు ''జుట్టుకాపాడుకొని వచ్చి నారా!"యనెను. దివానుగా రొకనాడు "నారాయణదాసుగారూ! మరి మీరు చదువనేలా! మధ్యాహ్నము రండు, మీకు గలక్టరుతో చెప్పి వెంటనే యేబదిరూపాయలు జీతము చేయించెద''ననెను. ఆమధ్యాహ్నము మూడు గంటలకు దివాన్జీసాహే బాకస్మికముగా కాలము చేసిరి. అంత గొప్ప ప్రాపు అట్లగుటకు కొంత చింతించితి.

### ప్రిన్సిపలు చంద్రశేఖరశాస్త్రిగారి మృతి

చంద్రశేఖరశాస్త్రిగారు కూడ కంటోన్మెంటులో రాచపుండుచే స్వర్గస్థులైరి. నాటిదినము రెండుజాముల యెండలో స్కూలుపిల్లలు మొదలూరిలోని పురుషు లందరతని వెంట నుండిరి. చంద్రశేఖరశాస్త్రిని గూర్చి నాయభిప్రాయము లోకులకు విద్యాబుద్ధులం జెప్పుట కవతరించిన చంద్రశేఖరుడే యని,

మ॥ స్మిత పూర్వాస్య సరోజ మున్నత భుజాశ్లిష్టంబు నాజానులం
బిత బాహుద్వయ మబ్జనిర్మల శిరోవేష్టంబు సత్యామృతాం
చిత వాక్పూర మఖండ వక్ష మరుణ స్ఫీతంబు శిష్యాళి బ్రో
వుత మంచు న్గుదు చంద్రశేఖర మహామూర్తిం బ్రశంసించెదన్॥

అనియు

సీ॥ ఏదినంబున శోక మెరుగని బుధులెల్ల
కన్నీటి వరదలు కార్చినారు
చీమ బారుల వలె శిష్యు లేదినమున
నెండలో బడి పరువెత్తినారు
గ్రహణ దినము పోల్కి గనుపట్టె నెద్దిన
మఖిల జనస్నాన మతిశయిల్లి
యెద్దినంబున బ్రజకెల్ల నీపురిలోన
దుర్దినమై యేమి దోచకుండె.

నెద్దినంబున మనబడి యింపు దరిగె
నెద్దినంబున గురువుల ముద్దుచెల్లె
నెద్దినంబున శ్రోత్రియం బేపు దొరగె
తద్దినంబా యిది బుధ విపద్దినంబు॥

అనియు పద్యములు చెప్పినాడను. అజానుబాహువు, మేటిబలాఢ్యుడు. ఆణిముత్తెముల కోవవలె నతని చిరునగవున దంతపంక్తి నీసుకమలముల తళుక్కున ప్రకాశించును. తెల్లని దంతమువంటి చాయ. వెడదవక్షము. సన్నపు నడుము, తీయని మాటలు, అత డింగ్లీషున నుపన్యాసమిచ్చుచున్న సంగీతమువలె శ్రావ్యముగ నుండును. సంస్కృతమున మేటిపండితుడట. దీన విద్యార్థులపాలి కల్పవృక్షము. భయభక్తులతో స్కూలు పిల్లలు, టీచర్లు, తక్కిన యూరిలోని తగు మనుష్యు లతనిం జూచువారు. నిష్కల్మషుడట్టిమహనీయు డెట్టినుతికైన బాత్రుడు.

## వీణసాధకము

చిన్నవీణె కట్టు సూర్యనారాయణవద్ద సంపాదించి సాధకము మొదలిడినాడను. సరళీ జంటవరుసలు కొన్ని యలంకారములవరకు కట్టు సూర్యనారాయణ నాకు జెప్పెను. నే బరిచర్య సేయుచుండు దర్బారు విద్వాంసుడుకూడ వీణ మేళము సేయుటయు రెండుమూడు పిళ్లారి గీతములను నాకు నేర్పెను. పిఠాపురము హరికథల యప్పటినుండియు ధారాళముగ సభలలో స్వరము బాడుచుంటిని. గజేంద్రమోక్షణ మను యక్షగానము రచించి యదివరకే దివాంజీవారికి విన్పించి యున్నాడను.

## విశాఖపట్టణంకాలేజీచదువు

చంద్రశేఖర శాస్త్రిగారి తరువాత రామానుజాచారిగారు ప్రిన్సిపలైరి. అతడు ఎఫ్॥ ఏ॥ జూనియరులో మాకు హిస్టరీ పాఠమునకును, "మైనరు పోయెమ్సు" చెప్పుటకును వచ్చుచుండిరి. పూవులతావి మోసికొని వచ్చుటచేత సంతర్పణమున తిన్నబ్రాహ్మణులవలె గాలులు మెల్లగ వీచుచున్నవని "షల్లీ, స్కైలార్కు"లోని భావమునకు సోపమానముగ నేనర్థము చెప్పినపు డాచార్యులుగారు సంతోషించి "గుడ్‌పోయెట్" అని మెచ్చిరి. చంద్రశేఖర శాస్త్రిగారి తరువాత "ఫ్రీస్కాలరు నీకివ్వబడదు. చదువని వెర్రివాడవు నీకెందుకు దండుగ" యని యాచార్యులుగారు సెలవిచ్చిరి. పాడి యాడుచు హరికథలు సేయువారు వెర్రివారని వారి యభిప్రాయము కాబోలు. పిదప నే "నెట్రెండెన్సు సర్టిఫికేట్సు" తీసుకొని విశాఖపట్టణములో సీనియర్ చదువ నేగితిని. ఫ్రీస్కాలరు నాకివ్వక మానుటచే నేనితరత్ర యొంటిగ బోవుటచే నాచదువున కాచార్యులవారే పుణ్యము గట్టుకొని రని నానిశ్చయము. వారు నాఫ్రీస్కాలరు మాన్పుటకు సబబు నాకు జదువు రాదనియో, సర్కారు ద్రవ్యమున గౌరతవడుననియో లేక నాబోటి పాడి యాడువాడు ఫ్రీస్కాలరుగ నుండ నర్హుడుకాడనియోనాపై జిరుక న్నిడిరి.

విశాఖపట్నం హిందూకాలేజీ ప్రిన్సిపలుగారిని జూచినాడను. అతడు నాసంగతి కనిపెట్టి తనయింట భోజనము సేయుచు జదువుకొమ్మనెను. కాలేజీ చదువు మాట దేవున కెరుకగాని, యతని వెలయాలికి నే బాట మప్పుచుంట యతని యింట భోజనము సేయుచుంట, యూరిలో యథేచ్ఛగా దిరుగుచుంటయు లభించెను. ఎటెండెన్సుమాత్రము పూర్తి చేయుచుంటయే కావలసినపని. నాతో జదివిన క్లాసుమేట్లు నందగిరి నాగోజీరావు, పోలిసెట్టి యప్పారావు, వేపా రామేశము, నరసింహాచారి, మొసలికంటి వెంకటరమణయ్య తెన్నేటి సూర్యనారాయణ, జే॥ సీతారామయ్య మొదలైనవారు. దైవసహాయము, బయ్యానరసింహశర్మ. కూర్మాచారిగారు ఇంకొక శ్రీవైష్ణవుడు మొదలగువారు టీచర్లు. క్లాసుమేట్లను, టీచర్లను మాత్రము వయసు మించినను జ్ఞాపకమున్నంతవరకు బేర్కొనుట నాయిష్టము గనుక పేర్కొంటిని. ప్రిన్సిపాలు డబ్ల్యు రామయ్యగారును నేను, భోజనముచేసి కాలేజీకి వెళ్లువారము. అయిదుగంటల సాయంత్రమునకు వెలయాలియింట నుండువారము. ఆ సంవత్సరము ముప్పది, నలుబది హరికథలు విశాఖపట్టణమున జేసియుందును.

పిఠాపురమునుండి వచ్చుచుండగా కసింకోట జమిందారుగారు నాచే రెండు కథలు చేయించి నూటపదార్లిచ్చిరి. ఆ పరిచయముచే నే వ్రాసికొనగా నాకు వారు ఎనిమిదిరూపాయిలు నెలకు స్కాలరుషిప్పు దయచేయుచుండిరి. అచటనొక మున్సబుగారు మా ప్రిన్సిపలుగారివలె రసికులు. నాచే కార్మంచివారి హవేలీలో కథ చేయించి యేబది రూప్యములొసంగిరి. ఊరికి రామయ్యగారి బసకు రెండుమైళ్ళపైగా దూరము. ఉదయమున, సాయంకాలమున నూరిలో దిరుగుటగాక, రానుపోను నాలుగు మైళ్లు ప్రతిదినము నడుచుచుండువాడను. జనసమ్మర్ద మేమియు లేక యొంటిగా సముద్రపుటొడ్డున పట్టణమునకు రెండుమైళ్ళకు బైగా నున్న ప్రిన్సిపలుగారి యింట నుండుచు, సముద్రఘోష వినుచు, సంతతము నురగల న్నవ్వు తరంగముల రాకపోకల ననుసరించి సాహసంబున బర్వి

డుచు వచ్చిపోవు స్టీమరుల లెక్కించుచు, నా బసకు చుట్టున్న తోటలో నొంటిగ జదువుకొనుచు, విజయనగరపు క్రొత్తస్నేహితుల యుత్తరములు గంటలకొలది తనివితీరక చదివి యానందించుచు, విచిత్రసంకల్పముల నందుచుందును. అచటి డిస్ట్రిక్టు రిజస్ట్రారు రెండు మూడు సార్లు తనయింట నాహరికథలు చేయించి నన్నెంతో వాత్సల్యముగ జూచుచుండిరి. వారియింట దరుచుగ భోజనము సేయుచుంటిని. అతని కుటుంబమందలి యందరును సంగీత సాహిత్యములం దభిరుచి కలవారగుటచే నన్నెంతో దయగా నాదరించుచుందురు.

### అప్రతిష్ఠ మూపుకొనుటకై యష్టావధానము

భీముడుచెల్లెలి పెనిమిటి యచట జిల్లాకోర్టు ప్లీడరుగా నుండెను. అతనియొద్ద నే నేడురూపాయి లెందుకో బదులు పుచ్చుకొన్నాను. నెల రోజు లాయెను. ఒకనాడు పదునొకొండు గంటల రాత్రికి కొందరితో జట్టు కూడి, మిఠాయి దినుచు నతఁడున్న మేడవరండాలో గూర్చుంటి. అపుడు నాగొంతు విని యచటనున్నవారు, "వీడు కడు పెంకెవాడు, హరికథలో నందరిపని పట్టుచుండును. స్వతంత్రు డెవ్వరి లక్ష్యము లేదు, రాత్రులు వీధులవెంబడి పోకిరిజట్టుతో దిరుగుచు, జావళీలు పాడుచుండును. హిందూ కాలేజీలో ఎఫ్ ॥ఏ॥ తగలపెట్టుచున్నాడు. వీనికి జదువేమిటి ? పోకిరీ ముండవాడు ! తెల్వితేటలు కొంచెము కలవుగాని, వానిమొగము ! తెల్వితేటలకు వానికి నెంతదూరము ? కొంచె మెర్రగా బుర్రగా నుండి పిట్టకథలు చెప్పుచు వెర్రి ముండాకొడుకులను సంతోషపెట్టును గాని. తగుమనుష్యు లెవ్వరును వాని తైతెక్కలకు సంతోషించరు. నిమ్మకొయ్యజాతి గనుక చొరవ మెండు. ఆ "రాస్కల్" నాయొద్ద నేడురూపాయిలు బదులు పుచ్చుకొన్నా డిదివర కగుపడడు" అని ప్రసంగించుట నా చెవులార వినుచు, గడవరిమాట నాకు బదులిచ్చిన యతనిదాటచే బిగ్గరగ "నేరాస్కలును గాను మీరూకలు రేపేయిచ్చెద" నంటిని ఆమరునా డాదిత్య వార మీ

దయమున నెనిమిది గంటలకు మాటతప్పక యేడురూపాయలు పట్టుకొని వెళ్ళి "యివిగో మీ రూపాయిలు. నా తెల్వితేటలు కొంచెము చిత్తగించుడీ! యష్టావధానము చేసెద" నంటిని. అపుడు రాత్రి నన్నుగూర్చి ప్రసంగించిన వారందరచట నుండిరి. వారందరష్టావధానము చిత్తగించుట కిష్టపడగ నెంతో వేగముగ దప్పక యష్టావధానమును బదిగంటలకు ముగించితిని. అపు డందరాశ్చర్యపడిరి. అంతటినుండి నాకు బదులిచ్చిన ప్లీడరు నన్నెంతో దయగా జూచుచుండును.

## మాటతప్పినవేశ్య

విజయనగరముకన్న నీళ్ళకిబ్బందిగా, మిక్కిలి యనారోగ్యముగా నపుడు విశాఖపట్టణ ముండెను. అనుకూల శత్రువుమాడ్కి బైకి జల్లగ నుండినను సముద్రపుగాలి లోపల గాక చేయుచుండును. అచట నుంటచే నాశరీరపురంగు కగ్గిపోయెను. అచట పురుషులకు నీరసము, స్త్రీలకు బుష్టియు నైజములు. ఒకశీతకాలపురాత్రి రెండుగంటలవరకు దిరుగుచుంటచే నిదురించుటకు స్థలము దొరకక సంసారుల తలుపుకొట్టి బాధించుట కిష్టపడ కొక వెలయాలి తలుపు గ్రుద్దినాడను. ఆపె తలుపుదీసి లోపలికి రమ్మనెను. నే లోపలికి వెళ్ళి, "యీ గదిలో మంచముపై నన్నొంటిగ బడుకొన నిచ్చెదవేని నీ కివిగో రెండు రూపాయ లిచ్చెద" నంటిని. ఆందుకాపె నన్ను నిదానించి చూచి, తలయూచి, కార్మంచివారి హవేలీలో మీరు హరికథ చేయలేదా? యనియెను. అందుకు నే 'నౌను' అంటిని "సరియె పడుకొనుడు, మీరు మంచముపై నే గ్రిందను బడుకొందా" మనియె. నేను బడుకొంటిని. నాకు నిద్ర పట్టుచుండెను. అపుడాపె మెల్లగ నాయొద్దకు వచ్చి నాచెంత మంచమున బండుకొనియె. నే దెలిసియు నూరకొంటి. అంతతో బోకయాపె నాపై గాల్లు వేసె నందుకు గోపించి లేచి, "ఛీ! నీయింట బండుకొన రాదు. నీవు దౌర్జన్యమునకు మాటదప్ప నెట్టుకొంటి" వంటిని. అందుకు చిన్నబోయి నా రెండురూపా

యిటు నాచేత బెట్టి, "నా యిష్టానుసారము నీ వుండెదవేని నిచటనుండు లేకున్న బొమ్మ"నియెను. నిదురమాని చలిలో నెచటికిని బో లేకుంటిని. మఱియు నా వేశ్య యభీష్టము దీర్చుట కిష్టము లేదు. ఎటులైన శరీర నష్టమున కొప్పక, వీధిలో బడి యొకయరుగుమీద బవళించినాడ; నయ్యో యేయెండ కాగొడుగు బట్టనివాడు కష్టములకు బాలవ్వుంగదా.

## పరీక్షలు

పరీక్షదినములు వచ్చినవి. తొమ్మిదిగంటలలోగా తొందరగా రెండువేడి మెతుకులు తిని యెప్పటి పరీక్షపాఠము లప్పుడు మరొకసారి తిరగవేయుచు, ప్యాసుమాట కేమిగాని తమ యింటి వారియొద్ద డాబు చేసి డ్రస్సుమాత్రము నీటుగా వేసుకొని, చుట్టలు కాల్చుచు. ఖిల్లీలు నమలుచు, గుఱ్ఱపుబండ్లపైనుండి గోటుతో వచ్చి ప్రశ్నపత్రము చేతనందుకొని యెగదిగ జూచి. యెద్దియు దోచక "ప్యాన్ పెన్ పేపర్'' అని యరచుచు, కొంతసేపు వ్రాసినట్లు నటించుచు బైకిదాటి యధేచ్ఛ న్భోవు భాగ్యపాటి సోమరిపోతులును; ప్రశ్నముల కుత్తరములు ప్రశస్తముగ వ్రాసి, తమపేరులు మాత్రము వ్రాయుట మరచి, పైకివచ్చి చేతులు పిసుకుకొనుచు గోలవెట్టు మతిభ్రష్టులును; చెంతనున్నవారిది కాపీకొట్టి పైకీడ్వబడిన దొంగలును; ఈ లెక్క "కాన్సరే"మోయియని తమప్రక్కనున్నవారి ప్రాణములు దీయుచు, గుసగుసలాడి, వాచిమన్న చే జీవాట్లు తలవాయ దినుచు, ప్రశ్నముల కుత్తరములు తోచక, పరీక్షహాలు వదిలిపెట్టలేక, యాకాశము జూచుచు, నందరికన్న నాలస్యముగ మిక్కిలివ్రాసినట్లు పైకివచ్చి, తమవారియొద్ద డాబుచెలాయించు బూకరిముచ్చులును; రాబోవు సంగతి చూచుకొనక గడచిన ప్రశ్నములం గూర్చి చింతించు బుద్ధిహీనులును; కడుపువెలితి కొప్పక పీకమోయ తిని" చుట్టకాల్చి పైకి బోయి కాళ్ళు కడిగికొని, నీటుగ నలంకరించుకొని, తమవారి దీవనల గైకొని, యగుపడినవారికెల్ల దా బరీక్షకు బోవుట దంభముగా దెల్పుచు

ఖిల్లీల దుకాణమునొద్ద యొడలు మరచి కొంత యాలస్యము చేసి చుట్లు త్రోవయైనప్పటికి నొకసారి వలపుకత్తెల యిండ్ల చెంగటబడి వారి కగు పడునట్లు వీలు నేసికొని, తుదకు ప్రైము మించునని యొక్కూపున పరుగిడి వచ్చి. లబ్బలు కక్కుకొనుచు మాటైన నాడలేక రోజుచు నరగంటకు పైగా నాలస్యముగ వచ్చి పరీక్షహాలులో జొరనిమ్మని యచటివారిం గాలు నేతులు పట్టుకొనుచు, కావలివారిచే నిరాకృతులయి నిస్పృహతో నెత్తినోరు కొట్టుకొని పలవించు సోమరిపోతు వన్నెల విసవగఱ్ఱలును; "పరీక్షలో వ్రాయుటకేమిగాని పకోడీలెంతో బాగున్నవి కడుపు నిండ పట్టించు" డను తిండిపోతులును; "స్టాప్" అని యన్నను దురాశ వదలక యేమో పరపర వ్రాయుచు, తుదకు తమ కాగితముల నంగీకరింపని వారిం బ్రతిమాలుకొనియు, గార్యములేక, యావదిన్న పసులవలె నెద్దియు దోచక దేవులాడు చాదస్తులును; ఎట్లు వ్రాసితివని యడుగ సామాన్యముగ వ్రాసితి నిపుడెట్లు చెప్పగల మను బుద్ధిశాలురును; ప్రశస్తముగ వ్రాసితిమి తప్పక ప్యాసగు"నను బూకరిగాండ్రును; "ఇళ్లనుండి ఫలహారము లిట్లు తెచ్చుకొన్నచో మాసామాను లెట్లు చెల్లును? దండుగకు వచ్చినా"మను మిఠాయివాండ్రును; తమపిల్ల లెట్లుంటిరో చూడ వచ్చిన వారును; కలములు చెక్కుచు, గాగితము లందిచ్చుచు గడబడగ దిరుగు ప్యూనులును: యమకింకరులవలె బచారీ సేయు వాచ్‌మన్లును; పరీక్షహాలున నైదు రోజులవరకు సందడిచేసిరి. ఉడుపు లైనపిదప వ్యవసాయదారుల వలె విద్యార్థు లెల్లరు యధేచ్ఛ న్నాటురంగులం గొందరు, నాటకములం గొందరు, దమయూళ్లం గొందరు చుట్టాల యిండ్ల గొందరు సుఖముండిరి.

## రామయ్యగారికి వీడ్కోలు

విశాఖపట్టణమున నాలుగైదు హరికథలు చేసినాడ నచట నొక వెలనాటి నియోగి చిన్నవాడు నాకు మిత్రు డయ్యెను. అతడు మిడిల్ స్కూల్ ఫస్టుక్లాసులో ప్యాసయినాడు. మిక్కిలి సొగసుగ దెనుగు,

ఇంగ్లీషు, నాగరీ, వ్రాయగలడు. అతనికి మేరు మందరములవంటి యిద్దరు మేనమామలు కలరు. వారిరువురు సకలశాస్త్రవిదులు. అనేకభాషలు తెలిసినవారు. చిన్న మేనమామ విజయనగరము చిన్నప్రభువువారికి గురువు. (లింగం లక్ష్మీజీ) గ్రహచారవశమున కారాగృహమున తొమ్మిదేండ్లుండి. విముక్తుడై విశాఖపట్టణమున నాకథలు విని మిక్కిలి యానందించి నన్నెంతో ప్రీతిగా జూచుచుండును. అన్నిభాషలలో బండితుడైన యంత ధీరు డీదేశములో నుంటయరుదు. పిదపవిజయనగరమునకు వచ్చినాడను.

గీర్వాణాంధ్ర కావ్యముల జదువుచుంటయు, బాడుచుంటయు. వీణ సాధకము సేయుచుంటయు, హరికథ లొనర్చుచుంటయు, శృంగారరసమున నోలలాడుచుంటయు నాపనులు. ఎఫ్. ఏ. పరీక్ష కపు డారుసబ్జెక్టులు. తెలుగు, ఇంగ్లీషు. హిష్టరీ, లాజిక్కు, ఫిజియాలజీ. మేధమెటిక్సు, మేధమేటిక్సులో తప్ప తక్కిన సబ్జక్టు లన్నియు ప్యాసయినవి. పరీక్ష పోయినందుకు కొంత చింతించినాడను. అంతట నాభార్య ప్రధమరజస్వలాయౌటచే ముహూర్తముచేసికొనుటకు రామభద్ర పురమున కేగినాడ. ప్రైవేటుగా జదివి రెండవసారి పరీక్షయిచ్చుట కుద్దేశించినాడ గావున వెంటనే యామె నావెంట గొనివచ్చుటకు వీలులేక పుట్టింట నుంచి విజయనగరమునకు రావలసివచ్చెను. రెండు నెలలు మాత్రమే పరీక్షకు జదివినాడను. పరీక్ష యిచ్చుటకై విశాఖపట్టణమున కేగితిని. డబ్లు రామయ్యగారి యింట బసచేసి పరీక్ష లయిన పిమ్మట నాయూర దిరిగి హరికథలు చేయ బ్రారంభించితిని. అంతట రామయ్యగా రచట నుద్యోగము చాలించుకొని స్వకుటుంబముతోను దన వెలయాలి కుటుంబముతోను స్టీమరుపై మెద్రాసునకు వెడలిరి. అతని దిగ బెట్టుటకై నేగూడ స్టీమరున కేగితిని. అదియే నే దొలిపర్యాయము స్టీమరుపైకి బోవుట. ఉప్పుటేటిలో దెప్పల నెక్కి కొంతమేర సుఖముగాబోయి, పిదప మేమున్న పడవ లొక్కుమ్మడి బొంగు కరటములతోనే నాకసమంటి దెబ్బున బాతాళమంటినట్లు క్రిందికి దిగుచున్న నంత విరిగెడు నలల నీటిచే దడియుచు, భయసంతో

షంబుల గదియుచు, నోడవాండ్ర బ్రతిమాలుకొనుచు, "నేరకవచ్చితిమి దేవుడా! నీదేభార" మనుచు, నూగులాట కోర్వక కొందరు వమనంబు చేసికొనుచు బాధపడుచుండ. గొంత సేపటికి విరుగుచూపక హెచ్చుతగ్గులం బొర్లు పెద్దకెరటంబులం దాటి స్టీమరుజేరి, జాగరూకతగ దోలునిచ్చెన లెక్కి స్టీమరుపై కేగినారము. ఏనుగు తల యాడునట్లు గాలికి స్టీమరు రెండు ప్రక్కలం దూగుచుండెను. కొన్ని గదులెంతో రమణీయముగ నలంకరింపబడి సౌధాంతముల మరపించి యున్నవి. అటుకులు మొదలగు ఫలహారములు పట్టుకొని కొందరు బ్రాహ్మణులు "సాహెబూ! సాహెబూ! ఎక్కువజాతి పిల్లను, పెదవిమాత్ర మెంగిలి నేయకు" మనునట్లు తమజాతిం గాపాడుకొనుచుండిరి. కడుపున జఠరాగ్నివలె స్టీమరు నడుమ నగ్ని కుండ మున్నది. ఒకచో కోళ్లు, గొర్రెలు దాచబడెను. మరియొకచో దుర్గంధము సహింపరాదు. మట్టమధ్యాహ్నపు వేడియెండ వెన్నెలవలె నీటిగాలివశమున దోచుచుండెను. ఇపుడు జవ్వనము గడచుటచే బుద్ధి తీక్ష్ణత దప్పి యున్నది గాన నపుడు జూచినది వర్ణింప జాలకుంటి నేమి నేయుదును? ఏమేమో వింతగనున్న స్టీమరుపై కొంతసేపుండి వలపు మొగమాటముతో వెలయాలిమోమును, వెలితిచూపులతో నిల్లాలి మొగంబును జూచుచున్న రామయ్యగారిని, గుత్తలంజం దెచ్చుకొనుట కసహ్యముతో నాధుని మోము చూడనొల్లక "సీసిక్నెన్" మిషను కనులు మూసికొని పడుకొన్న యాచార్యాణిని. సిగ్గుమాలిన పాతివ్రత్యముం జూపుచు మతిమాలిన మాటలాడుచు నవ్వు రామయ్యగారి వెలయాలివి గొంతవరకు జూచి వారినెలవు గైకొని తిరిగి పడవలకు దిగి కొంత సేపటికి "బ్రతుకుజీవుడా" యని యొడ్డు జేరికొంటిని.

నాకాయూర మిత్రుడైన నియోగిచిన్నవాడును, నేనును శృంగార శేఖరులమై వలపుకత్తెలం దడముచుంటిమి. ఒకనాడు నామిత్రుడు నాకు గల నిషా కోర్కెనుబట్టి నేనడిగినపిదప కాని బస్సిండికాయను చిన్నగురు మాత్ర నిండువపిక్కంత నాకిచ్చె నది సేవించి హాయిగ దిరుగుచుంటిని.

అపుడచటికి వచ్చియున్న విజయనగరపు డిప్యూటీకలెక్టరొక నియోగిపంతులు నాపాట వినగోరి నన్నిలిపించెను. అపు డతడున్న మేడ నెంతో కష్టముగ నెక్కినాడను. కాని మేడయంతయు దిరుగుచున్నట్లు కన్బడుటచే నతడున్న కుర్చీపట్టుకొని నిలబడినాడ. అతడు నన్ను గుర్చీమీద గూర్చుండ నియోగించెను. అపుడు రాతిరి పదిగంటలవేళ దెల్వితెచ్చుకొని యాపంతులుతో నాకు మిక్కిలి సుస్తీగా నున్నదేమో కాని కనులు దిరుగుచున్నవి. కరుణించి నాకు దోడిచ్చి నాబసకు దిగబెట్టించు" మని వేడుకొంటి నతడట్లు సేయగా నామిత్రుని యింటికి వచ్చి యెంత తలుపుతట్టిన నెవ్వరుం దీయకుండుటచే చీకటివేళ దడుముకొనుచు బడుచు, లేచుచు. నాలో నే నొచ్చుకొనుచు దారికై తడుములాడుకొనుచు, తుదకొక పరిచితుని యింటి కేగి తలుపు పిల్వగా నతడు వచ్చి "యేమి మామా! యింత రాత్రివేళ వచ్చినా వని యడుగగ" నయ్యా! నోరెండిపోవుచున్నది, నాల్కవెనుకకు లాగుకొని పోవుచున్న దేమందును నాయవస్థ! కొంచెము తరవాడి నాకిచ్చినయెడ నే బ్రతికెదను అంటిని. అపుడాధర్మాత్ముడు తన భార్యచే నాకు దరవాడియన్నము వెట్టించెను. అన్నము తిని తరవాడి త్రాగుటచే గొంత తెప్పిరిలి యిక నెన్నడుం జిన్నగురు సేవింపనని చెవులు నులుపుకొంటిని.

మరునాడు విజయనగర సంస్థానపు దావాల వ్యవహారముల నడుప నొక గోల్కొండవేపారిపంతులు తనయింట నాచే హరికథ చేయించి కడు సంతసించి నా కిరువదిరూప్యము లిచ్చి నన్ను గుఱ్ఱపుబండిపై గూర్చుండ బెట్టుకొని యల్లిపురమున నున్న యొక ముసలి పండు జమీందారునియొద్దకు దీసికొనిపోయి నాచేత నవధానములు చేయించెను, గ్రీకు భాషలో నేబదిమాటల వ్యస్తాక్షరీ చేయుట. పురాణము కోరినరాగములతో పుస్తకము గిరగిర ద్రిప్పుచు జదువుట. ఆల్‌జీబ్రాలో నొక సింపిల్ ఈక్వేషను నోట సాల్వుచేయుట, యిద్దరికి దెనుగు నిద్దరికి సంస్కృతము కవిత్వము చెప్పుట. పూలు లెక్కించుట నిషేధాక్షరి సేయుట. ఒక్కొక్క

పాదముచొప్పున నొకమారు చదివిన శ్లోకమును మరలచదువుట, ఛందో భాషణము సేయుట. ఆసభలో దిమిలెద్రావిడియైన నొకధర్మశాస్త్రవేత్త నన్ను దప్పించుట కొఱక కంకోష్ఠ పద్య మొకసారి కడువేగముగా జదివి నన్ను దిరిగి జదువు మనియె, నేదిరిగి జదువగా నతడు మాత్సర్యము దొరగి పెద్ద గొంతుతో నన్ను శ్లాఘించెను. జమీందారుడు మిగుల సంతోషించి యపుడే నాకు నూటపదారు రూప్యములు బహుమతి యొసంగి నాకది వార్షిక మొనరించెను.

## స్త్రీల సభలో హరికథ

భీమునిగారి బావయగు ప్లీడరు నాచే దనయింట హరికథ చేయించెను. ఆసభలో మద్దెల వాయించువాడును, నేను దప్ప మరి పురుషులు లేరు. రెండువందలకు బైగా నూరిలో దగుమనుష్యుల భార్యలు మాత్రమే కూర్చున్నారు, కొందరు పురుషులు చాటుననుండి నేనెట్లు చెప్పెదనో యని వినుచున్నారు. కథచాలించిన మీద నాస్త్రీలు తమలో దామువందా వేసుకొని నాకు డెబ్బదిరూప్యములు వెండిపళ్ళెములో బోసి చేతికిచ్చిరి, అందులో ఒకయిల్లాలు నాతో "అయ్యా! మీతలిదండ్రుల పుణ్య మేమో కాని, మిమ్ము జూచినపుడు దేవుని జూచి నట్లు మాకున్న" దనెను. నే బైటికి వచ్చినతోడనె అచట వేచియున్న పురుషులు. ప్లీడర్లు ద్యోగస్థులు మొదలగువారు "నారాయణదాసుగారూ! నేడు మీకథలో బేలవమైన మాట ఒకటియులేదు. మీ రేమన్ననకైన బాత్రు"లనిరి.

భీముడుగారు రాజమహేంద్రవరము చూడవచ్చునని నన్ను వెంట తీసుకొనిపోయెను. ఇద్దరము బండి చేసుకొని కతిపయప్రయాణంబుల రాజమహేంద్రవరము జేరికొంటిమి. అదివర కొకసారి మాత్ర మాపురిం జూచినాడను. పేరన్నయు నేను నచటి యొక గొప్పప్లీడరుకు పిఠాపురము దివానుయొద్దనుండి సిఫార్సు పట్టుకొని వెళ్ళినారము. సామర్లకోటలో పడవెక్కినారము. కడు శీతకాలము. గది పుచ్చుకొనక పైభాగమున

పడుకొని, మిక్కిలి చలిదెబ్బ తిని, మరునాడు రాజమండ్రికి బోయి యా పంతులకు మాయుత్తరము గనపర్చితిమి. అతడు మ మ్ముండమనియెను. ఆ సాయంత్రము శరీరపుబడలిక పోవుట కొరక యేగాదిలేహము తీసుకొని రమ్మనగా బేరన్న తెచ్చెను. అందు నాలుగువంతులు నేను, నొకవంతు బేరన్నయు బుచ్చుకొంటిమి. పిదప భోజనము బాగుగ జేసినారము. ఆ పంతులు నాచే బురాణము చదివించెను. మిక్కిలి సంతోషించెను. పదు నొకొండుగంటల కిరువురకు మిక్కిలి నిషాచేసి భయము తోచెను పన్నెండుగంటల కాపంతులును నిద్రతెలిసి యేదో వక్కముక్క వచ్చినట్లు దోచెను. "మా యిరువురకు నాల్క యెండిపోవుచున్నది ఎవనినైన వైద్యున బిలిపించు" మంటిని. అతడు వైద్యుని రప్పించెను. వైద్యుడు మా సంగతి విని పెద్దనిమ్మపండ్లతో వచ్చి యాపండ్లరసము మాయిద్దరికి బిడిచి యిచ్చెను. బిమ్మట నొకగంటకు సుఖముగ నుంటిమి. ఆలేహ. ములో నుమ్మెత్తగింజలు కలిపి యుండవచ్చును. కొబట్టి యిట్లు బాధిం చెను. పంతులు పిదప మాచే రెండు హరికధలు చేయించి యెనుబది రూప్యము లొసగెను. అచటనుండి కాకినాడకు వెళ్ళినారము.

### నేను విక్రమోర్వశీయనాటకములో రాజు పాత్రధరించుట

కాకినాడ నాటకపు కంపెనీవారు మమ్ముల నెంతయో యాదరిం చిరి. విజయనగరపు సంస్కృత నాటకులు పిఠాపురములో నపు డాడుచుం డిరి. కాకినాడ కంపెనీచే గూడ సంస్కృతనాటక మాడింప దలచి విక్ర మోర్వశీయము నేర్పి నే రాజవేషము వేసినాడ. నాడు రెండువందలకు బైగా దొరికెను. మరునాడు మధ్యాహ్నము నాటకశాలలో నే బడుకొనగా నచటి యొకమిత్రుడు నాపై వసంతము చల్లి "ఇదిగో యుత్తరము, నీ భార్య సమర్తాడె ననెను, నాటకులు మాకు నూటయేబది రూపాయలిచ్చిరి. పిదప కశింకోటకు వచ్చినాము. కశింకోట జమీందారుడు సుగుణశాలియు, దానకర్ణుడును. నాచే హరికథ చేయించెను. అపుడు పప్పువెంకన్న వీణ

వాయించుచు నావెన్క బాడెను. అదివరకు నన్ను సామాన్యముగా జూచుచు వచ్చిన పప్పు వెంకన్న నాడు నా కథ విన్నప్పటినుండి నాపాటను మెచ్చుచు తరుచుగా హరికథలలో నా వెన్క బాడుచుండును,

## కవితాశక్తి పరీక్ష, విజయము

భీముడుగారు నన్ను దొల్లి సత్కరించిన పంతుల కప్పగించెను. ఆ పంతులు మాధ్వుడు. రాజమండ్రి వకీళ్లకెల్ల మేటి, మిక్కిలి దొడ్డవాడు. వ్యసనరహితుడు, నా కవిత్వమునం దభిరుచి కలవాడును. భీముడుగారు నన్నొక సాయంత్రమున నచట నభినయమున ప్రసిద్ధిచెందిన ఒక వేశ్యయింటికి దోడ్కొని పోయెను. ఆపె యభినయించెను. నా కత్యామోద మయ్యె. నే బాడగా నాపెయు మిక్కిలి సంతోషించెను. ఆ రాత్రి పంతులుగారియింట బురాణము జదివినాడను. ఉత్తరగోగ్రహణ మిటజరుగుచున్న ట్లున్నదని సభికులందరును సంతోషించిరి. పంతులుగారికి నాయందు మరింత ప్రేమ కలిగెను. అతని కొక కొమారుడును, లక్ష్మిదేవివంటి భార్యయును కలరు. ముగ్గురు మాణిక్యములవంటి తమ్ములుగూడనున్నారు, తల్లియునున్నది. నెలకు మొత్తముపై నతని యార్జనము వేయిరూప్యములకు దక్కువుండదు. పంతులు పగడపు తీగెవలె నెర్రని సొగసైనవాడు,

మరునాడు నాచేత నవధానములు చేయించెను. రాజమండ్రీలోని ప్రసిద్ధమైన కవీశ్వరు లాసభకు వచ్చియుండిరి. అందులో ఒకడు చిత్రవివాహకర్త; అతని నచట గొప్పపండితు డనియు, గవీశ్వరుడనియు, విచిత్ర వివాహపరులు కైవారములు సేయుచు వచ్చిరి. అతడు నన్నాయవధానమునందు "నఖలు నఖలుబాణః"అను శాకుంతలశ్లోకము నాంధ్రీకరింపు మనియె. అవధానము ముగిసినపిదప పంతులుగా రతనితో "నేదయ్యా! యా శ్లోకమునకు మీరుచేసిన తెనుగు చదువు" డనియెను. ఆతడు రెండు గీతములు చదివెను. అందుకు నే జిరునవ్వుతో "నే

మయ్యో! ఒక శ్లోకమునకు రెండుపద్యములు చెప్పవలెనా? మీ పద సౌష్ఠవ మన్నాళ్ళాలోచించి, యాలోచించి తుదకు బీరకాయపీచువలె చేసినా" రన. స్కూలు పాఠములు పెట్టుటకు దత్తరపడి చేసితి"ననగా "దద్దినము గాదుగదా! ఇంత తొందరపడి ముద్రింపనేల?" యంటిని. చిత్తగించుడీ యవధానమందు శుద్ధాంధ్రమున వివరించినాడ.

గీ॥ వలదు వలదయ్య యీ యిఱ్ఱి తలిరుమేన
నమ్ములేయుట పూవుల కగ్గియిడుట
లేడిపిల్లల నిలుకడలేని బ్రతుకు
లకట ఎచ్చట నీవాడి యలుగులెచట.

ఇట్లు నే జదువగా నచటి యొక ముసలి కవి నన్ను మిక్కిలి శ్లాఘించెను. అవ్విచిత్ర వివాహకర్త యప్పటినుండి నన్గని గుఱ్ఱుచుండును. మరియు నామఱునాటి యవధానములో పంతులుగారు పచ్చికబయలుపై నొకసీసము చెప్పు మనియెను.

సీ॥ ఆల దెక్కలి నంటి యాడెడు మిడతల
వేటాడు గోరల మాటులకును
ఆబోతుమూపుల నలరు నెట్రింతల
వలన నూరెడు నీలపాటలకును
గూళ్లలో బరపులకొరకు నాదోకల
వెంబడు కాకులవేటలకును
జిరుగాలపై జిలజిల బారు నెలయేటి
నీటిపై లకుముకి దాటులకును
గీ॥ చెలగి యుబ్బుచు నిసుకదిన్నెలను గంతి
బరుగు లిడుచుండు బసుల కాపరుల గలిగి
చుట్టుచెట్లు నొకవంక చిట్టివంక
బరగు పచ్చని పచ్చికబయలుగంటి॥

అది విని సభ్యులందరు, (విచిత్ర వివాహకర్తయు నతవి నొక గొప్ప కవిగా దలంచినవారును దక్క) మిక్కిలి సంతోషించి యింతరసవంతముగా గవిత్వము చెప్పగలవారు మిక్కిలి యరుదనిరి. ఆయూర నింకొక పాఠశాలోపాధ్యాయుడు తనకవిత్వము నాకు విన్పించెను. అతనిం గొంతవరకు గవి యనవచ్చును. అతడొనర్చిన యొకశతకములోని కొన్ని యూహ లతనివైనచో నతడు కొంత నుతికైన జాలును. విచిత్ర వివాహకర్త చీపర పావర తీగల జేపలబుట్టల్లి నల్లెద్దువచ్చెను. చెడవేసె అని తేటతెను గనుకొని కొన్ని హాస్యకరములగు వచన బంధముల విరచించెను. పామరులకుమాత్ర మవి రుచ్యముగ నుండుటచేతను, మరియు నతడు విచిత్ర వివాహరచనామిషంబున లోకోపకారిగ నటించుటచేతను బేరువడసెను. గాని సంస్కృత గంధమైన నతనికి లేదు. తెనుగులో నింగ్లీషులోను గొంతవరకు జ్ఞాన మున్నది. కవిమ్మన్యుడుగాని కవిగాడని నే దెల్పగ నాయం దచట గొందరి కతనియందు వెర్రి యభిమానమున్నవారికిమాత్రము కొంత యీర్ష్య కలదు. బొత్తిగా చిన్నవాడను. తరచుగా జిన్నగురుని వశంబున నుండువాడను గనుక కథలు చేయునపుడు పిన్నపెద్దలనక పొగరున నా యభిప్రాయంబుల వెల్లడించుచు తట్టాబాజీచేయుచుందును.

## పదవ ప్రయాణము

పంతులుగారు, భీముడుగారును నన్ను దోడ్కొని యమలాపురంబునకు బోయిరి, రెండుగంటల ముందువేసవి పగటియెండలో నఖండగౌతమిపై మాపడవ బైలుదేరెను. నొక్కులకొప్పువలె విరుగుచూపని కరటములతో నల్లనిగోదావరిపై నెండ న్వెన్నెలగ మార్చు చల్లని నీటిగాలి విందారగించుచు, బలురకంబుల ముచ్చటించుకొనుచు సాయంకాలమునకు లాకు దాటినారము. అచటి వ్యాఘ్రేశ్వరము కాల్వయొడ్డులు కొండలవలె బొడవుగ నున్నవి.

వానిపై పెరుగుపిడతలు దోసెలు, సాతాళించినసెనగలు నమ్ముచుందురు. ఒకలాకులోనినీరు మింటివరకుబొంగుటచే పండుగకు ముందు వెనుకలనున్న మనసువలె, పడవ లాకుననున్నతమై పిదప మామూలుస్థితి నందెను, ఫలహారము లొనర్చి లోకాభిరామాయణమున గొంతవరకు మేల్కొని నిదురించినారము. పడవను పొడవుత్రాట నగట్టి లాగువారి పాటలును గొన్ని పిట్టల పల్కులును, పడవలో గాలక్షేపమునకై జనులు చెప్పుకొను కథలును, తప్ప మరియేసందడియు వినబడలేదు. ఎవరికిం దెలియనటు ధనమార్జించుకొను దొంగవలె జప్పుడొకింతయు లేక పడవ బోవుచున్నది, ఇంటిలో బడుకొన్నట్టు చలన మగుపర్చని పడవలో హాయిగ నిద్రపట్టెను. కాల్వ కిరువంకల మెండుకొనుతోటల నానావిధ పక్షికూజితములు మేల్కొల్పుపలుకు లానందముగ వినుచు, నిద్రలేచి నారము. పడవ దిగి చెంగటితోటలో గాలోచితకృత్యములు తీర్చుకొని తిరిగి పడవనెక్కి పోవుచుండగా కాల్వ కిరుతట్ల నిండుజవ్వనమున గుబ్బచన్నవన్ గ్రిక్కిరిసినమాడ్కి గెలలగుపర్చు కొబ్బరులును, చెంగులు వెట్టుచుం ద్రుళ్లు కోతుల నిండుకొను మ్రాకిచెట్టుదాపు, హరిదాసులవలె నాశ్రయించినవారలను మాత్ర మొద్దున జేర్చుచు దాము దరిజేరలేని కట్టడ్రమా కులును. అచ్చటచ్చట రేవులకడ దడిసిన చీరెలు నెమ్మేనులకాంతి ద్రెట్టింపజేయ తడిసిబిగిసిన రవికలం గుబ్బధోయి బిగువుచూప గుచము లూరువులు పిరుందులు బయల్పడ బట్ట లుతికికొనుచు హాస్యంబున నొం డొరులపై వీర్లల్లుకొనుచు స్నానమాడు కాంతలం జూచి చూడనటు కొంగజపంబులజేయు ప్రాతఃస్నాతలును, పడవ నొడ్డునకు జేర్పించి కొందరు దిగువారును మరికొంద రెక్కువారలును కాలోచిత కృత్యము లకై యొడ్డున దిగి చాలాదూరమువరకు బడవ నగలియజాలక పడవ నాపుమని మొరబెట్టువారును పన్నిదములు వైచికొని ఒండొరుల మీరి పడవలు లాగు కూలివాండ్రును. ఎదుట వచ్చు పడవత్రాడు జూచుకొనక దెబ్బతివి యేడ్పు నవివేకులును, దొంగకూటమివలె తత్తరగ చెంగటి



'నవరసతరంగిణి' రచించు కాలమునాటి నడివయసుదాసుగారు



శ్రీ మదజ్జాడాదిభట్ట నారాయణదాసు

పూటకూళ్ళదిని పడుచు లేపుచు పడనందుకొనువారును తాము సుఖ
మ్ముండినకొలఁది పలువుర దోడ్కొని రక్షించు యజమానులవలె, దమకడుపు
నిండినకొలఁది పడవలం దత్తరగ నీడ్చికొని పోవు తెరచాపలును, పరప
తిం బోగొట్టు దబ్బరపక్కి రీతి గాలిం గూడనీని తెరచాపఛిద్రంబులును,
ఓడకొయ్యలం సవారీసేయుచు క్రిందివారల నిదానించి రెట్టలువేయు
వాయసంబులును, కొంతదూరము దనుక పడవలో గూర్చుని కీర్తనలు
బాడుచు ప్రాప్తమును దబ్బందుకొని యింకొకపడవ నెక్కి పోవు యా
చకులును, బడకింపుచు నమలాపురంబున కేగినారము;

అచట పంతులుగారు కోర్టుపని చూచుకొన్నపిదప నాచేత హరికథ
చేయించి యపుడే రాజమండ్రికి జనిరి. ఎనుబది రూప్యములవరకు భీముడు
గారు నా కొరకై వసూలుచేసి యొద్ద నుంచుకొనిరి. భీముడుగారు నతని
తల్లియు నేనును మోడేకుర్రునకు బోతిమి. అచట యతని చుట్టాలు
కలరు. కాల్వయొడ్డున నున్నదాగ్రామము. అందు కోతులు మెండుగ
గలవు. అచట రెండుపూటలుండి తిరిగి రాజమండ్రీ జేరుకొంటిమి.

## భీముడిగారి స్థితి

భీముడిగారి భార్య యొకకొమార్తెను గని స్వర్గస్థురా లయ్యెను.
తన తల్లి మిక్కిలి తెల్వితేటలుగల తెల్లనిముసలిది. నాతో బలుమారులు
అన్నా! భీముడు తిరిగి పెండ్లాడడట. నే నెంతచెప్పినను విన దేమి
చేయుదును? నా కిరువదేండ్ల లోపున నిద్దరు కొడుకులు నొకకూతురును
బుట్టిరి. వీనియన్న యొకకొడుకును గాంచి కొన్నాళ్లక్రిందట మృతు
డయ్యెను. అట్లు పిన్నతనమునందె వైధవ్యము నందియు, నెంతో శ్రమ
పడి పిల్లలను పెంచుకొనుచు మర్యాదను కాపాడుకొంటిని. ఇపుడు వృద్ధు
రాలనైతి. నామాట వినకున్నాడు. పెండ్లి చేసుకొమ్మని బోధించుము''అని
నాతో భోజనసమయమున నొంటిగా జెవి నిల్లుకట్టుకొని చెప్పుచుండును.
ఆపె వండినపదార్థ మమృతోపమానము.

భీముడుగారు తనచేత జిక్కిన ద్రవ్యము తనదికానీ పరులది కానిమ్ము, రూపాయి గవ్వవలె ఖర్చుపెట్టువాడు. అతని కింగ్లీషునందు కొంతపాండిత్యము కలదు. మిక్కిలి రసజ్ఞుడు, మాటలపోగు. కోటు, పంట్లాము, బూటు, పాగా, కాలర్ ధరించి నీటుగ నుండును. కొంతవరకు గవితా గాన రసంబు లెరుగును. అతనివయసు ముప్పదైదేండ్లుండును. అతని పొడ వారడుగు లుండును. అతనికి సొగసైన పెద్ద కుంద్రని పింగళనేత్రములు కలవు. తెల్లని బలమైన శరీరము కలవాడు. పరోప కారముకై యగ్గిలోనైన దుముకునట్టి సాహసధైర్యములు కలవాడు, అత డందరికిం బ్రియుడు. నన్నెంతో కూర్మితో జూచుచుండును,

ఒకనా డతడును నేను నమావాస్యరాత్రి పదునొకొండుగంటలకు రాజ మహేంద్రవరము పాతయూరినుండి పైయిన్నెస్‌పేటకు బోవ నుద్దేశించి నాము. అపుడు మబ్బు గ్రమ్మి యుంటచే నక్షత్రకాంతి కొంచెమైనను లేక గాంఢాంధకారముగ నుండెను. మేముభయులము మాట్లాడక ముందు వా డెట్లు బోయిన వెనుకవాడటు పోవుటకు బన్నిదములు వైచుకొంటిమి. నా వాణీచెంగు భీముడుగారు పట్టుకొనిరి. నే ముందు నడచుచుంటిని. మాశరీరములుకూడ మాకగపడనంత చిమ్మచీకటిగ నుండెను. దారికై తడుములాడుచు గోడలకు శిరము దగుల దడుముకొనుచు నెవరు వచ్చు వారని యడిగెడువారికి బదులుచెప్పక నవ్వుచు, నడచినత్రోవనే నడుచుచు దుద కొంటిగంట రాత్రివేళ నొక మురుగుకుండీలో దిగబడి మిన్నకుంటచే నతడుకూడ నందు దిగబడెను. ఇట్లిర్వురము కృతస్నానులమై దుర్గంధ పంకము నుమియుచు దగిలిన దెబ్బలకు లక్ష్యముసేయక పకపక నవ్వుచు రెండు గంటలకు గోదావరిగట్టుదిగి మునికెడునీట బ్రవేశించితిమి. అటుపై నే దెల్వితెచ్చుకొని "అయ్యా! ఇక యేటిపన్నిదము? నదిలో చావ సిద్ధమైనాము" అని యనగా నతడుగూడ "ఇకచాలు రమ్ము పోయెదము" అనియె.

### ఆయన తల్లిగారి యిచ్ఛాపూర్తికై నా ప్రయత్నము

పిదప నదిలో సుస్నాతులమై యిన్నీసుపేటకు భీముడుగారితో బోవు చున్నపుడతనితో "అయ్యా! తాము మరిపెండ్లాడమని పట్టుపట్టు టనుచి తము. మీయమ్మ కడుముసిలిది. ఆపెను దుఃఖపెట్టరాదు. తిరిగి పెండ్లి చేసి కొనుడు. మీరు బ్రహ్మచర్యము సేయలేరు గద, పరస్త్రీలపొందు చెట్ట గదా!" యని యంటిని. అందుకతడు నవ్వి "రాత్రి పడ్డగోత పగలుపడు నట్టు. డబ్బిచ్చి తద్దినము కొనునట్లు. వదిలిన పీడ న్దిరిగి తెచ్చుకొనునట్లు నడికాలమున దిరిగి నాకు వివాహమెందుకు? దేవునికృపచే నొకపుత్రిక కలిగెనుగదా! చాలును. నే నానందరాయుడను గనుక మరి సంసారపు చిక్కు నాకక్కరలేదు. నాకంటె చిన్నవాడవు నీవు నాకు జెప్పవలయునా? మాయమ్మ నాతో జెప్పుమని నీ ప్రాణము గొరికెనుగాబోలు" అని బదులు చెప్పెను.

### భీముడుగారితో ఏలూరు ప్రయాణము

మరునాటి సాయంకాలమున మేమిరువురము నేలూరికి బడవలెక్కి బైలుదేరి చచ్చిచెడి సున్నమై మరునాటి సాయంకాలము నాలుగుగంటలకు బవరుపేట చేరుకొంటిమి, వెంటనే యొకప్లీడరింట భోజన మొనర్చి తిమి. ఆప్లీడరు ముప్పదైదేండ్ల నల్లటివాడు. చేతులకు మురుగులు, చెవులకు బోగు లతనికి గలవు. నలువురైదుగురు పిల్లలు కలవాడు. కడు మంచి వాడు. రసికు డతని కార్యు రన్నదమ్ములట. భోజన మైనవెంటనే యింగ్లీషు డ్రస్సు వేసికొని భీముడుగారు నన్ను దోడ్కొని పోవుచుండిరి కృష్ణకాల్వకట్టు దాటి యిరుకు జంతు లెన్నియో గడిచి తుదకొక యింటి కేగినాము. అచట నొక భోగకాంత చంద్రలేఖవలె వచ్చి యతని సత్క రించెను. నే దోడపెండ్లికొడుకువలె సావడిలో గూర్చుంటిని. అపుడు తంబురా నందుకొని యాపె సొగసుగ బాడెను. పిదప నేగూడ బాడగా నాపెయు నాపెబంధువులును మిక్కిలి సంతోషించిరి. అంతట నాపె నా

యొద్ద పల్లవి నేర్చుకొనుట కుత్సహించెను. రాజమహేంద్రవరమున నన్న భినయమున నోడలు మగపించిన యాపెకన్న నీపె సొగసుగా గన్పడెను. రాత్రిభోజనమునకు నేమాత్రము ప్లీడరింటికి దిరిగి వచ్చినాడ. నాపాట కూరి తగుమనుష్య లందరు కడుసంతసించి నన్ను దయతో చూచుచుండిరి. మరునా డుదయమున భీముడుగారు భోజనమునకు దయచేసిరి. పిదప వా రావెలబోటిని మరిగి, తిరిగి వివాహము నొల్లకుండిరని స్పష్టముగ నే దెలిసికొంటిని. రెండవమారుకూడ నా ఎఫ్॥ ఏ॥ పరీక్ష మేధమేటిక్సులో బోవుట తెలిసి మిక్కిలి నొచ్చుకొంటిని గాని మరి చదువ నుద్దేశింపలేదు. ప్రతిదినము మధ్యాహ్నము భీముడుగారితో వెలచేడియయొద్ద కేగుచు బాడు చుంట ప్లీడరుగారియింట భుజించుచుంటయును సంస్కృతములోనుండియు ఇంగ్లీషులోనుండియును గాళిదాసు, షేక్స్పియరు దొట్టి మహాకవుల పద్య ములు తెనిగించుచుంటయు నచ్చువిడిచిన యాబోతుకోడెవలె పన్నెగ దిరుగుచుంటయు నా వృత్తి. అపుడపుడు విశాఖపట్టణమందు. విజయ నగరమునందు నే నొనర్చిన సఖ్యముల యెడబాటు కొంతవరకు నన్ను బాధించుచుండెను గాని మొత్తముపై సహజముగ నిశ్చింతుడ నౌటచే హాయిగనుంటిని.

నీలపు టుంగరములవలె ముంగురులు హాయదీసి దిద్దుకొనుటయు కురులు నున్నగ దువ్వి పట్టెడు సిగ వేసికొనుటయు షర్మాపెట్టుకొను టయు, నీగకాలంత నల్లని యగరుబొట్టుంచుకొనుటయు, సంజవేళ చిన్నగురుని వశము బొంది యెడతెగక చుట్టలు కాల్చుచుంటయు, బాట కుడనని గాని కవిననిగాని వచ్చినవానినెల్ల నెదిరించుచుంటయు, బడు చుల నొయారముగ జూచుచుంటయు నాచర్యలు. సంస్కృతము. తెనుగు ఇంగ్లీషు వచ్చియుండుటచేతను, పాటయందు ముఖ్యముగ బల్లవియం దసమానపాండిత్య ముండుటచేతను, పండిత పామర రంజకముగ గవి త్వము చెప్పగలుగుటచేతను ఇరువదినాంగేండ్లవయసులో కడురమ్య రూపమున నుండుటచేతను నాపొగరుబోతుతనమును సహించి పెద్ద

పిన్నలు నన్నాదరింప జొచ్చిరి. నావిగాని యితరులయవిగాని తప్పొప్పులు బాహాటముగ వ్రాయుచ్చుట కొంత నాస్వభావము. ఇంతకు నేనెట్టివాడ నైనప్పటికి లోకులు నన్నాదరించుటకు ముఖ్యకారణము దైవకృపయే యని యనుకొనుచుందును. పరులలక్ష్యముకాని మరి యేవిధమైన భయముగాని నాకెన్నడును లేదు. చిన్నగురునివశమం దున్నపుడు కొంతవరకు పిచ్చియనుమానములు పిరికితనము కూడ నన్నంటు చుండును. "పహిలా పచ్చీస్" నాటనేతను బలువురు నాయిష్టానుసారముగ నన్నాదరించుటచేతను దృణీకృత పురందరుడనై విహరించుచుంటిని.

భీముడుగారు నాతో నొకసాయంకాలమున నోయీ ! యిక నాకు బెళ్లెందుకు? నీవు చూచితివిగదా యాపె నన్విడిచి యితరుల కూటమి చేసినట్లు నీవు ఋజువు చేసినయెడల దప్పక తక్షణమే పెండ్లి చేసికొనెదను. విశ్వాసముకలది కులాంగనయైననేమి వేశ్యాంగనయైననేమి హాయిగ గాలక్షేపము చేయవచ్చును గదా! యనెను అందుకు నే జిరునవ్వుతో "నాహా! వెఱ్ఱికుదిరెను రోకలి తేరా తల చుట్టుకొనెద నన్నట్లున్నది; మీ తెల్వితేట లిట్లు పరిణమించెనా ?

కం॥ వెలయాలి వలన మోహము
కలుగదు మరి కలిగెనేని కడతేరడయా
పలువురు నడిచిన దారిని
బులు మొలువదు మొలిచెనేని బొదలదువేమా

యని యొకమహాయోగి చెప్పలేదా. మార్పుగోరుచుంట మన స్వభావము. అత్త, మామ, పెనిమిటి, కులము. మర్యాద కట్టుబాటులకు నలపడిన కులాంగనల చిత్తమే గురి దప్పునన మోసపుచ్చి ధన మార్జించుటకు ముప్పబడిన వెలబోటుల విశ్వాసము గగనారవిందము శశవిషాణము, వంధ్యాపుత్రుల వంటిది. ఇంతకు వారిసంయోగము పరస్త్రీసంభోగమువలె రసాభాసమని యాలంకారికులు నుడువలేదా ! నా

యభిప్రాయము స్త్రీలే యవిశ్వసనీయు లందు రూపాజీవలు శ్మశానకు సుమమువలె వర్జనీయు లట్టి లోకాపకారిణులు విషవస్తువులవలె దైవ సృష్టిలో గన్పట్టి యసాధ్యరోగార్తులకు విషప్రయోగముబోలి మర్యాదా హీనులకు మాత్రమే వేశ్య లేర్పరచబడిరి. వేశ్య తనవారినందరిని వదలి తనయాస్తితో మీయింటికి వచ్చి మీవారినందరిని మంచి చేసికొని మీసేవ కొడబడినచో కొంత శుద్ధిచేసిన విషమువలె విగతభార్యులైన మదనజ్వరార్తులైన మీబోట్ల కౌషధమగు నట్లు కానిచో, నెల్లవిధము లది జెట్టకు కారణ మగును" అంటిని. అందుకు వెడనవ్వు నవ్వి "విను మోయీ! వేయేల? ఆపె నన్ను విడిచి యితరులతో సంభోగించినట్లు దృష్టాంత మగుపర్చెద వేని బెండ్లాడెదను. నీవాపెను శోధించు, నీకు సందిచ్చెద నేడే రాజమంద్రికి బోయి నెలరోజులలో దిరిగి వచ్చెద. పిదప నీవెట్లు చెప్పిన నట్లు నమ్మెద" ననియె. అందుకు "ధర్మమా! నే మీకు శిష్యప్రాయుడను, మీరుంచుకున్న దాని శోధింప న్యాయమా?" యను నన్ను భుజమున దట్టి "నా కీయుప కారము సేయుము. కులాంగన కాదుగనుక నీవు శోధింపవచ్చును" అని యతడు రాజమహేంద్రవరమున కేగెను.

## వెలయాలి పరీక్ష

పిదప నే వింతయుత్సాహమున నతని కూర్మికత్తె యింటికేగుచు కంటోన్మెంటులో సిపాయీల యిండ్లబారువలె విరుకు జంతులలో గ్రిక్కిరిసిన భోగకాంతల కొంపలవైపు బరికించుచు, నడునడుమ నీగలు ముసురు మాంసఖండములను వ్రేలగట్టబడిన భాగకంకాళములును, జెంగటం దారుసారమేయంబులుం గలిగి దుర్గంధాకరములగు కటికి దుకాణములకు దాపున గబాబుపుల్ల నంచుకొనుచు, దినమంత కష్టపడి యార్జించిన ద్రవ్యము వినియోగించి పెద్దగురునకు వశులై జట్టుకట్టి యసందర్భ ప్రలాపంబుల జోగుచున్నవారలకు మొదటమాత్రము స్వచ్ఛమగు మద్యమిచ్చి పిదప సొలపుచూపుల మరపించి మద్యమున సగబాలు నీళ్ళుకలిపి మెలపున

వ్యవహరించు సొండీచేడియలను; చల్వచేసిన తాబొందులు. రవికలు, వాణీలు ధరించి సబ్బుతో మోములు కడుగుకొని సుఖజాడ్యంబుల నారోగ్యంబుదరిగిన యవయవంబుల గుల్లనగ అలంకరించుకొని తలుపుచాటుల నుండి దోబూచి చూపు పెదభోగకాంతలతో సరసమాడు నీచువిటు బొడగాంచుచు శరవేగమున నేగుచుండ నెందుకో బైటికి వచ్చి నన్నుజూచి భీముడుగారి వారకాంత ధర్మమా ! యింతలో మరచి మాయిలు దాటి పోయెదరా! యెవతెకొరకు కాతత్తర దయచేయుడు" అని ప్రేమతో నా చేయి వట్టుకొని లోనికి గొంపోయెను.

అదివర కాపెయొద్ద బల్లవిలో దనంతవాడు లేడని డాబుకొట్టుచున్న నొక గాయకుని జూపించి మీరుభయులు పాడగా విన గోరుచున్నాను" అనియె. అపుడు మాయిరువురి ముఖవైఖరి యెట్లు వర్ణింపగలను! కేసు గెల్చుటకన్యోన్య జయేచ్ఛల వాదించు ప్లీడర్లవలె భోగేచ్ఛం బోరాడు వృషభద్వయంబుమాడ్కి నొండొరుల మీరి రాగ తాన పల్లవులం బాడుచుంటిమి. అతడొక పొట్టి బ్రాహ్మణుడు. ఆయూరి వాస్తవ్యుడు. కొంచెము నాకంటె వయసున పెద్ద. నాకంటె గొన్ని వింతరాగములు తెలిసినవాడు గాని హిందూస్థానీ, కర్ణాటకము జోడించిపాడు నేర్పునాకుంట చేతను, నాశారీరమున కతనిగొంతు నీరసమౌటచేతను, గ్రొత్తయొక వింత యోటచేత నితరమగు తెల్వితేటలు నాయందుంటచేత నచట గూడియున్న వేశ్యాంగనాసభ నే బాడినపుడెల్ల శ్లాఘించుచు నతనిపాట నుపేక్షించుచుండెను. అంత "రెండు లక్షల గ్రంథము చదివినాడను బల్లవిలో నీ పని తెలిపెదను" అని యతడు చతురస్రగతిలో బాడుచున్న బల్లవిని త్ర్యస్రగతికి మార్చి పాడజొచ్చెను. నేనపుడు చిరునగవు నవ్వి "అయ్యా! మీరెన్ని లక్షల గ్రంథమైన జదివియుందురు డప్పాలకేమి గాని మునుపటి చతురస్రగతి చేతనిల్పి నోటత్ర్యస్రగతిగ బాడినచో మీలయజ్ఞానము ప్రౌఢ మని యొప్పుకొందును" అంటిని. అత డెన్ని మార్లు యత్నించినను జేయజాలక "అట్లు ప్రశ్నింప వచ్చును గాని చేయ

రాదు" అనియె. అపుడు సభికులందర రౌనన ధారాళముగ భిన్నగతుల నాపల్లవిం బాడి చూపించితిని. అంత అచటివారెల్ల నతనితో ఇన్నాళ్లు నీ వెంతలేసి గోతాలు గోయుచుంటివి? ఆహా గుద్దులాడినగాని కులము బయలు పడదుగదా! యనిరి. పిదప నతడు గూడ నా అయజ్ఞానమునకు విధిలేక మెచ్చుకొనుచు సన్నసన్నగ సభనుండి యేదో మిషపెట్టుకొని జారెను.

పిదప రెండుగంటలవరకు బాడుచు నభినయించుచు సభికుల మనంబులు జూరగొంటిని. సభ చాలించినపిదప భీముడుగారి వారకాంతయు నాపె చుట్టాలు మరికొందరు వేశ్యలు నాకభీష్టసేవ లొనరించుచును నా యొద్ద మరునాటినుండియు బాట నేర్చుకొనుచుండిరి నూత్నయౌవనము గాన కవిత్వ ప్రతిభయు- చిన్న గురు కటాక్షము - తరుణవేశ్యా సంగమము నామనమున కత్యంత మదజనకంబు లయ్యెను, మీరాకపోకలకు బవరుపేట దూరము. చెంగటిహోటేలులో మీయిష్టానుసారముగ భుజించుట కేర్పాటొనరించితిమి. మీచిత్తానుసారముగ రాత్రి యిచటనే పడుకొనుడు. అట్లైనచో మీ సంతతసాన్నిధ్యము దొరకును" అని భీముడుగారి వెలయాలు నన్నింట నుంచుకొనియె. ఒకయువతి కాళ్ళు పిసుకుచు నిద్రలేపుట- యొకజవ్వని పలుదోముపుల్లయు నీరందించుట- యొక వన్నెలాడి తలదువ్వుట యొకమదిరాక్షి చిన్న గురుని తయారు చేసి వెండిగిన్నెలో వసబోసి యిచ్చుట- యొకపూబోడి స్నానమాడించుట యొకలతాంగి బ్రాహ్మణునిచే మృష్టాన్నముల దెప్పించి వడ్డించుట - యొకనీలవేణి భోజనానంతరము చుట్ట యందించుట, యొకమధురవాణి విడె మిచ్చుట - యొకకనకాంగి శయ్య నమర్చుట- యొక సరోజముఖి చందన మలదుట- యొకహరిమధ్య పూలు ముడుచుట- యొకమదవతి వీవనబట్టి విసరుట- యిట్లహోరాత్రములు విడువక పెక్కు- వేశ్యారత్నములు శుశ్రూషజేయుచు నన్వీధిలోనికి గదలనీక గాన మభ్యసించుచుండిరి.

వారలకు నాపాట రవంతయు న్రాదని వారెరిగియు మద్గాన శ్రవణ కుతూహలంబులం జొక్కి యిట్లు పరిచర్యలొనరించుచుండిరి, దేనివలలో జిక్కుకొనెదనో యని యెవతెమట్టు కది నన్వలపింప నుద్యమించుచుండెను. ఆ సంగతి స్పష్టపర్చుటకై వారలతో "ఇదిగో నాయొద్దవిద్య నేర్చుకొనుస్త్రీలను పుత్రికలవలె జూచెద" నంటి నందుకు భీముడుగారిసాని నేమాత్రము శిష్యురాల నెన్నటికిని గాను సుడీ యనియె నాపెయింట ప్రతిదినము నేబాడు పాటవిలువ యింతంతన రాదు. పడుచులతో విలాసము చేయుటకన్న మరి యేకోర్కెగాని పనిగాని లేకున్న కోడెగాయకుని పాటచవి చెప్ప నలవి యగునా? భీముడుగారి వారకాంతతో నతని ప్రవాసమునం దాపె యక్క నుంచుకొన్న యాచారి యొకడును నాకు భోజనము వెట్టిన ప్లీడ రొకడును సరససల్లాపములు దరుచు నేయుచుంట నే బరికించి నామనసులో నాహా వెలయాలి యెంతకైన జాలును. భీముడుగా రిచట నున్నపు డీమొగము లెన్నడైన నిచట గన్పడెనా! ఈ ప్లీడ రట కొంత విలువగల చీరె కొని యిచ్చుట కేహేతువో యని యనుకొంటి, నాసాయంకాలం ఆపె నాతో నయ్యా! నేడు నాయిష్టానుసారము తా మంగీకరింపవలసిన దనె నందుకు నే సరియే యేమి నీయుద్దేశమంటి నపుడాపె నా కభ్యంగనము చేయించి తన యంగకములు నన్నంట రాయుచు దువాలుతో నాతల యొత్తి చిక్కెడల్చి సాంబ్రాణిపొగ వైచి చల్వదుస్తులు కట్టింపించి నానుదుట నగరుబొట్టు పెట్టునెపమున నొకచే జుబుకము నొక్కుచు ఫాలమున బాగున్నదా చూచుకొను దని యిరువుర మన్యోన్యముగన్నపుడు నట్లొక నిల్వుటద్దము దరి జేర్చి సొలుపుచూపులం జూచుచు నంత యొకతె యందిచ్చిన యాసవముగిన్నె నందుకొని నేమీకు సేవకురాలను గాని శిష్యురాలను గాను. నేడు మీప్రసాద మాసించెద నని సగము నాకిచ్చి తక్కినసగము దాబుచ్చుకొని ఫలహారముల దెప్పించి నానోట బెట్టుచు నేను నేడు మీయధీన మనియె నందుకు నే మందహాసము చేసి భీముడుగారు

నిన్నే నమ్ముకొన్నా రతనికి నాయెం దెంతో దయ యింతేగాక స్వల్ప కార్యములకు దిగినచో లోకులు నన్మన్నించెదరా యేమి నీకిట్టి బుద్ధి పుట్టె నంటి నపుడు నన్నాపె యాశ్లేషించుకొన సాహసించుచు తన చంద్రహారములు నామెడలో వైచి నే వెలయాలను గాని యొకని యిల్లాలను గానుగదా భీముడుగారి పిచ్చికేమిగాని ప్రతికూలించిరేని యుభయులకు క్షేమముగా దదిరాఢి యనియె నపుడు నే దలయూచి తంబుర మీటుచు నీ పదము విను మని "చెలియ నీతోపొందు చింతకాయ" యని పాడుచుండగా నాకస్మికముగ భీముడుగారు లోనికివచ్చి యేమోయి యని నవ్వీల్వగా మేమిరువుర మత్యాశ్చర్య సంభ్రమంబుల దిరిగి చూచితి మపుడతడు నాతో నీ విపు డిచటి హోటేలులోనే భోజనము సేయుచుంటివా యేమి నేనందు కౌనయ్యా యంటి న్మంచి పాటపాడుచున్నావే ఏమాయెనవ జింతకాయాయె నింతకుం గాగలకార్యము గంధర్వులు తీర్చి రంటి నత డొకింత తలయూచి బడలిక నటింప నాపె పరిచర్యలకు జొచ్చె నేను నింకొకగదిలో పడుకొని యౌరా యిదేటి చిత్రము? కల గవిన ట్లితడెట్లు వచ్చె నోపీనన్నెంచెనింతకు న్మించిన దానికి వగపేల ననుకొనుచు నిదురించినాడ. మరునాడు భీముడుగారు నన్నేసంగతియు నడుగకుండ వింత యయ్యెను. పిదప నాకు భోజనము పెట్టిన ప్లీడరు తనతో నేను బందరు పట్టణమున కేగినచో బాగుండు ననియె నందుకు భీముడుగారు నంగీకరించి నన్ప్రోత్సాహపర్చెను.

## బందరు, రాజమండ్రి కాకినాడలలో సంగీత హరికథాకాలక్షేపాలు

పిదప నాప్లీడరు నతనికుటుంబమును నేను నాటుబండ్లపై రెండు జాములకు గుడివాడలో దిగి యచటినుండి బందరునకు జేరుకొంటిమి. నను దోడ్కొనిపోయిన ప్లీడరు పెద్దన్నగారి యింట బస చేసినాము. వేసవినెలవులు గనుక యతని సోదరులందరు నచటనే యుండి రందు నొకడు వర్తకు డొకడు మునస బిద్దరు ప్లీడ ర్లొక డోవరసియ రొకడు సిరస్తదారుడును, అందరును మంచి రసికులు. నన్నెంతో యాదరించి

నాచే నొకకథ చేయించిరి. అపుడు బందరున గల పలువురు పిన్న, పెద్ద లేతెంచి కడు సంతసించిరి. పిదప విశాఖపట్టణమున నాకుఁ గృత పరిచయులైన రిజష్ట్రారుగారి యింటఁ బ్రవేశించితి. నతడు మిక్కిలి దొడ్డవాడు. సకల సుగుణ పుంజము. నన్ను బుత్రవాత్సల్యముతో జూచు చుండును. బంద రొక చౌడుపఱ్ఱపై సముద్రమునకు రెండు మూడు మైళదూరమున నిర్మింపబడియెను. ఉప్పెనచేత మిక్కిలి క్షీణదశ నొంది యున్నను నే నదివరకు చూచిన పట్టణము లన్నిటికంటె మిక్కిలిగొప్ప దిగా నుండెను. నూతుల నీరు కడలినీటికన్నను మిక్కిలి క్షారమును చేదును, సర్పచెముడు దొంకలు మెండు. ధూళి యపరిమితము. కృష్ణా కాలువనీరు మెండుకొనుటచే వేసవియందు మాత్రము కడు సౌఖ్యకర ముగ నుండును. బలు సంగీత సాహిత్యజ్ఞులు పలువురు కలరు. విద్వాం సులకుఁ దగు సంభావన మిచ్చి యచటిజనులు మన్నించుచుందురు. నేన చట సుమారు నూరు హరికథలైన చేసి రెండు వేలార్జించియుందును.

## లయపాండిత్యము

ఒకనాడు నే మొదటబసచేసిన యింట నొక గానసభ జరిగెను. చెన్నపట్టణము చాకలిపేట నివాసు డొక ముదుసలి సాతాని ఫిడెలరును కాంచీపుర నివాసియగు నొక వృద్ధబ్రాహ్మణ ఫిడెలరును. నెల్లూరు నివాసి యొక భట్రాజు పాటకుడును బందరునివాసి యొక జంగము ఫిడేలరును మరికొందరు ఫిడేలర్లును పాటకులును బందరులోని విద్వాం సులగు భోగమువాండ్రు మద్దెలగాండ్రును తాళగాండ్రును మొదలుగ రమారమి యరువదిమంది సంగీత విద్వాంసులు సభచేసిరి. నల్వురు ఫీడేళ్లు వాయించుచుండి రిద్దరు పాడుచుండి రొకడు మద్దెల వాయించు చుండె ముప్వురు కొల్పించుచుండిరి. తక్కినవారు లయపట్టుచుండి రావార్త నే విని చిన్నగురుని పుష్టిగ సేవించి యాసభకుబోయి కూర్చుం టిని. నన్నని యాసభ చేయించినయజమాని యయ్యా! మీరుకూడఁ బల్లవి బాడగల్గినయెడ బాడ గోరెద" ననియె నందుకు నే జిరునవ్వుతో

నదివరకు నాల్గవ కాలమున నారక్షరములు జాగాచేసి పాడుచున్న పల్లవి నై దవకాలము విలంబముగా మార్చి యొంటి యక్షరము జాగాచేసి మూడావృత్తములు పాడినాడను. ఫిడెలర్లుగాని పాటకులుగాని మద్దెల వాడుగాని కొలిపింపు విద్వాంసులుగాని లయకణిశము కాచుకొనలేక జాగాతెలిసికొనలేక తడబడ జొచ్చి రపుడు నేను ఇందరు విద్వాంసు లున్నారు. కానియొకడైనం జాగాకురాలేకుంట యాశ్చర్యమాయె" నని ముక్తాయించి జాగా వెల్లడిచేసినాడ నటుపై గొందరు పాడయత్నించుచు దప్పుచుండిరి. మద్దెలగా డొకసారియైన ముక్తాయింప జాలకుండె నపుడు నగ్గని పురజను లింతటి లయపండితు డిచటి కెన్నడు రాలే దని శ్లాఘించిరి. పిదప నావిద్వాంసులెల్ల నాపై గావేషి వహించి కట్టు కట్టి నాకవమానము సేయ బ్రయత్నించుచుండిరి. కాని మ్రింగరాని మిడిగ్రుడ్డునగు నేను వారికి లొంగకుంటిని. పై యూళ్ళనుండి వచ్చి యిదివరకచట సభలు చేసి ధనమార్జించుకొను విద్వాంసులు కొందరు పలాయితులైరి. కొందరచటి కక్షదార్లతోగలిసి నన్నాధింప సందు వేచు కొని యుండిరి. ప్రత్యేకము రాగతాన పల్లవులు బాడుచు బదిపన్నెండు సభలయందు మెప్పుపొందినాడను. బందరు పురమెల్ల రెండుపార్టీలయ్యెను బ్రాహ్మణులు బాజారి వర్తకులు కాలేజివారందరును నావైపు నాయూళ్లొ భోగమువాండ్రు నాప్రతిపక్షగా నుండిరి. నాకథలకు భోగమువాండ్రు మద్దెలకు రామనియు నాయూరి యొక జంగము ఫిడెలరుతప్ప మరేఫిడె లరును నావెంట వాయించమనియుఁ గట్టు కట్టిరి. కోవెలపూజార్లందర న్నదములును వారిస్నేహితులు మరికొందరు మాత్రము నాతరపై నా వెన్కపాడి వాయించుచుండిరి.

## టికెట్టు పెట్టిన అష్టావధానము

పంతులుగారి మేడలో నొకనాడు టిక్కెట్టు సిస్టముపై నష్టావధాన మొనరించితిని. రెండు పాదముల రెండు తాళములు, రెండు చేతుల

రెండు తాళములు వేసి పల్లవి పాడుచూ కోరినజాగాకు కోరినముక్తాయిలు వేయుచుంట. (2) బ్రొబ్లిము మెంటల్గ సాల్వు చేయుట. (3) నల్వురకు దెనుగు నల్వురకు సంస్కృతము కోరినపద్యములు కవిత్వముచెప్పుట, (4) వ్యస్తాక్షరి. (5) న్యస్తాక్షరి (6) ఇంగ్లీషున నుపన్యాస మిచ్చుట (7) పూలు గంటలు లెక్కించుట, (8) ఛంద స్సంభాషణ మొనరించుట. నాడు నూటఎదిమిది రూప్యములు నోటీసువగైరా ఖర్చులు పోగా నాకు దొరికెను. మరునాడు బుధవిధేయినియను వార్తాపత్రికలో దానిఎడిటరు నన్నుగూర్చి వ్రాసినదేమన నిన్ననీయూర విజయనగరవాసులగు బ్రహ్మశ్రీ ఆదిభొట్ల నారాయణదాసుగారు టిక్కెట్టువేసి యష్టావధానము చేసినారది యొక చిన్నపనులగుంపు. వారి బుద్ధిసాహసములు మెచ్చదగినవి. అని ప్రకటింపగా నేనాపత్రిక జూచి చిన్నపనులగుంపనుటకు బదుల సాధ్యాష్టావధానము సంగీతసాహిత్యములతో నిట్లవధానములుచేయుసమర్థత యింకొక్కనికుండుట దుర్ఘటమని యేల వ్రాయకూడదనియును, నాయష్టావధానము గ్రహించి వ్రాయుటకు కేవల సాహిత్యజ్ఞుడగు బుధవిధేయిని ప్రకటనకర్త సమర్థుడు కాడనియు మరియతడు నాప్రతికక్షిలో జేరియుంటచేనట్లు వ్రాసెనని "కలుషహారిణి"యను పత్రికలో ప్రచురించుటచే నుభయపత్రికల వివాద మధిక మయ్యెను.

## గానమున పోటీలు

పిదప నొకనాడు నాప్రతికక్షులందరొకచో సభచేసి సంగీతమున నన్నోడింపదలచి యాసభకు శక్తుడనైనచో నన్ను రమ్మని యచ్చునోటీసు పంపి రది రాత్రి 9 గంటల కొక నాప్రతికక్షుల మేడపై జరుప నుద్దేశింపబడెను. ఆనాడొకమునసబింట సాయంత్ర మారు మొదలు తొమ్మిదిగంటలవరకు హరికథ చేయుచుంటి. నామునసబు నియోగి బ్రాహ్మణు డిద్దరు భార్యలు కలవా డతనియొద్ద నీలమణితో జెక్కిన బాలకృష్ణవిగ్రహము కల దతడు నాతో అయ్యా! నీవొంటిగాడవు దూర

దేశమునుండి వచ్చినావు. నీయం దసూయతతో నిన్ను వంచించుటకై యీసభ చేయుచున్నారు. నీవచటికి వెళ్లుట నామతముగాదు. అని తన యింట నన్నాపివేసె నంత పదిగంటల సమయమున రెండువందలమందిని వెంటవేసికొని యచట రిజిష్ట్రారు పినతల్లి కుమారుడైన యొక డి॥ కోర్టువకీలు నాయొద్దకువచ్చి 'నీకేమియు భయములేదు. నాశిరస్సున్నంత వరకు నిన్నెవరైన ముట్టుకొనజాలరు. తప్పక రమ్ము నీవిపుడు రాకున్నచో నీకీర్తికి లోప మగును. అని మునసబు నొప్పించి నందోడ్కొని సభలో బ్రవేశించె. నాసభ యొక పెద్దమేడపై జరిగెను. రెండువేల జనులకు బైగా నచటనుండి నాసభలో నాప్రతికక్షులగు పదిమంది సంగీత విద్వాంసులుండిరి. మేడక్రింద నల్లరి జరుగునెడ నాపక్షమున బోరాడుటకై సరిబద్దలతో సిద్ధముగ వేయిమంది కధికముగా దేవరవాండ్రుండిరి. రెండువందలకుపైగా కనిష్టేబులు జనులల్లరి సేయకుండ నివారించుచుండి రిద్ద రినస్పెక్టరులు గూడ నచట నుండిరి. మరియు బందరుపురమునందుగల యుద్యోగులెల్ల నచటనుండిరి. సంగీతసభయొక్క పరిణామ దశను జూచుటకై యందరును వేడ్కపడుచుండిరి. నే సభలో బ్రవేశించినతోడనె చప్పట్లు చరచుచు "బ్రేవో"యని యందరు కేకలు వేయ దొడగిరి. సద్దడిగినపిదప నాప్రతికక్షుల యజమాను డొకవకీలు సభలో నిలువబడి నారాయణదాసుగా రిచట గల యీ యరువదిమంది సంగీత విద్వాంసులు విద్యయందు దనకు జాలరని పబ్లికుగా నుడివినందున నీసభ జరిగింపబడెను. కనుక యీవిద్వాంసులు చేయుప్రశ్నముల కతడుత్తరములు చెప్పవలసినది. వీరుచేయు శాస్త్రపరీక్ష కాగినచో నితడందరికన్న గొప్పవిద్వాంసుడని యంగీకరింపబడును. లేనిచో నితడు వీరి నందరిని క్షమాపణ కోరుకొనవలసినదనియు చెప్పి కూర్చొనియె. నంతట నేలేచి సభికులారా! యీవిద్వాంసులందరును సంగీతమున నాకు లోకువ యని వీరలు నన్ను దిరస్కరించినపుడెల్ల వాక్రుచ్చుట నిజము.సంగీత విద్వాంసుల మనుకొన్న వారిలోనేసంగీతతత్త్వము తెలిసినవారుంట యరు

దన దక్కినవారిం జెప్పనేల! కావున మాకు మధ్యస్థులై మీరుంట యసాధ్యముకదా! ఇప్పుడు వీరు సంగీతశాస్త్రమున ప్రశ్నించి పరీక్షించుట కనర్హులు. కారణమేమన సంగీతశాస్త్రము సంస్కృతమున వ్రాయబడినది. వీరికందరికిని సంస్కృతభాష కొంచెమయినను దెలిసినట్లుకాన్పించదు. సంస్కృతపాఙ్ఞాన మిసుమంతయు లేనివారికి సంస్కృతమున వ్రాయబడిన సంగీతశాస్త్ర మన్వయింపబడదుకదా! కావున సంగీతశాస్త్రమునందలి సూత్రములుకాని పద్యములుకాని నే జదువ వీరల కర్థమేకాదు. గనుక శాస్త్రచర్చ నాతో నేయుటకు వీరుతగరని స్పష్టము. ఇక శ్రోతృరంజక స్వరసందర్భము సంగీతము గనుక వీరందరును గలిసి యొక గంటవరకు బాడనిండు. పిదప నేనొకగంట బాడెదను. ఎవరిపాట మిక్కిలి రంజకముగ మీకుదోచునో వారధికులుగ నిర్ణయింపబడుదురు ఇది నామనవి. యని నే నుపన్యసింపగ సభికులలో నన్ను దోడ్కొని వచ్చిన ప్లీడరు లేచి యుభయులవాదములను వింటిని. శాస్త్రవాదమగు నప్పుడు తగవు తీర్ప మేమసమర్థులము. ఉభయ కక్షలవారు పాడి సభారంజన మొనర్చుట మాకోరిక." యనియె అప్పుడొక విద్వాంసుడు లేచి "మీయందరికి రక్తి నేయుట కీసభ యేర్పర్చబడలేదు. నారాయణదాసుగారికి వర్ణములు. కృతులు. గీతములుగావు. వచ్చినయెడల తంబురా మీటుకొనుచు బాడవలయు" ననియె. అప్పుడు నాశిష్యులలో నొకడు లేచి. రాగము. తానము, పల్లవిపాడి సభను మెప్పించగల విద్వాంసుడు, బాలబోధపాఠములు చదువునట్లు సభలో పిళ్ళారిగీతములు. జంటవరుసలు పాడుటకుత్సహింపడు. ఇదిగాక నిరుపమానముగ ప్రబంధము చెప్పి మెప్పించు కవీశ్వరున కొకవేళ వేమనశతకము, భూషణవికాస శతకములలోని పద్యములు కంఠపాఠము నేయకుంట యొకకొరత యగునా! నారాయణదాసుగారివంటి పల్లవి విద్వాంసుని ఇపుడే పాట నేర్చుకొనుట మొదలుపెట్టిన పిల్లవానివలె గీతములు వర్ణములు, కృతులు, పాడుమనుట యవివేకముకదా! దాసుగారి శిష్యోపశిష్యుడనగు

నేను వీరుఘర్మాయించునవెల్ల తంబురానాలుగుతారలు నాల్గువ్రేళ్ల మీటుచుం
బాడి యీవిద్వాంసులొకరైన యెరుగని గ్రంధము పాడెద. అంతేకాక
పెక్కువర్ణములు, గీతములు, కృతులు నొనర్చి మాబోటి శిష్యులకు
జెప్పిన నారాయణదాసుగారికి వీరుపాడుమన్న గ్రంథమన నొక లక్ష్యమా?
మరియు నారాయణదాసుగారు పాడినవు డీవిద్వాంసులలో నొకరైన
లయగూడ వేయజాలరు అనియె. అందుకు నాప్రతికక్షిదారులు కోపించి
లేచిరి. పిదప సభవారెల్ల లేచిరంతట నెంతోరణగుణధ్వని యల్లకల్లోలము
సేయుచు నెవరిమటుకు వారు సాగిరి.

## బందరులో సన్మానము

ఉభయకక్షిదారులు ప్రచురించు బుధవిధేయుని కలుషహారిణీ వార్త
పత్రికల పోరధికమగుచుండెను. రెండుకక్షిలకు వైరము ముదిరెను,
ఒకనాడు కలుషహారిణీపత్రికాధిపతి యింట నే బాడుచుంటిని. ఆయూరి
జంగము ఫిడేలరు నాప్రక్కను ఫిడేలు వాయించుచుండెను, కొంత
వరకు నే రాగముపాడినమీద సభలో నెవరో నన్పల్లవి పాడు మనియె.
అపుడు "పల్లవిగూడ వినురసజ్ఞులిచటగలరు, ఏమిపుణ్య"మనగాసభలో
నుండి యొకవృద్ధవైశ్యుడులేచి నేనున్నానయ్యా! పల్లవి వినగలరస
జ్ఞుడ నికపాడుమయ్యా ! పల్లవి" యని తనచేతనున్న పదితులముల
బంగారుకడియము నాచేతికి దగిల్చె అంత నేను మరింత యుత్సాహ
ముతో రెండుగంటలవరకు గేవలము పల్లవినే పాడి సభారంజన మొన
ర్చితిని.

ఒకనాడు సింగరాజుగారి జల్తారుబట్టలను బజారులో వేలము పాడు
చుండిరి. నేనచటికి మార్గస్థుడనై పోవుచు వేలమువెర్రికిలోనై మూడు
వందలరూపాయలకు గొన్నిబట్టలు పాడినాడ, పిదప నే బసచేసిన రిజ
ష్ట్రారుగారి ఇంటికి బట్టలమూట పట్టించుకొని రాగా నతనికి జదువు
చెప్పించి పెద్దవానిని జేసిన యతనియక్క "నాయనా! ఇదేమివెర్రి యెం

దుకు నీకీపాతబట్టలు'' యని రిజిష్టారుగారితో తమ్ముడా! చూచితివా దుర్మార్గు లెట్లు యమాయకునికి పాతబట్టలు తగిల్చిరో''యనెను. పిదప రిజిష్టారుగా రాబట్టలు తిరిగిపంపించి వేసిరి.

బందరులో నేనున్నపుడు భీముడుగారివేశ్య యచటికి వచ్చి నాశిష్యురాలనని చెప్పుకొనుచు నైదారుసభలలో బాడి మూడువందలార్జించుకొనియె. బందరులో బదునాలుగుమాసములుంటిని. పిదప పుర మందలి పిన్నపెద్దలుకూడి ఫెర్వెల్ మీటింగు చేసిరి. అపుడు కాలేజి ప్రిన్సిపాలుగారు ప్రెసిడెంటుగా నుండిరి. కొందరు తెనుగున గొందరింగ్లీషున నన్ను బ్రస్తుతించిరి. ఒకడు నాపై నింగ్లీషున కవిత్వముచేసి ముద్రిపించి యాపత్రికలు సభవారి కందరికిచ్చెను. ప్రెసిడెంటుగారు దాక్షిణాత్య శ్రీవైష్ణవుడు నన్నుగూర్చి ప్రసంగించుచు బొంబాయిలో బ్రాడ్లాధోరణి వింటిని. ఇప్పు డట్టిధోరణిగలవా రొక్కనారాయణదాసుగారు తప్ప మనవారిలో మరెవ్వరును లేరు''అనియె. బందరులో నేనార్జించినద్రవ్యములో నాకుమిగిలినవి నూటపదేనురూపాయల విలువగల వెండిపాంజేబులు బంగారుమురుగులు దండకడియములు అంటుపోగులు పదిహేనుగిన్నికాసులు మూడువందలరూపాయలు నగదును, తక్కిన సొమ్మేమయ్యెనో నాకు గుర్తులేదు.

## మరల రాజమండ్రి

గుడివాడవరకు గొందరు మిత్రులు నన్ను దిగబెట్టిరి. నడుదారిలో గొల్లేరుంజూచి దానిపూర్వచరిత్రము విని మిక్కిలి యద్భుతపడినాడను. ఏలూరులో గొన్నాళ్లు భీముడుగారి సహవాసమున్నానుంటిని. అచట సంగీతసాహిత్యరసజ్ఞులును గవీశ్వరులును బలువురుపిల్లలతండ్రియునగు నొకనియోగిబ్రాహ్మణవకీలు నన్నెంతో బ్రస్తుతించుచు దనయింట నా హరికథ చేయించి నావలె ముఖారీరాగము పాడిన వాని నింకొకనిజూడ లేదనియె. నేదెచ్చినసొమ్ములో చాలామటుకు భీముడుగారు సెలవు

చేసెను. భీముడుగారి సెలవుపొంది పిదప నేరాజమంద్రి చేరుకొని పం తులుగారియింట బసచేసి యభినయమున నన్నానందింపజేసిన వేశ్యా రత్నమును జూడనేగితిని. మధ్యాహ్నము ఒంటిగంట మొదలు నాలుగు గంటలవరకు కచటబాడి పిదప ధవళేశ్వరముమీదుగా గాకినాడకు బోదలంచి యాపెతో జెప్పగా నేడు మీకు పడవలు దొరకవు. మీరు తిరిగి వచ్చెదరు. నాయభిప్రాయము, మీరు నేను నిచట గొన్నాళ్ళు పాడుచు నభినయించుచు నానందించుటయనియె. ఆపెను విడిచిపోవుటకు నాకుగూడ విష్టములేకుండెను, కాని విజయనగరము విడిచి చాలాకాలమౌటచే కూలీ చేతికి నాపెట్టె, మూట ఇచ్చి ఇన్నీస్‌పేటదాటి వెళ్ళినాడను. అంతలో వాన ముమ్మరముగా గురియజొచ్చెను, గాన దిరిగి సాయంకాలమునకు పంతులుగారియింటికి దిరిగివచ్చినాడను.

అపుడు పంతులుగారు నన్ను గని మీాయభినయకత్తెన్విడిచి పోగాళ్ళు రాకుండెనో! వెళ్ళిపోయెదమని నాతో జెప్పి తిరిగి వచ్చినారా? కావిండు మీసర్దా తీరనిండు అనియె. ఆపంతులుగారు నాయందు గన్పర్చినదయకు నేనెంతయు గృతజ్ఞుడను. నన్ను గన్నకొడుకుకన్న నెక్కువ ప్రేమగా నెల్లప్పుడు సంరక్షణ నేయుచువచ్చెను. వ్యసనరహితుడగు నట్టి మహానుభావుడు, విలాసపురుషుడనగు నాయందంత ప్రేమనుంచు టొకవింత. అతడు మాధ్వుడు,అచట ప్లీడర్లలో ముఖ్యుడు. లక్షాధికారి. మరియు విచిత్రవివాహకర్తతో మైత్రి నెరపుచుండును. అభినయమున నన్నానందింపజేసిన వెలయాలియింట నేత్రతిదినమును బాడుచుంటిని. ఆయింటిపొరుగే విచిత్రవివాహకర్తయిల్లు, గాన నతడు పంతులుగారితో నే బోకిరిననియు నాదరింపపగినవాడ గాననియు నెల్లప్పుడు వేశ్యాసంగతి నుందుననియు జెప్పుచుండును. విచిత్రవివాహకర్త సంగీతకుఠారము గనుక నన్నెరుపుగ జూచుచుండును. బందరులో నున్న కడపటిదినములలో నమితముగా చిన్నగురుని కటాక్షమందుటచే నాయాధిక్యమున జ్వరము వచ్చెను. నాయందు మిక్కిలిమైత్రికల గుడిపూజార్లును సంగీతజ్ఞులగు

నిద్దరన్నదమ్ములు వైద్యమునందుకూడ మేటినైపుణి కలవారగుటచే నన్ను బాగు చేసిరి.

## రాజమండ్రిలో దినచర్య

పిదప నాముంగురులు తీయించి శుద్ధవైదికవేషముగా నుంటిని. రాజమహేంద్రవరమున నున్నపుడు తిరిగినాశరీరమునకు పుటధాతువు అలరెను. పదిగంటలకు పంతులుగారితో భోజన మొనర్చుట, ఇన్నీస్ పేటలోనున్న యొక సంగీతవిద్వాంసురాలి యింట కొంతకాలము గడుపు చుంటిని. ఆమె కూతులిద్దరు నాయొద్ద సంగీతవిషయములు నేర్చుకొనుటచే నాకభీష్టసేవ లొనరించుచుండిరి. రెండుగంటలకు నిద్రలేచి ఫలహారము చేసి సింగారించుకొని నన్నభినయమున నానందింపచేసిన యాపెయింట సాయంత్ర మేడుగంటలవరకు కొంత ప్రొద్దుపుచ్చుటయు పిదప పంతులు గారియింట భోజనము చేయుటయు మామూలు. పంతులుగారి యింటి భోజనము కడురుచ్యముగ నుండును. పంతులుగారు నెల్లూరువైపు మాధ్వులగుటచే వారియింట వంటలు మిగుల ప్రశస్తముగా నుండును. రాత్రి ఇన్నీస్ పేటలో నున్న నా శిష్యురాండ్రయింట పడుకొనుట. ఇట్లు రాజమండ్రిలో షుమారు రెండునెల లుంటిని ఒకనాడు నన్నభినయమున నానందింపజేసిన నిపుణురాలు యాపెకుపరిచయమున్న ఒకనాయడుగారి యింట నాచే హరికథ చేయించెను. అతడొకగొప్పనాయడు. అతని సన్నిహితబంధువుడు సదరమీనుపనిచేసి మిక్కిలి ధర్మాత్ముడనియు, గడు రసజ్ఞుడనియును ప్రఖ్యాతి గాంచెను. బందరుపై జెప్పిన పద్యము కొంత వరకు జ్ఞాపకమున్నది.

సీ॥ ఒకవీధి కొకవీధి కొక్కొక యామడ
యొకయింటి కొకయింటి కొక్కక్రోసు
చొడువేలల బొరలాడు గాడిదగొడ్లు
ధుమ్మన ధూళులు గ్రమ్మ రోడ్లు

సకలస్థలంబుల సర్పచెముడు ముళ్లు
గొప్పవేసవి ద్రావ నుప్పునీళ్లు

ఇట్లు బందరుపై పద్యము చదువగా రాజమండ్రివారు తమ యూరిపై నొకప్పుడు పద్యము రచింపుమని కోరిరి కాని పద్యమిక ముందు చెప్పెదనంటిని.

ఎవరో దుర్మార్గుడు విజయనగరములోనన్నుగూర్చి యొకదుర్వార్త ప్రకటించెను. నాయన్నలు మిక్కిలి భయపడి నాక్షేమము తెలుపుమని పంతులుగారికి టెలిగ్రాము వేసిరి నాయందుపై చెప్పిన రీతిని ఆదరాభిమానములు గల స్నేహవర్గము విడిచిపోదునన్న భయముచేత ఆ టెలిగ్రాము నాకందనీయలేదు, ఆ టెలిగాము నన్నభినయనమున నానందింపచేసిన వెలయాలి యింటనున్న నాకిమ్మని పంతులుగారు పంపించిరి అప్పుడు నేనచట లేకుంటచె నాపె యందుకొని విజయనగరమునకు జెప్పిన నేవెడలిపోయెదనేమో యని నాతో టెలిగ్రాము సంగతియే జెప్పలేదు. ఆపె నుంచుకొన్న యతడొక వకీలు. బక్కపలచటి పొడవగు బ్రాహ్మణుడు. వర్తకులు ప్లీడర్లు నప్పటికాలములో వెలయాండ్రనుంచుకొనుట యొకవిధమైన గొప్ప. అతడు నాతో మామా! నీ భార్య వ్యక్తురాలైనది. యెందుకీ ముండల వలలోబడి వ్యర్థముగ నిట కాలక్షేపము సేసెదవు?" అనినాకొరకు స్వయముగ జుట్టుచుట్టి యిచ్చుచూ విజయనగరమునకు దిరిగి పొమ్మని బోధించెను అతని వెలయాలిని దరుముచున్నానేమో యని యట్లు చెప్పినట్లూహించితిని. అంతట దిరిగి మరియొక టెలిగ్రాము నాక్షేమము దెలుపుమని రాగా పంతులుగారు నన్ను బిలిపించి మొదట టెలిగ్రామునకు జవాబివ్వలేదా యని యడిగెను. అందుకు మొదటి టెలిగ్రాము సంగతియే నేనెరుగనంటిని, అందుకాపె యొద్దకు పంపించినానని మా సోదరులకు నే క్షేమముగా నున్నట్లు జవాబిచ్చెను. నా టెలిగ్రాము దాచి నన్నాపదలచిన వేశ్యామణి కాకినాడకు దా మేళమువచ్చెదననియు నన్నచట గాచుకొని యుండమనియు జెప్పగా కాకినాడకేగినాడ.

కాకినాడనుండి జగ్గయ్యపేటకు వెళ్లి తిరిగి కాకినాడకు వచ్చునట్లు పె మేళమును కుదుర్చుకొన్నవారు వైశ్యులు. ఆవైశ్యులలో నిద్దరుముగ్గురు కుఱ్ఱవాండ్రు నాయందు మిక్కిలిదయతో నాపాట విని యానందించు చుందురు. వారలకు మిత్రులైన యొక వెలనాటి నియోగిబ్రాహ్మణుడు కష్టమ్సు అఫీసులో నిరువదిరూపాయలజీతగాడు, మెట్రిక్యులేటు, మిక్కిలి సంగీతసాహిత్యరసజ్ఞుడు. నాబోటిసంగీతగాండ్ల నింట నుంచుకొని యాదరించుచుండును. అతనియింట నా భోజనము. అతడుగూడ నొక వెలయాలి నుంచెను. వెలయాండ్ర సహవాసము సేయుట, కొంచెము గురుని సేవ కలవడుట, సంగీత సాహిత్య రసజ్ఞత కలిగియుంట, యీ మూడుకలవారే లోకములో దరుచు భూతదయాపరులు, పరోపకారులు, వితరణశీలురునై యుండెదరు. తక్కినవారల హృదయము సరసము కాదని యనుకొనుచుందును. వ్యసనరహితు లెక్కడో తప్ప తరుచుగ గొడ్డువారివలె గార్హస్థ్యధూరులవోల్కి గఠినాత్ము లయ్యెదరని యప్పటి నాయూహ.

ఆపెకొరకు గాకినాడలో వేచియుండగా పిఠాపురపు నావైష్ణవ మిత్రుడు తనయింటి కొకసారి నన్ను రమ్మని యుత్తరము వ్రాసెను. నేనొకరాత్రి బైలుదేరి పోవుచుండగ నాబండికి ముందుబోవుబండి పెద్దాపురమునకు పిఠాపురమునకు బోవురోడ్డుప్రక్క నొకయొంతరలో బడెను. బండిపై బెల్లపుబస్తాలు కలవు. బండివాడు మొత్తములపై గూర్చుండెను. వంతర యిరువది యిరువది గజముల లోతుగ నుండెను. బస్తా లొకటియు ద్రుళ్ళిపోలేదు. బండి సుంతయు చెక్కుచెదరలేదు. అంతయెత్తునుండి యంతలోతుగ బడినపుడు నుగ్గునూచము కాదగిన బండికిగాని, యెడ్లకు గాని, మనుష్యునకుగాని యొకింతయు హానిలేకుంట కే హేతువో యని మిక్కిలి యద్భుతమందినాడ.

పిఠికాపురములో రెండురోజులుండి నా మిత్రుని సెలవుగైకొని కాకినాడకు తిరిగి రాగా నప్పటికి గాకినాడలో నన్నుండుమన్న వెలయాలు

జగ్గయ్యపేటనుండి వచ్చెను. సాయంకాలము నాకు భోజనముపెట్టుచున్న రసికుడు నా సంగతివిని, నా కలంకరించి. వెలయాలి గుమ్మమువరకు నన్ను దిగబెట్టిన దయ నింతవరకు మరువజాలను. అపుడాపె "యుదయముననే వచ్చినాను గదా ! యిప్పుడా మీరు వచ్చెదరు" అని నన్ను లోనికి దోడ్కొనిపోయెను. మలినాడు స్కూలులో కొందరు చందావేసుకొని నాచే హరికథ చేయించిరి. ఆ కథకు జాటుగా నాపెవచ్చి యా రాత్రి నాతో, "అయ్యా ! మీరుద్యోగము చేసికొని జీవించుచే గాని. కాళ్ళకు గజ్జలు కట్టుకొని సానిపాపవలె నాడిజీవించుట యుచితము కాదు. మరియు మీరెట్టి హరిదాసులో, యెంతవిరాగులో, నాకు స్పష్టముకదా! మీవంటి శృంగారశేఖరులు, పరమపవిత్రులు నిష్కాములు చేయదగు వృత్తికి జొరకొనుట తగదు" అనెను. అందుకు నే జిరునవ్వున "కొలనునుండి కొండకేగిన కలహంసది తప్పుగాని కాకిది తప్పా!" యని యంటిని.

మరునాడు నేనాపెయొద్దకు బోనొల్లకుంటిని. అపుడెన్నో వర్తమానములచే సాయంత్రమునకు నన్ను రప్పించుకొనెను. అపుడాపె యప్ప నాతో "అయ్యా ! మా చెల్లెలకు దయ్యము పట్టె నెన్ని ప్రతిక్రియలొనరించినను దయ్యము వదలకుండెను. ఏమిసేయుదు నదిగో యా చీకటి గదిలో ముసుగు వైచుకొని పడుకొన్నది. ఈ దినమంతయు నాపెకుపవాసము. మీరు దయచేసినారు, హరిదాస శిఖామణులుకదా! మీ సంపర్కమునగాని యాపె కాదయ్యము విడువ దనుకొనెద చిత్తగించుడీ" యని నన్నాపెయొద్దకు గొంపోయి "చెల్లెలా ! యిదిగో గొప్పభూతవైద్యుని తెచ్చినదాన నికనైన గన్నువిప్పి చూడుము" అనియె. నాగొంతువిని యాపె కలకలనగియె పిదప నాపె నా సన్నిధిని భోజన మొనర్చి సుఖముండెను. మొత్తముపై స్త్రీలకిట్లే దయ్యములు పట్టుచుండునని యనుకొంటిని. అట్లు కొన్నాళ్లు కాకినాడలో యదేష్టభోగములంది స్టీమరుకే వచ్చి పొగనావ నెక్కినాడ.

## తిరిగి విజయనగరము

ఆనావ పోవుచున్నపు డాయూపునకు వమనములు మెండుగ బోసి
కొని బాధనందుచున్న నన్నొకరైన బడవలోనివారు కాపాడకుండ
కెంతయో యాశ్చర్యపడినాడను. ఆ పడవలో కొందరు యూరేషియనులు
మాత్ర ముండిరి. అచట స్త్రీలకుగాని పురుషులకుగాని నాయవస్థచే మది
కరుగకుంటకు గారణమేమో ! క్రిస్టియానిటీ కన్యమతస్థులయెడ దయలే
కుంట కది ఋజు వనుకొంటిని. సాయంకాలమునకు స్టీమరుపైకి జేరు
కొంటిని. రాత్రి నిద్రమానియుంటచేతను పగలుకూడ నిద్దుర లేకుండుట
చేతను, పైత్యించి వమనములు వెళ్ళుటచేతను, పిదప కమలాఫలము దిను
టచే గొంతుమండుటచేతను మిక్కిలిబడలిక గొని యంత్రములాడు
చెంగటిగోడపై సుఖముగ నిద్రించినాడ. కడుశీతాకాలమౌటచే యంత్ర
ముల దరి యగ్గివేడి నే బడుకొన్న తావునకు సుఖస్పర్శమును గలిగిం
చెను. తెల్లవారినతోనె దెప్పనెక్కి విశాఖపట్టణము చేరుకొంటిని.

విశాఖపట్టణములో నాచే నవధానములు చేయించిన జమీందారు
నావార్షీక మిచ్చివేసెను. విశాఖపట్టణమునకు నేవచ్చిన వర్తమానము
తెలిసి పేరన్న కాలినడక నచటికి వచ్చి, నే విజయనగరమున కాదినమే
యేగుట రూఢిగ విని మళ్ళి విజయనగరమునకు వచ్చెను. ఇట్లు పదునా
లుగు మాసము లేకాకినై గోదావరి కృష్ణజిల్లాలకు బోయి వచ్చినాడ.
మొత్తముపై నాకు మిగిలిన యార్జన మూడువందలకు దేలెను. మరి
చదువుట కిచ్ఛగింపక హరికథలపై జీవించుటకు నిశ్చయించుకొన్నాను.
ఎఫ్. ఏ. పరీక్షకు వెళ్ళిన రెండుసంవత్సరములలో నొకయేడు సంస్కృ
తము, నింకొకేడు తెనుగు ప్యాసయినవి. కనుక తెనుగు సంస్కృతములు
సమముగ నాటినుండియు నాకు వచ్చును. సంస్కృతములో గొంతవరకు
గావ్యనాటకముల సాహిత్యమున్నది. కాని బొత్తిగ శాస్త్రజ్ఞానము లేకుం
డెను. సంగీతమునందుమాత్రము తగు పాండిత్య మబ్బెను. విజయనగర
ములో నే కాపురముంటకు నిశ్చయించుకొంటిమి. నేను నా భార్యయు

మా రెండవ యన్నగారియింట నుంటిమి. మా పెద్దన్నయు, మూడవయన్నయును; బేరన్నయును భార్యాసహితులై మా రెండవయన్నగారియింట్లో నొక భాగమున గలిసియుండిరి. బందరు కమానులో బేరన్న నా వెంట నుండకుంటచే నా యార్జనము మూడువందలుమట్టుకే తేలెను. నాయార్జనమం దొకగవ్వయైన నపాత్రమున వినియోగింపబడ లేదు. కాని దానమున గొంత, మిత్రులయొద్ద మరచినది కొంతయును. ఆదపా నదునాలుగు నెలలోను రెండువేలరూపాయి లార్జించి యుందును. "డోంట్ కేర్ మేస్టరు" నగుటచే నూర్జితపర్చ లేకుంటిని.

విజయనగరపు డిప్యూటీకలెక్టరుగారు ఆంధ్రశారీరము విరచించి యందులో తన వంశావళి వర్ణించుమని నన్ను గోరెను. పదిపదేను పద్యములతో వర్ణించినాడను. ఆ పద్మములు మహారాజు సమక్షమున జదివెను. మహారాజుగారు మిక్కిలి సంతోషించి పద్యములు కడురమ్యములుగ నున్నవి యెవరుచేసి రనగా దానే యొనర్చినట్లు మనవిచేసెను. అపుడచటి పండితు లీ డిప్యూటీకలెక్ట రిట్లు రచింప జాలరు కాని మరెవరో చేసియుందురని, తెలిసియుండియు నాపేరు వక్కాణింపరైరి. నాస్వతంత్రబుద్ధియు, బరులయెడ నిర్లక్ష్యమును, ధనమందు నిర్మోహము, సంసారభారము కొంత తగులుటచే తగ్గిపోవుచుండెను. బైసంచారము కట్టుబడెను. కొంప గోడి కూర్చుకొనుమను బోధకు చెవియొగ్గక విధి లేకుండెను,

## గంజాముజిల్లాలో హరికథలు

ఖరసంవత్సరమున వర్షపులేమియును, బంటల నష్టము దటస్థించెనపుడు నేను బేరన్నయును దిరిగి గంజాంజిల్లాలో నార్జించుకొనుటకై బైలుదేరినాము. శ్రీకాకుళములో మేముండగా నుర్లాము జమీందారురాలి రెండవయన్న యాయస్టేటు మేనేజరయ్యె నతడు నన్ను గ్రామునకు దోడ్కొనిపోయె నపుడు జమీందారురాలుగారు లింగధారణమైరి. నాచే



" తొండమెత్తిన మత్తశుండాల మాగము
గ్గినపండ్లు నెమరు వేసినది నేడు." —యస్వీ.

రెండు హరికథలు చేయించిరి. సంగీతజ్ఞుల కుర్లాములో వార్షిక మీయ మని రపు డష్టావధానము చేసినాడ. సభలో పండితుడైన జమీందారురాలి పెద్దన్నయు మరికొందరు ప్రాజ్ఞులుం గూర్చొనిరి. అందులో నే జెప్పిన న్యస్తాక్షరి.

శ్లో॥ ఏత చ్చిత్రపటం భాతి, శాద్వలాభం సువిస్తరమ్
తస్మి న్తనోషి భో విద్వన్, ఫలవృక్ష ఇవోన్నతిమ్॥

నా యవధానములకును, హరికథలకును సంతోషించి నలువది రూపాయిలు వార్షికముచేసి ప్రతిసంవత్సరము పదిరూపాయిలు హెచ్చించు టకు వాగ్దాన మొనర్చిరి.

ఉర్లామునెంతనున్న లుకులాము అగ్రహారములో నొకగొప్ప జ్యోతిష్కుడు కల డత దేకసంతగ్రాహి. క్రమాంత స్వాధ్యాయవేత్త మిక్కిలి భాగ్యవంతుడును. నన్నతడు తనయింటికి రప్పించి యొకహరికథ జేయించెను. అతని సన్నిహితజ్ఞాతులు కూడ మరిరెండు కథలు చేయించి యందరు కలిసి యొకగరిసెడు ధాన్యము రెండుబండ్లమీదుగా విజయ నగరమునకు పంపిరి. గింజలు దొరకని కరువులో రెండుబండ్ల ధాన్యము తెచ్చుటకు మావారందరు సంతోషించిరి. నా యిరువది నాల్గవయేట బాట సారి యను కావ్యమును తెనుగున రచించితిని, ఇరువది యారవయేట దంభపురప్రహసనమును, సారంగధర నాటకమును దెనుగున విరచించితి.

లుకులామునుండి విజయనగరమునకు మేము వచ్చినపిదప మా పెద్దన్నగారికి బదిరోజులవరకు జ్వరము తగిలెను. అతనిభార్య ఆదినము లలో నాహారనిద్రలు మానుకొనియె. సాయంత్రము భర్తపోవునని తెలిసి యాపె యిద్దరికొడుకుల నందరి కప్పజెప్పి నిదుర వచ్చుచున్నదని పడు కొనియె. సాయంకాలము మూడుగంటలవరకు లేవకుంటచే మేము చూడగా ఆమె పెన్నిద్దుర చెందెను. మాపెద్దన్నయు నాపె పోయిన రెండు

గంటలకు కాలముచేసెను. పిదప నతనికొమారుల నిరువురను మా రెండవయన్న సంరక్షణ చేయుచువచ్చెను.

మా రెండవయన్నగారి యింటి కుత్తరశ్రేణీనున్న యతని మామ గారియిల్లు వేలములో నొకవైశ్యుడు కొనెను. అతని యొద్దనుండి యేడు వందల యాబది రూపాయలకు బేరన్నయు నేనుగొని యందులో నొక భాగము మా మూడవయన్నకిచ్చి తక్కినరెండుభాగములు మా క్రింద నుంచుకొన్నాము. ఇట్లు విజయనగరములో మాకాపురము స్థిరమయ్యెను.

భీముడుగారి భావమరిది ప్లీడరీమాని మునసబుగా జోడవరమునకు బోయెను. మే మతనియొద్దకు వెళ్లినాము. అచట మూడుకథలు చేసినాము. చోడవరములో నున్న యందరును మిక్కిలి సంతోషించి మాకు రెండు వంద లిచ్చినారు. మాయార్జనమునందు పేరన్నకొకవంతు నాకురెండు వంతులును. నేను మిక్కిలి ఖర్చుదారుడనౌటచే కడు కొద్దిసొమ్ము నిల్వలో నుండెను.

## విచిత్ర వివాహకర్త విచిత్ర రచన

భీముడుగారి బావగారు ఈసఫ్‌ఫేబిల్సులోని కొన్ని కథలు నన్ను తెనుగుచేయమన నూర్గంటిపేరిట నూరుకథ లొనర్చి ప్రతికథచివరను రెండుపాదములలో నీతియు రెండుపాదములలో కథయు నిమిడ్చి గీతములు వివరించినాడ. నా కథలపుస్తక మచ్చు వేయమని భీముడుగారు రాజ మంత్రిలో నచ్చాఫీసుగల విచిత్రవివాహకర్తగారి (కందుకూరి వీరేశలింగం పంతులుగారు) కిచ్చె నక్కవి నావొత్తము నడుగుద్రొక్కి యాతీరున దా కథలు రచించి తనపుస్తకమును ముంద చ్చొత్తించుకొని ప్రచురించుకొనె నవ్విచిత్రవివాహకర్త కాలేజీలో తెనుగు పండితుడును సంఘసంస్కరణ కర్తయు నగుటచే క్రమముగ యూనివెర్సిటీ ఫెల్లోయై తనపుస్తకములు ఇంగ్లీషుపాఠశాలలో పాఠ్యగ్రంథములుగ బెట్టించుకొని యామూలమున

ధనమార్జించుకొను చుండెను, ఇరువది యేడవ యేట జిన్నగురుని దూర మొనర్చి నిర్మలస్థితితో మార్కండేయ చరిత్రము నొనరించినాడను.

మూడునెలలవరకు గంజాముజిల్లాలో హరికధలు సేయుచు దిరుగు చుంటిమి. చీకటికోట దివానుగారి రెండవకుమారుడు జిల్లాకోర్టుప్లీడరీ సేయుచు మాకింట భోజనము వెట్టి మిక్కిలి యాదరించెను. గోపాల పురములో నొకకధ చేసి ఛత్రపురములో నొకకధ చేసినాము. నాచే నంబ రీషచరిత్రము విరచింపించిన డెప్యూటీకలెక్టరపుడు పెన్షను దీసికొని వేదాంతచర్చ చేయుచుండెను. మాకధ వినకయే మాకిరువదిరూపాయిలు పంపెను. జిల్లాకోర్టుప్లీడరీ సేయుచున్న మాపెదతల్లికొడుకును జయింతి కామేశముపంతులుగారును కాలముచేయుటచే మాకు గంజాంజిల్లాలో చాలా మట్టుకు తగిన ప్రాపకము పోయెను.

## నరసన్నపేట వేశ్య

బరంపురమునుండి తెల్లవారినతోనె యిచ్ఛాపురము జగన్నాధస్వామి యాలయమునొద్ద బండివిప్పించి యొక యన్నదాతయింట భోజనమొన ర్చితి మతడు మిక్కిలి సంతానవంతుడు గొప్పస్థితిమంతుడును. మా బండి చెంత ఛత్రపురము హెడ్క్వార్టరు ఇనిస్పెక్టరుంచుకొన్న నరసన్నపేటసాని యను వెలయాలికూడ దనబండి విప్పించెను. నుదుట విభూతి మెడలో రుద్రాక్షతావళము శరీరమున గావిబట్టతో యోగినివలె నాపె కనుబడెను. నే నామెచెంత నెన్నిమార్లు బచారుచేసిన నాటక్కారివేశ్య నన్నొకసారి యైన జూడకుంట కాశ్చర్య మయ్యెను. ఆపెకు సాహాయ్యముకై యాపెయజమాను డిద్దరు బంట్రోతుల నిచ్చెను. నేనాపె యుపేక్ష గని పెట్టి సొగసుగ నొకజావళి బాడినాడ బిదప నా చెంత కాపె వచ్చి సంగతి భోగట్టా చేసెను. సాయంత్రము మాబళ్లు బయలుదేరునపు డాపె తన బండిలో నన్నూర్చొమ్మని ప్రార్థించెనుగాని నే నందుకొప్పలేదు. మరునాడు దయమున నౌపడాతోటలో దిగినాము. ఆపెయొద్ద వంటబ్రాహ్మణుడుం

టచే వానిచే వండింపించి నన్ను భోజనము సేయ బల్మియొనర్చెను. పేరన్న యావంటలో భోజనము సేయనొల్లక యూరిలో భోజనము సేయ నేగెను. పిదప నాపెయు నేనును చెరువునకు జట్టుగూడి స్నానము సేయ నేగితి మాపె యాదారిలో నాతో "ఇవుగో రెండువేలరూపాయిలు విలువగల నానగలు మీస్వాధీనము చేసెదను. నేను గొంచెము స్థితిపరురాలను. నాయాస్తి యంతయు మీ యాధీన మొనరించెదను. మీరు నరసన్నపేటలో నాయొద్ద నుండగోరెదను" అనియె. అందుకు నేను "హరిదాసుడను. మునుపు నావృత్తి యెట్లున్న నిపుడు పరస్త్రీల నొల్లను అంటిని. అందుకేడ్చుచు నొకసారియైన దన్ను సంతోష పెట్టుమని నా చేతులు పట్టుకొనినిర్బంధించుచుండెను. అంతట పేరన్న వచ్చుటచేదూరముగనుండెను.

యజమానునిదప్ప యింకొకరిమొగము చూడనని యోగనీచర్య నటించెడి వారవధూశిరోమణియవస్థ కొంత నామదికి గనికరము హాస్యము నద్భుత మొనరించెను. పిదప నాపెబండి కంటనీక మాబండి తప్పించుకొంటిమి. లోకములో యోగులు, యోగినులు, హరిదాసులు వేదాంతులు తరుచు సమయము తటస్థించువరకే ధూర్త బకమువలె ధ్యానము సేయుచుందురు. పిల్లిచాంద్రాయణమువలె గలికాలపు వైరాగ్యము నమ్మ వాటముకాదుగదా?

శ్రీకాకుళము చేరుకొంటిమి. అచట మొట్టమొదట నాచే హరికధ చిత్తగించి యవతారమెత్తించిన పంతులు స్వర్గస్థులయ్యెను. ఆతని కొక కుమారుడు. అతడు పొట్టిపంతులుగాని సుగుణములబుట్ట. విద్వన్మండలి కన్నపానములొసగి యుచితముగా సన్మానించుచుండును. అచట టికెటు సిస్టముపై రెండు కథ లొనరించితి. మొదట నన్ననుగ్రహించిన వేశ్యామణి యచట నుంటచే నాయూరు కొంత తీయగ నుండెను. గుజరాతీపేటలో భీముడుగారి చెల్లెలి మామగారు మాచే హరికధ విస్తారముచేసి చేయించిరి. ఆగుజరాతీపేటలో మేమారగించిన బాసందీరుచి యింతవరకు జ్ఞాపక మున్నది. గంజాంజిల్లాలో మొత్తము నాలుగువందల

నగదును రెండు పట్టుపంచలచాపులు నార్జించుకొని మూడునెలలు షుమారు కమాసుచేసి యింటికి జేరుకొంటిమి. మేము తెచ్చినసొమ్ములో మిగిల్చి కొనుట కొంచెము, ఖర్చుచేసికొని యనుభవించుట మెండు.

## విజయనగరము

ఖరసంవత్సరమున నీటిలేమిచే జనులు మిగులబాధపడుచుండిరి. అయ్యకోనేరు, సాహసమున ధానధర్మము లొనరించి పేదవడిన, సజ్జనుని మాడ్కి గృశించి యుండెను. అట నూతులు ద్రవ్వించుకొని పౌరులు కాలక్షేపము నేసికొనుచుండిరి. మాయూరిప్రభువు (ఆనందగజపతి) గొప్ప రాజర్షి యనదగువాడు. పున్నమచంద్రుని జూడగోరునట్లు చూపుల కతనిమో మెంతచూచినను దనివితీరకుండును. అతడు రూపజితమన్మథుడు, మిక్కిలి బలశాలియు నుదారుడును. ఇంగ్లీషునందు, సంస్కృతమందు, తెలుగునందు, పార్సియందు మిక్కిలిపండితుడు కడు మృదుభాషి. సంగీత సాహిత్యములందు విశేషాభిరుచికలవాడు, సంతతపితృభక్తు డరిదరిని సంతోషపెట్టుటయే యతనివృత్తి, ఎల్లపుడును బండితగోష్ఠి నుండుచు విద్యాచర్చ సేయుచుండును.

దివాంజీసాహెబుగారి కాలమువరకు రాజ్యాభివృద్ధి కలిగెను. పిదప నిద్దరు మేనేజర్లు రాజ్యవవహారము చూచుచుండిరి. అందులో బెద్ద మేనేజరు చాలాభాషలలో బండితుడు. పరదారధన విముఖుడు. మాధ్వుడు. నిరంతర తపశ్శాలి. సత్యధనుడు. పెక్కేల పరమభాగవతోత్తముడు. రెండవ మేనేజరు వెలనాటినియోగిబ్రాహ్మణుడు. మిక్కిలి తెల్వితేటలుగల మంచివ్యవహర్త. ఉమ్మేజువారి విజయనగరములో ముఖ్యముగ గోట యుద్యోగులచెంత నవసరమైనపని. వైదికులుగాని లౌక్యులుగాని ముష్వే శలయందు పిశాచములవలె పెద్దయుద్యోగులయిండ్లనుందురు. అందరు తన్ను గనిపెట్టుకొని యుంటయె యొకగొప్పగ నాయుద్యోగులు తలంచుచుందురు. తెలివితేటలతో బనిలేదు. విసుగక యుమ్మేజువారీ చేసినవానికి

దప్ప కేదో యుద్యోగము లభించును. కోటలో నుద్యోగము దొరుకుట ముంగొంగుపసిడి. జీతము కడుకొద్దిగాని కస్పీ మెండుగ నుండును. ఎని మిదిరూకల జీతగానికి గవర్నమెంటునౌకరు నూరురూపాయిలజీతగాడైన నందడు. పదేనురూపాయిల కోటజీతగానికి రెండువందలరూపాయిలవరకు బజారులో విసీబు దొరుకును.

అయ్యకోనేటికి దూర్పుతోటలో గట్టబడిన యేన్గుల సంగడికాంౘ వలె చెంగట పూర్వోత్తరములకు గొండలు కలవు. ఉత్తరమున ఛోటా హిమాలయమని ప్రసిద్ధిచెందిన వెలగాడకొండ గలదు కోటకు పశ్చిమ భాగమున బెద్దచెర్వున్నది. పెద్దచెర్వు పడమటిహద్దున నిలువబడి తూర్పు వైపు పరికించునపుడు విజయనగరపు సొగసు కనబడును. విజయనగర మంత సొగసైనపట్టణ మిచటి మహారాజువంటి యుదారుడగుప్రభువు నిచటగల సంగీత సాహిత్యవైభవము లింకొకచో నరుదని నాయభిప్రాయము.

సీ॥ తరుచుగ నల్లి తామరతంపరగ జివు
రించెడి విద్దెల మించునెద్ది
సమద గజేంద్రాశ్వ సంపద నలరారి
విజయరామ విభూతి బెంచెనెద్ది
సంతత రత్నకాంచన సమృద్ధిన్ మీరి
నెరి నలకారేఖ వించు నెద్ది
యానంద పరవసంబై జగన్నాథ వీ
క్షణమున నభివృద్ధి గాంచె నెద్ది

కోటపేటలకుం బూవుతోటలకును
నీటుబోటుల కతిచిత్రనాటకముల
కాటపాటల కుద్యోగి కూటములకు
నాటపట్టైద్ది యవ్విజయనగరమిది॥

అని వర్ణించినాడ. విజయనగరము విద్యానగర మన దగినది. ఆశ్ర యించి యిచ్చకములు బల్కుచు, నక్కవినయములు చూపుచు నుద్యోగ ములు సంపాదించుకొనుటచే వైదికులకు గాని లౌకికులకు గాని యోర్వ లేమి మెండుగా నుండెను. శక్తిహీనుల కసూయేర్ష్యలు నైజములు. స్వతంత్ర శక్తికలవారి కిచ్చకములతో బనిలేదు. మరి యొరుల జూచి యులక నవసరములేదు. సంగీత సాహిత్యముల బండితపామరరక్తి సేయుచు లోకముల గొట్టి బ్రతుకు నాకు రాజు నాశ్రయించుకొని యిచ్చ కములు పల్కుచు నసూయ నులుకు ధూర్తబకములంగవి హాస్యములు సేయుచు, వారిదంభము నుద్ఘాటించుచు, నిర్లక్ష్యముగ దిరుగు నన్ను గూర్చి ప్రభువుతో నొకరైన జెప్పలేకుండిరి. లోకుల లక్ష్యము లేకుండుట యథేష్ట వేషభాషలం దిరుగుట నా స్వభావము. మరియు సన్యసించుట, పరమతములలో గలియుట యాత్మహత్య చేసికొనుట దేశాంతరము వట్టుట కొందరి నైజములు.

## ఒక రాచయువకునితో పోట్లాట

ఒకప్పు డొక క్షత్రియకుమారుడును నేనును కాలేజీపడమటిహద్దున సాయంకాలము నాలుగుగంటలకు గలిసికొంటిమి. ఉభయులము సమాన వయస్కుల మనగా బదేదేండ్లుండ వచ్చును. అతనితో ముష్టియుద్ధము సేయుటకు నాకు విలాసము పొడమెను. ఇద్దరము పొడవునకు, విగ్రహ పుష్టికి, బలమునకు సమానముగ నుంటిమి. అతనితో "భాయీసాహెబు గారు! దెబ్బలాడుదామా?" యనియంటిని, అందుకారాచకొడుకు "చిత్తము" అనియెను. వెంటనే యతనికి దీసియొకలెంపకాయ ఖర్చునకిచ్చితిని, పిదప నతడు కొంతనొచ్చియు వెంటనే దౌడమీద నాకొక గ్రుద్దు గ్రుద్దెను. ఇట్లొక పావుగంట నొండొరుల గాలిబ్బేతులం గొట్టుకొన్న పిదప నొకరు జుట్టు నొకరు చేతుల లంకించుకొని కలపడి మల్లయుద్ధము సేయుచుం టిమి. జనులు చుట్టు కడియముకట్టి చూచుచుండిరి. కాని ఇరువంకలవా

రొకరైన నచట లేకుంటచే మమ్మొకరైన విడదీయకుండిరి. అరగంటకు పైగా నన్యోన్యఘాతంబుల మిక్కిలి నొచ్చి యలసియు బరువునకై పోరాడుచుంటిమి. తుదకు నా వెండిమురుగుతో నతని కనుబొమ్మపై గొట్టితిని. రక్తము జిల్లున నెగరదొడగె నపుడతడు "భాయిసాహెబ్ చాలును విడువుడు" అని కొంచెము సొమ్మసిల్లెను.

నా పదారవయేటినుండి యిరువదేండ్ల వయసువరకు నాతో సహోరాత్రములు కలిసిమెలసియున్న మిత్రుని జూచి "నేటినుండియు మనము సహవాసము మానుకొందము" అంటిని. అందుకతడు మిక్కిలి నొచ్చుకొన్నప్పటికి నతనితో మరిమాటాడనొల్లనైతి. అకారణవైరము నిష్కారణప్రేమ కొంతవరకు నావిలాసములు. ముందుచూపేగాని వెనుకచూపు నాకు లేదు.

### సంస్థానవైణికుని యవలయ కధిక్షేపించుట

ఒకప్పుడు కట్టుసూరన్న సంగీతపాఠశాలలో ఆస్థానవైణికుడొకడు వీణ వాయించుచుండెను. అతనికి గుండలములు మురుగులును మహరాజుగారు బహుమతి యొనర్చిరి. అతడు సంగీతమునందును, సాహిత్యమునందు, సామునందు మిక్కిలి నేర్పరి. మంచి భూస్వాస్థ్యముకల వెలనాటి వైదికబ్రాహ్మణు డేబదేండ్లవాడు. అతడు "చింతయ మాకంద మూలకందమ్" అనుకీర్తనము వాయించుచు "ఉత్తుంగ కమనీయ వృషతురంగ"మని యావృత్తముసరిపెట్టి భైరవీప్రసంగమని యెత్తుకొనుటచే సరిగా గ్రహమునకు జేరకుంట చూచి నేనవ్వుచు "అయ్యా! యింత గొప్పవైణికవేషము వేసి యీపాటిముక్క దిన్నగ వాయించనేరకుంటిరి. యీపాటి లయజ్ఞానము లేని మీకింతఖ్యాతి యెట్లు వచ్చె నయ్యా పామరలోకము" అని యంటిని. అందుకతడు కనుల నిప్పులు రాల్చుచు "ఏదీ నీవు సరిపెట్టుము అనియె. వెంటనే సరిగబాడినాడను. అదిజూచి వోర్వలేకపగ్గలేక "సరేబాగున్నది" అని వీణచాలించి రాజుగారిసెలవైనదని డాబుసేయుచు లేచిపోయెను.

## డిప్యూటీ కలెక్టరు దబ్బర

మహారాజుగారితో నేజేసిన పద్యములు తా రచించిన ట్లబద్ధమాడిన డిప్యూటీకలెక్టరు, నన్ను దనయింటికి బిలిపించి భోజనము వెట్టించి సత్కరించి యొకపంచలచాపు నొకపుష్యరాగమణిచెక్కిన బంగరుటుంగరమును నాకు బహుమతియొనర్చి "అయ్యా! యాంధ్రశారీరమున మొదటిపద్యములు నేజేసితినని రాజుగారిసభలో బల్కినాడ గనుక మీరవి నేజేసినటు ప్రచురింపగోరెదను." అనియె. అందుకు నే నవ్వి "నియోగుల పర్వు దీసినారేమయ్యా! యింత యుద్యోగము నింత తగువరితనము తుద కిట్టు లబద్ధము లాడించెనా! రాజుగారియొద్ద నాపద్యములు చదివి నాకు సిఫార్సు చేయుటకొప్పుకొని యిట్లొనరించుట న్యాయమా! ఇదిగో నే ద్రావిడుడ నడిగినవారితో నడుగనివారితో దప్ప మరెవరితో మీదబ్బరను బ్రకటించను." అంటిని.

హరికధలలో దుష్టవర్తన ముద్ఘాటించుట, లేనిదుఃఖమును బైపెట్టుకొని మిగుల నాయంతట నే బాధపడుచుంట నా యవివేకచేష్టలు.

## నాహితుడు బొడ్డు వెంకటేశము దొర

మాపట్టణమున గోటలోదప్ప దక్కిన యన్నివీధులలోను నాహరికధలు జరిగెను. నాహరికధలు కొన్ని విని నాక్లాసుమేటగు బొడ్డువెంకటేశ మనునతడు మిక్కిలి హితుడయ్యెనతడు వెలమ. నాసమవయస్కుడు స్కూలులో జదివినప్పటికన్న నాకు స్నేహితులు తగ్గిరి. క్రమక్రమముగా మిత్రు లనదగువారు కడుకొంచెము సంఖ్యగ నుండిరి. ఔను, వయసుమీరినకొలది నిజమగు మిత్రులుంట యరుదు. సంసారబంధమున నుండువార లాత్మలాభపరులౌటచే నితరులయెడ మైత్రివిశ్వాసము లగుపర్చ జాలరు. మొదటినుండి తుదవరకు మిత్రులుగా నుంట యెక్కువపుణ్యాత్ములకు దప్ప నందరికిం దొరకదు, త్రాగుడు నేస్తము, వ్యభిచారపు చెల్మి, ధనాశతో జేయుమైత్రి, తుదముట్టనేరవు.

## చోడవరము డి: మునసబుగారి యాదరణ

చోడవరములో మమ్మాదరించిన మునసబుగారి యొద్దకు దిరిగి పోతిమి. చోడవరము తామరఖండీనీరు మిగుల మందమచట, హరికథకు నిర్ణయింపబడిన కాలమునకు దప్పక వర్షమువచ్చుట, చుట్టుపట్ల నైదారు క్రోసుల దూరమునుండి కథ వినవచ్చినవారు వర్షాటంకముచే గథ నిల్చిపోయినందుకు యజమానులను మమ్ములను దిట్టుచు బోవుట యిట్లేడెనిమిది పర్యాయములు జరిగెను.

ఒకప్పుడు మున్సబుగారును నేను నాలుగైదు మైళ్ళవరకు నిద్దరమే కాలినడకతో నైరు వెళ్ళినాము. మామళ్ళుదలలో జప్పున నాకసమున నల్లమబ్బులల్లుకొని గాఢాంధకారమును గలిగించెను. పిదప రోడ్డుపై మేము నిలువబడజాలని యంతవడి బెనుగాలి రువ్వసాగెను, వెంటనే యేనుగు తుండములంతలేసి ధారలతో వాన గురియసాగెను. వడగలిదెబ్బలు సహించరాకుండెను, భూమిపై మోకాలుబంటి వరద పారుచుండెను. మేము పడుచు లేచుచు వింటికి మళ్ళివచ్చుచున్న సమయమున జప్పున మునసబుగారు నారెండుకాళ్ళుపట్టుకొని సాష్టాంగపడి యయ్యా! మీయందు నాకు గలభక్తి యీలోకములో నాకెవ్వరియందును లేదు" అనెను. అపుడు జిరునగవున "అయ్యా! మీరు గ్రాడ్యుయేటులు, మిక్కిలిచదువుకొన్నవారు. కొన్నాళ్ళు ప్లీడరుచేసి లోకులమంచిచెడ్డలు కనిపెట్టినారు. ఇపుడీ యధికారమున నానావిధజనులను బరిశీలించియున్నారు. నాకన్న పెద్దలు కదా! యీ వెఱ్రి మీ కెట్లు కలిగెను! పంచమహాపాతకులలో నగ్రేశరుడనగు నేనా మీకు వందనీయుడుగా దోచినాను. "జేయునది మాఘస్నానములు, దూరునవి దొమ్మరిగుడిసె" అన్నట్లు హరిదాసుడనని పేరుపెట్టుకొని యొరులకు నీతి బోధించుచు, సంతతము దుష్టచేష్టలు నేయు నాబోంట్లు బ్రాహ్మణవర్ణమున బుట్టి చండాలకృత్యము లాచరించు వారలంబోలి దండనీయులు కాని మాన్యులు కానేరరు. నాచూపు పరస్త్రీలయందు. మరియు దుర్వ్యసనా

నక్షుడ నట్టి నన్నొక ధన్యునిగ నవివేకులు కొనియాడిన జెల్లునుగాని మీబోటి చదువుకొన్నవారు వ్యసనరహితులు, పరదారధనవిముఖులు, వివేక చూడామణులు నగువారలిట్లు బ్రితిమాలి పిశాచముపట్టినట్లు తాగ్రిగుబోతు వలె మూఢునిమాడ్కి బిల్లికాయవలె నావంటి దుష్టవర్తనుని కాళ్ళకు సాష్టాంగమొరగుట తగదు'' అంటిని. అందుకతను కన్నులనీరు నించి ''యాహా! నామనసు మీరు కనిపెట్టజాలరైరి. మీరు వివరించిన దుష్టవర్తనము మీయందుంట నాకు స్పష్టమైనప్పటికి నేద్దియో మీయందొకశక్తి కలదదినాకిట్టి భక్తి కలుగజేసెను." అనియె. పిదప నేడుగంటలరాత్రి ఇల్లు జేరుకొంటిమి, తువాలుతో నతడు నాయొడల లొత్తుచు' ఏమయ్యో! యిన్నిమడికట్లవర్షములో దుక్కడలదడిసినను మీజుట్టున నాకింతయుదడి యంటకుంట యాశ్చర్యము. మీకొప్పెంతసాంద్రము గుడా కేశవవయా.?'' యని నవ్వెను.

నేనెట్టి దుర్గణములగపర్చినను కనికర మామునసబు కొంచమైన నసహ్యించుకొనకుంట యాశ్చర్యము. అత డతనిభార్యయు నన్ను గన్న తల్లిదండ్రులకన్న నెక్కువగ భోజనము పెట్టి సంరక్షించుట నేనెప్పటికి న్మరువజాలను. ఆహా! పుణ్యాత్ములకు లాతివారి దోషము లగుపడవు కదా!

ఇచట నాచే నవలయ కాక్షేపింపబడిన వైణికశిరోమణి చోడవరపువా_స్తవ్యుడు. అతడు రచించిన కొన్నిస్వరజతులు, వర్ణము లచటి యతని బంధువులచే జదువబడగా నే సమర్ధించుకొనుటకు వీలులేని తప్పులువట్టిన నాసంగతి యచటివా రతనితో జెప్పిరి. అందుకతడు నాపై మరింత గుర్రుచుండెను.

## పప్పువెంకన్న గాయక వైణిక శిరోమణి

పప్పువెంకన్న కాలముచేసెను. వేలకొలది జనుల నతడు రక్తి నోల లాడింపదగు ప్రశస్తతరమగు శారీరముకల గాయకమణి, వీణకూడ సుందరముగ వాయించును. ఎవ్వియో నాలుగక్షరములు గూర్చి యేదో

పేరుపెట్టి యొకపుస్తకము వన్ని ప్రచురించినవానికెల్ల జిరకాల మీలోక
ములో ప్రఖ్యాతి నిలుచునుగాని స్థావరజంగమములు కరుగునట్లు దివ్యశారీర
మున గానముసేయు కేవలసంగీతజ్ఞులవిద్య వారితోడనే సమాప్త మగును
గదా! యొకవేళ గ్రామాఫోనులవల్ల పాటలు నిల్వచేసినను వేళవేళకొక
విధమగురక్తి కన్బరుచు గానవైభవ మొకమూల చూచినమాత్రమున
నేపాటిసంతుష్టి చేయజాలును! నేనెరిగినమట్టుకు పప్పువెంకన్నవలె దూర
శ్రావ్యముగా సుశిక్షితమగు శారీరము కలవా రరుదు. అట్టిప్రశస్తగాయ
కుని వెలుపల మిక్కిలి మెచ్చుకొనుచుందురు. కాని యైదురూకలకన్న
నెక్కువజీతము చేయించుడని రాజుగారితో నొకయాస్థానగాయకుడైన
సిఫార్సుచేయకుంట కేహేతువో! నాకు తెలిసినకారణమొర్వలేమియే.

తీయనీటిసరస్సున మొసళ్లున్నట్లు రాజులయొద్ద గనిపెట్టుకొని
పాతబడుటచే మొగమాటము చిక్కించుకొని తమకన్న నెక్కుడు విద్వాం
సుల జొరనీయక నొకవేళ నెట్లో సన్నిధిని చేరిన, వారలపై తప్పక
రాజుల కసహ్యము పుట్టునట్లు పాపములు కల్పించుచు గొండెములు
చెప్పుచుందురు. సర్వలోకరంజకమగు విద్యావైభవము కలవా డొకచో
దల నమ్ముకొనబోడు కదా! నౌకరీచేయువారు దారులొట యరుదు. కావున
నాస్థానములయం దర్హులకు చితసత్కారము తరుచుగ లభింపనేరదు.
సాహిత్యము తెలిసినవారు లోకులలో మెండుగ నుందురు. కాని శ్రుతి
లయల నెరిగినవారు సంగీతజ్ఞుల మనుకొన్నవారిలోనే యరుదైనప్పు డిత
రులలో జెప్పనేల? సంగీతమెక్కడనో గొడ్డళ్లకుదప్ప లోకమంతట నా
హ్లాద మొనరించును, సంగీతజ్ఞుల నలంతిగా జూచెదరు.

గవర్నమెంటు నౌఖరు మొదటిగౌరవనీయు డందు క్రిమినలధికారి
శ్రేష్ఠుడు. సివిలు రెండవరకము. మావైపు భోజనము చేయువేళ ఫస్టు
క్లాసుపంక్తిలో మొదటివిస్తరి డిప్యూటీకలెక్టరుగారు తరువాత శిరస్తాదారు
గారు. తరువాత సబ్ మేజిస్ట్రేటుగారు, తరువాత మునసబుగారు, తరువాత

ఇనస్పెక్టరుగారు, తరువాత హెడ్‌గుమాస్తాగారు; తరువాత నాజరుగారు. తరువాత ప్లీడరు, తరువాత చిల్లరిగుమాస్తాలు, రెండవక్లాసుపంక్తిలో జీతమునుబట్టి తరగతిగా జమీందారీ యుద్యోగులు. మూడవక్లాసుపంక్తిలో స్కూలుమాస్టర్లు, పిదప దిక్కుమాలినపంక్తిలో పండితులు. వైదికులు, కొట్టకొసకు గాయకులును, భిక్షుకులును.

శాస్త్రిలకు, నవధానులకు, కవీశ్వరులకు గాయకులకును మన్నన కొంచెము. సుగుణములకును, పాండిత్యమునకు పల్లెకులో మన్ననము లేదు. అధికారముకొలది, ధనముకొలది, గౌరవము చేయబడుచుండును. సానిపాపలకు. మద్యమునకు, దావాలకు, గుర్కజట్టిలకు. మోసగాండ్రకు గొండెగాండ్రకు. కొరమాలినడ్రస్సులకు గుఱ్ఱపుబండ్లకు, రిఫ్రెష్మెంటు రూములకు సొమ్ముదండుగ మెండు, "కల్లుకిచ్చునట్లు చల్లకీయజాల" రను సామెత యెంతనిజము! అన్నసత్రములు వేయుట చెర్వులు నూతులు త్రవ్వించుట, దేవాలయములు కట్టించుట, విద్యార్థులను పెంచుట, యగ్రహారములు సేయుట, కవీశ్వరుల నాదరించుట కలలోనివార్త లయ్యెను. కోర్టులప్రమాణా లబద్ధము లన్యాయములకు, పోలీసుస్టేషనులు దొంగతనములకు, మ్యూనిసిపాలిటీమురికికి, దేవతాలయములు వెలయాండ్రకు. తీర్థములపరిశుద్ధికి. కల్మిపాపమునకు, విద్యమోసమునకు, హేతుభూతములుగాదోచెడిని.

♦ తెల్లదొరలను అనుకరించుటతో వెనుకపడిన సంస్కృతి దర్పములు ♦

* విచిత్రవివాహకర్తతో ఒక సన్నివేశము *

జాతివివక్షిత లేదు. ఇంగ్లీషువిద్య యుద్యోగకారణము. ధనమూలమగుటచే నీచజాతుల కగ్రవర్ణములు చులకనయ్యె. స్వవృత్తిచే బ్రాహ్మణులు చెడిరి. వేదబాహ్యుల పాలనమగుటచే శ్రుతిస్మృతిధర్మము లడుగంటెను, బ్రాహ్మణులమని క్షత్రియులమని, వైశ్యులమని చెప్పుకొనుటతప్ప వర్ణాశ్రమధర్మములు బొత్తిగ నశించెను. మెట్టవేదాంతము ముదిరెను.

క్షామములు హెచ్చెను, దిక్కుమాలిన జాతులవారందరు దేశాంతరముల నుండి వచ్చుటచే ప్లేగు మొదలైన విచిత్రరోగములు హిందూదేశమున వేటాడుచుండెను. మనచేతులతో మనకన్నులు పొడుచుకొను సమయము వచ్చెను. పన్నులు బలమయ్యెను. భోగేచ్ఛ మెండయ్యెను. ఆయు వల్ప మయ్యెను. సిగ్గులేని మొండిబ్రతుకున కిపుడా కాలమయ్యెను. స్త్రీలకు పాతి వ్రత్యము పురుషులకు సూనృత మంట యరుదయ్యెను. స్వర్గము విజన స్థల మయ్యెను. తపనెట్టిదో తెలియదు. ట్రెయిను నడుపుట, టెలిగ్రాపు పోస్టు నిల్పుట, ఆనకట్టలు కట్టుట, పొగయోడలు నడుపుట, బెలూన్ లెగిరించుట, ఫొటోగ్రాపులు తీయుట. ట్రాముబండ్లు దోలుట, మోటారు బండ్లు నడుపుట, బైసికిలు చేయుట, విచిత్రములగు నాయుధములు పన్నుట, శస్త్రచికిత్స లభివృద్ధి నొనరించుట యన్నియుందెలిసినట్లు యెద్ది యుందెలియక చచ్చుట కలిమహాత్త్యము. గోబ్రాహ్మణులయెడ గౌరవము సున్న. భక్తి జ్ఞాన వైరాగ్యములు శబ్దమాత్రము లయ్యెను. హిందూ దేశమున మనుష్యసృష్టి ఖిలమయ్యెను. కోతులకు మనుష్యులకు నడుమ స్థితిగల మనుష్యులవంటి మృగములు భరతవర్షమున బుట్టి పెరుగుచుం డెను.

## ఇచ్చకములవారు

మాప్రభువువారు శుక్రవారముపార్టీలు చేయుచుండిరి. ఇచ్చక ములు బల్కుచు, నెంగిలిబ్రాందిం ద్రాగుచు, గొడ్డుమాంసము దినుచు. సవ్వాకులో చెవ్వాకులో వచ్చీరాని యింగ్లీషు బేలుచు, వెకలినవ్వుల నవ్వుచు, ధనభోగంబుల యాశచే దెలవార్లు నిద్దురమానుకొని పిశాచము లవలె జోగుచు, ప్రొఫెసర్ల మనియు, బండితుల మనియు, నుద్యోగుల మనియు, దంభములు చూపు బ్రహ్మబంధులను, అగ్రజాతుల నిరసించు నధమవర్ణములును, పరువుమర్యాద లటుండనీ, గుఱ్ఱపుబండీ, ఈజీచైరు, టోపీ, కోటు, పంట్లము, జూటు, క్లబ్బు, రిప్రెష్మెంటురూము, బానిసెరి

కము, దేహములందు జాడ్యము, మనములందు ద్రోహ చింత, లిప్పటి హిందువుల బ్రతుకున ముఖ్యములు. ప్రస్తుతము హిందువులకు జేయదగిన పని యేమి? లోకములో దమ పేరుండనీయ కేదోయుపాయమున నశించు టయే. పౌరుషజ్ఞానకీర్తులు లేవి బ్రతుకెందుకు? క్రమముగా హిందువుల పేరు జగతిలో నశించనీ: యడవిలో సంచరింతునా స్వేచ్ఛగా; బాధించు నధికార్లుండరు: పన్నులులేవు: మ్యూనిసిపాలిటీబాధలేదు: దేశక్షామమునకు వచ్చెను తెల్లియును: హిందూదేశములో నిపుదేమున్నది? గాజు పెంకులు మెడకోసుకొనుటకు. ధనమంతయు దిగంతములు పట్టెను. వానలేమిచే ధాన్యములు లేవు. ఉన్నమట్టు కెగుమతి, పైదేశములనుండి మనకవసర మైన వస్తువులేమియు రానక్కరలేదు. దూరదేశములతో నోడవర్తకము చేయజరుగురు లేదు. ఆనకట్లు ధూమశకటము, పొగయోడలు భరతవర్ష మునకు చేటు దెచ్చెను.

ఇపుడు కర్తవ్యమేమి? మంచిస్థితి హిందువులకెట్లబ్బును? చావులు లేని హఠయోగులు, మృత్యుంజయులగు బ్రహ్మర్షులు. వివిధయజ్ఞహవి ర్భాగములు తిని క్రొవ్విన దేవతలేమైరో? అంతఃకలహము లింతకు కార ణముకదా? భరతవర్షమందు కొసకు క్రోతితగవయ్యెను. ఓర్చుకొన్నచో మంచికాలము తిరిగివచ్చును కాబోలు. ఔను బహుళపక్షముపిదప శుక్లప క్షము వచ్చునుగదా. భవిష్యద్భారతవర్షజనులకు సుఖమబ్బక తీరదు. మనకు కష్టములు తప్పవు. కాబట్టి యోర్చుకొందము. అయ్యో! క్షణకాల మైన సహింపరాదుకదా వీరల దౌర్జన్యము. జాతులు చెడనీ - గోహత్య ప్రత్యక్షముగ నహోరాత్రములు జరుగుచుండనీ, వైదికకర్మములు మంట గలియనీ. వర్ణాశ్రమధర్మము లడుగంటనీ. హిందువుల మర్యాద మంట గలియనీ, కూటికొరకు అగ్రవర్ణము లధముల నాశ్రయించనీ. హీనజాతుల రొట్టెనేతబడనీ, హిందూదేశీయవిభవము లాతివారలు కొల్లగొట్టి కైకొననీ, కరువులు రానీ, రెప్పపాట్లవలె శతాబ్దములు మారునుగదా? యెప్పటికైన బురాణములలో జదివినట్లు శ్రుతిస్మృతి ధర్మపరాయణులు, ధర్మవీరులు

కలిగెదరా? యాకసమున దామరలు మొల్చునా? మనము మన మౌదుమా? జపాన్, చైనా, పర్షియా, రష్యా, టర్కీ. గ్రీస్. ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సు, బ్రిటానియా, అమెరికా యిందరికి "నేషనాలటీ" కలదు. హిందువులకు "నేషనాలిటి" యెపుడైన గలదా! లేకిప్పటివలె పూర్వముగూడ హిందువులుండిరా, పూర్వమెట్లుండినను ప్రస్తుతము మనము మనుష్యులముకాము. బంధములో బంధము; దుఃఖములోదుఃఖమిప్పటి హిందువులకు విధివ్రాసెను. ఇక మనదేశము, మనవర్ణము, మనమతము నను నభిమానము వదలుకొని జీవచ్ఛవములభంగి దిరుగుచుండుటయో, లేక తొంటి మర్యాద నిల్పు కొంటకై పాటువడుటయో! వెఱ్ఱి కుదిరినగాని పెండ్లి కాదు. 'వైన్‌వెర్సా' జీవనములు జలబుద్బుదములవంటివని యెంచి శాశ్వతఖ్యాతిని దలంచి తొంటిమర్యాద నిల్పదలంచి యహరహములు హిందువులు ధర్మప్రతిష్ఠకై చచ్చుచుండుడు. కొద్దికాలములోనే మనతపస్సు పండును. దేవుడు తిరిగి శుక్లపక్షమును గలుగజేయును. పోయినట్లె తిరిగి శుక్లపక్షము వచ్చును గదా. మధ్య మన చావుతపస్సు లేమి ప్రయోజన మనెదరేని వర్తమాన హిందువులారా! మనబ్రతుకే మనచావు, మనచావే మనబ్రతుకని ఢూఢిగ నమ్మకొనుడీ. మరణ యజ్ఞములో మొదటి హోమముగ వ్రేల్పబడతగిన వారు "సోషల్రిఫార్మర్సు", నౌకర్లును, వర్తకులు, వ్యవసాయదార్లు మాత్రము మిగలనీ తక్కినవారందరు నిర్మలహృదయముతో మృత్యువు నెదిర్చి శాశ్వత విఖ్యాతిగాంచనీ.

## ఉభయభ్రష్టులు

ఇట్లు గురుబోధమహిమచే దలంచుచు మింట మిద్దెలల్లుచు నాత్మారాముడనై యొకవిం జూచినపు ఢయ్యోవెఱ్ఱిముండకొడకా నీతండ్రి తద్దినమంత్రము చెప్పిచెప్పి పౌత్రలు పట్టిపట్టి జన్నిదము లాడికియొడికి దర్భపోట్లు తినితిని నీకీదిక్కుమాలిన చదువు చెప్పించగా దుదకు నీరూప మిట్లు మారెనా? మీతండ్రియవధాని. నీవు గ్రామనౌకరువా? నీవేష మడిగి

కొన్న ట్లున్నది. కోటు బూట్సు వేసినంతమాత్రమున దొరవైతివో? బొద్దెంకలవలె మీసములుంచితివా? ఇంగ్లీషు తిన్నగ రాదు. స్వభాష నోర్లి వైతివి. ఓరీ! యుభయభ్రష్టుడా! నీవేనా వైదిక బ్రాహ్మణుక విదియేనా నీ వేదచోదితకర్మము? నీవాళ్లయొద్ద డాబుసేయుట. పైవారి బూట్సు కాల్తాపులు తినుట నీనుదుట వ్రాయబడెనా? కులకాంతను వేశ్యగ నుంచత గునా? పర్ణశాలల తపసొనరించుకొనుట మాని వైదికబ్రాహ్మణు లిట్లధమ వృత్తి బూనుట గ్రహచారము. ఇప్పుడే తొమ్మిదిగంటలలోపున తంద్రి తద్దినము బెట్టుకొని దొరగారియొద్దకు బోవుచున్నా డీవెలనాటినియోగిపి రస్తాదారు డీపని యితనికి గొంత యుచితముకాని యింతకన్న మేలు వీడు కత్తి చేబూని చచ్చుట. ఓహో! విశ్వనాథశాస్త్రిగారు డబులెమ్మె. వీడి చదువు మండ. వీడొక యధమనౌకరు. శుద్ధశ్రోత్రియునివలె గోష్పాదమంత పిలక యుంచినాడు, బాగున్నది. ముండమొగమువలె మీసములు లేవు సరే గంధముబొట్టు మరెంతస్ఫుటముగ బెట్టుకొన్నాడో? తురకవాని దగులుకొన్నను పొత్తిపంచ మడిమానినట్లు భాషమ్లేచ్ఛితము వైదిక వేషము. ఓరీ కుక్షింభరుడా! యీ పాటి నీబానిసరికము మాను కొని మెడకు బండకట్టుకొని నూతబడుము. పోలా వెంకట సోమయా జులుగారి కుమారుడు యజ్ఞేశ్వరుడు. ఎంత సొగసుగ నున్నదిరా నీదొర వేషము, నీయందమూర. యొడలినింత దూదియంటించుకొనుము కొంత దొరను బోలియుందువు. అడుగుకొన్నను జరుగనపుడు నౌకరీ చేయమన్నా డదే యొక మాధ్వసంతులదె యొక శ్రీవైష్ణవు డిరువురుస్కూలుమాస్టర్లు, గొర్రెలకైన బెదురుకూరు కాని వీరలకెవరు లక్ష్యపెట్టరు. పూర్వకాలమున రాజులచే వసతులు పొంది యన్నివిధముల బ్రాహ్మణులు, నియోగులు తప్ప తక్కినవారందరును షట్కర్మలుగ నున్నారు. ఏలాగునైన బ్రతుక వలయునా? పొట్టకై బానిసరికము సేయక తీరదు. కొలువునకు బ్రాహ్మణ కర్మము చాలాదూరము.

ఇట్లుతలంచుచుండును

ఏమయ్యో! యెపుడు వచ్చినావు? "మొన్ననోయి" యాగు

మాగుము, కొంచెముచెప్పు, లండనుసిటీ యెట్లున్నది! నీకు భోజనమెట్లేమి నేర్చుకొంటి వెందుకు పనికి వచ్చెదవు! లండనుసిటీ చూచి తీరవలెనుగాని చెప్ప శక్యము కాదు. అచటి బ్రతుకు మిక్కిలి కాస్ట్లీ. నామట్టు కెంత క్లుప్తముగా వాడుకొన్నను షుమారు నెలకు రెండువందలకు మించినది. నాభోజన మొక హోటలులో. యెన్నో హోటల్సులో "ప్యూర్ వెజిటేరియన్స్," దొరసానులే వంటకు. మరియొక విచిత్రము విన్నావా! యిచటి కలెక్టర్లు డి॥ జడ్జీలు మొదలగు గొప్పయాఫీసర్లక్కడ కూర భుజమున మోసికొందురు. వీరచట జీవనాధారమునకు గౌరతవడినవారిలో నొకరు. మనకు ప్రభువు లిచట, వీరికి జీటికి మాటికి గుఱ్ఱపుబండి. మనసొమ్మెల్లి వీరిజీవితములకే చాలకున్నది. నేను బారిస్టరీ ప్యాసయినాను", బాగున్న దచట నశించకుండా తిరిగి పరుషదీయ నేల వచ్చినావు! నిన్గలుపుకొన్నారా తిరిగి బ్రాహ్మణులలో! మనవాళ్లకు నీతి జాతి యేమోయి, మొన్ననే కలుపుకొన్నారు. స్వల్పప్రాయశ్చిత్తమే జుట్టు గొరగలేదు. కోరినయెడల దొరలనుగూడ దమలో గలుపుకొను సామర్థ్యము మనబ్రాహ్మణుల కున్నది సుమా. తిరిగివచ్చుట నాతప్పే ఈదిక్కుమాలిన మనదేశములో బ్రతుకుటకన్న సీమలో జచ్చుట నయము. నాయభిప్రాయ మిపు డిండియాలో సారములేదు. తెల్వితేటలుగల హిందువులు దేశాంతరములకేగి మనదేశమునకు బేరు దేవలయును. పోదునా! వీడు కొంత మంచివాడు. విర్భయముగ పరదేశములలో జదువుకొని వన్నెమీరి మనకుబేరు దెచ్చెను. కాని వీడాదేశములోనే బారిస్టరుగానుండి సంపాదించి మనవారిని మరికొందరిని దనయొద్దకు రప్పించి బాగుసేయవలెను.

ఇదుగో మహారాజుగారు పూలదోటకు విచ్చేయుచున్నారు. కడు దొడ్డ రాజుకొడుకు గాని యితడొకసారి లండన్ వెళ్ళిన బాగుండు నచటివార లిట్టి రాజరాజోత్తముని జూచి మిక్కిలి సంతోషింతురు. ఈ పండితులీయుద్యోగు లీ నౌకర్లు స్వలాభమును కోరువారేకాని మహత్కార్యము

లకై మహారాజును ప్రోత్సాహ పెట్టజాలరు. నాబోటి రాజుగారిని గలిసి కొనుట తటస్థించినచో నట్టిసలహా తప్పకచెప్పుదును. ఇట్లు తలంచు చుందును.

## రాజమహేంద్రవరములో శ్రీరామనవమి

రాజమహేంద్రవరమున శ్రీరామనవమి హరికథలు చేయనేగినా రము, అచట వసంతనవరాత్రములు మిక్కిలివైభవముగ జేయుదురు. తాటికమ్మలచే దట్టముగా సందులు, గొందులు, రోడ్లు మూసి పందిళ్లు వేసెదరు. నానావిధ జను లిసుకవైచిన రాలకుండ గుమిగూడెదరు. పందిరి కగ్నితగిలినచో ఫీపిల్సుపార్కుముచ్చట జరుగకతీరదు. పీర్లపంజాలవలె బలుతావుల నుత్సవము నిలిపెదరు. కొన్నిచోట్ల నాచురంగు కొన్నిచోట్ల హరిభజనములు. కొన్నిచోట్ల వాద్యవిశేషములతో గోలాహలముగ నుండును.

ఒకచో హరికథ యొనర్చినాడను. కథలో బ్రహ్మసమాజమును గూర్చియు, వితంతువివాహముగూర్చియు నిట్లు ప్రసంగించినాడ. "స్వర్గ మందున్న నాతండ్రి యోదేవుడా, నిరంజనుడా, నిర్గుణుడా, పరిశుద్ధుడా! నీజాడ తెలియ శక్తులము కాము. నీవీసమస్త ప్రపంచమును గల్పించితివి నీవు మమ్ములను బుట్టించితివి, యోదేవా! మాయాత్మలను బరిశుద్ధి నేయుము. నీదయవలన నేడుహాయిగ నిద్రలేచినాము. పల్దోముకొని కాళ్లుచేతులు కడిగికొని యింత రొట్టియ తింటిమి. మాహృదయముల నిర్మలము నేయుము. మాపాపములు మన్నించుము". ప్రార్థనము కొంత బాగున్నది. కాని వర్ణభేద మొల్లకుంట, వేదముల నమ్మకుంట. యాచారములు మార్చుకొంట కొంతశోచనీయము. బ్రహ్మసమాజము క్రిస్టియానిటికి పెద్దప్ప మహమ్మదానిజమునకు మేనత్త. అగ్రవర్ణముల యాధిక్యమునకు సహించని యితరుల కీమతములు కొంతసంతుష్టికలి గించును. బ్రహ్మసమాజ మెందునుండి బుట్టినది? ఉపనిషత్తులనుబట్టి యీమత ముద్భవిల్లెనో!

## విచిత్రవివాహాలపై ప్రసంగము

ఉపనిషత్తులలో బునర్వివాహాతం తెచటనైన జెప్పెనా? మేకల యజ్ఞములమిషచే నీమతము జంపించకుంటకు సంతోషమే కాని హిందువుల కనాదిగానున్న వర్ణభేదము తొలగించుట పునర్వివాహముల బ్రేరేపించుట కొంతచింత్యము, భూతదయ ముఖ్యమె కాని పాములను. బులులను తేళ్లను ముద్దాడరా దట్టివాని మేలు తక్కుజంతువులకు జెట్టతెచ్చును. మనుష్యులలో బురుషులం బ్రేమించి స్త్రీలు తత్సంగమమున దమదారువులను ఫలింపజేసికొని ప్రసూత లగుచున్నారు. స్త్రీలను బ్రేమించి పురుషులు తత్సంయోగమున మతిభ్రష్టులై దేహనష్టములం గాంచి కష్టముల పొలగుచున్నారు. వీడు నాభర్త వీనితోడిదె నాబ్రతుకని భార్య పతిని సేవించుటయు దనకంటె ముందొకప్పుడుకన్నెతన మందుగాని పెద్దరికమున గాని భర్త నీల్గినయెడ దిరిగి కామసౌఖ్యము గోరకుంట యిదివరకు జిరకాలమునుండి మనకునాచారము. స్త్రీకి పాతివ్రత్యము, పురుషున కేకపత్నీవ్రతము చూపట్టెడు. పాతివ్రత్యమన పెండ్లాడినవానిందప్ప సంయోగమునగాని వియోగమునగాని యన్యుని గలియగోరకుంట. ఏకపత్నీవ్రతమన నగ్నిసాక్షిగ బెండ్లాడిన దానితప్ప నన్యస్త్రీ సంగమ మొల్లకుంట స్త్రీ గృహకృత్యములు సేయుటయు, పురుషులు యుద్ధాదికృత్యము లొనర్చి దేశక్షేమమునకై పాటుపడుటయు. నియతధర్మములు మరియు. లోకోపకారము చేయు సామర్ధ్యముకల పురుషుని కాపాడుటకై భార్యయుంట యావశ్యము గనుక యొకవేళ భార్య గతించెనేని యింకొకతెను గట్టుకొనుట పురుషున కుచితము, భర్తగతింప నింకొక భర్తను గట్టుకొనుట పాతివ్రత్యభంగముకదా? కామసౌఖ్యము, శరీరపోషణము, సంతానలాభము గదా స్త్రీకుండవలసినది, పతిదొరంగినస్త్రీ పాతివ్రత్యము దొరగి పునర్వివాహమాడగోరుటకేవల మాత్మలాభమునకేగాని దేశక్షేమమునకు గాదుగదా? లోకమున స్త్రీ సృష్టి యధికముగ గన్పట్టెడు. స్త్రీలు పునర్వివాహము లగుచున్నయెడ బ్రజాభివృద్ధి విపరీతమగు నందువలన

జనులకు సౌఖ్యము దరగును. ఆహారనిద్రలు శరీరధారణకు ముఖ్యములు, కాని సంభోగము మానినచో జీవహాని కలుగనేరదు. కావున స్త్రీ పునర్వివాహము మానినచో దేశోపకారులగు పురుషులకు శరీర పోషణకు దగు కృత్యము లాచరింపగలరు. జనసంఖ్య విపరీతము కానేరదు. పాతివ్రత్యములేని మాదుమనుపుజాతుల జనసంఖ్య కన్న స్త్రీపునర్వివాహ మెరుగని ద్విజులసంఖ్య మిక్కిలి తక్కువ గదా! కావున దేశమునగల పంట నధికముగా భక్షించువారు మాదుమనువుజాతులే. మాదుమనువులు లోకములో లేనిలాభములు జనులకు సమృద్ధిగ భోజనసామగ్రి దొరకుట, ద్రవ్యసమృద్ధి ప్రజకు సరిపడియుంటచే మోసము మొదలగు దోషములు లేకుంట సర్వజనసాధారణ సంతృప్తియు. నాయూహ లిటుండనీ, బ్రిహ్మర్షులు శాసించుటచేత నో మరియెట్లో యీస్త్రీపునర్వివాహములు హిందువులలో చాలాకాలమునుండి యాచారము లేదు. పూర్వాచారము కులధర్మము లందైన మన మనుసరింప రాదా? పై యంశములను వివేకించి జూడగ వితంతువివాహములు విపరీత ప్రజాభివృద్ధికి హేతుభూతములు లోకోపద్రవకరములు దుష్టమతప్రవర్తకములు హాస్యాస్పదములు, సనారోగ్య కారణములు గనుక స్త్రీపునర్వివాహము తగదని ప్రస్తుతము జరుగుచున్న స్త్రీపునర్వివాహమందలి దోషము లుద్ఘాటించితిని. కాలానుసారముగ రాజ్యపరిపాలనమున మార్పు లవసరముగాని మతముమార్పు జరుగురు లేదు. జాతిసంకరము పొందకుండ శిష్టాచారము చెడకుండ రాజ్యపరిపాలనమున మార్పులు గోరు వివేకులు దేశక్షేమంకరులు. రాజ్యపరిపాలన మెట్లున్నను పూర్వమతాచారములకు విరుద్ధముగా వ్యర్థముగ నూత్నమతాచారములను బోధించువారు దేశోపద్రవకరులు" అని పల్కు నా యుపన్యాసము రుచింపకచటి విచిత్ర వివాహకర్తయొక్క శిష్యులు కొందరు సభనుండి నన్గడింపక వెడలిపోయిరి.

## రాజమండ్రి టౌనుహాలు

మరునాడు టౌనుహాలునకు సాయంత్రము నేబోయి, ఉదయము నుండి సాయంకాలమైదుగంటలవర కుద్యోగముల నలసి డస్సి యచట గాలయాపనము చేసికొనుటకై కొందరు. ఇంటిబాధ పడజాలక కొంత సేపైన నొంటిగ సుఖముండుటకై కొంధరు. గుఱ్ఱపుబండ్లపై బైసికిళ్లపై నుండియువచ్చితమడాబు చెలాయించుటకై కొందరు, తగిన యధికార్ల సహవాసము దొరకునుగదా యని యిచ్చకములు బల్కుచు నాత్మలాభముకై కొందరు, ఇంటిలో గూరనారచూచుకొనక న్యూస్ పేపర్ల టప్పాలు రుచిమరగి మరింతమనఃక్షోభ నొందుటకై కొందరు. ప్లీడర్లుద్యోగులు కలిసి టప్పాలు కొట్టువారు; పనికిమాలిన వృద్ధఘటములు పెన్షనుదార్లు మొదలుగ బలురకముల కళ్లబ్బపురువులు, టెన్నిస్సులో నాట కొంచెముగాని సోడామొదలగు దిక్కుమాలిన మాదిగనీళ్ళు కడుపున కామాధిక్యముగ మెండుగ ద్రాగుపడుచువాండ్రును, బాలెస్లెటు దిరుగునో యట్లు శిరస్సులు ద్రిప్పుచు ఒరుగుచు ప్రతికక్షి కేనన్‌గాని పాకెట్‌గాని చేసినపుడు విధిలేక మెచ్చుచు మాటిమాటికి స్కోరడుగుచు మిన్నైనపు డెల్ల స్కోరుకొనకును తనచేతి బొటనవ్రేలి మొనటికిం జీమసుద్ద వ్రాయుచు రెస్టు పుచ్చుకొనియు మిన్‌పాకెట్‌ నేసి తెల్లబోవుచు ప్రతికక్షి దా కూహ[illegible]పు సలహాలిచ్చుచు గెల్పుగోరి బుద్ధితీక్ష్ణపర్చుకొనుటకై మాటిమాటికి బొడుము బీల్చుచు చుట్టగాల్చుచు సొమ్ముకొల్ల వెట్టి యడ్డమైననీళ్ళు ద్రావుచు దెబ్బ తప్పిపోయినప్పుడు స్కోరుటిప్పరబ్బ రెరిగిపోయినదనియు నేటిశకునము బాగులేదనియు నభీష్టానుసారముగ దెబ్బతగిలినపుడు తనలో దా మెచ్చుకొని చెంగటివారి మోములను గర్వముతో జూచుచు వెకలినవ్వులు నవ్వుచు మ్లేచ్ఛత మే మాట్లాడుచు యురోపియన్ డ్రస్సులు వైచుకొని బేజరుగురుగ ధనము పాడుచేయుచు తద్దినమైన మానుకొని తప్పక ప్రతిదినము విలియడ్సాడు హీనసత్వులును, బురదనీట ద్రొక్కబడినట్లూపిరిదీయక ఫ్రాన్సుదేశములో నొకగాడిదకు క్రోతి బుట్టినదనియు, నమెరికాలో

సైన్టిస్టు వీనసులో మిరపకాయలతోట కనిపెట్టినాడనియు, రష్యాచక్రవర్తి
గారి గడ్డములో నొక వెండ్రుక తెల్లబడినదనియు, జపానుయుద్ధములో
నాడది మగవానిపైకెక్కి మీసములూడదీసెదనియు, మనచక్రవర్తిగారు
మనదేశము మునుపటికన్న నెక్కువప్రేమతో బరిపాలించుటకు ఖరారుచే
సినారనియు, సురేంద్రనాధ్ బెనర్జీగారు స్వరాజ్యముంగూర్చి లెక్చెరులో
భూమిని మన్ను చేసివేసినారనియు, నరవిందఘోషుగారు లండనులో
మనకొరకై బాధపడుచు మాఁకూడు దినుచున్నారనియు, లాల్ మోహన
రాయిగారు క్రోతి సీల చెఱుకుచందమున ముప్పుతెచ్చుకొన్నారనియు,
బొబ్బిలిమహారాజావారు గవర్నరుగారి సభలో జీతమునకు గుదుర్కొన్నా
రనియు, జాతివిచక్షణమాని హిందువులందరేకవర్ణముగ నున్నగాని మన
దేశము బాగుపడదని లాల్ మిత్రగారుపన్యాస మిచ్చిరనియు, నొకన
బాబుగారు మొన్నసాయంకాలము బొద్దెంక నొకనరుకునకు మూడుతు
న్కలు చేసిరనియు, లండన్ టెలిగ్రాముబట్టి చూడగా ప్రైవేటు శెక్ర
టరీగారికి ఇండియాయొక్క యభివృద్ధికై యాలోచన పుట్టకలదనియు
స్వదేశీమీటింగుచేసి నందుకు అల్హాబాదులో గొందరిని ప్రోసెక్యూషన్
జేసిరనియు, జనులు చచ్చిసున్నమైనారనియు, ఎచటివేసవిబాధకు దాళ
లేక మైసూర్మహారాజావారు నీలగిరికొండలు పట్టిరనియు, మరియొక
జమీందారుగారు సముద్రపుటొడ్డు జేరుకొనిరనియు, గవర్నరుగారు ఫలానా
తేదీ మూడుగంటల పదేనుమినిట్లకు విజయనగరం మహారాజావారిని కలు
సుకొని అయిదుగంటలకు వార్తేరుకై లుప్లాట్ ఫారమున నద్రస్పందుకొని
ప్రసిడెన్సీలోని భాగ్యపాటిస్థలములన్నియు జూచుకొని మరియు స్వదేశము
నందు 'సెటి'ల్కాబోవుచున్నారనియు, వెర్రికుక్కకాటునకు బకోడీలు
తినుమని జర్మనుడాక్టరుపదేశించెననియు, ఫ్రీమేసన్ మీటింగులో నానా
జాతివారందరు కలిసి యన్నపానముల దృప్తిచెందిరనియు, మొదలగు
వార్త లడిగినవారితో నడుగనివారితో దెల్పుచు వార్తాపత్రికల నూపిరిడి
యక చదువుకొనుచు దలలాడించు వార్తాలాలసులును, బ్రిడ్జి కంప్లీటయినది

పేకాటలో నింతసొగసైన యాట యింక్లీ యరెన్నుగాన యురోపియ
న్సట్లు సొమ్ముకొల్లబెట్టు కొనెదరోయి యిటువిగో యూరోపియన్సొసై
టీయే సొసైటీ యని పీట్లాడు ముదుసలివారును - రాజు ఆటకట్టి హాహా
యిహిహి మరియొక యెత్తువేయుదమా! ప్యూన్! స్వీట్సున్నాయా యేదీ
యొక లెమ్నేడు తెమ్మనుచు నేమో మిక్కిలి లోతుగ నాలోచించుచు
నంతలో మతిలేక బంటుముందు మంత్రినిబెట్టి యెత్తిమ్మని పీకులాడుచు
నూలులేని సంతగడబిడజేయు చదరంగపుటాటగాండ్రును. మెండుకొను
క్లబ్బులో నొకకుర్చీమీద డమాషాగా చూచుచున్ననాతో హానరబులైన
నాపేరున్నపంతులుగారు అయ్యా! దయచేయు డీకుర్చీపైకి" అని పిల్చి
యాచెంత నేకలి పునర్వివాహకర్తగారితో పంతులుగారు "నిన్నటి రాత్రి
యితడత్యద్భుతముగ హరికథచెప్పి సభికుల రంజింపజేసెనట" యని
యనగా నప్పునర్వివాహకర్తగారు మొగముముడుచుకొని" ఛీ. యేమి
హరికథలు. వెధవహరికథలు. బంగబూతు హరికథ" లనియె నపుడు
నే నవ్వి "పంతులుగారికి సహవాసబలముకాబోలు నెల్లప్పుడు విధవాస్మర
ణము చేయుచుందురు" అంటి. నంతట నచటివారెల్లరు సద్దడిగి వినుచుం
డిరి. పిదప హానరబుల్‌గా రతనితో "నిన్నరాత్రి దాసుగారిపాట దేవదుం
దుభులు మ్రోసెనట" యని యనగా "పాటసంగతి వారెరిగినచో వెధవ
కథలని తిట్టెదరా!" యంటి నందుపై పునర్వివాహకర్తగారు నావైపుతిరిగి
పండ్లుకొరుకుచు బెతాకహస్తమున ముదలకించుచు "నీ పాట పిచ్చాయికి
దెలియు" ననియె. పిచ్చాయియను నది యొకవెలయాలి యభినయ
విద్యా విశారద యతనియింటిపొరుగు నాపెయిల్లు, నేనచట దరుచు
బాడుచుందుసుగాన నన్నలెత్తిపొడిచెను, పిదప విరస మికచాలునని
నేమానుకుంటిని కొంతసేపటికింకొకడు "నారాయణదాసుగారి కవిత్వము
వంటి ఒరిజనల్‌ప్లో సాధారణముగా మరెవరికిన్లేద" నియె నందుకాపునర్వి
వాహకర్త "ఫోనిండామాటన్న నాకసహ్యము, పోకిరీగుంటకారు" అనె
నంతట యెవరియిండ్లకు వారేగిరి.

## చెన్నపట్టణములో పరిచయములు అనుభవములు

మరునా డేలూరునకు బో సమకట్టియుండగా జోడవరమున నన్నా
దరించిన మునసబు కొంతకుటుంబముతో రామేశ్వరయాత్ర బోవుచు
మెద్రాసును జూడవచ్చు రండు కలిసిపోవుదమని మమ్ము పిలిచెను, మరు
నాడు పగలుపన్నెండుగంటలకు బెజవాడ చేరుకొంటి మపుడు వేసవి
కాలము. బెజవాడలో దూర్పునదప్ప దక్కినవైపున గొండలుంటచేతనో
మరెందుచేతనో గాని యగ్గి తూలుచుండును. కృష్ణానది పట్టణముకన్న
మిక్కిలి పల్లమున నుంటచేత నూరిలో నీటిసదుపాయము తక్కువ.
సాయంకాలము సదరన్‌మరాటా రైలులో గూర్చుంటిమి. ఈపోతులబండి
యుదయము జామున కొక కొండగుహ దాటెను. ఆగుహ యొకమైలు
పొడవున దొల్వబడెను. బండి గుహనుండి పోవుచున్నపు డేయమావాస్య
రాత్రియందుగూడ నట్టి యంధకార మనుభవించ లేదు. కష్టము గడచినట్లు,
నిద్రమేల్కొన్నరీతి, రహస్యము తెలిసినట్లు, గుహదాటి వెల్లడి దోతేర
దబ్బకాయచుట్లవలెనున్న కొండపై మీద యినుపదారిపై తలక్రిందుల
బోవు ట్రెయినులోనుండి క్రిందుగనుబడు నగాధపు కొండయొంతరల దట్ట
ముగ పోల్కికిరానిచెట్ల నల్లుకొన్న యడవిం బలుతెరంగుల రొదసేయు
నానావిధజంతుజాలంబుల బరికించుచు, మలుపు దిరుగునపు డుంథలబారుతో
నడుచుబండి నోరికలిబొండతో బోల్చుచు భయ విభ్ర మామోదంబులు
ముప్పిరిగొను డెందములతో దంతధావనమైన లేక నిద్రదొరగి వాడిన
మొగంబులతో సాయంకాల మైదుగంటలకు గుంటకల్లును బండినిల్వగా
వేగిరపడి కృతకృత్యులమై వండుకొని భోజనానంతరము తిరిగి బండెక్కి
నారము. పెద్ద బుట్టపాగాలును కారునల్పు దుక్కిముచ్చు మోటదేహము
లతో కొందరు సీడెడ్‌జిల్లామనుష్యులను, తెల్లటి పొట్టి శరీరములతో పెద్ద
యంచుధోవతులతో నున్న ధార్వాడజనమును, తురక యాచతో దెనుగు
మాటాడుచు నొడలినిండ బట్టతొడువుగల నైజాముప్రజలను, అడ్డలో
గచ్చకాయలు గిలకరించినట్లు కడుతత్తరగ మాట్లాడు నరవజనులను;

రెయిలుస్టేషనుయొద్ద నిలవయున్నవారు. నచటినుండి బైలుదేరువారును, స్టేషనునౌకర్ల సమ్మర్దమును. తినుబడివస్తువుల దుకాణదార్ల యమ్మకపు కూతలును. మనమున కచ్చెరువొనరింప మెడ్రాసుమెయిలులో గూర్చుని దానివేగము కొనియాడుచు తెంపరితనమున మాగదిని జొచ్చినవారితో విధిలేక మైత్రి నొనర్చి పరస్పరసల్లాపముల నానందించుచు, స్థలము చాలమిం గూర్చొని కొంతసేపు గుర్రుపెట్టుచు, బండివిల్చు స్టేషనులస్థితి భోగట్టాచేయుచు మెద్రాను చేరుకొంటిమి.

ఒంటెద్దుబండిలో సామానువెట్టుకొని మేమిర్వురము కూర్చుంటకు జాగాలేనందున సున్నితమైన వస్తువులు తంబురావీణలుచెరియొకరిభుజమున మోయుచు నెన్మిదిగంటల యుదయపుటెండలో నద్భుతపడి పట్టణము నలు వంకల జూచుచు గవర్నరుగారి యాతాచుట్టుగోడప్రక్కనుండి చనిచని తుదకు దిరువలిక్కేణిలో మునసబుగారివెంట నొకయింటిలో బ్రవేశించి తిమి. మున్సబుగారి భార్యాసోదరు డట వెలయాలితో నుండెను. చెంగటి యింట్లో నొకహోటేలులో మాకతడు భోజనము పెట్టించుచుండెను, మున సబుగారు మరునాడేరామేశ్వరమునకు బోయిరి. తిరిగి భీముడుగారు మమ్మా దరింపజొచ్చిరి. క్రొత్తకుండలో జోరీగజొచ్చినట్లయ్యె మాపని. మాకట నన్నియును గ్రొత్తమొగములే, సాయంకాలమున బార్ధసారధిగుడియు. నచటజరుగు వాద్యవిశేషము లాచెంగటనున్న కోనేరు నాచుట్టునడుచు స్త్రీపురుషులు కన్పండువుసేయు. చెట్టువిడిచిన భూతములనలె యోడవదలిన కళాసులపోల్కి, బేరముడిగినవర్తకులభాతి, పెన్షనుగొన్నసిపాహీలకరణి, కోర్టుసెలవురోజులలో ప్లీడర్లవైఖరి నృనిపాటులేవియు లేక వీధులవెంబడి దిరుగుచు భీముడుగారిప్రాపున భుజించుచుంటిమి. తిరువల్లిక్కేణిలో రాత్రి దోమలు మెండు. పగలు ధూళి యింతంతకాదు. సముద్రపుగాలి వైచినంతవరకు కొంత సుఖమేకాని గాలి కొంచెము తగ్గినపుడు తాపము సహింపరాదు.

## మెడా్రిసులో నాహరికథలు

ఒకనాడు భీముడుగారి బసకొక గుర్రిపుబండిపైనుండి యొక గుమాస్తాను వెంటనుంచుకొని మైలాపూరులో నివసించిన యొకవెలనాటి నియోగిపంతులు వచ్చి నాకవిత్వము విని మిక్కిలి సంతోషించి మాయిరువురన్నదమ్ములను దనయింటికి గొనిపోయెను. మైలాపూరు చెర్వునుత్తర శ్రేణీ నతనిబస. ఆతడు బి. ఎ. బి. ఎల్. మంచితెల్వితేటలుకలవాడు. స్కూళ్ళకు మేడేజీలుచేసి రెండులక్ష లార్జించెను. మిక్కిలిరసికుడు. కడు నుదారవంతుడు. తెనుగున గద్యపద్యములు మిక్కిలిచురుకుగ నల్లగలడు. దొరలు మెచ్చునట్లింగ్లీషు వ్రాసి మాట్లాడగలడు. నేనప్పటికి బాటసారి యను కావ్యమచ్చువేయించుటకు సన్నద్ధపర్చినాడను. శ్రీకృష్ణజననమను పేరున నొక సంస్కృతయక్షగాన ప్రబంధమును జేసినాడను. గుజరాతీపేట లోని యొకగుజరాతీ బ్రాహ్మణుడు చంద్రశేఖరశాస్త్రిగారి సతీర్థ్యుడును, మిక్కిలివన్నెకెక్కిన గ్రాడ్యుయేటును ఒకస్కూలునకు హెడ్మాస్టరును బహుసంతానవంతుడు సద్గుణపుంజ మగునతడు నాప్రజ్ఞకు సంతోషించి తనయింటను, తనపొరుగు నప్పటికున్నదశలోనున్న నొకవెలనాటి వైదికునియింటను మూడుకథలు చేయించి నూరురూపాయలిప్పించెను. మరియు నతనిశిష్యుడగు నొకరత్నములవర్తకుడు తనవైశ్యసంఘములో చందా యెత్తించి నారాయణముదలిసెట్టివీధిలో రెండుకథలు చెప్పించి యెనుబది రూప్యములు విలువగల వజ్రపుటంటుపోగులు నాకు బహుమతియొసఁగెను. మైలాపూర్ కపాలేశ్వరదేవాలయమున మాకన్న మిడుచున్నపంతులు పదిమందిని రావించి యొకకథచేయించెను. పిదప "హిందూ" "స్టాండర్డు" పత్రికలలో నాసంగీతసాహిత్యము లుగ్గడించుచు నాశారీరము వంటి ఘనగంభీరమధురధ్వని యదివరకెన్నడును వినలేదని ప్రచురింపబడెను.

భీముడుగా రొకయుదయమున నెగ్మూరుచెర్వుపడమటిగట్టున నున్న యొకహైకోర్టువకీలుయొద్దకు దీసుకొనిపోయె నావకీలు శ్రీవైష్ణ

వుడు. "కలకత్తా లెజిస్లెటివుకౌన్సిలుమెంబరు, విద్యావినోదియు ఇంగ్లీషున మహాభారతము వ్రాసెను. ఆతడొకప్పుడప్పటికి రెండేళ్లక్రిందటకూరెళ్ళ వెంకన్నపంతులు డిప్యూటీకలెక్టరు ట్రాన్సఫరయినపుడు విందుచేసి నాచే బాడింపగా రామానుజాచార్యులుగారితో వచ్చి నేజెప్పిన గజేంద్రమోక్షణమునకు మిక్కిలి సంతోషించెను. గనుక నన్నతడు చూచి మిగులనౌరవించి తనయింట నుంచుకొని యొకహరికథ చేయించెను. జయంతి కామేశముపంతులుగారి కతడు మిత్రుడౌటచే కామేశముపంతులుగారు నగౌరవించినసంగతి విని మరింత నన్నాదరించి నాసంగీతసాహిత్యములను గురించి "హిందూలో వ్రాసెదనని యొకనాడు జోడుగుఱ్ఱములబండి నెక్కించి "నేటీవుక్లబ్బు"నకు దీసికొనిపోయెను.

"లవ్‌ఫిఫ్టీ" యనుచు దేగలవలె బేట్లు ద్రిప్పి స్మేష్‌గొట్టుచు టెన్నిస్సాడువారును, ప్రేకుచేసినయప్పటినుండియు వొకమార్కయిన దెచ్చుకొనలేకుండియును దనప్రతికక్షి ఫిఫ్టీగేములో నలువదెనిమిది సంపాదించుకొన్నను జయమున కాసించుచు మొండిదెబ్బలు గొట్టు చేతకాని బ్రిలియర్డ్సుప్లేయర్లును గలక్లబ్బునకు బోయినపుడు నాచేయిపట్టుకొని యాచారిగారు నాతో "అయ్యా; క్షమించవలయును. కొన్నాళ్ళు దేశములు తిరిగి యడ్డమైన నీళ్లు ద్రావుటచే నీళ్ళపల్లడి బోగొట్టుకొనుటకై యీపెద్దగురున కలవడినాడను. మీరు హరిదాసులుగనుక మీయెదుట జంకుచున్నాను," అని యనగా జిరునవ్వున "నేగూడ మీతో వంతుగలిసెదనపుడు నాయొద్ద మీరు జంక నక్కరలేదు" అంటి నందుకతడు మిక్కిలి సంతోషించెను. పిదన మేమిరువురము అయిదారు రూపాయిలు కిమ్మత్తుగల పెద్దగురుని సేవించితిమి. అంతనతడు మిక్కిలి హుషారుగా గలమునకాగితమందుకొని నేదనబంగాళాలో నొనర్చిన హరికథనుగూర్చి ప్రశంసించుచు విద్వాంసులు మెచ్చుకొనున ట్లింగ్లీషున నొకగొప్ప ఆర్టికిల్ వ్రాసెను,

పిదప మేమిరువుర మింటికి జేరుకొని మేడపైకి బోగా నతడు చప్పున బెద్దగురుడు పదేడింట గ్రుద్దుకొనుచుండెనుగాబోలు నతనికన్న నొక్కింత యుషార్గానున్న నాకాళ్ళు పట్టుకొని "మీవంటిపండితుని నేజూడ లేదు. నాయొద్ద మీరున్నయెడ నెలకొక వందచొప్పున నిచ్చెదను. ఒకసంవత్సరము జీతము ముందుగ మీకిచ్చెదను. నాకోర్కెతీర్చి నాచెంగట మీరుండునట్లు ఖరారుచేసినదప్ప మీపాదములు విడువను" అనె నపుడు సరియే" యనియతని సమాధానపర్చి నాలోనే "వాహాపెద్దగురుని మాహాత్మ్య మెంతవాని కెట్టి యవస్థతెచ్చెను. ఈస్థితిమారిన నేటి మాట రేపితనికుండునా? చిన్నగురునకు బెద్దగురునకున్న బేధము. మోతాదుమీరినపుడు పెద్దగురుసేవచేసినవానితెల్వి నీటనిప్పార్పబడినట్లు శూన్యమగును. యుక్తాయుక్త మెద్దియు గాన కట్టివాడెట్టి దుర్మార్గమైన గేవలమూఢుడై యొనర్చును, చిన్నగురుడు మితిమీరినను బైకి దయ్యము వలె నుండియును లోపల తెల్వితప్పిపోదు. దుష్టకార్యము లొకింతయును జేయించదు. పెద్దగురుడు నరికి చిన్నగురుడు పిరికి. ఎంత డబ్బుదండుగ ఎంతయవివేకమెంతనగుబాటు. లోకములో యుక్తాయుక్తముగ మదద్రవ్యములను సేవించినచో నభీష్టసుఖంబులబ్బును. కాని మోతాదు నిల్పుకొనుట దుస్సాధ్యముకదా! ఇంతకును పుస్తకములు పెద్దలు యాత్మసాక్షియును గూడ నిషేధింపదగు వస్తువులనుగూర్చి యనిశము దెల్పుచుండ లక్ష్యము సేయక దాలిగుంటకుక్కచందాన దైవోపహతుడు దుష్ప్రవర్తనము మానజాలడు కదా! మరియు గవర్నమెంటువారు కల్లు గంజాయి నల్లమందు మొదలగు దుష్టవస్తువులమ్మకుండ శాసింపరేల! స్వలాభపరు లొరుల కష్టము లాలోచింతురా! ఆబ్కారీలవన వచ్చునంతరాబడి మానుకొందురా! ప్రజలేమైన గానీ, తమకు హానికలుగునని కదా ఘనాయుధములను, తగిన సివిలు ఉద్యోగములను, మనకు దూరము చేసిరి. ఎద్దుపుండుకాకికి నొగులా! వింతతు వివాహము చేసికొండు, జాతిభేదము లక్కరలేదని ఘోషించు సోషల్రిఫార్మర్సు మద్యములను విక్రయించగూడదని చట్టమేర్పర్చుటకు

బైవారితో మొఱ్ఱబెట్టుకొనరాదా? లోన గోరివివెట్టి పై నీరుజల్లుచున్న ట్లున్న దీరాచరితము. ఆక్కన్న విన్న సంధ్య మాదన్న విన్న సంధ్య నాకెందుకీ వెఱ్ఱియూహలని విదురించినాడ.

దొరగారి సిఫార్సు

మరునాడుదయమున మునుపటికన్న మరింత పెద్దమనుష్యుడుగా లేచి గతమెంతయు మరచి తెల్విదేటలగపర్చు నాచారిగారు నన్గోలుదొర యొద్దకు దీసికొనిపోయి రతడు బోర్డుమెంబరు పెద్దగుపుడు. అతనిభార్య నాచే వీణవాయింపించి మిక్కిలిసంతోషించెను.

దొరగారు గొడ్డలిగాని దొరసానిగారు కొంతవరకు సంగీతజ్ఞానము కలది. భర్త చెంతనున్నపు డొకచెల్వు దూరముగ నున్నపుడొకతీరు నామెమోమునందు గన్పట్టెను. స్త్రీస్వాతంత్ర్యము మెండగు యూరోపి యనుకుకూడ నట్టియవస్థ లుండునా యని నేనబ్బురపడినాడ. నాపాట విని దొరగారు నాతో 'నాచెవిని నేవిందించుకొందును. వీరందరు మిక్కిలి సంతోషించుచున్నారు గాని నాకేమియు పాట తెలియదు" అనియె. అపుడు నేనతనితో 'అయ్యా! యిచటి కొకఫర్లాంగుమేర నన్నిఱైయి నులు వచ్చుచు బోవుచు నొక్కుమ్మడి కూతలు పెట్టుచున్నవిగదా? చిత్తగించుడీ నే పాడుచున్నంతవరకు మీకాధ్వని వినపడనీయ' నని పాడదొడగితిని. అపుడు దొరసానిగారు "మీరన్నట్టే మీరు పాడినా రింత గొప్పకంఠధ్వని నేనెన్నడును వినలేదు" అనియె. పిదప రామనాధరాజుగారికి సిఫార్సిచ్చెదము. అచటకు బోయెదరా! యని యెంతో దయతో దొరగారు సెలవిచ్చిరి. కాని ''యంతదూరము పోవుట కిచ్చలేదు అంటిని. ఆచార్యులుగారు నేను నింటికి వచ్చినపిదప నేబదిరూప్యముల నోటు నాకిచ్చెను. అయ్యా! యెంతపనిచేసినారు? దొరగారుదయచేసెద మన్న సిఫార్సు పుచ్చుకొని రామనాధరాజుగారిని జూచినయెడ మీకెంత యైనద్రవ్యము దొరుకునుగదా? పోనీ యిదుగో మైసూరు దర్బారు బక్షీకి

సిపార్సిచ్చినా నిదిపట్టుకొని మైసూరునకు వెళ్లుడు. ఈ తోపున బెంగు
ళూరులో మాతమ్ముని కీయుత్తరము గన్పగ్చుచు. మీకు మిక్కిలి
లాభముండును." అని గ్రామాంతరము బోయెను.

కాలేజీ ఆంధ్రోపాధ్యాయుని వద్దకు వెళ్లుట

మేమిర్వురన్నదమ్ములము మైలాపూరులో మమ్మాదరించిన యతని
యొద్దకు బోయినారము. ఆతడు నన్నెంతో సన్మానించుచుండును. ఒక
నాడతడు నేను గాష్ఠవాదమునకు దొరకొంటి మతడు కొంత తిక్కమతము
కలవాడు. తనగుమాస్తాయింట నన్నాపూట భోజనముచేసి రమ్మనియె,
నాగుమాస్తా టోపీదాసుగాన నతనియింట భోజనమున కొల్ల కేదోనెపమున
నతని దప్పించుకొని భోజనమున కల్లాడుచు నొకయరుగుమీద నొకపుస్త
కము జదివి శిష్యులకు వినిపించుచున్న నొనముసలి పండితుని జూచి చెం
తకు బోయి యతనితో "అయ్యా! యీ పుస్తకము చదివెద నొకసారి
చిత్తగించుడీ" యని యంటిని, అతడునన్ను గూర్చొనమని పుస్తకము
చేతికందిచ్చెను. నేనా పుస్తకము స్వరవేగమున బ్రత్యక్షరముగా రసమొ
ల్కునట్లు చదువుట కెంతయో సంతోషించి "అయ్యా! నా భాగ్యమున
మిముబోటి మహనీయుల దర్శనము నాకు లభించెను. మీరెచటికి బోవు
చున్నారు?" అని నాయుదంతమంతయు విని నన్నాదరించి తనయింట
భోజనము వెట్టెను. అతడచటి కాలేజీలో నాంధ్రోపాధ్యాయుడు. తెను
గున మేటిపండితుడు. నాచే జదివించిన పుస్తక మతడొనర్చిన విశ్వేశ్వ
రీయమను నాంధ్రకావ్యము. (కొక్కొండ వేంకటరత్నము పంతులు)
అతని పాండిత్య మాతనికవిత్వము గణనీయములేకాని యతనిధోరణి
యమృతో, పమానమట్లు నిర్దుష్టముగ దెనుగున నుపన్యసింపగలవా
రింకొకరులేరు. పిదప నతనియొద్ద సెలవుపుచ్చుకొని మైలాపూరునకు నడచి
పోవుచుంటిని.

## మదరాసులో బ్లాక్ టౌను

నాకొరకు వెదకుచు బేరన్న నన్గలసికొని "యాతిక్కశంకరయ్యతో నీకు వాదమెందుకు! ఇంత పట్టణమున నిన్నెట్లు వెదుకగలను" అనియె. మైలాపూరునకు దిరిగి మేమేగినారము. మాకన్న మిడుచున్న పంతులు నన్ను వృథాగా నొప్పించి వెడలద్రొబ్బుటకు లోన నొచ్చుకొనుచు మరింతప్రేమతో నన్నాదరించుచుండెను. విజయనగరమునుండి మేరంగి రాజుగారి యుద్యోగి యొకడు నామిత్రుడు నన్ను జూడవచ్చెను. అతడు మేటిలాక్షణికుడు, వెలనాటినియోగి. నాకవిత్వమునకు మిగులసంతోషించు చుండును. నాకన్న మిడుచుండిన పంతులు నేనును బన్నిదములు వైచి కొని యాశుధారాపద్యములు వ్రాసి యేపద్యము బాగున్నదని నామిత్రున కగపర్చినపు డతడు నాపద్యమునకు సున్నయు రెండవయతనిపద్యమున మైనస్ ఒకటియు మార్కు లిచ్చినందుకు మేరంగిపంతులక్కాంచెతనము మిక్కిలి కొనియాడతగినది.

బందరులో నన్నాదరించిన రిజిస్ట్రారు మేనల్లుడు నన్నొంటిగ దన యింటికి దోడ్కొనిపోయెను. అతనియిల్లు బ్లాక్‌టౌనులో నుండెను. ఒకయింట్లో మూడునాల్గు కుటుంబాలవారు అద్దెకుదిగిరి.

అబ్బా! నరకముకాని యది బ్లాక్‌టౌను గాదు. ముఱుగుకుండీలో పురువులవలె జనులట బ్రతుకుటవింత. మధ్యాహ్నమతనియింట భోజనముచేసి సాయంత్రము నాలుగుగంటల కూరుచూడబోతిని. మురికికి బుట్టిల్లౌ బ్లాకుటౌనులో ఇండ్లు క్రిక్కిరిసి యున్నవి. ధూళిరేగుట చెప్పదరము కాదు. సముద్రపుగాలి కొంచెము కట్టుపడినప్పు డుక్క మరణయాతన పెట్టును. దోమలబాధ యింతంతకాదు. ప్రతివీధిలోను మేడలవలె సొగసుగ రంగురంగుల మిఠాయి పేర్చిన దుకాణములను చెంగటతమలపాకుల యంగళ్లను వచ్చిపోవుబండ్ల మోతలును, దిక్కుమాలిన యరవ భాష మాట్లాడు జనులనుగూర్చి కొంత వింతపడుచు వేరుసెనగకాయలను

దోసెలను ముందుంచుకొని బండికన్నములవంటి కమ్మలుంచుకొని యమా న్దస్త్రాలో దమ్మలము దంచుచు బొగాకువిడెముల రసము స్రవింప దయ్యములవలె గూర్చున్న కారునల్పు నరవస్త్రీలం గాంచుచు బోవుచుంటిని.

## శ్రీ వైష్ణవమిత్రుడు

ఒకచో నారాయణమొదలివీధిలో హరికథచేసినపుడు నా ప్రక్క ఫిడేలువాయించిన శ్రీ వైష్ణవుడొకడు నన్గని "ఓహో అన్నగారూ! నా పుణ్యమున నేడు మీసందర్శన మయ్యెను, మాయింటి కొకసారి విచ్చేయుడు. మాయన్నగారికి మిమ్ము గన్పర్చవలయు నని నా కోర్కె" యనెక నందుకు నే సమ్మతించితిని అపుడొక మిద్దెపైకి న న్గొంపోయె నది బ్రాందీషా పచట నెంమంద్రు పెద్దగురువి సేవ నేయుచుండిరి. ముమ్ముల నెంతో యాదరించిరి, మదిరాగృహమందు త్రాగుబోతు లన్యోన్యము కన్పర్చు స్నేహ మింతంత కాదు.

జూదము జరుగు తావున దీర్ఘములందు రెయిల్వేప్లేటుఫారముచెంత వెలయాలియింటిలోను మదిరాగృహములందు జనులకు త్యాగము మెండు. ఒకగంటలో పదిరూపాయిల విలువగల పెద్దగురు ప్రసాద మయాచితముగ లభించెను, పెక్కురకముల పెద్దగురుని ప్రసాదమును, కారపుపోస పకోడీ మొదలగువాని నంజుకొని కొందరును, ఖబాబుపుల్లలు కొర్కుచు కొందరును సేవించిరి. ఆమిషాశనము నబద్ధమాడుటయు నన్నంటని పాపములు ఇట్లిరువురము గురుసేవ నోలలాడిన పిదప నవ్వైష్ణవు డొక మెడసన్నముగోవిందుని జంకనుంచుకొని తనయింటికి నన్గొంపోయెను. అపుడు చీకటి రాత్రి తొమ్మిదిగంటలవేళ, అతనిరాక కతని యింటివా రెదురు చూచుచుండిరి. అతని యన్న యతని వదినెయు నతని తల్లియు నతని భార్యయు నతడు నేను నింటిలో నున్నవారము. అతని తల్లి యెనుబదేండ్ల ముసలిది. అతని యన్న యేబదేండ్లకు బైగా వయస్సు

కలవాడు. వదినె ముప్పదేండ్లది. భార్య పాతికయేండ్ల దతడు నలువదై దేండ్లవాడు. అతని యింట్లో యేమూల జూచినను సరోజు—ఫిడేలు-మద్దెల మొదలగు సంగీతపుపనిముట్లు మెండుకొని యుండెను. అదివరకే పెద్ద గురుని సంపూర్ణముగ సేవించి యప్పుడే కొంచెము తెల్వి గాంచుచున్నవా రందరొక్కుమ్మొగి "నాయనా తెచ్చినావా!" యని యొక్కు పెట్టున గేకవేసిరి. అపుడతడు తన యొద్దనున్న మేడసన్నముగోవిందుని మూత దెరచి యందరికిం గొంచెము కొంచెముగ గురుసేవ సేయించెను. అంతట నెవరో మరి రెండు సీసాల కంట్రీగురుని గూడ నొసంగి రిట్లమితముగా గురుసేవ లభించినందున వారి యందరి యానంద మేమిచెప్పగలను. కొంత గడచిన తరువాత అన్నగారు ఫిడేలు పట్టుకొనిరి. తమ్ముడుగారు మద్దెల పట్టుకొనిరి. నన్ను బాడమని "రాహో ముండదేవుడు కుదర్చెనురా, ముగ్గురి నొక్కు లాగున ననుకొని నేనవ్వ దొడగితిని. నానవ్వుచూచి కోపించి "విల్లుపట్టిన వారిలో నర్జునుడు ఫిడేలు పట్టిన వారిలో నేనుగదా నేర్పరులము. తమ్ముడా వీడు నన్నుజూచి యెందుకు నవ్వుచున్నాడు?" అని యొక పల్లవి యెత్తెను. నేగూడా బాడ దొడగితిని. నన్నుగని సంతసించి ఓరీతమ్ముడా! వీడు పాడ గలయపట్టుట కష్టము సుమా యనెను. ఇదివర కెందరో యుత్తరాది వాండ్రు వచ్చిరి కాని వీనివంటి వాడొకడైన రాలేదు. వీడింకను గొప్ప వాడగును సుమా" యనెను. పిదప కొంతసేపటికి భోజనమున కాయత్తులయి ముగిలిన గురుని పంచుకొని సేవించి అమితగురుకటాక్షమున జీర్ణించి నన్నొక్కన్నయతడు తప్ప దక్కిన వారందరును శల్యావశిష్టులై యుండిరి. ఫిడేలువాయించుచు నావిద్య మెచ్చిన యతడు నిజముగ లోకోత్తర సంగీత ప్రజ్ఞ కలవాడౌట యతడు కొన్నాళ్ళు పాఠశాలాంధ్రోపాధ్యాయుడట. సంగీత గ్రంథములను రచించెను. విజయనగరపు మహారాజుగా రతని నెంతో మెచ్చుకొని యతనికి బుష్కలముగ ధన మిచ్చిరట. పళ్ళెములునిచి యతని భార్య వడ్డించుచుండెను. సంపూర్ణగురు కటాక్షమందుటచే భోజనవాంఛ మాకెవ్వరికి లేకుండెను. అంతట నింటియజమానుడు నన్నవి

తొమ్మిదవయష్టము పారాయణచేయుచు నొరిగెను. క్రమక్రమముగ నంద రము సంపూర్ణానందమున దొర్లుచుంటిమి. తెలవారకయే మిద్దెపైకి బోయి మరికొంచెము గురునిసేవించి నిదురించితిమి తెలవారినతోనె పేరన్న యచటికి వచ్చి నన్ను మైలాపూరునకు దోడ్కొని పోయెను.

ఆ రాత్రి మేము బయలుదేరి బెంగుళూరికి బోవుచుండగా గుడి యాతము స్టేషనుచెంత నాపేరుపెట్టి యెవడో పన్నెండుగంటల రేయివేళ బిగ్గరగ బిల్చుచుండెను. ఏమని నేనడుగగ నాచేత నొకటెలిగ్రాము పెట్టెను. ఎనుబదిరూప్యము లివ్వబడుననియు నొకచో బాడ వలసినది గాన వెం టనే మళ్ళి రమ్మనియు మైలాపూరిలో మమ్మాదరించినపంతులు వ్రాయు టకు గొంతయో చించి మళ్ళి మెద్రాసునకుద యమునజేరుకొంటిమి.

## పోలీసు కమిషనరుగారి యింట్లో నాచే సంగీత సభ

మైలాపూరుపంతులు ననుచూచి మిక్కిలి సంతోషించి వచ్చినావా ఈ యూరివారికి నాకును బట్టుపంతముపైని నిన్నిలిపించినాము. నేడు పోలీసుకమిషనరుగారి యింట నాలుగుగంటలకు సాయంకాలమున సభ జరుగును. పిడేలువాద్యమున దేశమున ఘనతకెక్కిన యొకడు నీపక్క వాయించును. ఒక గొప్పవిద్వాంసుడు మృదంగమున కేర్పర్చబడెను. ఈయూళ్ళోనున్న ఘనులందరు నేడాసభకు వచ్చెదరు. దాక్షిణాత్యులకన్న సంగీతమున నౌత్తరాహులు తక్కువయని యిచటివారి యభిప్రాయము. నేడు నీవాయపవాదమును బోగొట్టవలయు జుమా "యనె నందుకు నే దలయూచి "అయ్యా! హరికథాగానమున గొంత సభను రంజించుశక్తి నాకున్నదేమోకాని కేవలసంగీతమున సభను రంజించు నలవాటు చాల కాలమాయెను నాకు లేదు. అప్పుడప్పుడు నేనాడు తలబిసుమాటలను బట్టి నన్నులకనపర్చుటకు మీకిట్టి వేడుక కలిగెను గాబోలును. కానిండు. అంటిని.

పిదప నాలుగు గంటలకు సభ కేగినాడ. చీఫ్‌జస్టిస్ మొదలు ఘనులచే సభ క్రిక్కిరిసియుండెను, నట భైరవి పాడుచుంటిని. ఫిడెలును మార్దంగికుడును ఘటవాదకుడు నన్నలక్ష్యముగ జూచుచుండిరి. సభికులు నాశారీరమును మెచ్చుకొనుచుండిరి. కాని నాయాచ యాదేశస్తులకు గ్రొత్తయౌటచే రుచింపకుండెను. తానము నే గొంతవరకు పాడుచుండగా హరికథాకాలక్షేపము సేయువా డింతసాహసముగా సంగీతము పాడజాచ్చెనా పల్లవిలో వీనిబండారము బయల్పడుననిి ఫిడెలరు నాతో "ఇక పల్లవి యెత్తుకొండి" అనియె, అప్పుడు విషమోద్గ్రాహమున నే పల్లవి బాడుచూ నొకమారైవ జాగాకు రాజాలని ఫిడెలరును మార్దంగికుని జూచి "తానము పాడుచుండగ బల్లవిపల్లవి యని నన్ను దొందర పెట్టిరి. ఒకసారియైన జాగాకురాలేరు ముక్తాయింప జాలరు. కాలముం దరిమివేయుచున్నారు. మీదాక్షిణాత్య లొకింతయు విలంబకాలమునకు బనికిరారు." అంటి నందుకు నాభాష తమకు తెలియనట్లభినయించుచు నేమో వారిలో వారు గొణుగుకొనుచుండిరి. అంతట నానందభైరవి చీఫ్‌జస్టిస్ వినగోరెను నేనారాగము పాడుచుంటిని. ఫిడెలరు ఆ రాగమును మిక్కిలి యందముగా వాయించుచుంటచేత పాటమాని నేగూడ సంతోషముతో వినుచుంటిని. సభికులంద రమితానందమును బొందుచుండిరి. పిదప నన్ను రాగముమార్చి పాడుమనగా హిందూస్థానీభైరవి నే బాడుచుంటిని. కొందరుమాత్రమే సంతోషించుచుండిరి. దాక్షిణాత్యులకు హిందూస్థానీయాచ పాములకు సుగంధివంటిది. పిదప నారుగంటలకు సభ ముగిసెను. దాక్షిణాత్యుల కలవడినకృతులు నాకురాకుంటచేతను పాటలో వారిదొకయాచ నాదొకయాచ యగుటచేతను నావలె విలంబకాలమున పల్లవిపాడుట నచటనరుదౌటచేతను హిందూస్థానిబానీ సొగసు వారికి తెలియకుండుటచేతను కొందరు పెద్దలు సభలో లేచి "ఈ విజయనగర విద్వాంసుని శారీరము నిరుపమానరంజకముగ నున్నది. ఔత్తరాహుల లయజ్ఞానము మిక్కిలిశ్లాఘనీయము. ఇతడు పల్లవిలో మేటి. ఇతడుపాడిన హిందూ

స్థానీయాచ మాకుదెలియలేదు. కొన్నాళ్ళతడీప్రాంతమున నుండి యిచటి యాచను గ్రహించినచో నిచటిగాయకులందరిని మించుననుటకు సందేహములేదు" అనిరి. నే నందుకు బ్రత్యుత్తరముగా "మీయాచ మిక్కిలి బాగున్నది. నాకు జిత్తరంజక మయ్యెను. ఔత్తరాహుల లయనుగూర్చి మీరొప్పుకొనుట న్యాయమే. మీకు హిందూస్థానీబానీ తెలియకుంట మిగులశోచనీయము" అని విరమించితిని. పిదప నెవరిమట్టుకు వా రిండ్లకు జనిరి. మొత్తముపై నా కర్ణాటకము వారికి రుచింప లేదు. నా హిందూస్థానీ వారికి తెలియలేదు. దేశమున కొక్కొక్కయాచ. యెవరియాచ వారికి రుచి. యెచటనైన బాండిత్యమెరిగి సంతోషించువారు కడునరుదు.

## బెంగుళూరు ప్రయాణము.

మరునాడు బెంగుళూరుకు బయలుదేరినాము. మాయొద్ద నొకవీణ యొకతంబురా యొకక్రపెట్టెయు గలవు. చెన్నపట్టణపు పితలాటకమును గూర్చి మొదటిసాక్షుల లచటి ఝట్కాబండ్లవాండ్రు. దక్షిణదేశములో నన్నదాత లరుదు. అరవలకు ధనలోభము మర్కట చేష్టలు కాపట్యము మురికితనము మోటరికము సహజములు. స్టేషనుచెంత నొకకానిస్టేబు మాకు టిక్కెట్లు కొనిపెట్టి మమ్ములను బ్రెయినెక్కించగా వానికొక యణా యిచ్చుకొంటిమి. కొందరు కన్నడము కొందరరవము మాట్లాడువారే జట్టుదార్లుగా దొరికిరిగాని తెనుగుమొగ మొకటైన గానరాకుండెను. సాయంత్ర మూరుగంటలకు బెంగుళూరుమెయిలు బయలుదేరెను. మేము కూర్చున్న బండీలోని కెవరూ రాకుండ ద్వారముచెంత నిలబడి యెక్కబోవు వారితో నిచట బలువురున్నారనియు మేము రిజర్వుచేసుకొన్నామనియు నింకొకబండికి పొమ్మనియు బోరాడుచు సాహసించి చొరబడిన వారితో బొత్తుకలుపుకొని కుశలప్రశ్నముల జేయుచు దేశభోగట్టా నేయుచు గాలి యధికమైనపుడు కిటికీలు మూయుచు నిరువంకలగల దేశము నబ్బురపడి చూచుచు శిరస్సు కిటికీలోనుండి పైకి బెట్టి చూచు

నవు దేదిరిగాలితాకున సంప్రాప్తించు నన్యనిష్ఠీవనము తుంపురుం దుడుచు కొనుచు గంటబడు బొగ్గుదుమారమును నలుపుకొనుచు గూర్చుని గుఱ్ఱు పెట్టుచు బడుకొంటకు కొంచెము చోటిమ్మని చెంగటివాంద్రతో బెనగులాడుచు నెవరైన మాబండిలోనికి వచ్చుట కనంగీకారమును బండిలో నుండి దిగిపోయినప్పుడు విశ్రాంతిగా బడుకొనవచ్చునని సంతోషించుచు కాళ్లుచాచి ముసుగుపెట్టి పడుకొని యెందరు లెమ్మనిలేపినను మీదకూర్చున్నను గదలక మోటగించి నిద్దుర నటించుచు భూత భవిష్యత్తులంగూర్చి యెద్దియో తలపోయుచు మింటిమిద్దె లల్లుచు స్టేషనుల లెక్కించుచు మిఠాయి మొదలగు వస్తువుల నమ్మువారి కూతలను వెక్కిరించుచు గొప్ప స్థితికలవారుగా దోచినపుడు వినయమును సఖ్యమును సామాన్యులుగ గనపడినపుడు బండినెక్కుదిగు జనులపై ధార్ష్ట్య మగపర్చుచు బడుచు లేచుచు నెగయూపిరిదీయుచు స్టేషనుకువచ్చి యప్పుడే కదలిపోవుచున్న బండింగని నెత్తినోరుకొట్టుకొని వాపోవు నలసులం గని నవ్వుచు నెదియైన గొని తినుచు జుట్టలు గాల్చుచు బొడుము పీల్చుచు సోడా ద్రావుచు ప్లాటుఫారముపై నిటునటు దిరిగి యన్నిబండ్లలోని మొగములు గనిబెట్టుచు నొకటికి దిగి కచ్చ సవరించుకొని బండిజేరుకొని బర్వెడుచు కట్టుంగలయందు వంతెనలమీదను బండినడుచుట పరికించుచు బండి పర్వెడుచుండ పార్శ్వముల నగపడినవారి గ్రమ్మని పెంకెతనముగ బిల్చుచు ముందుస్టేషనెద్దియని భోగట్టా సేయుచు దుద కుదయమున నెనిమిది గంటలకు బెంగుళూరు జేరుకొని యొంటెద్దుబండిం గూర్చుకొని ఫలానా పేటలో ఫలానావారి యిల్లెక్కడనని తారసిల్లువారినెల్ల నడుగుచు మాకు మైసూరునకు సిఫార్సిచ్చిన యాచార్యులగారి మైదవతమ్ముని యింటికి వెళ్లి యతని కుత్తరము చూపినాము.

### బెంగుళూరులో సంగీత, హరికథాకాలక్షేపాలు

అతడు తెల్లటి సొగసైన ప్లీడరు. అన్నగారి యుత్తరమును జూచి మమ్ములను మిద్దెపై సామాను పెట్టుకొమ్మని చెప్పి భోజనానంత

రము జడ్జీకోర్టునకు బోయెను. అతని కరుంధతివంటి యొక చక్కని భార్యయు సరస్వతివంటి యొక చక్కనికొమార్తెయు గలరు. మేము మిక్కిలి బడలియుంటచే హాయిగ విస్పమ్మర్దమగు మిద్దెపై నిదురించితిమి. నాలుగుగంటలకాయజమాను డింటికి వచ్చెను. మేముకూడ నిదుర మేలుకొని కాళ్చేతులు కడిగికొని మంచినీళ్లు త్రావి స్వస్థముగ నుండగా నతడు నాచెంతకు వచ్చి "ఏదయ్యా కొంచె మొకరాగము పాడుడీ చూచెదను" అనియె నపుడు నే తంబురా శ్రుతిచేసి సావేరిపాడగా నతడు పొందిన యానంద మేమందును! ఒక గంటవరకు నాపాట వినివిని "అయ్యా! మొదట మిమ్ములను జూచియే మీయుత్తరాదివాండ్రను మాయన్నగారు నాకు దగిల్చి రను కొంటిని. మీయుత్తరాదివారి పాటంతే మాదేశస్థులకు దలనొప్పి. ఇపుడు మాదేశస్థులకంటె సొగసుగ మీరు పాడినారు" అని సంతోషించెను. అతడుగూడ సొగసుగ బాడ గలుగును.

అతని రెండవయన్న యచట మున్సబుగా నుండెను. అతడుగూడ నాపాట కెంతయో సంతోషించి "ఇదివరకు కోయంబత్తూరు రాఘవయ్య పాట విన్నాను. ఇపుడట్టి గంభీర శారీరము తిరిగి లభించెను." అని పరమామోదము పొందెను. ఇట్లు రెండు దినములవరకప్పుడప్పుడు నాయన్నిరకముల సంగీతప్రజ్ఞ కాయిరువు రన్నదమ్ములు బ్రహ్మానందమందిరి. కాని ఆ మహారాజుగారియొద్ద నే హరికథ యెట్లు చేయగలనో యని సందియముతో బొరుగింట నాహరికథ పెట్టించెను. నాడు నాహరికథ విన్నవారందరు నిరుపమానముగ నున్నదన్నారు. కథ చేయించిన యతడు ముప్పదిరూక లిచ్చెను. నా కన్నము పెట్టుచున్న యజమానుడు నాతో "మీ పాట బాగున్నది. కాని మీకథ యెట్లుండునో యని యిదివరకు సంశయించినాడను. ఇదివరకు మాదేశమున ప్రసిద్ధిచెందిన కృష్ణభాగవతులకథకన్నను రంజనముగాను పాండిత్యయుక్తముగాను నున్నది. మీకాలక్షేపము మాదేశమున నొకభాగవతులును ఉత్తరదేశమునకు మీరు నిద్దరికిద్దరు సీడు లేనివారు. దేవుడు మీవిత్యకుదగు రూపముకూడ

మీకిచ్చుట యెంతయదృష్టమయ్యా! "యని కన్న కొడుకుకన్న వేయి రెట్లుప్రేమతో నన్నాదరించుచుండెను. సంగీత రసికుడతడుగాన నతని మరింతవేడ్కతో బాడుచు రంజింపజేయుచుంటిని.

అతని యన్నయైన మునసబు బెంగుళూరు పూలతోటలో మైసూరు మహారాజావారు కుటుంబముతో వేంచేసి యుండిరని యదియె మంచిసమయ మని యతనిభార్యకు మేనమామయైన దర్బారుబక్షీ, తనయన్నగారు మాకిచ్చిన సిఫార్సుతో మమ్ములను బంపించెను. బక్షీ మమ్ములను జూచి "సరియే మహరాజు గారితో మనవిచేసి మీకేవర్తమానము దెలిపెద" అనియె. పిదప సాయంకాలము మునసబుగా రొకఉత్తరము పట్టుకువచ్చి నాతో అయ్యా! మహారాజావారితో బక్షి మనవిచేసినాడు. రేపుదయమున మహారాజావారు మీపాట ముందు విన నుద్దేశించిరి" అని చెప్పిరి. మరునా డుదయమున గృతకృత్యులమై కాఫీద్రాగి మేమిర్వురన్నదమ్ములము మునసబుగారు సప్లయిచేసిన గుర్రపుబండి నెక్కి పూలతోటకు వెళ్ళి దూరముగ బండి నునిచి మహరాజావారి బంగళా కేగినారము.

## ఆస్థాన విద్వాంసులవద్ద సంగీత ప్రదర్శనము

అచట యిరువదిమంది సంగీత విద్వాంసులు తంబురాలు వీణెలు నొద్దనుంచుకొని కూర్చుండిరి. మహారాజావారు లోపున నుండిరి. అంతట బక్షీ మా యొద్దకు వచ్చి "అయ్యా! మీ ప్రజ్ఞావిశేషము లీ విద్వాంసుల యొద్ద గన్పర్చుడు. దొరగారిచెంగటనే యున్నారు. మీ శారీరములు వారికి రుచించినచో రాత్రి మీ కథ వారు చిత్తగించెదరు" అనియె. పిదప వీణ నే బట్టుకొంటిని. తంబురా పేరన్నయొద్ద నుండెను. గాన నన్ను వైణికుడనియు పేరన్న న్గాయకుడనియు నచటి సంగీత విద్వాంసులు పోల్చుకొని యందులో నొకడు నన్జూచి "ఏదండా కొంచెము వాయించండా" అనియె. అపుడు నే వీణ వాయించగా బెదవులు విరిచి లొచ్చుగొట్టి విరసనదృష్టితో నన్జూచి పేరన్నవైపు దిరిగి "మీరు కొంచెము

పాడండా" యనెను. అపుడు పేరన్న కొంచెము పాడెను. అందుకుగూడ మూతివిరిచి నిరసనదృష్టితో 'సరియె బాగున్నది నిల్పండా'' యనె. నే నందుకు జిరునవ్వుతో "నే బాడెద వినండా"యని ధన్యాసి పాడ నారంభించితి. నాశారీరమునకు బంగాళా యన్నివైపుల బ్రతిధ్వాన మివ్వ దొడగెను. మహారాజుగారియొద్దనుండి బక్షీవచ్చి నాతో "అయ్యా! మీ శారీరమునకు దొరగారపరిమితానందము నందిరి. రాత్రి మీకథ యెనిమిది గంటలకు జిత్తగించెదరు మీరు బసకేగి సిద్ధపడుడు"అనియె. సంగీత విద్వాంసు లందరు అద్భుతపడిరి.

## మహారాజావారి సమక్షములో హరికథ

పిదప సాయంకాలమున కచటగల తగిన యొకఫిడెలరును మద్దెల గానిని జతపర్చుకొని భోజనము లాచరించి బక్షీద్వారా మామామూలు డ్రిస్సుతో వచ్చెదమని మహరాజుగారి సెలవును పొంది యొడల జంద నము కనుల కంజనము, నుదుట తిలకము, సిగకు బూలదండ, మెడలో బూలదండ, మొలను మున్నుబుగారు కట్టపెట్టిన క్రొత్తపట్టుపుట్టము, నడు మున బనారస్సు ఖండవా, చేతిలో శ్రీరామపట్టాభిషేకపటమును ధరించి నేనును, చొక్కాయిపాగాతో జేతను తంబురా పట్టుకొని పేరన్నయు గుఱ్ఱపుబండిపైనుండి ప్రక్కవాదకుల వెంటనుంచుకొని సరిగ నెనిమిది గంటలకు మహారాజసముఖమున కేగితిమి. అపుడు మహారాజుగా రొక గుమ్మటముబోలిన బంగళాలో సోఫాపైని గూర్చొనియుండిరి. సోఫాక్రింద నొకవైపున బక్షీమొదలగు కొందరు సన్నిహితోద్యోగులును నిదప సంగీ తసాహిత్యవిద్వాంసులు మహారాజుగారి సోఫాకు రెండవప్రక్క చిన్న చిక్కుచాపచాటుగ మహారాణీగారును వారిపిల్లలు కూర్చునియుండిరి. అస భలో గూర్చున్న వారందరును మొత్తముపై నలువదిమందికి యెక్కువగ నుండరు.

నే పటము చేతపట్టుకొని సముఖమునకు బోవగా మహారాజావా రొకపుష్పమాలిక చేతవందుకొని నాకంఠమున స్వయముగ వేసిరి,

ఆపటము మహారాణీవారిచెంగట నొకకుర్చీయుంపించి యందుపై నిడి ప్రార్థనశ్లోకము కమాచీరాగమున జదువగా "మ్యూజిక్ ఈజ్ వెరి వెరి స్వీట్" అని మహారాజుగారు సంతోషముతో తలనాడింపదొడగిరి. అట్లు పదునొకండుగంటలవరకు సంతోషముగ గున్నఁ బేనుంగుపగిది దలనూపుచు ప్రభువు చిత్తగించుచుండిరి. సభ చిత్రమున లిఖింపబడినట్లు నిశ్చేష్టమై యున్నది. పదునొకొండైన దరువాత ప్రభువువారు బక్షీవైపు చూచిరి. బక్షీ నాయొద్దకు వచ్చి ముగించుమనియె. మంగళము పాడినపై మంగళహారతి మహారాజుగారందుకొని లోనికి వేంచేసిరి. తరువాత బక్షీ నావద్దకు వచ్చి "యెల్లుండి మరియొకసారి మీకధను దొరగారు చిత్తగించెదమన్నారు, మీపాటకు దొరగారపారముగా సంతోషించిరి. ఇదివరకింతటి సుందరమైన పాటకుని చూడలేదని సెలవిచ్చినారు." అనియె. పిదప నచటి విద్వాంసులు గూడ "అసమానప్రతిభావంతులు మీరు" అని నన్నుశ్లాఘింప దొడగిరి. సంస్కృతము తెనుగు చదువుట పాడుటయు నెంతయో వేగముతో ఇంగ్లీషున దర్జుమాచేయుటచేత మహారాజావారికి నాకధయంతయు బాగుగ బోధపడెను. మహారాణీవారికి దెనుగు కొంతవరకు తెలిసియుంటచే వారికిగూడ మిగుల నామోదమైనట్లు తెలియవచ్చెను. అప్పటి నాయింగ్లీషుధోరణి చికిలీచేసిన కత్తివలె సాపుగా నుండెను. నావయ సప్పటికి ముప్పదేండ్లు. బందరుప్పెన కనగా రవ్వాక్షి నాజననమట, శరీరము శారీరవిద్యయు మిక్కిలిసౌష్ఠవముగ నుంటచే నెప్పుడు కధచేసినను సమ్మోహనాస్త్రమువలె తప్పక వశీకరంజనమగుచుండెను

## రెండవనాటి హరికధ

ప్రభువువారు సెలవిచ్చిననాడు తిరిగి రాత్రి యెనిమిదిగంటలకు బంగాళాకు బోయినారము. వైశాఖమాసము. బెంగుళూరు చందనము పూసికొని గుఱ్ఱపుబండి యెక్కి యొకక్రోసు వెడల్పైన పూలదోటనుండి

పోవునపుడు మేమనుభవించిన చల్లగాలిహాయి యెట్లు వర్ణింపగలను! పెద్ద లింగకాయలుకట్టుకొన్న యిద్దరు వెండిచెంబులతో. పాలు నే బంగాళాకు వెళ్ళినతోనె నా కొసంగిరి, పాలారగించి చుట్టకాల్చి తాంబూలము వై చికొని నే సిద్ధముగ నుంట దెలసి మహారాజుగారు కొల్వుచేసియుండిరి. తొలినా డంబరీషచరితముచెప్పినాడ. రెండవదినము గజేంద్రమోక్షణము చెప్పుచుండ మహారాజుగారు పేరన్నపాట విని 'ఇట్-లవ్స్-మి-టు-స్లీప్" అని సంతోషించిరి. తొలిదినము భోజనాత్పూర్వము దొరగారు కూర్చున్నారు గనుక భోజనార్థమై పదునొకొండు గంటలైన తరువాత కథ చాలింపమనిరి. కాని రెండవదినము మరింత సావకాశముగ విననెంచి భోజనముచేసి కూర్చుండిరి. కథచాలించుడని తొలిదినము మహారాజావారు వెలవిచ్చుటకు బదులు నేడు తీర్చెదనని స్వతంత్రబుద్ధితో రెండవదినము పదునొకొండుగంటలకుబైగా పాడి "కథ ముగింపబడియె" అని యింగ్లీషున మహారాజావారితో నంటిని. అపుడు దొరగారింకను వినుటకిష్టమున్నను విధిలేక కొల్వు చాలించుకొనవలసి వచ్చెను. పిదప నాకడకు బక్షీవచ్చి "అయ్యా! మహారాజావారి కింకను మీపాట తన్వి తీరలేదు. మైసూరులో సింహాసనముపై నుండి మీకు బహుమతులిచ్చెదమని సెలవిచ్చిరి. దసరాయుత్సవములకు మిమ్ములను మైసూరునకు రమ్మని సెలవైనది. మీ తెర్రియిను ఖర్చులకిరింద బ్రిస్తుతమివిగో రెండువందలు దయచేయించిరి. మీరు బెంగుళూరుమీద రచించిన సీసపద్యము వ్రాసి యిమ్మని సెలవిచ్చిరి" అనెను.

సీ॥ అలరుతేనియ లూరు దలిరులజిగి మీరు
విన్నగరవుదీరు బెంగుళూరు
చిరుతమబ్బులకారు చెమటరానిషికారు
వేడుకలింపారు బెంగుళూరు
చెరుకుతీయనినీరు చేలపచ్చనిబారు
వేల్పునగరుగేరు బెంగుళూరు

ఆవులపాలేరుతావుల వేమారు
పిలువదగినపేరు బెంగుళూరు

వింత నగనాణెముల నారు బెంగుళూరు
పెనుతెవులులకు మందువేర్బెంగుళూరు
తెల్లదొరలను రాగోరు బెంగుళూరు
వేనుడువులేల బంగారు బెంగుళూరు

అనుపద్యమును వ్రాయించి పుచ్చుకొనియె.

మరునాడు మైసూరుదివానుగారు ప్రత్యేకము నాసంగీతము మాత్రము వినగోరి సాయంకాలము నాలుగుగంటలకు సభచేయించెను. సభలో మైసూరుస్టేటు గొప్ప యుద్యోగులందరును కూర్చొనియుండిరి. నాలుగుగంటలవరకు ప్రారంభించి ముప్పావుగంటరవకు హనుమత్తోడీ రాగము వాడి మరియొకముప్పావు గంటవరకు బల్లవి పాడినాడను. పిదప దివానుగారు సభలో నిలువబడి "దాక్షిణాత్యులకు నౌత్తరాహులకు నాటయాచలో జాలావాసి కలదుగాని నారాయణదాసుగారి సంగీతప్రజ్ఞకూడ నసాధారణము సభారంజకమనుటకు సందేహములేదు. ఇతడికముందు తెల్వితేటలతో దనశారీరమాధుర్యము చెడకుండ కాపాడుకొనవలయును. అట్లయినచో యావజ్జీవము జనరంజకముగ బాడవచ్చును" అనెను.

మరునాడు హైకోర్టు చీఫ్‌జడ్జిగారు క్లబ్బులో సాయంకాలము నాచే హరికథ చేయించి క్లబ్బుమెంబర్లుమొదలగువారి కచటనే విందొనర్చిరి. నాటిచిత్రము దివానుచెంగట నొకపదేను రూపాయలు జీతగాడును దరువాత హైకోర్టుజడ్జియును పిదప నొకనేటివువైద్యుడును, పిదప పదునెనిమిదివందలజీతగాడు. నతనిప్రక్క నొకసామాన్యగృహస్థు నిట్లుద్యోగదంభములేకందరునుగలసి పంక్తిలో గూర్చుంట, యచటియుద్యోగుల నిగర్వమును దెలియజేసెను. నాటికథకు జడ్జిగారు నాకు నూటముప్పది రూప్యము లొసగెను.

## ఆస్థానసంగీత విద్వాంసులు నావద్ద హిందూస్థానీ భైరవినేర్చుకొనుట

మరునాడు సాయంకాలము నాలుగుగంటలకు మహారాజుగారు నాయొద్ద హిందూస్థానీభైరవిరాగము నేర్చుకొమ్మని యాజ్ఞయివ్వగా దాము వచ్చినామని యాస్థాన సంగీత విద్వాంసు లందరు నాతో జెప్పి నన్నారాగము పాడు మనిరి. నేనారాగము వారియిష్టమువచ్చినంతవరకును బాడినాడను. నేబాడినజాలుగా వారు పాడుటకు బ్రయత్నించిరి. కాని లాభము లేకుండెను. అపుడు నేను అయ్యా! అంగుడినుండి దౌడలనుండి ముక్కులోనుండి పాడుట కలవడిన దాక్షిణాత్యులకు నిరాతంకముగ నాభి నుండి ప్రారంభించి బాహాటముగ పెదవులు ముడవక దౌడలంటనీక ముక్కున బోనీక నమలక గొంతుతెఱచి పాడుటకలవడిన యౌత్తరాహుల పాటరీతి యెట్లులభించును? మరియు శ్రుతిలయ లొకటియయ్యును. శారీరము యాచలనుబట్టి గానభేద మగపడును" అంటిని. పిదప వారందరును నావలె హిందూస్థానీభైరవి పాడుట యంతవేగము తమకబ్బదని యాసదొరగి పోయిరి.

## పుష్పప్రదర్శనోత్సవము

మరునాడు లాల్బాగులో సాయంకాలము నాలుగుగంటలమొదలాకువరకు పుష్పప్రదర్శనోత్సవ మయ్యెను. పలురకంబుల పూలమొక్కలనెనేకు లచట జనానందముకొరకు గన్పర్చిరి. మహారాజచ్చటికి విచ్చేసెను. బెంగుళూరునందలి పెక్కుజనులు స్త్రీపురుషులచట నానావిధ సుమసందర్శనముచేయుచు దిరుగుచుండిరి. సరిగంచురంగుచీరలతో నానావిధరత్నాభరణములతో స్త్రీగుంపు లచ్చటచట గూర్చిన పూమొక్కల ననుకరించియుండిరి. తరుణస్త్రీపురుషులన్యోన్య సందర్శన జనితానందంబుల జొక్కుచుండ మన్మథుని తూపులన బువ్వులలరుచుండెను. మహారాజుగారు కొందరి హూణస్త్రీలతోగూడి యాసుమవనమున నందరిజనులకు గనుపండువుగ విహరించుచుండిరి. మహారాణీగారును బిల్లలనుగూడ నుపవనవిహార మొనర్చు

చుండిరి. లాల్బాగు చూడదగినయుద్యానవనములలో లోకమునందొకటి యనుకొనెదను. అందలి నానావిధవృక్షములు సూర్యరశ్మింజొరనీక దట్టముగ బెరిగి యాకసమంటుచుండెను. పలుతెరంగుల నికుంజములు, మంటపములతోజెన్నారు కొలనులును, తివాసీలవలె దిద్దిన పచ్చికపరవులు, వివిధఫలవృక్షంబుల మనోహరంబుగ బల్కు పలురకంబులబిట్టలు, వింత వింతరకముల పెంపుడుకారడవిజంతువులును, జూపరులకు మిగుల వేడుక గలిగించెను. మరునాడు మహారాజుగారు మైసూరునకు విచ్చేసిరి.

## తరుణీమణుల సంగీతసాహిత్య విద్యాగోష్ఠి

మైసూరురాజ్యములో స్త్రీలకు స్వైరవిహారములు విద్యాభ్యాసము గలదు. ప్రతిదినము తరుచుగా నాపాటవినుటకు దమపాట నాకు విన్పించుటకు గొందరు పదారేండ్లలోపు బాలికామణులు నాబసకు వచ్చువారు. స్త్రీలకు స్వేచ్ఛావిహారము విద్యాభ్యాసమును జిరకాలమునుండి హిందువులలో కన్పడదు. కాని యిపుడు హూణుల వలె నుండగోరి మనవా రీక్రొత్తయాచారమవలబించుచున్నారు. "స్త్రీణామశిక్షితపటుత్వ"మని కాళిదాసు చెప్పినట్లు స్త్రీలకు సహజముగ నన్నిరకముల తెల్వితేటలు చదువకయే లభించుననుటకు సందేహము లేదు. "నస్త్రీస్వాతంత్ర్యమర్హతి"యను స్మృతివాక్యము గూడ న్యాయముగ దోచెడిని. లోకములో నెంతచదువుకొన్నవాడైనను మరెంతయార్జనవరుడైన వింకెంతగొప్పవాడని ప్రఖ్యాతి పొందిననుగామసుఖ మాసించి తమ్మనుసరించు పురుషులం దృణప్రాయముగ స్త్రీలు గనుచుంట కేహేతువో! గొప్పవిద్వాంసుడననియు బ్రయోజకుడననియు వచ్చు మగనిం గని యిల్లాలు మూతివిరిచి చెంగటవారితో "అయ్యో! మావారుత్త వెర్రివారు" అనుట తరుచుగనంద రెరిగినవా స్తవమేకదా! యనగ మగవాడు పనికిమాలిన బుద్ధిహీను డని స్త్రీవెల్లడించుట కావెకుగల సహజపాండిత్యగర్వమే కదా కారణము. పురుషుల న్వశపర్చుకొని తమ యిష్టానుసారము వారలం ద్రిప్పుటయే స్త్రీలయందుగల సహజబుద్ధిప్రభా

వము. తమ్మాసించినమాత్రమున దెల్విహీనులు పురుషులని స్త్రీలు తలంచక మానరు. పరమపురుషుడొకడుతప్ప బురుషు లనదగువార లెచటనైన లేరు. బిందుమగవాడైనవాడు శివునివలె కామశత్రుడగు ననగా స్త్రీసంపర్క మొల్లడు. "కాముకా ఏవ స్త్రియో భవంతి" యను శ్రుతిప్రమాణముచే కాముకులు స్త్రీస్వభావముకలవారనుటకు సందేహములేదు. ప్రాణవాయువు మనలోపలలేక బాహ్యవాయువు నాకర్షింప జాలదు. స్త్రీస్వభావము మనయందుంటచే స్త్రీలను గోరుచున్నాము. అట్లేస్త్రీలును కాబట్టి యీపురుషులు కేవలపురుషులు కారు. స్త్రీలు కేవలస్త్రీలుకారు. చెరిసగమున స్త్రీపుంసత్వము స్త్రీపురుషసామాన్యముగ నున్నది. కావుననే యన్యోన్య సంయోగాభిలాష చూపట్టెడు. కనుక పురుషుడు మగయాడుదనియు స్త్రీ యాడుమగవాడనియు నిశ్చయింపవలయును. ప్రసవాద్యవస్థలంబట్టి రోగార్తులంబోలి స్త్రీలు కనికరింపదగు నబలలని మనమనుకొన్నట్లే త్రుటిలో మనల నాస్వాధీనముచేసుకొని తమ యిష్టానుసారము త్రిప్పజాలు సామర్థ్య ముంటచే వారు క్రూరభూతములవలె ఘోరరోగములరీతి నెల్లెడన్భయంకరులు సబలలని మనమేల తలంచరాదు! నఖ దంత విషాణాది సహజాయుధోపేతములగువ్యాఘ్రాది దుష్టసత్వములకు ఖడ్గాద్యాయుధముల యుపయోగమబ్బునట్లుకదా సహజబుద్ధినైపుణిచే నెల్లపురుషుల న్వశపర్చుకొను స్త్రీలకు విద్యనేర్పి స్వాతంత్ర్య మొసంగుట! యురోపియన్సులోగూడ రాజకీయోద్యోగములందును యుద్ధములందును బురుషులవలె స్త్రీలుగూడ వియమింపబడకుంటకే హేతువో! పురుషులతో సమానముగ స్త్రీలన్నిపనులయందు వ్యవహరించుట యెచటనైన లోకములో గానరాదు. కావున బురుషులవలె స్త్రీలు వ్యవహరింపదగదు. మరియు స్వాతంత్ర్య విద్యాభ్యాసములు పురుషులరీతి స్త్రీలకుండరాదు. ఉండినచో యురోపియన్పురుషులబోలి స్త్రీలకు లొంగి మనముకూడ దుఃఖపడకతీరదు. స్వచ్ఛందవిహారము విద్యావైభవముంటచేతనేకదా యురోపియన్ స్త్రీలు లోకములనుస్వాధీనముచేసికొనజాలు శక్తిమంతులం గనుచున్నారని యూహింపరాదు. అటులైనచో విద్యా

గంధముగాని యణుమాత్రమైన స్వైరవిహారముగాని లేని మహమ్మదీయ స్త్రీలెల్లంతటి యోధులగు జక్రవర్తులం గనజాలిరి! ఇంతకు నేదియెట్లున్నను మనలో స్త్రీలు యథాపూర్వముగ నుంటయే మేలని నాయభిప్రాయము.

మనజాతినీతులు మనయాచారములు మనమతములు మనమనుసరింపవలయునుగాని క్రొత్తరీతులు మనమవలంభించినచో మనకు మరింత చిత్తక్షోభమునకు హేతువగుగాని లాభమెద్దియు గలుగనేరదు. “ధనము విద్యయు వంశంబును దుర్మదులకు మదంబు పొనరించును సజ్జనులయినవారి కడకువయును నవియె నిచ్చునుర్వీనాథా” యను భారతవచనము కొంతగమనింప దగినది. డిగ్రీలు పొందినకొలది దుర్గుణములు కొందఱి దుష్టుల కధికమౌట కనలేదే! సుగుణదుర్గుణములు స్వాభావికములుగాని యాగంతుకములుకావు. ఒకానొకప్పుడు సహవాసమునుబట్టి సుగుణదుర్గుణములు లభించుటగూడ గలదు గాని యందుకొకనియతిలేదు. ఉల్లిపాయకుగల దుర్వాసన నెట్లు పోగొట్టగలము? “స్త్రీణాం ద్విగుణ మహార”మను న్యాయమునెట్టైన మార్ప దరముకాదు. సారథి రథికునకు సేనాధిపతి సేనకు వలె గృహస్థుడగు పురుషుని నడిపి రక్షించుటకు ముఖ్యముగ భార్యరూపమున స్త్రీ యేర్పఱ్పబడినట్లు సృష్టిలో గాన్పించుచున్నది స్త్రీ నేర్చుకొనవలసిన ముఖ్యమగు విద్యలు భర్తకన్నివిధములం దేహపోషణ మొనర్చుటయు, గృహకార్యములు జక్కబెట్టుకొనుటయు, బిల్లలసంరక్షణ మాచరించుటయు, కులవర్తనముంగా పాడుకొంటయుగాని యక్షరములు చదువుకొని యోచించుటయు తిరిగితిరిగి దేశభోగట్టాలు తెలుసుకొంటయు. నడ్డమైన వారియొద్ద నాటపాటలు నేర్చుకొనుటయు, బండ్లెక్కి వాడవాడల దిరిగి నాటకములు సర్కస్సులు చూచుటయు, సభలలో జదువుకొన్నామని దంభముగా గోసిటప్పాలు కొట్టుటయు. దనయవయములు బైలుపర్చినట్లు తనమనోవృత్తులం బయలుచేసి వ్రాయుటయునుగాదు. స్త్రీ గృహలక్ష్మి రూపమున భర్తయొక్క యోగక్షేమమరయుటయే సర్వ

లోకముల నుద్ధరించుట. పాశ్చాత్యాచారము మనకెన్నటికిని సరిపడదు. మనము హిందువులము వారు క్రైస్తవులు. కులరూప దేశాచారములు మనవి వేరు. వారివి వేరు. మిక్కిలిరాజులవలె మనమందరము భాగ్యవంతులమైనచో మనస్త్రీ లన్నిగృహకార్యములను నౌకరులనుంచి మనతో బండిషికార్లు చేయుచు న్యూస్‌పేపర్లు చదువవచ్చును. మరియును మనదేశములో బురుషులవలె బజారులలో కూలినాలిచేయుచు కోర్టులలో నుద్యోగములు సేయుచు ధనమార్జించుటకై తిరుగుట బ్రహ్మక్షత్ర వైశ్యస్త్రీలలో నేకాలమునుండియు నాచారములేదు.

మనలో భార్యకు నేర్చుకొనదగు నక్షరములు భర్తృచేష్టానిరీక్షణములు; చదువదగుగ్రంథము వల్లభుని మనోవృత్తి; చేయదగునుద్యోగము కాంతునిదేహసంరక్షణము: నేర్చుకొనదగువిద్య గృహకార్యనిపుణత. పూలచెండ్లు గ్రుచ్చుట, టవెల్సల్లుట. ఊలుతో పక్షులు మొదలగు చిత్రముల రచించుట. దొరసానులవలె ముస్తాబగుట యార్జనకు బైటబోయి కష్టపడివచ్చిననాథుని సంరక్షణము ప్రేమలేని కూలి వారిచే జేయించుచు నాటపాటలచేతను జదువుచేతను సుకుమారించి యింటిపనిపాటులకు బనికిరాక సోమరితనమున బ్రొద్దుపుచ్చుట మనలో స్త్రీలకెంతమాత్రము తగదు. విదేశీయాచారము మన మవలంబింపబూనుట తెల్విమాలినతనము హానికరమును. సంగీతమును మరిగినవారు నిషాబాజులవలె మరెందుకును బనికిరారు. సంగీతము విన్నమాత్రమున మత్తుమందుజల్లినట్లుమైమరచెదరు కదా! సంగీత విద్యానిపుణులకు దక్కినలోకముతో బనియేమి? దూరముగ వింపైన శారీరము వినబడినచో సంగీతజ్ఞానముకలవారి పచటికిబోయి యాగాయకుని కనులారజూచి మరికొంచెము వానిచే బాడించి [illegible] యేపనులు సేయుటకైన దోచునా? సుందరరూపము దృష్టికి సంగీతము చెవికి, సువాసనఘ్రాణమునకు, సుస్పర్శము శరీరమునకు, మంచిచవి జిహ్వకు, నభీష్టములుకదా. సుందరపురుషుల యథేచ్ఛ న్జూచుచు, నిష్టమువచ్చిన సంగీతము వినుచు, అడ్డమైనయుత్తరువుల కలవాట్లుపడుచు,

శీతకాలమునసిలోనుకు వేసవిలో సిమ్లాకు దిరిగి శీతోష్ణవాయుసుఖస్పర్శము లనుభవించుచు, నన్నిరకములచదువులు మరిగి పొట్టలు బెంచుచునుంట భోగములకలవడి చెడుటకు హేతువులు. భోగములు మరుగు స్త్రీలు పతులకు బరిచర్య సలిపి గృహకార్యములు చక్కచేసికొనజాలరు. కావున మన స్త్రీలకు భోగకాంతలకుబలె సంగీతాదిభోగముల మప్పరాదు. సంగీతము వచ్చిన పురుషులలో నిర్మలవర్తనము కలవార లరుదగుటచేతగదా గాయకు లపాత్రులని స్మృతులు దెల్పుచుండెను. తలను మణిగల ఫణికి విషాభివృద్ధి సహజమగునట్లు సంగీతవిద్యగల వారికి దుష్ప్రవర్తనము స్వభావసిద్ధము. ఆటపాటలతోడనే యన్ని వికారము లంకురింప దొడగును. త్రాగుట పరపురుషుల గౌగిలించుకొని యథేచ్ఛగానాడుట పరపురుషులతోగూడి యేకాంతముగ విహరించుట పాశ్చాత్యాచార మట్టివి మన స్త్రీలకు మప్పినచో వినాయకుని చేయబోయిన గ్రోతి యగును. మరియు "నేకు మేక"గును. ఉన్నయిల్లు చెడగొట్టుకొనకున్న జాలు మరొకయిల్లు కట్టినంతఫలము. ఇదివరకున్నట్లు మనస్త్రీల నుంచుకొన్నజాలును వారికి విద్యనేర్పినంతఫలము అని గురుబోధమహిమచే బెక్కువిధముల నూహించుచు చాలాదూరమునుండి మత్సహవాసంబున సంగీతసాహిత్య విద్యాగోష్ఠి ననుభవింపగోరి వచ్చిన తరుణీమణుల పొత్తున దరుచుగ నాటపాటల నోలలాడుచు గన్నడదేశముల చిత్రముల గనుగొంచు రెండు నెలలవరకు బెంగుళూరులో నుంటిని.

బెంగుళూరులో నొకవైశ్యునియింట హరికథచేసినప్పుడు కథాంతమున నొకవైశ్యస్త్రీకి దేవుడావేశించి యింకొక కథచేయించుమని యచటి వారలతో దెల్పుట దేవునకు నాయందుగల యనుగ్రహమునకు స్పష్టముగ ఋజువనుకొంటిని. జంతికెలు, గారెలు, పకోడీలు. మొదలగు తినుబడి వస్తువులు పెట్టుమని దయ్యములును. ముడుపులు కట్టుమనియు, భాగవతము లాడించుమనియు, హరికథలుచేయించుమనియు, తీర్థముల దిరుగుమనియు దేవతలును, మనస్త్రీలలో ముఖ్యముగ గొందరియం దావేశిం

తురు. ఆవేశము పట్టినవారు తరుచుగ దుర్వర్తనము కలవారు. ఔను, త్రాగుబోతులయందు మెట్టవేదాంతమును, శూద్రజనులయెడ దేవతావేశము తరుచుగ గోచరించెడు. సోదెలు, పుక్కిటిపురాణములు, మెట్టవేదాంతములు, పౌరోహిత్యము, జ్యోతిషము, వైద్యము, కొందరికి బుణ్యవశమున ధనార్జనమునకు దోడ్పడుచున్నవి. "సింహాద్రియప్పడనై యుంటిని జూడుమి, నల్లబండనై యుంటిని జూడుమీ నరుడా" యిట్లు కొప్పు విరిబోసి తలనాడించుచు దేవతలావేశించినట్లు సోదెలు చెప్పువారికి దప్పితీరనోట బాలు బోయుచు, గుగ్గిలపుపొగ వేయుచు, నొడల జందనము రాయుచు, పండ్లారగింపజేయుచు, ప్రశ్నములు వేసి యుత్తరములువినుచు దక్షిణబెట్టు వారును, "ఆంజనేయులు సంజీవపర్వతమును దెచ్చుచుండగా భరతు డొకకోలతో గొట్టె నపుడు కొండతోగూడ హనుమానుడు రామనామోచ్చారణము సేయుచు నేలగూలగా జూచి భరతుడు తనకరస్పర్శనమాత్రమున హనుమంతుని మూర్ఛదేర్చి యొకబాణాగ్రమున గొండతోగూడ నాంజనేయుల నునిచి యాబాణమును రామునిచెంత నెగిచె" ననగా సంతోషించి పురాణముచెప్పువారికి సత్కారముసేయువారును, "జగత్తుకల్లనే నెవరు నీవెవరు అంతయు బ్రహ్మమే" యనెడు మెట్టవేదాంతి కాపూటబత్తెమొసగువారు, "నేడు మీ యమ్మగారి తద్దిన ముల్లి బచ్చలకాడ వంకాయ మొదలగు కూరలు పనికిరావు మీ తల్లి వైతరిణీనది దాటుటకు గోదానము చేయకతీరద"ని పెక్కురకములగు కర్మముల జేయించు పురోహితులకు ధనధాన్యములిచ్చి యాదరించువారు, "నేడమావాస్య సూర్యగ్రహణపుణ్యకాలము నేడు పదమూడింట వర్జ్యము, గొల్లనానిచేత నున్నది కుంచ మీయేడు పంటలకు లోపములేదు, పగలుసూర్యుడు [illegible] చును, రాత్రి చుక్కలు కనబడును, నీకు గ్రహచారము బాగున్నది. హావుముందు శవిచుట్టకాల్చుచు దూర్పుమొగముగా గూర్చున్నందున దేశారిష్టములు కలుగు"నని చెప్పు జ్యోతిష్కునకు దబ్బిచ్చువారు, "ఈ యౌషధము కనకసుందరి, శుద్ధిచేసిన రసవిషగంధకములతో తయారైనది,

యేడుమాత్రలు మూడుపూటలు సరిగా తూచి పుచ్చుకొన్నచో మీ యామ వాత ముపశమించును, రోగిచేయి చూచినాను, మీరందరేమో భయపడుచు న్నారుగాని నాకెంతమాత్రమును భయములే''దనుచు వ్యాధికుదిరినచో దన ప్రజ్ఞయనియు లేనిచో నపథ్యదోషముగాని దైవముగాని కారణంబ నియు పల్కుభిషక్కులకు సొమ్మిచ్చువారును, సర్వదేశములలో కలరు. వీరు బుద్ధిమంతులో లేక జ్ఞానులో యికముందాలోచించి వ్రాసెదను.

### విజయనగరమునకు తిరిగి వచ్చుట

బెంగుళూరునుండి బయలుదేరి హిందూపురం గుంటకల్లుమీదుగా గుంటూరులో నాగినాము. బందరులో నాకు మిక్కిలిమిత్రుడైన యొకవెల నాటి నియోగి బ్రాహ్మణు డతని "కింజనీయరాఫీసు''లో నిరువది రూప్య ముల జీతము. అతడు సంగీతసాహిత్యరసజ్ఞుడు. దొడ్డవాడు. మొదట చీరాలవాస్తవ్యుడు. గుంటూరులో మమ్మలను మిగులనాదరించెను. అచట రెండుకథలు చేసినాము. గుంటూరునుండి యింటికి జేరుకొన్నాము.

### విజయనగరము మహారాజావారి ఆస్థానములో

మైసూరు మహారాజుగారు నా కథలు చిత్తగించినట్లు ''మెయిల్'', ''హిందూ'' మొదలగు వార్తాపత్రికల నెరింగి మనయూరియతడు విదేశ మున మహారాజసన్మానము నందెను గనుక నట్టిప్రజ్ఞావంతుని మనయాస్థా నవిద్వాంసులలో జేర్చినయెడ మనకు ప్రఖ్యాతి కలుగునని యెంచి విజయ నగరము మహారాజుగారు నన్ను దమపండితులలో జేర్చి నెలకు బదేను రూప్యములజీతము విర్ణయించిరి. కాని యీ వార్త నాకు దెలియలేదు. ఇచటి కాలేజీప్రిన్సిపలుగారైన రామానుజాచార్యులుగా రొకనాడు సాయం కాలము కాలేజీహాలులో నాచే హరికథ చేయించిరి. నాటికథ కిచటి పిన్న పెద్దలందరు వచ్చియుండిరి. కథ ముగించుసమయమున

గీ॥ వేంకటాద్రివలన నంకురించినబడి
పల్లవించె వరుణపర్వతమున
పూచికాచె జంద్రభూషుచే, రామాను
జన్మచేత గల్పశాఖియయ్యె''.

అని యాశుధారగా బద్యమునొనర్చి జదువగా నచటివారెల్లరు నుల్లసిలిరి. పిదప ప్రిన్సిపాలుగారు మేనేజరుగారి కిట్లు వ్రాసిరి. "నారాయణదాసుగారి సంగీతసాహిత్యప్రజ్ఞావిశేషములు విని సంతోషించి మహారాజుగా రతనికి నెలకు బదేనురూప్యములు జీతముచేసి యతని సంస్థానపండితులలో జేర్పుటకు నాద్వారా యాజ్ఞ నొసగిరి. కాన మీ రతని పేరు దివాన్‌దస్తరులో బండితులలో నమోదుచేయించవలయును". పిదప పెద్దమేనేజరుగారు మహారాజాజ్ఞచొప్పున నన్ను దర్బారు పండితులలో జేర్చిరి

విహంగన్యాయమున బ్రతుకనిశ్చయించితిగాని యొరుల నౌకరీ సేయు నుద్దేశము నాకెన్నటికిని లేదు. మరియు కొండలు, నదులు, వనములు, జంతుజాలములు, సూర్యాదిగ్రహములు దొట్టి ప్రకృతిమహిమము చూచి యానందించుచు నభినందించుచుంటయు, జనుల మంచిచెడ్డలు కనిపెట్టి తర్కించుచుంటయు, దరుచుగ గురునివశమున యధేచ్ఛాసంచారము సేయుచుంటయు నా వృత్తి.

మాఘమాహాత్మ్యమునుబట్టి మార్కండేయచరితమును యక్షగాన ప్రబంధముగ రచించుచు నాలుగైదు నెలలవరకు నేనేవిధమైన మదద్రవ్యముల నుపయోగింపక నిర్మలస్థితితో నా కావ్యము నుగ్మగించినాడ.

### తిరిగి మైసూరు వెళ్ళుట

అంతట దసరాకు మైసూరుకు రమ్మని మైసూరు దర్బారుబక్షీ నాకు టెలిగ్రాము వేసెను. పేరన్నయు నేను బయలుదేరి తెలవారిన తోడనె రాజమహేంద్రవరముజేరి స్టీమరెక్కి గోదావరిదాటి యేలూరులో దిగినాము.

అచట నొకస్కూలుమాస్టరొకమంచివాడు మమ్మాదరించి మాచే హరికథ చేయించి పాతిక రూపాయి లిచ్చెను. మరునాడు బయలుదేరి బెజవాడలో భోజన మొనర్చి సాయంకాలము సదరన్ మరాటారెయిలుబండి యెక్కి బహుప్రయాసమున మరునాటిసాయంకాలమునకు గుంటకల్లు హోటలులో దిని హిందూపురం మార్గమున నుదయమునకు బెంగుళూరునకు జేరుకొంటిమి. దర్బారు కంట్రోలరుగారి కొక యుత్తరము బెంగుళూరు మునసబుగారి యొద్దనుండి తీసికొని మరునాడుదయమున మైసూరుకేగినారము. బెంగుళూరునుండి మైసూరునకు రాత్రి బండినడుచుటచే నచటిత్రోవ యందలి చిత్రములు గానరాకుండెను. మిక్కిలి చలిచే బాధపడుట యొక్కటియే జ్ఞాపకమున్నది.

## మైసూరు కోటలో కన్నడ నాటక ప్రదర్శనము

మైసూరులో ఎడిషనల్ మునసబుగారియింట దిగినారము. సాయంకాలము కంట్రోలరుగారును నేనును రెండు గుఱ్ఱములబండిపై గూర్చుని కోటకేగినారము. కోటకు చిన్నచిన్న బురుజులు నూటివర కుండుననుకొనెద. కోటలో నెన్నియో దేవాలయములు కలవు. శివుని కోవెలలు మెండు. మహారాజుగారు కోటలో నొకమేడవరండాలో నాడబడుచున్న యొకనాటకము చూచుటకు విచ్చేయుచు మధ్యమార్గమున కంట్రోలర్‌గారి సమీపముననున్న నన్నుగని మందహాసముచేసి నావైపు వ్రేలుచూపించి చెంగటివారితో నేమో యనిరి. పిదప నైదుగంటల సాయంకాలమునకు నాటకము ప్రారంభమయ్యెను. నాకుకూడ నాటకము చూచుటకు మహారాజాజ్ఞయైనది, రెండుమూడువందల కుర్చీలపై దర్బారుద్యోగులందరు మహారాజుగారితో గూర్చునియుండిరి. నేనొకబాజున కంట్రోలరుగారి ప్రక్కను గూర్చుంటి నంతఃపురస్త్రీ లాచెంగటి మేడపైనుండి నాటకము చూచుచుండిరి. నాటకులు కన్నడభాషతో నాటకము సేయుచుండిరి. నే నంతఃపురస్త్రీలవైపు తిలకించుచు నంతఃపురస్త్రీలవైపు

జూడరాదనికాబోలు నొకరైన నాదిక్కుజూడకుంట కవిపెట్టి నేగూడ నటుజూడనొల్లకుంటిని. నాటక మెనిమిదిగంటలకు సమాప్తముకాగా కంట్రోలరుగారు నన్ను బసకు దిగబెట్టిరి.

## మహారాజవారి సందర్శనము

పిదప నేమేమో మింటమిద్దె లల్లుకొనుచు గొంతెమ్మకోర్కెలతో గొంతవరకు మేల్కొని విదురించి తెల్లవారినతోనే విద్రలేచి దంతధావన మొనరించుచుండగా విద్దరు గుర్రపుసవార్లు బల్లెములు పట్టుకొనివచ్చి మహారాజాజ్ఞయైనదని నన్ను దోడ్కొనవచ్చిరి. అపుడు పేరన్నవైపు నే జూచి "యోయి! నిన్నసాయంకాలము నాటక మాడు చున్నసమయ మున నంతఃపురస్త్రీలవైపు నే జూచినందుకు శాసించు టకుగాబోలు నింత యుదయముననే నన్నురమ్మని సెలవయినట్లున్నది కావున బోవుటకు జంకు వొడముచున్నది" అంటిని. అందుకతడు నవ్వి "నీకెందుకిపిచ్చి యనుమాన మట్లు కానేరదు" అనియె. పిదప మేమిర్వురము కాఫీ పుచ్చుకొని పాగాలు చుట్టుకొని మాకు తైనాతుగా హాజరైన గుర్రపు బండెక్కి కోట కేగినారము.

## మర్త్యులను గొలువను

దెబ్బదియేనుబది పహరాలు మేడ లెక్కుచు దాటి మహారాజా వారు మాకొరకు విరీక్షించుచున్న సంగీతశాలను సమీపించుచున్నాము. ఎనిమిదివందల రూపాయిల జీతగా డొకదర్బారు ఉద్యోగి మావెంట నుండెను. అంతఃపురమునకు సమీపించుకొలది దంతము, వెండి, బంగారు మలామాచేసినట్లు మెట్లగుపడుచున్నవి, మొత్తముపై నొకపాపుమైలునకు శైగా మెట్లు దాటినారము. పిదప షుమారు దెబ్బదిపహరాలు దాటినపై మహరాజావా రొకమేడచెంగట మెట్లపైని విలువబడియుండిరి. ఓకయెర్ర తలపాగా నొకయెర్రమల్లుజుబ్బా నందుపై బెద్ద బంగరు లింగకాయ యొక మల్లు పంచయు ధరించియుండిరి. మహారాజావారు నేచేతికందిచ్చిన

గులాబీపూవు వాసనజూచుచు "నీవీ పూలెచటనుండి కోసినావు? విజయ నగరమునుండి తెచ్చినావా!" యని చిరునవ్వున నన్నడిగిరి, "పేలెస్ దోటలో గోసినాను" అని జబాబు చెప్పినాను. నాడు బెంగుళూరులో నీవు పాడినపాట నీ శారీరము నిదివరకును నా చెవిలో మ్రోగుచున్నవి. విజయ నగరపురాజు నా మిత్రుడు క్షేమమా! నీ పాట యెన్నడైన వినెనా!" యనెను. "లేదు" అంటిని. అందుకు వింతపడి "ఎంత దురదృష్టవంతుడు నీవంటి ప్రతిభావంతు నిదివరకు జూడకుంటకు, మా దర్బారులో నీవేమైన సర్వీసు జేయగోరెదవా!" యని యడిగెను. "నా కక్కరలే దంటిని. "కారణమేమి!" అనెను. "మర్త్యులను గొల్వనొల్ల" నంటిని. మహారాజుగారి కందోయి యాషత్రెరబడెను, వారి చిత్తానుసార ముద్యోగము నంగీకరింపనందుకు వారికి గోపమువచ్చుట గనిపెట్టి నాదగాని సుంతయు న్నే జలింపలేదు. "ఔను నీవు స్వేచ్ఛగా నుండదలంచితివి. సరియే వీణపట్టించుకొని వచ్చితివా!" అని యడిగిరి. "లేదు" అంటిని. పిదప నాయందున్న కోపమును దివానుపై గనపర్చుచు దివానుతో "నిన్న వీణసహితముగా బంపుమని చెప్పినా నెందుకిట్లు చేసినావు" అని కను లెఱ్ఱగా బల్కెను "కానిండు మాయన్ననుబంపి త్వరగా వీణ తెప్పించెదను." అంటి నందుకు త్వరగబంపి తెప్పించుము" అనియె. పిదప బేరన్నను వీణదెమ్మంటి. ఒకరాజభటుడు పేరన్నను మేడక్రిందికి గొనిపోవుచుండెను. మహారాజుగారు. నేను, దర్బారుద్యోగియుమాత్రము మిగిలియుంటిమి. మహారాజుగారు నాతో "ఇటువైపెందరినో వింటిని గాని నీవలె హిందూస్థానీ కర్ణాటకముల యాచలు మిశ్రమముగా బాడ నేర్చినవారొకరైన గానరారు. విజయనగరములో గలరా!" యని యడిగెను. "లేరు" అంటిని, "నీ వెక్కడ సంగీతము నేర్చుకొంటివి!" అనిరి. "నా సంగీతసాహిత్యములు సహజపాండిత్యము" లంటి నందుకు మిక్కిలియాశ్చర్యమంది "ఏదీ ఖమాచీ కొంచెము పాడుము" అనిరి. నే నారాగము కొంచెముపాడి

శ్లో॥ వాణీ విలాసాక్షి చకోర చంద్రం
సౌజన్య సంతాన విభూతి సాంద్రం
స్వచ్ఛందకార్యేషు సదాప్యతంద్రం
పాయా చ్ఛివశ్చామధరాధిపేంద్రం

ఉ॥ సన్నవిమబ్బులో మెలగు చందురుపోల్కి మొగంబు, పెన్వలం
బన్నగ ద్రుల్లు బేడిసలమాడ్కి కనుంగవ చూపు, చాపలో
జెన్నలరార గల్మిచెలిచెల్వగురాణియు బట్టుగద్దియ
న్వెన్నునిబోలు చామదొరవించుత గోరికతల్లిదంద్రులై.

యని చదువగా "శ్లోకము తెలిసెనుగాని నీవు చదివిన తెనుగు కొంచమైనను దెలియలేదు, ఇంగ్లీషున తర్జుమా చేయుము" అనెను. మహారాజుగారికి తెనుగెంతమాత్రము తెలియదు. నాకు నుంతయు గన్నడము రాదు. కనుక ఇంగ్లీషున ఉభయుల మన్యోన్యాభిప్రాయముం దెలుపుకొనుచుంటిమి. నేనాపద్య మింగ్లీషున నర్థముచెప్పగా మహారాజుగారు వెంటనే కన్నడమున దర్జుమా జేసికొని "క్షణముండుము వచ్చెదను" అని యంతఃపురమున కేగెను.

## నా యనుమానము

నా చెంగట నెవ్వరును లేరు. విచ్చుకత్తులను బట్టుకొని యెటుచూచినను దూరముగ పహరావాండ్రు గుపడుచున్నారు. అపుడు నాలో నేనుదయమునపడ్డ యనుమానమునకు నిప్పటిస్థితికి సరిపోయెను. విన్నపాయంకాల మంతఃపుర స్త్రీలవైపు తిలకించుట, మహారాణీగారిని శృంగారముగ నభివర్ణించుటయు నాలోనాకీ యనుమానము పుట్టించెను కాబోలును. మా దర్బారులో గొల్వుండుట మీ కిష్టమా యని మహారాజుగారడుగనేల! నహీయని యంటి నంతతో బోక మృతిస్వభావముగల మర్త్యులను గొల్వనవి యేల నొక్కివక్కాణించితిని? అయ్యో మీదెరుగనైతినిగదా! ఈ సంగతులనుబట్టి మహారాజుగారికి నిశ్చయముగ కినుక పుట్టె నతవి కను

వెఱ్ఱపడలేదా ! నా తెనుగుపద్యపు తాత్పర్యము తెలిసికొని మరింతకోపమున బోయినట్లున్నది వీణమిషపై బేరన్నను దగిలివేయుట యిప్పుడిట్లు నన్నొంటిగ నుంచుట తప్పకేదో చోద్య మున్నది. ముందుచూపేకాని కొంచమైన వెనుకదృష్టి నాకు లేదుగదా ! ఆ పహరావాండ్రేమో యాయుధముల సవరించుకొని నావైపు చూచుచున్నారేమిచెపుమా ! గొన్నినెలల క్రిందట నుపయోగించిన గురుడు నెత్తెక్కి యిట్టి పిచ్చియనుమానముల పుట్టించెనని నాలో నే నవ్వుకొనుచు గబగబ జోడుచప్పుడు వినబడ దెసలు పరికించుచుంటిని. అంతలో నన్ను విడిచిన సుమారొకపావుగంటకు మహారాజుగారు మందహాసముతో నాయొద్దకు వచ్చి "మిస్టర్ నారాయణదాస్, పద్యమునకు మహారాణీ మిక్కిలి సంతోషించి నీకెన్నో థేంక్సు చెప్పుమనియె. ఆమెకు తెలుగు కొంచము తెలియును. ఇప్పుడు నీవు పాడినపాట యామె వినుచుండెనట. అంతఃపుర మిచటికి సమీపమే" యని నాభుజమున సంతోషముతో దట్టెను. నేను శిరమువంచి చేతులుజోడించి "మహారాజుదంపతులు సంతోషించుటచే నా జన్మము సార్థకమయ్యెను" అంటిని.

## బందే బందే

అంతట బేరన్న వీణచేతబట్టుకొని యొకగుమాస్తా వెంటరాగా మమ్ముల సమీపించుచుండెను. మహారాజుగారు నన్ను దయతో వీక్షించి "నీ కేకూర యిష్టము" అన "వంకాయలు" అంటిని. అందుకు నవ్వి "మా మైసూరు వంకాయలు రుచికి బ్రసిద్ధములు. ఎవడురా !" యనిపిల్వ "బందే బందే" యని యొకడు వచ్చెను. వానిచేత తక్షణ మొకపళ్ళెములో వంకాయలు తెప్పించి నా బసకు బంపెను. ఇంతట పేరన్న రాగా మమ్మిరువురను చెంగటిసంగీతశాలకు మహారాజుగారు దోడ్కొని పోయి నన్ను వీణవాయించు మనిరి. నా వీణ పొట్టిది. తీగెలు మిక్కిలి లావు. ఒకస్వరమైన లాగుట కవకాశము లేనంత హెచ్చుగ సాధకమునకై శ్రుతి

చేసి యుంటిని. కొంచెము కమాచీరాగము వాయించినాను. మహారాజు గారు కొంచెము విని. "సరే చాలించు. నీ పాట రికార్డుచేయుటకై నిన్నిపుడు పిలిపించినాడను." అని పేరన్నవైపుజూచి నాతో "మీరిద్ద రేమయ్యేదరు" అన "ఏ కోదరులము నాకన్నపెద్ద" యంటి నందుకు నవ్వి మీరిద్ద రేకోదరు లంటివికదా నీ శారీర మేమంత యాకసమంటుచు నొక మైలుదూరము వినబడ నితనిగొంతు మిక్కిలి సన్నము" అని నవ్వెను.

### ఫోనోగ్రాఫులో నా పాట రికార్డుచేయబడుట

అంతట నొకయూరోపియను వచ్చి ఫోనోగ్రాఫు సిద్ధపర్చి మహారాజుచెంత నుంచి పోయెను మహారాజుగారు నాతో "జూడు, నే పాట ప్రారంభించు మన్నపుడు పాడుటకు సిద్ధముగ నుండుము" అని ఫోనోగ్రాపునకు ముల్లు తగిల్చి కీయిచ్చి నా వైపు సంజ్ఞచేసి "జంఝూటీరాగముతో బెంగుళూరుపై (నే రచించిన) పద్యము చదువుము" అనియె. నే పద్యము చదువుచు బాడుచుంటిని. మా యన్న తంబురాశ్రుతి మీటుచుండెను, ఇట్లొకప్లేటు సమాప్తముకాగా రెండవప్లేటుతీసి "కన్నడారాగ మీ ప్లేటులో బాడుము" అనియె. కన్నడారాగ మా ప్లేటంతయు బాడినాడ. మఱియొకప్లేటు తీసి హిందూస్థానీ భైరవి నీవుపాడిన బ్లైచటను వినలేదు. నాకారాగము మిక్కిలిప్రీతి పాడుము" అనగా "సయ్యాజావోనహిబోలుం" అని పాడుచుంటిని, పేరన్న మీటుచున్న తంబురా పంచమము కొంచెము తగ్గుటచే మహారాజుగారు స్వయముగా బూస సవరించె. పేరన్న తన లోపమునకు జంకుచుండెను.

పిదప మూడుప్లేట్లు నాకు వినిపించుచు మూడవప్లేటులో నేబాడిన భైరవిరాగమును దాశారీరము ననుసరించుచు తనకు రాలేదని చేయి ద్రిప్పుచుండెను. ప్లేటు పాట ముగిసినపిదప నాతో "ఈ భైరవి నీకెట్లు వచ్చెను" అనెను, కొంతమోస్తరు విజయనగరములో వింటిని బిదపనాయూహను బాడుచుంటిని అంటి నపుడు నాతో మహారాజుగారు" నీ పాట శతాబ్దము

వర కిప్లే పెట్టెలో వినవచ్చును. వినుమా యీ పాట యెట్లున్నదో" అని రెండుప్లేట్లకు కీయిచ్చి విన్పించెను. నే విని "కడుబాగున్నది. కర్ణాటక మీ పాడినవారు స్త్రీలై యుందురు అంటిని. అపుడు మరిరెండు ప్లేటుదీసి "యీ రెండింటిలో నేది ప్రశస్తతరమో చెప్పుము" అనియె. నే రెండును బాగుగ నిదానించి వింటిని. రెండుప్లేటులలోను ఫిడేలు మృదంగసాహాయ్యమున శారీరములు వినబడియె. రెండింటిలోను గర్ణాటక సంగీతమే యుండెను. మొదటి ప్లేటునందు పరిమితద్రుతకాలమున శారీర ముండెను. రెండవప్లేటులో గున్నయేనుగ నడుచునట్లు మధ్యలయను బాటయుండెను. రెండవప్లేటు శారీరము గనుక భూయిష్ఠము సుందరతరమని తోచెను" అంటిని "మొదటిశారీర మిటువైపు మిక్కిలిఘనతచెందిన మహావైద్యునిది. ఎక్స్ప్రెస్ ట్రెయినువలె నతిత్వరితముగా బర్విడు నతనికంఠము. రెండవయతడు పట్నం సుబ్రహ్మణ్యమను విద్వాంసుడు" అని "చూడు నీ శారీరమువంటి శారీరము నీవలె సుమారు హిందూస్థానీభైరవి పాడినా డొక యాత్రాహుడు, సన్యాసి, నే నెన్నివిధముల బూజించి ప్రార్థించిన నొక్కదినముమాత్రమే నా చెంతనుండి చెప్పక లేచిపోయె నామహాత్ము డాకొండపై దుర్గగుడియొద్ద నీ ప్లేటులో నతనిచే బాడించితిని" అనియొక ప్లేటు తీసి కీ యిచ్చెను. నిజముగా నా శారీరమున కాసన్యాసిశారీరమునకు భేదమేద్దియు తెలియరాకుండెను, నిజాకూడ నొక్కటియే యాటకు మే మిర్వురన్నదిమ్మేల మచ్చెరువందినాము. పన్నెండుగంటలు సుమారయినది. మహారాజుగారి యాజ్ఞ గైకొని బసచేరినాము.

## నాయుల్లాసము

పిదప నాలోనేను బ్రతుకుజీవుడా మహారాజు మిక్కిలి సంగీతరసజ్ఞుడు గాన నాయాటలు చెల్లెను. లేకున్న మహారాజుమాట కెదురుచెప్పి బ్రతికి రా దరమా ? నీకొల్వు నాకక్కరలేదంటి నందుకు మహారాజు కనులెఱ్ఱబడెను. మహారాజున కలుక పొడమినపు దేముండును ? బాగు

న్నది, ఏమి నామూర్ఖపాకమేమి నావిర్లక్ష్యము చిత్రము జరిగెను." అని యనుకొనుచు మాబస కెదుటనువ్న కొళాయిచెంత గుమిగూడి జగడమాడుచు నొండొరులమీరి బిందెలలో నీళ్ళుబట్టుచు నేమో కారుకన్నడము మాట్లాడుకొనుచు బుగ్గలను తమ్మలము. సిక బూలదండ చెవులకు గమ్మలొడలినిండ బట్ట రవిక వింతమోటసింగారముతో గర్ణాటకాంగనల చెల్వు కనులవిందుగా జూచుచు భళిరా! వింతవింత దేశములు వింతవింతరకముల మనుష్యులనుకొనుచు. నాకొత్తమొగము వెర్రివేషము వింతగా జూడవచ్చు కొత్తవారితో జమత్కారముగ సంభాషించుచు మూర్తీభవించిన నుల్లాసమువలె విటునటు దిరుగుచుంటిని.

## మహారాజు సమక్షమున మార్కండేయ చరిత్ర హరికథాగానము

మరునాడు రాత్రి యెనిమిదిగంటలకు హరికథ చేయుమని నెలవయ్యెను. దర్బారు మార్దంగికుని ఫిడెలరును జతపర్చుకొని సాయంకాలము భోజన మొనర్చి మామూలు వేషము వేసికొంటిని. గాని నీరు కొంచెము పల్లడిచేసెను, గాన బైకివెళ్ళి వచ్చుట యాలస్యమయ్యెను. మహారాజుగారు సింహాసనారూఢులై నిండుకొల్వుచేసి యుండిరి. దర్బారునుండి వర్తమానముపై వర్తమానము వచ్చుచుండెను. పదిపన్నెండుగురు గుఱ్ఱపుసవార్లు వీధి మిక్కిలి చప్పుడుగా వచ్చుచుండిరి. నాకు దైనాతు చేయబడిన జాయంటుమునసబు మరికొందరుద్యోగులునునన్ను ద్వరగా బయలుదేరమనియు, యెనిమిదిగంటల పదిమినిట్లయినదనియు నన్ను ద్వరగా దోద్కొని రాకున్న దమయుద్యోగము లూడుననియు బ్రతిమాలుకొనుచు నెత్తినోరు గొట్టుకొనుచుండిరి. కాని దేహధర్మములు రాజాజ్ఞకు లొంగునా! రాజు ఫర్మాయించినమాత్రమున తుమ్ము వచ్చునా? కాలోచిత కృత్యముల నిర్వర్తించుకొని సిద్ధమైన బండెక్కి మహారాజసభ కేగినారము.

అదివర కుద్యోగులపై నాయాలస్యమునకై యులుకుచూపు మహారాజుగారు నన్ను చూచినతోనె గద్దెపైనుంచి లేచి వచ్చి "ఇంతయాల

స్యము చేసినావు. వంకాయలకూరతో నధికముగా భోజనము చేసినావా యేమి ? (అనినవ్వి), పాలు త్వరగా ద్రావి కథచేయుము" అనిరి. నేవెంటచే యచటగిన్నెలో సిద్ధముగనున్న పాలు కొంచెము త్రావి కథ ప్రారంభించినాడ. నాటిసమయమున నాశారీర మంబరవీథి నాక్రమ్మెను. మార్కండేయచరితమును బాడుచున్నాడ. నాశారీరపు ప్రతిధ్వనిచే మేడయంతయును మ్రోగుచుండెను. తెనుగున బాడుచు ఇంగ్లీషున చెప్పుచుండగా మహారాణిగారు వేంచేసియున్న తావున కభిముఖముగా దెనుగున చెప్పుచుండుమని మహారాజాజ్ఞయైనది. ఎనిమిదిగంటలపావు లగాయితు ఒంటిగంటవరకు నత్యద్భుతముగ బాడుచు హరికథ చెప్పినాడ. మహారాజుగారు మిక్కిలి వేడ్కతో జిత్తగించిరి. కథ ముగిసినపై నాయొద్దకు వచ్చి "నేటిపాట మిక్కిలి బాగున్నది" అని సెలవిచ్చిరి. దివాను మొదలగు వారెల్ల నోటికి బట్టడ్డుపెటుకొని మహారాజుగారితో మాట్లాడుచుండిరి నే యధేచ్ఛగా జవాబు చెప్పుచుంటిని. చేతులు జోడించుటగాని తరచుగ 'యువర్ హైనెస్స్'నిగాని యెరుగను. దివానుమొద లుద్యోగులెల్ల సభనుండి మళ్ళివచ్చుచుండగా నాతో "అయ్యా! మహారాజుగారు నేడు మీగానమున కపరిమిత మోదము నందిరి." అని నన్ను మెచ్చ దొడగిరి.

## గ్వాలియర్ విద్వాంసుని గానము

మరునాడుదయమున మహారాజాజ్ఞ చొప్పున దిరిగి మేమిర్వురన్నదమ్ములము దర్బారు సంగీతశాల కేగినారము. అచట మహారాజుగారు నాతో "నీకు మా హిందూస్థానీ గాయకులపాట వినిపించగోరినాము" అని యొకతురకను బాడు మనిరి, తురకయు వాని కొడుకును తంబురాలుపట్టుకొని తబలా సారంగి సాహాయ్యమున బాడదొడగిరి. వారిపాటకన్న వారు నేలకువంగి మాటిమాటికి మహారాజుగారికి సలాములుపెట్టుట వింతగనుండెను. పాటముగిసినపిదప" ఎట్లున్నదీపాట యితడు గ్వాలియర్ విద్వాంసుడు" అనిమహారాజుగారు నన్నడుగగా" మాసైపు భాగవతపుపాటకు

లిట్లు కొంతవరకు బాడెదరు. ఇదేనా గ్వాలియర్ పాట ! అని యంటిని. మరునాడింకొకసారి నాకథ చిత్తగించెదమని మహారాజుగారు సెలవొసంగగా బసకు వచ్చినారము.

### కర్ణాటకుల వంటలు

మాకొరకై దర్బారునుండి ప్రతిరో జిరువదిరూపాయిల బత్తెము వచ్చుచుండెను. మైసూరు కర్ణాటకుల వంటలు చాలామట్టుకు మాకు రుచింపలేదు, కారములే దుప్పులేదు పులుసు లేదు. పప్పునీళ్ళచారుతో నెంతకవి మ్రింగగలము ! వారివంటలు వారి కమృతోపమానమట. పనసకాయ మూడు ముక్కలు చేసి చారులో వేయిట యెంతయో ఘోరము. ఆచారు మాకు బోయుచు "మీ సీమలో నింతసొగసుగా బనసకాయ వండుకొనగలరా!" యని గర్వించి వారడుగుట మరింత చిత్రము.

### వనసమారాధన

కార్తీకమాసమున మైసూరు దుర్గగుడిచెంగటి తోటలో మహారాజుగారు పురజనులందరికి ముఖ్యముగ బ్రాహ్మణులకు వనభోజనము చేయించిరి. మమ్ములనుగూడ పిలిపించిరి. ఆభోజనమునకు మహారాజు కూడ విచ్చేసిరి, కాన పౌరులందరును స్త్రీపురుషులు పిన్నపెద్ద లచట నుండిరి, ఆవనము నాలుగు క్రోసుల కై వారమున నుండును. చెంగట దుర్గకొండ గలదు. పెద్దచెర్వొకటి కల దందు గుంపుగుంపులుగ బెంపుడు గజములు నడవియేనుంగులు చిత్రముగా నీదుచుండును. రంగురంగుల చీరెలతో విచిత్రాభరణములతో స్త్రీలు గుంపుకూడుచోటు పూలమొక్కల నమర్చినట్లుగాన్పించెను. వనభోజన మంత గొప్పగా లోకములో మరెక్కడను జరుగదు.

### దర్బారులో నాహరికథ సన్మానములు

రాత్రి దర్బారుచేసి తిరిగి మహారాజులరాగా నాహరికథ యెవిమిది

గంటలమొదలు పన్నెండువరకు చిత్తగించిరి. పిదప మైసూర్గవర్నమెంటు డిజైనుగల రెండుమురుగులు. రెండుజతల శాలువులు, నొకవీణ యొక సంచిరూపాయిలు, రానూపోను సెకుండుక్లాసు రెయిల్వే ఫెయిరును నాయెదుట యుంపించి మహారాజుగారు నాతో "మిష్టర్ నారాయణదాస్, నీకు ఫస్టుక్లాసు బహుమతి యిచ్చితిని" అనియె.

పదివేలిచ్చునో యైదువేలిచ్చునో యని యాసించినాము కాని స్వల్పమే యని దర్బారునుండి బసకువచ్చుచు దివానుతో నే ప్రసంగింపగా "అయ్యా! మహారాజుకన్న మనమే భాగ్యవంతులము. మహారాజుగారి కెత్తుడుబత్తెము రీతి కొన్నిలక్షలు మాత్రమే యిచ్చెదరు. వారిఖర్చుకే చాలవు" అనియె. బసలో నే నాశ్చర్యపడి వీరితండ్రిగారు విద్వాంసులకు గనకాభిషేకము సేసిరట. యింతకును దత్తులకన్న నింటబుట్టినవారికి ద్యాగము స్వభావముగా నుండును. మరియు కోర్టుఆఫ్ వార్డ్సుచేతక్రింద తీరుటాయైనవారలకు ఔదార్యము దూరము. శిబి. కర్ణుడు నొడలుకోసి యిచ్చిరనియు బలియాచకునకు దనసర్వరాజ్యమిచ్చెననియు నిట్లు దానవీరత్వమును బోధించుట యురోపియనులకు దెలియదు. తమ క్రింద నున్న మైనరురాజులకు దిక్కుమాలినతీరుటా చేసి రాజ్య మప్పగించెదరు. అట్టి రాజులు దొరలవలె వ్యవహరింపగోరి హిందూఆచారములకు దూరమై యురోపియన్సొసైటీ కంగీకరింపబడక యుభయభ్రష్టులై మూఢువంతులు గుణహీనులయ్యెదరు. శౌర్యసాహ సాద్యుత్తమ క్షేత్రగుణములు వృద్ధికానీక వర్తకులరీతిని ఆదాయవ్యయ లెక్కలను, కొన్నిదిక్కుమాలిన యాటలను రాచబిడ్డలకు కోర్టు ఆఫ్ వార్డ్సువారు మప్పెదరు. కాన మెజార్టి వచ్చిన తరువాత నట్టి జమీందారు తమహిందువులతో దిరుగుట కిచ్చగించరు. యురోపియనులు తమలో జేరనీయరు. మనమతమందు నమ్మకముండదు. తుదకెందుకును బనికిరాక మూఢువంతులు లబ్ధు లయ్యెదరు. తక్కినవారు చెడుకొట్లయ్యెదరు. కోర్టుఆఫ్ వార్డ్సునుండి విడుదలకాబడిన వారన్నితెల్వితేటలతో బేరు తెచ్చుకొన్నవారు మిక్కిలి యరుదు.

### మహారాజావారి సెలవు గైకొనుట

మరునాడు మహారాజుగారి సెలవుకై కొంటకు కోట కేగినారము. మహారాజుగారు నాతో "రేపు కలకత్తా కేగుచున్నాము, నీవు రాగలవా!" యనిరి. అందుకు నే "నింటికి వెళ్ళి సెలవైనచో గలకత్తాకు హాజర య్యెద" నంటిని. పిదప నే దిరిగివచ్చినతోడనే విన్న బిలిపించెద నిట కట్టబడుచున్న యంబావిలాసములో నీహరికథ జరిగినయెడ నీశారీరము చిత్రముగా బ్రతిధ్వని చేయును" అనియె. "మరియు మైసూరుమీదనొక చిన్నశ్లోకముచెప్పు" అనగా

శ్లో॥ వార్తాకో నాగవల్లీ చ
వనభోజన వైభవః
స్త్రీపాఠశాలా గోజాతి ర్మైశ
సూరీవ న్న కుత్రచిత్॥

అని చెప్పినాడ. నిజమే జంకనుబిడ్డ చేతబుస్తకములతో పన్నెం డేండ్లకుబైగా ముప్పదేండ్లవరకు వయసుగలస్త్రీలు పాఠశాలకు బోవు చుంట యచ్చెరువయ్యెను. మహారాజుగారు స్త్రీపాఠశాలలు స్వయముగ విచ్చేసి సూపరువైజు చేయుచుందురుగనుక తరుణులు మిక్కిలిసొగసుగ సింగారించుకొని పాఠశాలను గావలసినవిద్దెలన్నియు నేర్చుకొని "రాయ ల్రాజం" టందుకొనెదరట॥

మైసూరునుండి రాతిరి ట్రెయినెక్కి బెంగుళూరికి వచ్చి యట యిరువది దినములవరకుండి రెండుకథలు చేసి మెడ్రాసునకు వచ్చినాము. ఇంగ్లిషుగవర్నమెంటుకన్న మైసూరుగవర్నమెంటులోని జనులు భాగ్య వంతులు వివేకులనుటకు సందేహము లేదు.

### మద్రాసులో నిండియన్ నేషనల్ కాంగ్రెసు

మెడ్రాసులో నపుడు కాంగ్రెసు జరుగుచుండెను. కాంగ్రెస్సనగా నొకచోట విస్తీర్ణముగా నొకపందిరి వేసిరి. అందు వేలకొలది కుర్చీలు

న్నవి. అందుపై జనులు పదిరూపాయిల టిక్కెట్టుకొని క్రిక్కిరిసి కూర్చుండిరి. నాటకములోని పాత్రలవలె కొందరభినయించుచు నుపన్యాసము లిచ్చుచుండ మధ్యమధ్య కెవ్వున కేకలువేయుచు జప్పటలు చరచుచుండ వారినివీరు వీరినివారు క్రొత్తమొగములచూచుచు నింగ్లీషున మాట్లాడుకొనుచు వింతయుత్సాహముతో ప్రజాక్షేమముకొరకు యత్నించుచుంటయు. ప్రజాక్షేమము మాటకేమిగాని అంగరఖాలకు బదులు గోట్లు పాగాలకుమారు టోపీలు, చెప్పులకు బదులు బూట్లు, చుట్టలకుబదులు సిగరెట్లు, యీతనీళ్ళకు బదులు సీసాద్రావకములు, సంస్కృతపాఠశాలలకు బదులు ఇంగ్లిషుపాఠశాలలు. చలివేంద్రాలకుమారు రిఫ్రెష్మెంటురూములు కదిబంతికిబదులు క్రికెట్, తీర్థయాత్రలకుమారు కాంగ్రెస్సులు పుట్టినవి. కాంగ్రెస్సులో మనము పెట్టుకున్న మొఱ్ఱ ఇంగ్లీషు చెవులకెక్కి మనకు లాభము కలుగునట.

కాంగ్రెస్సయిన పిదప సోషల్కాన్ఫరెన్సు వెలసెను. ఆడపిల్లలకు పదేండ్లపై బెండ్లిచేయుట, బ్రాహ్మణులలో నన్నిశాఖలు సంబంధబాంధవ్యములు చేసికొంట, వృద్ధపురుషులు వివాహమాడకుంట, స్త్రీపునర్వివాహములు సేయుట. స్త్రీలకు జదువువ్రాతలు నేర్పుట. సముద్రయానమంగీకరించుట, యూరపువెళ్ళినవారిని దిరిగి కలుపుగొంట, యీ మొదలగు నేర్పాట్లు సోషల్కాన్ఫరెన్సులో జరుగును.

స్వతంత్రరాజ్యము కానిదేశము నిత్తీరుగా బాగుసేయబూనుట శవము నలంకరించుటకదా ! స్వతంత్రముగ రాజ్యముసేయుటకు మనమెంతమాత్ర మర్హులముకామని మన మ్యునిసిపాలిటీ తెలివియే మనకు జెప్పుచున్నది. మనము సవారీమోయుటకేగాని యెక్కుటకు దగమది నిశ్చయము. మన సురేంద్రనాథ్ బెనర్జీగారు గావుకేకలు వేసి యింగ్లిషు మాట్లాడుట, మనగోఖలేగారింగ్లండు చేరి తద్దినములు జరిపించుటకు మనము పొంగుటయే కాని పులి దాసరికి పెట్ట దనునట్లు మనలను దయతో

సమానముగ నెన్నడు ఇంగ్లీషువారు చూడ నొల్లరు. స్వరాజ్యమబ్బిన గాని మనకు పౌరుషజ్ఞానకీర్తులు కలుగనేరవు, శిరస్సులేని మొండెము నభ్యంగనమొనర్చినట్లు స్వాతంత్ర్యములేని దేశమున సోషల్‌కాన్ఫరెన్సేల ! ఈకాంగ్రెస్సు లీకాన్ఫరెన్సులును మనలో మనము డాబులు చేసి టప్పాలుకొట్టికొనుటకు దప్ప మరేమియు బ్రయోజనము లేదు. ఇవన్నియు నాటకములు. ఫార్సులుబోలి దుష్టకాలక్షేపమునకు వృథావ్యయమునకు విపరీతబుద్ధులచే గల్పింపబడి యవివేకులచే బోషింపబడుచున్నవి. వ్యవసాయ మభివృద్ధిచేసికొని పంటలుపండించుకొనుచుంటయు, వర్తక మభివృద్ధి చేసుకొనుటయు నీరెండుమార్గములే మనదేశమునకు దగిన పనులు.

కలకత్తాలో మైసూర్మహారాజుగారు కాలముచేసినారని విని యంత యాకస్మికముగా గొప్పప్రాపకము చెడిపోయినందుకు గొంతవిచార మయ్యెను.

విక్టోరియారాణీ వర్ధంతి

విక్టోరియామహారాణీ పుట్టినదినము వచ్చెను. బ్లాకుటౌనులో నెచ్చటనో సభజరిగె నందులో నీపద్యము చదివినాడ.

సీ॥ ఏయమ్మ పాలింప నెల్లహిందువులకు
నిర్భయ భో॰జన నిద్ర లొదవు
నేరాణి శాసింప దూరదేశంబులు
చేరువు లయ్యె సంచారములకు
నేదేవి యాజ్ఞచే నేర్లు కట్టువడి కో
రినతావులందు జీవనము లొసగు
నేచక్రవర్తిని యేలగ నారోగ్య
విద్యాధనంబు లభివృద్ధిచెందె

ఆట్టి విక్టోరియాంబ యాస్యశశిబింబ
వితత సింహాసన ప్రదీపిత వితంబ
కోవిదజనావలంబ సద్గుణకదంబ
నేడుపుట్టినదినమట నేస్తులార

చెన్నపట్టణమునుండి బళ్ళారి కేగినారము, ప్రాతఃకాల మెనిమిది గంటల వేళయినది, చిన్నచిన్కు పడుచున్నది, ఊరను గృతపరిచయు లెవ్వరును లేరు, హోటేలు సమీపమున నొక తురకవాని యింటి పంచలో దినమునకు నాలుగణాలచొప్పున నద్దెకు మాట్లాడుకొని బసచేసినాము. ఆయూరిప్లీడర్లలో ముఖ్యునకు మేము మెద్రాసునుండి తెచ్చిన సిఫార్సు చూపించినాము. అతడు షుమారు రెండులక్షలరూపాయిలు సంపాదించెనట. గవర్నమెంటుప్రోసెక్యూటరు, శ్రీవైష్ణవు డతని కొక్కకొమార్తె. సిఫార్సుచూచి "సరియే రెండు మూడురోజులలో నొకహరికధ చేయించెదను" అనియె.

## హోటేలుకీపరుతో జట్టీ

మేము భోజనము సేయుచున్న హోటేలులో పలుతెరంగుల గవర్నమెంటునౌఖర్లు బ్రాహ్మణులుకూడ దినుచుండిరి. హోటేలుకీపరొక సిసీదాని నుంచుకొనె నదియుగూడ నాహోటేలులోనే యొకపంచ నుండెను, మడిమైల లన కందరును గలిసి పంక్తిభేదముగా నానాజాతులు భోజనము సేయుచుండిరి, దృష్టిదోష మచట లేదు, తనయుంపుడుకత్తె న్మాటిమాటి కంటుచు సల్లాపములు సేయు నాబట్టలతోనే మాకు వడ్డించుచుంటకు నాకు మిక్కిలి యసహ్యమయ్యెను, పైకి వెళ్ళి వచ్చిన పంచలు విడువక జుబ్బా లెగదోసి కొనుచు బరిషించకముందే విస్తరంటల విడిన కూరలు మచ్చు దినుచున్న బ్రాహ్మణుల కెగ సక్కెముగ గాల్పెతులు గడుగుకొనక పరిషించుటమాని నే భోజనము సేయదొడగినాడ. అదిచూచి వారిలోవారు గుసగుసలాడుకొనుచుండిరి. మరునాడు తురక

ర్మము సేయించుకొనియు గాల్సేతులైన గడుగక భోజనము సేయుచుంటిని. అంతలో వారలు నన్ను గని యితడు బ్రాహ్మణుడైనచో నిట్లు సేయునా యని నాతో "మీరేవర్ణమువారు" అని యడిగిరి. బ్రాహ్మణుడ నంటిని. "మీరు బ్రాహ్మణులైనచో నిట్లు విరుద్ధాచారముగా మంగలివాని నంటుకొని యాబట్టలతో గాల్సేతులైన గడుగక పరిషించ కెట్లు భోజనము సేయగలరు ?" అనిరి, "కుసినీదాని నంటుకొనుచు వడ్డించిన వానిపాటి మడి లేదా నాకు" అని యనగా వారు కోపించి."నేటినుండియు నీకిచ్చో భోజన మిడకుండ జేసెదము. నీవు నిశ్చయముగ నబ్రాహ్మణుడవు" అనిరి, అందుకు నవ్వి సరియే స్ఫుటముగా సంధ్యావందనము మనలో జెప్పగలవాడు బ్రాహ్మణుడని నిశ్చయింతము. మీలో నొకరైన సంధ్యావందనము వచ్చినవారు కలరేని జెప్పినచో మీరు బ్రాహ్మణమాత్రులని యొప్పుకొనెదను. రూపాయి పందెమిదే మీరొకరైన సంధ్యావందనము చెప్పి ఈరూపాయి పుచ్చుకొనుడు. పిదప నన్నబ్రాహ్మణుడని నిందింపవచ్చును. గొంగళిలో దినుచు వెండ్రుకలు లెక్కించునట్లున్నది, మీసంగతి" యని యంటిని. ఒకరైనసంధ్యావందనము వచ్చినయెడల నారూపాయి పుచ్చుకొనకుందురా ! పిదప నీర్ష్యతో వారు నాకట భోజనమునకు వీలులేదని హూటేలుకీపరుచే జెప్పించిరి.

ఇట్లు కోరి జట్టీతెచ్చుకొంటిని, పేరన్న నన్ను దిట్టుట నేనవ్వుట. హొటేలువానివలన నీవర్తమాన మెరుగుటచే మరేహొటేలులోను మాకు భోజనము పెట్ట మనిరి. తుదకొక వైశ్యుని బ్రతిమాలి యతనియింట బసచేసికొని రెండురోజులవరకు స్వహస్తపాకము చేసుకొంటిమి.

## బళ్లారిలో నా హరికథలు

ఒకకోవెలలో మాకు ఖరారుచేసిన ప్లీడరు హరికథ పెట్టించెను. నాటికథలో విశేషముగా బూటకూళ్లతిండివిశేషములు, దాక్షిణాత్యులమడి సంధ్యావందనమైన తెలియని యిప్పటిబ్రాహ్మణుల యాచారములును,

హూణభాషనభ్యసించి శ్వవృత్తిచే జీవించుచు బ్రాహ్మణులమని డాబులు గొట్టుచు బిలక లుంచుకొనుట మీసములు గొరిగించుకొనుట చుట్టబట్ట కుంట మాత్రముచే దమయాధిక్యమును దెల్పుకొను వారల దంభవర్తన ములు కొంత యణగడించినాడ. సుస్వర్ణోచ్చారణముగ నే జదువు శ్రుతు లనుబట్టియు, సంస్కృత శ్లోకములు చదివి యన్వయించుటచేతను బ్రాహ్మ ణుడనని నన్ను రూఢిగ నచటివిద్వాంసులు గ్రహించి నావిద్యావిశేషములు గణుతించి నాకు నమస్కరింప దొడగిరి. మరునాటినుండియు గృహస్థులు నన్ను భోజనమునకై ప్రార్థన పూర్వకముగ బిల్వ సాగిరి. నే మొదట భోజనముచేసిన హోటేలులో దినుచున్న బ్రాహ్మణులు నన్గని సిగ్గు పొంద జొచ్చిరి.

బళ్ళారిలో నొకనాటక సమాజ మున్నది. దానియధ్యక్షు డొకశ్రీ వైష్ణవు డతడచట జిల్లాకోర్టుప్లీడరు, సరసముగా గవిత్వము చెప్పగలడు, పెక్కునాటకముల రచించెను. (ధర్మవరపు కృష్ణమాచార్యులు) అతడు నన్ను మిక్కిలియాదరించి తనయింట బసయిచ్చి వంటబ్రాహ్మణుని గుదిర్చి సమస్త భోజనసదుపాయములు చేయించుచు దనసంతకముతో నోటీసచ్చువేయించి పురమున బ్రకటింపించి మాచే రెండుకథలు నాటకశా లలో టిక్కట్టుసిస్టముపై చేయించెను. ఖర్చులుపోగా కథయొక్కింటికి నూటయేబది రూపాయిల చొప్పున దొరికెను. అర్ధ, పావలా. బేడచొప్పున రేట్లేర్పర్చినను సొమ్మధికముగా దొరుకుటకుహేతువు బళ్లారి మిక్కిలి భాగ్యవంతమైనది. మరియు రసజ్ఞులు పలువు రచట గలరు.

బళ్లారి సొగసైన చిన్నపట్టణము, నీటివసతి మిక్కిలి తక్కువ. కాని సంగీతసాహిత్య రసజ్ఞత త్యాగభోగము లాపురిస్వభావములు, దిగుడు బావులనుండి మోపెడేసి తడిబట్టలతో బస్తీయెడ్లవలె స్త్రీ లెక్కివచ్చుచుంట యాశ్చర్యకరము. ఒక్కొకతె శరీరమున మణుగులకొలది బంగారము కాన్పించును. శైవ మచట మెండు. సాధారణముగ దెనుగు, మహా రాష్ట్రము, కన్నడము వచ్చియుంటచే జనులు మిక్కిలి తెల్వితేటలు గల

వారు, తలను బువ్వులు, బుగ్గను తమ్మలము, దేహమునిండ వస్త్రాచ్ఛాదము లేనియాడుదే కనబడలేదు. మెద్రాసుప్రెసిడెన్సీలో బళ్లారి యన్ని విధములను గిరీటమువంటిది.

## బళ్లారినుండి గుంటూరుకు వచ్చుట

బళ్లారినుండి గుంటకల్లుమీదుగా వచ్చుచుంటిమి. నంద్యాలుచెంత రెయిలు రోడ్డు రెండుమైళ్ల మేర చెడిపోయెను. గనుక నడువవలసి వచ్చెను. మాయొద్ద బెంగుళూరుమునసబుగా రిచ్చిన దొకటి యదివరకు మేము కొన్నదొకటి రెండుతంబురా లున్నవి. మైసూరు మహారాజుగారు బహుమతియిచ్చినదొకటి యదివరకు మేము కొన్నదొకటి రెండు వీణ లున్నవి. సామగ్రితో నిండిన రెండు పెద్దరెయిలు సంచు లున్నవి. యొక కావడిపెట్టె యున్నది. మే మిర్వు రన్నదమ్ములము కూలివాడుగాని బండిగాని యిచట దొరకకుంటచే చెరిసగముగ బరువంతయు మోసికొని రెండుమైళ్లు నడిచి ట్రెయి నెక్కవలసి వచ్చెను. పేరన్న కర్రి. నేబల్ల. కర్రిచురుకు పల్లకు మోటబలమును స్వభావము లెనుబోతులలోగూడ తెలవారినతోనె గుంటూరులో దిగినాము. బందరులో నామిత్రుడై గుంటూరులో "నింజనియరాఫీసులో" నిరువదైదు రూపాయిల జీతముపైనున్న చీరాల జన్మభూమిగల వెలనాటినియోగి బ్రాహ్మణుడు మమ్ముల మిక్కిలి యాదరించెను. అచట నొకహరికథ చేసినాము. భోగమువాడొకడు మిక్కిలి నొగసుగ ఫిదేలు వాయించెను

## అమలాపురములో హరికథ

గుంటూరులో వాయించిన భోగముఫిడెలరును వెంట నుంచుకొని యదివరకు రెండునెలల క్రిందటినుండియు అమలాపురములో దాజేయు పెండ్లికి మమ్ములరమ్మని యెన్నోయుత్తరములు టెళిగ్రాములు వేయుచున్న మునసబుగారిసన్నిధి కేగినారము. అతడు చోడవరములో మిక్కిలిగా మమ్మాదరించుటచేత నతనియెడ విశ్వాసము మాకింటిపై ప్రేమ

కన్న యధిక మయ్యెను. అమలాపురములో నొకకథ చేసినాము, మా వెంటవచ్చిన ఫిడెలరుకు మాత్రము యిరువది రూప్యములు మునసబుగారి చేత నిప్పించినారము. ఆరునెలలకు జేయవలసినపనికై యిప్పటినుండియు యత్నించుట యీమునసబుగారి స్వభావము, అతడొనర్చిన పెండ్లిలోని భోజనవైభవము వేయినోళ్ల బొగడవలయును, నక్కదోసకాయయూర గాయరుచి యెంతని వర్ణింపగలను! మావెంటవచ్చిన ఫిడెలరుచేతికున్న నాదము, రాగమువాయించుటలో వానికున్న మెలపు సాధారణముగ మరెవని యొద్ద గనబడలేదు.

### తిరిగి విజయనగరము చేరుకొనుట

రెండునెలలకుపైగా విదేశములోనుండి యిల్లు జేరుకొన్నాము. మైసూరుమహారాజుగారు నా హరికథలు చిత్తగించి నాకు ఫస్టుక్లాసు ప్రజంట్సిచ్చినట్టు మెయిల్ హిందూ పేపర్లలో వేయుటచే మెద్రాసు ప్రసిడెన్సీ లోని ముఖ్యపట్టణములలో నా పేరు ప్రసిద్ధి చెందెను. ఒకనాడు మాయూరి కోటచెంగటనుండి నేబోవుచు గోటలోనుండి వచ్చుచున్న యిర్వురవైణికులను జూచి యందులో నాచే నదివరకు లయజ్ఞానమున నధిక్షేపింపబడిన ముదుసలివైణికునకు, నాకు మైసూరు మహారాజుగారు దయచేసిన బహుమతులగన్పర్చి యతని మరింత యుడికించుటకై "చూచితివా ముదుసలి దాసివలె నిచటిరాజును గవిపెట్టుకొని నాపేరైన నతనితో జెప్పవైతివి. చూడుమిట్లు మైసూరు మహారాజావారిచే ఫస్టుక్లాసు ప్రెజెంట్లు పొంద నీ తరమా!" యంటినందుకతడు నవ్వి సరేసరేయని తలయూచి పోయెను. కోడెతనపుపొగరున నేనట్లనుట తప్పేకాని యీమాటకతడు లోన నాపై గావేషీవహించుట మరింత ఘోరము. మైసూరునుండి నేవచ్చినవెంటనే మూడునెలల జీతమందుకొని యొకవెండి గిన్నె చేయించుకొంటిని.

### నానియమములు

సొగసైన తలకట్టుటచే బాగా పెట్టుకొనుట కిష్టపడువాడనుగాను.

పెన్నురము, సన్ననడుము నుంటచే ఖబ్బామాత్రమే తొడుగువాడను. ఉదయము తొమ్మిదిగంటలకు దరువాణీయన్నము తిని బట్టలుకట్టుకొని చుట్టనోటనిడి యథేచ్ఛగా నూరదిరిగితిరిగి యొంటిగంటలోపున నింటికి వచ్చి భోజన మాచరించి వెంటనే నిద్దురవోయి యైదుగంటలకు మేల్కొని బెద్దగురునిగాని చిన్నగురునిగాని సేవించి చిన్నగురుని గుండతో నిండిన చుట్టలు గాల్చుచు నెవ్వరిని జీరికిగొనక నిర్లక్ష్యముగా యథేష్టముగ సంచరించి రాత్రి పదిగంటలలోపున భోజనమాచరించి మూడునాలుగుగంటలవర కింటిలో నెద్దియో పాడుచుంటగాని వ్రాయుచుంటగాని నాదినచర్యలు. నిడుగొండవరహాలు, బొడ్డువెంకటేశము, మొదలగు సవయులతోగూడి తరచుగ సాయంకాలముల దిరుగుచుండును. ఆదాయమున మూడువంతులు వ్యయపర్చువాడను. అప్పుడపుడు గురునకై తప్ప మరెట్టి దుర్మార్గపు ఖర్చు చేసి యెరుగను. స్త్రీవ్యసనముక్రింద నెన్నడు నొకదమ్మిడీయైన వ్యయపర్చలేదు. దైవకృపవలననిరువదేండ్లవయసునుండియు బైయాటలు కట్టిపోయెను. పరస్త్రీని మాతృవత్తుగ జూచుటయు ఆటపాటలవలనదప్ప నింకొక విధముగా నొకదమ్మిడీయయిన సంపాదింపకుంటయు, మనుష్యులకు నేజేయుహరికథలు కృతియివ్వకుంటయు. ప్రమాణపూర్వకముగ నబద్ధమాడకుంటయు, జీవహింస చేయకుంటయు, నానియమములు. పరమేశ్వరుడు నిరాటంకముగ నావ్రతములను గొనసాగించుచుండెను. నా మతము.

చం ॥ కలయందెత్తెడు మేను దోచెడి జగత్కార్యంబులుం జిత్తసం
 చలత న్వాస్తవ మందుపోల్కగనుడీ సర్వప్రపంచంబు న
 జ్ఞులకు న్నిక్కముగాగనంబడును ప్రాజ్ఞు లూర్ణభావంబు ని
 శ్చలమౌట న్దమకన్న వేఱు గన రీశత్వంబు ప్రాపించుచున్.

అనియు ననగా మనఃకల్పిత మీదృశ్యమంతయుగాని వాస్తవము కాదని ప్రస్థానత్రయము మొదలగు వేదాంతగ్రంధములు జూచుటచే

దృఢవిశ్వాసము కలిగెను, గాని రూపమున కెల్కగాని చేయునవి పంది కొక్కుచేష్ట లన్నట్లు విశ్వాసమునకు దగు వైరాగ్యముమాత్ర మబ్బలేదు. తత్వజ్ఞానమేమాత్రమును లేదు.

### విజయనగరము మహారాజావారివద్ద నాప్రస్తావన

తొమ్మిదేండ్ల వరకు ఖైదులోనుండి వచ్చిన యొకవెలనాటినియోగి (లింగం లక్ష్మీజీ పంతులు) విశాఖపట్టణమున నాకథలువిని నాయందు దయ కలవాడగుటచే దనకు మహారాజుగారికి గురుశిష్యసంబంధముచే మహారాజా వారితో నన్నుగూర్చి సిఫార్సు చేసెను. మహారాజావారు నన్నుజూడగోరిరి. ఒకనాడు దివాన్సాహేబుగారి యల్లుని యింట నాచురంగుజరుగుచుండగా నాయందు గావేషిగల దర్బారువైణికుడు నన్నుజూచి "యోయీ; నిన్నటి రాత్రి మహాప్రభువు వారియొద్ద నీప్రస్తావనము వచ్చెను. హరికథకొంచెము తెల్వితేటలుగాచెప్పగలవని నిన్నుగూర్చి మహారాజుగారితో మనవిచేసినాను" అనియె నందుకు "సరియేబాగున్నది" అంటిని. అందుపైనతడు" నీయోగ్య తకొలది చెప్పినాను. ఫలానాయతనికంటె నెక్కువుగ గవిత చెప్పగలవని యనమన్నావా లేక ఫలనావానికంటె నెక్కువుగ వీణవాయించగలవని సిఫార్సు చేయమన్నావా"యని యీాసడింపుగా బల్కె నందుపై జిరువ వ్వుతో "అయ్యా! ఫలానాయతనికన్న సొగసుగ గవిత్వము చెప్పగలన నియు ఫలానావానికన్న నెక్కువుగ వీణ వాయించగలననియు నేల మన్వి సేయలేదు"అంటి నందుకు తలపంకించి యత డూరకొనెను,

### మహారాజావారిని దర్శించుట

మరునాడు మహారాజుగారి సెలవైనదని కోటనుండి నాకు వర్త వర్తమానము వచ్చెను. నేనుచితముగా డ్రస్సువేసికొని చేత నొక కొబ్బ రికాయ పట్టుకొని మహారాజుసముఖమున కేగినాడ. ప్రత్యుత్థాన పురస్స రముగ నన్నాదరించుట కిచ్చగింపక తా ముందుగా గూర్చుని పిదప నన్ను గూర్చొనమనుట కిష్టములేక సముచితజ్ఞులయిన ప్రభువువారు నే

సభకు వెళ్ళినతోనే తాము సభకు దయచేసి నన్ను గూర్చుండుమని యభి మంత్రణ మొనర్చి తాముపవిష్టులైరి. పిదప ప్రభువువారికి నారికేళఫల మును సమర్పించి

గీ॥ ఆశ్రితులపాల దాక్ష్య మరులయొద్ద
శౌర్యముం గోవిదులచెంత సాత్వికతయు
నెసగు నేలినవారి కభీష్టజయము
లిచ్చుగావుత సంతత మీశ్వరుండు॥

అని యాశీర్వదించి కూర్చుంటిని. పిమ్మట మహారాజావారు నాతో నింగ్లీషున అయ్యా! మిమ్ముగూర్చి "మెడ్రాస్ మెయిల్" నందలి యార్టికిల్చూచి చాలా సంతోషించినాను" అని సెలవిచ్చిరి. పిదప నెద్దియైన నొకపద్యము నా కవిత్వము మచ్చుచూపించుటకై నాకు సిఫార్సు చేసిన పంతులు చదువమనియె. అపుడు విక్టోరియా రాజ్ఞిపై నే జెప్పిన పద్యమును చదివినాడను. ప్రభువువారు మిక్కిలి సంతోషించి యాపద్యము రెండుమార్లు తిరిగి చదివించి సభికులతో "నాహా! వీరి కవిత్వ మెంత మధురముగా నున్నది? విన్నందుకు గన్నందు కొకలాగున్నది. రాగజ్ఞాన మకూడ శ్లాఘనీయముగ నున్నది" అని సెలవిచ్చిరి. పిదప నే సంతోష ముతో వారిపై జెప్పిన శుద్ధసావేరీవర్ణమును బాడినాడ నదివిని "యింత ప్రశస్తమైన సంగీతజ్ఞానముగూడ వీరికున్నదని యిదివరకు నాకెవ్వడును జెప్పలేదు? సంగీత సాహిత్యప్రజ్ఞలు నిరుపమానముగ నున్నవి. కనుకనే యింత ప్రసిద్ధి వచ్చెను" అని ప్రభువువారు సంతోషించి నాతో "మీ జన్మ భూమి యెద్ది? మీ రెచ్చట విద్య నభ్యసించినారు?" అని యింగ్లీషున సెలవిచ్చిరి. అందుకు "మహాప్రభూ! యేలినవారి తాలూకాలో జేరిన యజ్జాడ నా జన్మస్థానము, మరియు నేలినవారి కాలేజీలో జదువుకొంటిని" అంటిని. "అందుకు నాకు గర్వముగ నున్నది" మహారాజావా రుపొంగు టకు నా కెంతయో హర్షమయ్యెను. పిదప వారిపై నే రచించిన భైరవి,

ధన్యాసి స్వరజతులను బాడి నాటకురంజిస్వరజతి పాడుచుండగా గొంతవ
రకు విని సభనుండి లేచిపోయి తిరిగి పెద్దగురుకటాక్షమున జోగుచు వచ్చి
నా చెంత గూర్చుని "యాగుమాగుము" అని గద్దించుచు నాపై గావేషి
వహించిన ముసలివైణికుడు కోపముతో నన్ను జూచి "నిన్న నేమంటివి?
నీతో సమానముగ గవితచెప్పగలవారుగాని వీణవాయించువారు గాని
యిచ్చటలేరంటివి కావా? యనె నతనికి బ్రత్యుత్తరమిచ్చుట కిచ్చగింపక
నే నూరకుంటిని, అంతబోక యావైణికశిరోమణి కనుల నిప్పులు
రాల్చుచు "నీ వట్లనలేదని యీ వీణపట్టుకొని ప్రమాణము సేయుము."
అని చెంగటనున్న ప్రభువువారివీణ నాయొద్దకు ద్రోసెను. అంత ప్రభువు
వా రతనితో "ప్రమాణము చేయవలయునాయేమి? అట్లనియుండవచ్చు
నెవరిప్రజ్ఞవారిది. రామాయణములో బిడకలవేట్లాటవలె మధ్య నీపోట్లాట
యెందుకు? అబద్ధమాడుట కిష్టములేకత దూరకొన్నాడు" అని నావైపు
జూచి -

కం॥ కులశైలంబులు దలకిన
జలధులు నింకినను సూర్యచంద్రుల సన్మం
డలములు నేలం దొరగిన
పలుకడబద్ధంబు సత్యవాదిగుణనిధీ"

యని చదివి "నే రచించినాడ దీనిని" అని సెలవీయగా వెంటనే
యాపద్యమునే జదివి "సొగసుగ నున్నది పద్యము" అంటిని, నాయేక
సంధాగ్రాహిత్వమునకు మహారాజుగారు మిక్కిలి సంతోషించి "యిట్లొక
సారి విని పద్యము తిరిగిచదువుట మిక్కిలి దుర్ఘటము" అని శ్లాఘింప
మరింతయుడికి యావైణికసార్వభౌముడు "మహాప్రభూ! వీడుమిక్కిలి
పొగరుబోతు. వీడు మిక్కిలి పొగరుబోతు. వీనికి బుద్ధిచెప్పవలయును.
రావణాసురునివలె మా బోంట్ల వీడు బాధించుచున్నాడు" అని నా వైపు
దిరిగి "యోరీ! బేవకూఫ్ చూడు విన్నేమిచేసెదనో" యనియె. నందు
కసహ్యముతో నప్పండితోత్తమునకు మారుబల్క నుద్యుక్తుడనగు నన్ను

నా ప్రక్కనే కూర్చున్న కాలేజీప్రొఫెసరు వంగమాధవరావునాయిడుగారు నాకు సిఫార్సుచేసిన పంతులు తమహస్తాగ్రంబుల జాటుగా నావీపు స్పృశించుచు "నుపేక్షింపుము మారుపల్కవద్దు" అని సంజ్ఞచేయుచుండిరి. నాడు రాజసభలో దర్బారుపండితులు కోటయిలాకా గొప్పయుద్యోగులెల్ల యుండిరి. నే నెట్లు మహారాజసమక్షమున బాడెదనో యని పలువురు గుమిగూడి సభచాటున నుండిరి. పిదప ప్రభువువారు నా ప్రతికక్షిని జూచి "యోయీ! చాలు నూరకొమ్ము, రసముగాబాడుచుండగా నీయల్లరి యెందు కతడు స్వతంత్రుడు, మైసూరు మహారాజుగారిచే ప్రశంసలు పొంది దేశములు దోచి జీవించుచున్న యతనికి మనబోంట్లు లక్ష్యమా" యనియె. పిదప పెద్దగురునివశమున నేడ్చుచు నావైణికోత్తముడు "సరియా, మహాప్రభూ, మీరిట్లు వీనితరపున మాట్లాడినచో వీనికి మరింత గర్వము హెచ్చును. వీడు చోడవరములో నా బంధుమండలిచెంత నా కవిత్వమును దూషించినాడు. పై నెక్కడనైన సభలలో మేము పనిచేయుచున్నపు డడ్డపడి శృంగభంగముగా మాట్లాడుచుండును. ఏలినవారి సమక్షమున వీడైన నుండవలయును. నేనైన నుండవలయును గాని యుభయులమింటయిక మీద జతపడదు" అనియె. అవుడు నే నా వైణికునితో "అయ్యా! మీరు తండ్రివంటివారు. సర్వజ్ఞులగు ప్రభువులయెదుట నెద్దియో లేనిపోని క్రోధము వహించుకొని యిట్లాడుట ధర్మముకాదు. అంటిని. పిదప మహారాజుగారు సభ చాలించిరి. ఎవరిమట్టుకు వారిండ్లకేగినారము.

## దర్బారులో విద్వాంసులు ప్రభువు వారితో నాపై మన్వి సేయుట

కోటలోని సంగీతజ్ఞులందరు గట్టుకట్టి నాకేమియు సంగీతజ్ఞానము లేదనియు సాహిత్యజ్ఞులందరు నాకేమియు సాహిత్యజ్ఞానము లేదనియు నదివరకు మహారాజుగారితో జెప్పుచుండిరిగాన దమమాట నిర్వహించుకొనుటకై ఛిద్రములు వెదకి నన్నాదవిపించుటకు నిశ్చయించుకొనిరి. తమ్మనుసరించి తిరిగినచో నడుగువ ద్రొక్కుట, నిర్లక్ష్యముగ నున్నయెడ

విరోధించి యెగ్గుసేయుట, యీ పండిత సమాజముయొక్క నైజమని పోల్చుకొంటిని. ఒకనాడు నాకుసిఫార్సుచేసిన పంతులుపై నొక సీసపద్యము చెప్పినాడను. అతడు మిక్కిలి సంతోషముతో మహారాజుగారి కాపద్యము చూపెను. ఆ పద్యములో దప్పున్నదని పండితులు ప్రభువువారితో మనవి చేసిరి. నాయందు గావేషిగల వైణికుని మొగమాటమున నన్ను బిలిపించుకొంట మానుకొన్న ప్రభువు వా రాపద్యము నావలనవిని నాసాహిత్యము పరీక్షింపగోరి నన్ను బిలిపించిరి.

నేను దర్శనమునకు వెళ్ళినతోనె ప్రభువువా రింగ్లీషున నాతో "అయ్యా ! మీ వంటి గొప్పకవిని నేనిదివరకు జూడలేదు. మీరు తత్వజ్ఞులు. మీ సంగతి కేవలసాహిత్యజ్ఞులుగాని కేవల సంగీతజ్ఞులుగాని ఇంగ్లిషు విద్య తెలియని యుభయజ్ఞులుగాని యెరుగజాలరు. ఈ పండితుల అసూయను మీరు లక్ష్యము సేయవద్దు. ఏదీ పండితులుగారిపై చేసిన పద్యము చదువుడు" అని సెలవిచ్చిరి.

సీ॥ అఖిల లోకవ్యవహార ధర్మంబుల
నడిపింప జాలిన నల్లవేల్పు
జగముపై నొరిగియు జలియింపని ఘనుండు
వానగాలులకు బర్వతము బోలి.

యని చదువుచుండగా "అగుడు త్వార్థకము భిన్నకర్తృకముగా బ్రియోగించినారు కదా యెందుకు లక్ష్య మగపర్చెదరా లేక తప్పని యొప్పుకొనెదరా ?" అని సెలవిచ్చిరి. అందుకు "మహాప్రభూ! త్వార్థకముభిన్నకర్తృకముగానుండుటకు లక్ష్యమగపర్చెద నొకగంటలో మనవి చేసెదను" అంటిని. అక్కరలేదుసావకాశముగామీకులక్ష్యము కన్పర్చవచ్చును. అని నానాంశములపై నే రచించినపద్యములు చిత్తగించుచు నొక వైష్ణవకవిశిరోమణిని జూచి "స్వామీయెట్లున్న దితని కవిత్వము" అనిసెలవివ్వగా నక్కవిసార్వభౌముడు తలయూచి "మహాప్రభూ! ఈతని

తెనుగు కవిత్వము విజయవిలాసకారుని కవిత్వమువలె నిరుపమానముగ నున్నది, సంస్కృతమెట్లుండునో" యనియె అవుడు ప్రభువువారు నాతో "మీరుభయభాషలలో నిరుపమానముగ గవిత చెప్పగలరని బ్రహ్మణ్యులైన రామానుజాచార్యులుగారు చెప్పిరి. ఏదీ మీసంస్కృతపద్య మెద్దియైన జదువుడు"అని సెలవిచ్చిరి. అపుడు

శ్లో॥ న సా జయతు శూన్యవాక్ తవ మమేవ సంతాపయుక్"

అని నేరచించిన శ్రీకృష్ణజననమను సంస్కృతయక్షగానములోని వసుదేవుడు కంసునితో నన్నవాక్యమును జదువుచుండగా 'త వ చ మే చ సంతాపయుక్' అనియన్నచో బాగుండునని వైష్ణవకవీశ్వరుడనగా "స్వామీ యిదివరకు సంగీతమున వైణికశిరోమణిగా రొక చకారము పెట్టిరి. కాని కవిత్వమున దాము రెండు చకారములు పెట్టుట మరింత వింతగా నున్నది. తమ దిద్దుపాటుతెల్వి మిక్కిలిశ్లాఘ్యము" అనగా ప్రభువువారు ప్రక్కలు పట్టుకొని నవ్వుచుండగా కవిస్వామి తెల్లవోయెను.

పిదప ప్రభువువారి సెలవందికొని వైష్ణవకవియు నేనును గలిసి మేడదిగి వచ్చుచుండగా, నే మహారాజుగారి సమక్షమున నుండగా రానుత్సహింపక క్రింద గనిపెట్టుకొన్న వైణికశిరోమణి నన్ను జూచి "యోరి!తమ్ముడా పూర్వము సంగీతసాహిత్యముల ప్రసిద్ధిగాంచిన శిష్టు కృష్ణమూర్తివలె నీవసమానప్రతిభ కలవాడవని నే నెరుగుదును. దండెపట్లు పట్టగలవా?'' యని పెద్దగురునివశమున జోగుచు నన్ను జెయిపట్టుకొని లాగ జొచ్చెను. అతడు మిగులబలాఢ్యుడైనప్పటికి వివశుడై యుంటచే నే మెలపున దప్పించుకొంటిని. పిదప వైష్ణవకవిశిరోమణి నాతో "అయ్యా! మీకవిత్వమువంటి సొగసైనకవిత్వ మిదివరకు నే జూడలేదు"అనియె. అపుడతనితో "అయ్యా! యీమాట మహారాజుగారి యెదుట చెప్పిన నెంతబాగుండును!" అంటిని, అందుకు ''మాకుడ్డీదారుల సంతోషపెట్టుటకై మిమ్ము బాహాటముగా మెచ్చకుంటిని"అనియె నపుడు

నాలో నే "నాహా!యింతటివయోవృద్ధులు. జ్ఞానవృద్ధులుకూడసత్యమాడ నొల్ల కుంటకలిమాహాత్మ్యము కాబోలనుకొంటిని.

మరునాడు మహారాజులుంగారి దర్శనమునకు బోవుట

మరునాటికి మనుచరిత్రములో క్త్వార్థకముభిన్నకర్తృకముగానుంట కుదాహరణము వెదకినాడ. మరియు భారతములోగూడ నొకలక్ష్యము దొరికెను. కోటలో వీణలగదియొద్ద బండితు లుందురు. "నృమాంసంబు కూడై యేనెట్లు భరించువాడ" నని మనుచరిత్రమునందలి యుదాహరణమును, "రాహుకంఠముతెగి దేహము ధరణి బడియె" నని భారతలక్ష్యమును గన్పర్చగా మహారాజుగారు పండితులందరియెదుట "నారాయణదాసుగారి సాహిత్యము ప్రశస్తమైనది" అని ప్రశంసించిరి. పిదప వీణావాద్యమున ద్రుతకాలవిశారదుడును వైణికగురుప్రపౌత్రుడు నగు నొకనాయుడు వైణికునకు నాకు జోడిచేసి మరునాడు వీణవాయింపించెదమని ప్రభువువారు సెలవిచ్చిరి. కాని యావైణికు డెందుచేతనో గాని పదేనుదినములవరకు గోటకు రాలేదు. బహుశా నాతో బల్లవి వాయించుటకు జంకెను గాబోలును. మరియారునెలలవరకు మహారాజుగారి సభకు నేబోవ తటస్థించ లేదు. అంతట నాతోగలహించిన వైణికశిరోమణి కాలధర్మమందెను. మరి నాలుగుదినములపిమ్మట మహారాజుగారు నను బిలిపించి యాశుధారగా "మానవు ప్రేమ లజ్జయును మాటికి బోరగ బ్రీతి మీరెడున్" అనుసమస్యయిచ్చి పూర్తిసేయుమనిరి. వెంటనే

ఉ॥ సానులయొద్ద నివ్వకమునల్పుచు లొంగుచు నుంట కర్థమా
దానము సేయకుంటకు వృథాదినము ల్సరిపుచ్చుకొంటకున్
జ్ఞానియు జాణయైన తననాధుని గన్గొనునప్డు భార్యకు
న్మానము ప్రేమలజ్జయునుమాటికిబోరగబ్రీతిమీరెడున్॥

అనిచదువగా నబ్రమంది నన్ను జూచిరి.

## టౌనుహాలులో మహారాజులుంగారిని దర్శించుట

ఒకనాడు కోటకు బోవుచుంటిని. భాగవరపు సూర్యనారాయణయు కాకినాడపంతులను నింకొకయతడును గలిసి గుఱ్ఱపుబండిపైనుండి కోట పడమటద్వారమార్గమున బోవుచుండగా నెచ్చటికి దయచేయుచున్నా రేమి వింత లని యడిగినాడ. అందుకు నైరుబోవుచున్నామని చెప్పిరి. మహా ప్రభువారు కోటలో లేకుంట తెలిసికొని నేనుగూడ గోటపడమటిద్వార మున బోవుచు టౌనుహాలులో మహారాజుగారి జాయంటుమేనేజరుగారికి "దివాన్‌బహద్దర్" బైటిల్విచ్చినందుకు సభ చేసిరన్నమాట విని యట కేగినాడను. నన్ను గాంచినతోనే నమస్కరించి ప్రభువువారు తమచెంగటి కుర్చీపై కూర్చుండుమని సెలవిచ్చి దొరలను దొరసానులను నాదరించు చుండిరి. అంతట దూరముగనున్న భాగవరపుసూర్యనారాయణ నన్ను సభనుండి లేచిరమ్మని పిలుచుచుండెను. నే వినిపించుకొన కుంటిని. అది విని ప్రభువువారు "ఏమది మిస్టర్ నారాయణదాస్" అని సెలవీయగా "వాడు నన్నురమ్మని తొందర బెట్టుచున్నాడు" అని యంటిని అపుడత నితో "నారాయణదాసుగారితో నేడు నాకు బనియున్నది" అనిరి. పిదప సూర్యనారాయణ కాకినాడ పంతులు మొదలగు కోటయుద్యోగులందరు నిండ్లకు బోయిరి. మహారాజును వారి ప్రైవేట్ సెక్రిటరీయగు నొక యురోపియను మరియిద్దరు ముగ్గురు చిల్లరిగుమాస్తాలును కొందరు ప్యూ న్లును నేను మాత్రమే మిగిలియుంటిమి. రాత్రి యెనిమిది కావచ్చినది. అపుడు ప్రభువు వారెంతో యనుగ్రహ పూర్వకముగా నాచేయి పట్టుకొని ప్రైవేటు సెక్రిటరీతో "మనయందరి కొక్కొకన్నే యున్నది కాని యిత నికి రెండుకన్నులున్నవి. సంగీతసాహిత్యముల నిరుపమాను డీయూర నిత నివలె సొగసుగ గవిత్వము చెప్పగలవారు కాని సంగీతజ్ఞులుకాని లేరు" అని నాతో "ఈ దొరగారు తెనుగులో ప్రొఫెసర్లు" అని నుడివి రందు "కాలాగునా" యని యాశ్చర్యముతో దల యూచితిని.

—o—

# నా మాట

అజ్జాడనాపుట్టు - నట్టుకుప్పమ్మ
నా తలిదండ్రులు - నరసమ్మచేన్లు
ఆది భట్లుంటి పే - రయ్యవార్లేను
పదువుఎకాభర - ద్వాజుఁడె మొదలు
నాల్గేండ్ల యీడున - నాకెల్ల చదువు
లబ్బెఁదమంతనే - నరసిన కొలఁది
నేఁబుట్టులయకాడ - నేమాటకాఁడ
నాటపాటల మేటి - ననిపించుకొంటి
నా కెదుర్లేదిఁకే - నాడులనైన
వేవేల మందికి - వినుచునాగొంతు
గజ్జి విప్పెదరేయి - కడముట్టఁబాడి
యందగాండ్రతలక - ట్టందురు నన్ను
ఎకిమీంద్రకానుక - లేఁ గొన్న వాఁడఁ
దోడాలమైసూరు - దొరనాకువేసె
నాకంకినీడు పెం - దేరమ్మ దొడఁగెఁ
గై కొండు నెలకు రొ - క్కము నూఱువిజయ
నగరేలుగొప్పతే - ండ్ల నెనరువలన
పారపి, వేలుపు - పలుకింగిలీసు
తెలుఁగు వ్రాసిచదువు - తెలివి నాయాస్తి
నాయన్న పేరన్న - నా చిన్ననాటి
నుండియున్గలిసినే - నున్నాడియాడి
యింతదాకనుకట్న - మెలమిఁగొనెదము
పదునాలుగేండ్లపై - బడియింగిలీసు
మొదలిడినే ఎప్పే - ముగియించినాడ

పదునెన్మిదేండ్ల — సర్వము మొదలాట
పాటమాటలఁబట్టి — బ్రతుకుచున్నాఁడ
కన్యాకుమారిక — ల్కత్తావఱకు
నఱవ. కన్నడి, మల — యాళి, బంగాళి.
తెలుఁగుసీమల మెప్పు — తెచ్చికొన్నాడ
ఈవికాంద్రద్దప్ప— నెవ్వరేని
చీరికిన్గానమంచి— చెప్పెడిపట్ల
నాయంతనేర్చితి— న్జదువులనెల్ల
నాయగ్గులో త్తివం— దలుమను చంద్రు
ఇంచుమించిపుడెబ్బ— దేండ్లు నాయీడు
గాని యిప్పటికినేఁ— గట్టెదన్గజ్జె
నలుమాటలల్లువాం— డ్రన్నాటిమీఱ
హరికథామృతముకై — యా ము.తారకము
కలగల్పు తెనుఁగుగా — కాళిదాస్పేక్స్పి
యరుల యందములు ప్రహ్లాద మొదలుగ
బదకొండు హరికతల్ — బాట.సాఱ్యూస్ర్య
పత్య్రవత, ముకుంద — పతకముల్మూడు
సారంగ నాటక — చ్చతెలుఁగుతోడ
నూర్గంటి వేలుపునుడి — పెరుమాళ్ళ
వెయిపేర్ల వినకరి — పెద్దముక్కబడి
విడిసీమతెలుఁగున — వేలుపునంద
గౌరు పెండిలియు మ ర్కయ్క చౌకట్లు
తరుణముకొలఁదినా — డబ్బులెన్నెన్నో
కలిగి నెత్తురు — గంటి యేడాది
తూపు చుక్క నెలయం — దున బూదెరేయి
పదికంగులకునెల — పట్టితోయమున

2

నేచదువులనై – నతెన్నువారి
కన్నఁగన్నికు – లెక్కడనైనలేదు
తనుతాఁ బొగడుకొంట – తన్నుకున్నట్లె
ఊపిరిపైదీసి – యున్నంతవఱకు
నా తలవంపుల – న్జాటుకోలేను
నాతప్పులన్గాచు – నాయిలువేల్ప
మగయాడు పెండ్లిండ్లు – మానుకోవలయు
వేలుపు నుడువుల – న్వీడనాదవలయు
పొత్తుగానెల్లరి – మ్మొగమనవలయు
నాయింపువ్రాతలు – వదలుకోవలయు
మై వంచి యందఱుం – బాటుపడ వలయు
ముది, పిన్న, యువిటులఁ – బ్రోవఁగా వలయు
నాయెపులన్గాచు – నాయిలువేల్ప
మానక పెండ్లిండ్లు – మానుకోవలయు
నంజుడు. త్రాగుడు – న్మానుకోవలయు.
నా మాటలను విని – నన్మేలు గలుగు.

---

అనుబంధము—౧

# పూజా పుష్పములు

[శ్రీదాసుగారి గురించి వివిధ కవులు వ్రాసిన ప్రశంసా పద్యములు పరశ్శతముగా నున్నవి. అందు కొన్ని మచ్చుతునకలను మాత్ర మిందు పొందుపరిచితిమి. సం.]

సీ॥ కమ్మ కల్కండతు - న్కలఁ దెల్గుఁ బల్కుల
నాని కుట్టిన పెద్ద - గోనె సంచి
లలితమైనట్టి యలంకారముల నేతి
దాచిన మేలిదం - తంపు పెట్టె
నవరసమ్ములఁ గూర్చి - నవకమ్ము చెడకుండఁ
బాకమ్ము పట్టెడి - బందడమ్ము
శ్రమపడి భక్తిర - సమ్మెంత బేదినఁ
దఱుగుఁ జూపని యమృ - తంపు బావి

వివిధ భాషా సకల శాస్త్ర - నవరసములు
బాలనించిన బంగారు - పూలసజ్జ
కాదె నీ బొజ్జ యజ్ఞాడ - యాదిభట్టఁ
వంశ పావన శ్రీ శార - దాంశ భవన॥

సీ॥ భవదీయ గేయకా - వ్యాసురాగ ఫలభుక్తి
బ్రతుకు శిష్యుల నమ - స్కృతుల ముంప
వాగ్మయ ద్రవ్య సం - పాదనపరులు, నీ
గ్రంథ విధానము - ల్గవి జెలంగ
బహుకళాన్వితుడు మా - వాడని స్వీయ వం
శోదధి మిన్నంద - నుబ్బిపోవ

నిను యశశ్శాలి పు - త్రుని జూచికొని పొంగు
భారతమాతగ - ర్వంబు పెరుగ

విజయనగర పురాకృత - విపుల పుణ్య
రాశివై యొప్పితివి తెన్గు - దేశమునకు
వర్ణ మునకు స్వశాఖకు - వంశమునకు
వాసి గడియించితివి హరి - దాసమణివి॥

సీ॥ ముసలి జబ్బుల నొప్పి - పొందదా, యెడలేక
జననమస్కృతులందు - కొనెడి వేళఁ
పీకవా కాళ్ళు నీ - ప్రియుల యోగక్షేమ
మారయ యందంద - యాగి నడువ
నిల్చునా యోర్మియం - తే వాసు లెడనెడ
నాగి నిన్నే వేవొ - యడుగునపుడు
చెదరదా బుద్ధియా - సేపుననే సృష్టి
వరిశీలనా క్రియా - పరిచయమున

అయిన నెన్బది రెండు నా - యయిదు వంద
లిండు నా మేను రబ్బరు - బెండు నుండ
టంచు హరిగాన మొనరింతు వౌర ముదిమి
దేనికో చెప్పలేను సు - ధీ వరేణ్య॥

సీ॥ పండితాఖండల - శౌండ మండిత మండ
లాధీశ సభలయం - దలమికొనుచు
పట్టభద్రుల హ స్త - పద్మమ్ములందున
నచ్చు తేనియఁబోలి యానఁబడుచు
దాస వేషమునను - దర పోషణము సేయు
దట్టి దేబల నోళ్ళ - నుట్ట పడుచు

నల యయోధ్య బయళ్ళ - నాడెడి వేఁతల
చిన్నిమోముల నుండి - చిందిపడుచు

దీరుబడి వేళ బొంకుల - దిబ్బమీఁద
గడపు సారధులకుఁ గూడఁ - గమ్మనగుచు
మలయుచున్నది నీదు వాఙ్మయము సుకవి
యరయ కవి జన్మ సార్ధక్య - మదియ కాదె॥

సీ॥ ఆపాటి యీపాటి - యవధాని యధికారి
యగునెనీ బుక్సంగ్రి - హమ్ము కొరుక
వట్టి "ఎమ్ - ఏ" - తలం - బట్టునే నీ నవ
రస తరంగిణి లోని - రస కణంబు
పాణినితో నెంతొ - పాతతికము లేక
తాఁకఁ గలారె నీ - తారక కృతి
పారసీతో నాల్గు - బాసల మున్గి నీ
యుమ్మర్ కయామ్ చేత - నూనవలయు

బ్రహ్మవా! మగరూపునఁ బరగువాని
రాణివా! కానిచో నిట్టి - ప్రతిభ గలుగు
నృహరికై నాల్గు మూలల - నెమకుచుంటి
నేడ నున్నాదొ సత్కవీ - నీవె తెలుపు॥

సీ॥ నవనవమై యొప్పి - నవరసంబుల నూరు
నూయి యదార్థ రా - మాయణంబు
ఒకసారి చదివి బు - ట్టకు చేర్పఁదగినదా
కేవల సుధ జాన - కీశ పథముఁ
తాతిగుండె విడిక - రంగదే జాలిచేఁ
జదివెనా నీ హరిశ్చంద్ర చరిత

2

బెడిపె నున్మేలి కొర్రి - త్తడి గాఁగ మన్నదే
వెలలేని నీదుసా - వితి నుద్ది

ఎన్నని వచింతు నీ కృతు - ల్గన్నవాని
కవియె, నీకెవె, సాటి, గు-ణాలయాములు
నీదు కృతులంట యొక వింత - గాదు సుగుణ
భాసమాన నారాయణ - దాస సుకవి॥

సీ॥ నాటు తెల్గునఁ బొల్లు - మాటలు లేని, యా
లలితాంబ వేయిపే - రుల బెడంగు
తెలుఁగు మాటల పాత రలులేని బుద్ధుల
కందని వేలుపు- వందముద్దు
తెన్గు పోకడలకు - దెన్ను దిద్దిన చిన్ని
గవరమ్మ పెండిలి - కతసొబంగు
ఇది తెల్గు పారసీ - కదె యన్నయట్లు రా
జించు నుమ్మర్ ఖయామ్ - నీటు తెనుఁగు

తెల్పవే తెన్గు నెత్తురు - తెన్గు నాల్క
తెనుగు తెగువయునుఁ దెనుగు - దనము పీచ
యనుచు నొకపాటి మానిసి - పనువ తెలుఁగు
మీసఁ మనఁగ నారాయణ - దాసనీది॥

సీ॥ పాడి వెన్నెలలపై - పైఁ బర్వగాఁ జేసి
బత్తి మిన్నేటికా - ల్వలను ముంచి
తెల్వి తోతుల మంచి - తెన్నుల నడిపించి
నడతల కందువల్ - నచ్చఁ జెప్పి
మనసున బైరాగి - తనముపై పొఱఁగించి
జగము చిల్పకములు - చక్కఁజూపి

ప్రామిన్కుఁ గౌవలలో – పలి తెల్విఁ గావ్పించి
తలఁపు దౌడుల నట్టె – నిలువరించి
యేడిపించి. నగించి, మే – ళ్ళన్నొ జేసి
యెన్నిపెట్టులు చదివిన – నిన్నె యెదుటఁ
బెట్టు నీ కల్పముల కూర్పు – గుట్టునకె
తెలియు నీ కొల్చు తల్లి కి – ఁదెలియు నేమొ॥

సీ॥ కృష్ణ లీలా తరంగిణిఁ దోఁగి దాఁటిన
ధీర నారాయణ – తీర్థ తోడ
అష్టపదీ నావ – నధివసించి భవ వా
ర్ధిని వరించిన జయ – దేవుతోడ
అధ్యాత్మ రామాయ ణాకాశ యానాన
సద్గతుడైన శేష కవితోడ
నాదాశరోపాస – నడరిసీఁదిన, దీక్షి
తత్యాగయాది భ – క్త తతితోడ

వావియో. చెల్మియో, గురు – భావమొ తొలి
వఱల కుండిన నీవింత – వాఁడ వగుదె
అట్టిదే సుమ్మ యీమన చుట్టరికము
భావము గ్రహించి తన్వ్వమా – దీపనలిడి॥

సీ॥ వాణీకుఁడంచు సం – భావించిరే కాని
వీణాది వాది త్రి – విధ మెఱుగునే
వెన్క దాళము మాని – వేయంగలఁడు గాని
కమనీయ నర్తన – కళ యెఱుఁగునె
వేల్పు పెద్దను పేరు – పెద్దయే కాని ని
చ్చట పూజ నందెడి – సౌఖ్య మేది
తా శతానందాఖ్యఁ దనరుఁ బోవిన్ప్రొలి
శశ శతానంద ద – శక్తి యేది

కేవల పితామహుండ తండ్రీవు హరిక
ధా పితామహుండవు కళ - ధన్యమాన్య
ఒక్క బ్రహ్మత్వ లయల నీ - శుద్ధియైన
సుభయులును మాకుఁ బూజాల - యులు మహాత్మ॥

సీ॥ ధావాధరమ. దేవ - తత్తిమా పాడు దోఁ
గుత్తుకలో దూరి - గోసు పెట్టు
వాయుఁ డాలే కాంజ నేయుఁడా నృత్య పుం
దటిని మేనికిఁ జుల్కఁ దనము నిచ్చు
భరతుఁడా నందికే - శ్వరుఁడ నీకెర విచ్చు
నందఱ నుబ్బించు - నభినయ కళ
శారదయా పరాఁ శక్తియా నీ నాల్కఁ
దాండవించుఁ గధాక - ధనము వేళ

నారదాంశ ప్రపూర్ణావ - తార మవనఁ
జాలఁగా షాయ పటజటా - జాల రహితు
నిన్ను నారాయణాంశుఁగా - నిశ్చయింతు
దైవబల ధన్య శ్రీహరి - దాస మాన్య॥

సీ॥ ఉత్సాహశక్తి నీ - వొడ లెఱుంగక రస
జ్ఞాకర్షణ క్రియ - ల్నడుపుచుండ
నాయూరసంబుల - లను సభాస్తారు
లాహాయి లాహిరి - నణఁగియుండ
నీ శిక్షఁగొన్నాళ్ళు నెగడిన విష్యులే
ప్రక్క పాటను దడఁ బడుచునుండ
గానంబు తాళం, బగణ్యంబు గాఁగ మ
ద్దెల గాని ప్రేగులు - తెగుచునుండ

నాల్గు భాగము లెఱింగిన - నాధులచట
నుండవలెఁగాని యింకనే - ముండిపోవు
నఖిల మానచదరసమగ్న - మగునుగాదె
ధన్యుఁడా శ్రీహరి కథాపి - తామహుండ॥

సీ॥ కథనానఁ గ్రొత్త పో-కడలంచుఁ జొప్పించి
పప్పున గాల్వైచు - వారిఁగాంచి
విరిదండతో భక్త - వేషంబుతోనిల్చి
కథనా సమర్థుల - కష్టమెంచి
యే చాటువులో నడ్మ - నిరికించి మాయస
ల్పపస యిండను దారి - పాటుజూచి
కదముట్టఁ జిరుపెట్ట - కథలతో నేనేల
విడి సాముఁ జేయుగా - రథుల నరసి

అకట హరి బోలుఁ గూడమా - యలకెదిగిరి
స్వార్థపరలాభమే స్వరా - జ్యముగ మారె
ననుచుఁ గన్నీరు నించెద - వద్దరాని
కాలదోషమ్మునకు మందు - గలదె సుకవి॥

సీ॥ విద్వన్మఖంబుల - విడఁజేసి పొందిన
గండ పెండారము - ల్గానరావు
అవనీశ్వరుల మెప్పు - లందికై కొన్నదు
శ్శాలువ లెందు గో - చరము కావు
తన పెట్టుబడి కొంత - తగులకవచ్చు సిం
గపుఁ దల కడియాలు - కానరావు
విబ్బరమైన పాం-డితి చూపె గడియించు
మెడలు దాల్పఁగఁ దగు - మెడలులేవు

2

ధన్యుఁడా యొక్క నీచోటఁ దక్కనెందు
వాతలిడుకొన్న చిఱునక్క - వ్యాఘ్రమగునె
యీఁకలంటించుకొన కాకి కేకి యగునె
వేసముననె నారాయణ - దాసుఁడగునె॥

సీ॥ అన్నాఁడు పోనిమ్ము - హరికథా వర్తకం
దని యసూయాగ్రస్తుఁడైన పలువ
మన్నాఁడు పో చాటు - మాటు నవితఁ డెంత
యని కంటఁ బడలేని - యదురుగుండె
కన్నాఁడు పో యొక - కంటితో నీ పచ్చ
కనలేని యొక యక్షగాన కర్త
తిన్నాఁడు పో బుల్పు - తీరంగ మొట్లు వి
గ్గని కాలు ద్రువ్విన - గాయకుండు

అలికి సంపంగియును లొట్టి -యలకుమావి
చివురు రుచియించునే నీకుఁ - జెడినదేమి
కలుషమే దక్కె వారికి - కాల వక్ర
గతుల దా-తప్పు బుధనుత – గాయకమణి॥

సీ॥ ప్రాఁత మాటల కవి - త్వమట దాసుని దది
తన గొంగడివి జూచు - కొనని మాట
ప్రాఁత బానీలోని - పాటంట దాసుని
దది, తమ కబ్బని - యట్టి యేడ్పు
కథ చెప్పుచో నృత్య - కష్టమెందుల కంట
తన పొట్టలెవి పెట్టు - కొనెడి మొత్తి
దాసు మాటల మోటుఁ దనమె కన్పడు నంట
యున్నదన్నను నరుం-డుడికి చచ్చు

నోరు చెడెఁ గాని పాప సంభారులకును
ఘనుల విద్యాయశోధన - గౌరవమ్ము
లంత మాత్రమ్మనవె తమ - కబ్బ నటవె
గుణము లెన్నుట కలిలోనఁ గొఱఁత సుకవి॥

ఉ॥ శాశ్వత వస్తువుం దెలిసి - సంస్కృతి దాఁటెడి దారి చూచి యీ
విశ్వము సంతరించు హిత - వృత్తిని, నీ రచియించు సత్కృతుల్
శాశ్వత సుప్రతిష్ఠఁగనుఁ - జంద్ర విభాకర తారకాళితో
విశ్వమయుండెఱుంగఁడటె - విద్వదమాయక కావ్య కష్టముల్॥

సీ॥ బడులలో నిర్బంధ - పాఠమైగానంబు
రాణించు దినము దూ - రమున లేదు
గాన సాహిత్య సం - గతియె యోగంబని
ఘన బుద్ధులకు వచ్చు - దినము వచ్చు
కావ్యంబనఁగ యతి - గానమేయని కళా
నిధులెన్ను వెన్నెల - నిశలు వచ్చు
బాలు రొజ్జలు "డి-ఇ-ఓ"లును యతిగా
నమును బూజించు కాలమును వచ్చు

క్షీణయుగమునఁ బేరిచి - గేయకృతుల
లేఖినీ చౌరము చూప - లేనివారి
కొలలు తొలఁగు దినమ్ములు - కూడివచ్చు
కాలగతు లొక్క తీరువి - కావు సుకవి॥

చ॥ గ్రహముల నానవెట్టగఁల గండఁడు రావణుఁడైన ద్దురా
గ్రహ శనిగాని పట్లఁ దన - గాటము చెల్లకపోయె నీవా; యా
గ్రహముల మంచి చే నొలవు - గా, సుగమిచ్చుచు సంతతంబను
గ్రహదము లొట నిల్పి గుడి - గట్టితివౌర. జగద్ధితంబుగా॥

సీ॥ శ్రీ పూష వాద్వంస్య – భూపవరస్మారి
కానందదాయిని – యైన ప్రోలు
పండిత మత్తేభ – పాద విన్యాస పా
వన వీధుల మరెడి – పట్టణంబు
బహుకళానాధ శో – భా ద్యోతకము కళ
కళాలలొప్పెడి – లలితపురము
తుంబుర నారదా – దులఁ బంతగించెడి
గాయక వరులొప్పు – కటకవరము

వివిధ విద్యలయందు – దిగ్విజయులైన
నీదు స్మారిక యొక చోడ – నిల్పినపుడె
విజయనగరంబు సార్థమై – వెలయు సుగుణ
భాసమాన నారాయణ – దాస సుకవి॥

సీ॥ భవ కారకాఖ్యాన – ఫణితి నిస్సమ శక్తి
వగు నీకుఁ బూజ్యుఁడ వైన నీకు
ఆ శాంత విశ్రాంత – హరి యశశ్శాలి
వగు నీకు సరసుఁడవైన నీకు
భారతీ స్తన పయో – ధారా త్త బలశాలి
వగు నీకు – గుణమణి – వైన నీకు
ఆ బాల పండితా – త్యానంద సంధాయి
వగు నీకు నిర్మద – వైన నీకు

నమర నీశ్వర సత్య – నారాయణ కవి
మాలి పోఁగులఁ బోలుప – ద్యాల మాల
విబుధ చంద్రుఁడ వని భక్తి – వెలయనిచ్చె
వయను గొనుమయ్య జేజేల -దనుపుమయ్య॥

సీ॥ కల్పనా సమనల్ప – శిల్ప చాతురి జూపి
చవుల గూర్చెడి బాట – సారి సాక్షి
సకల భాషా విశే – షా భ్యాసమునకు న
త్యద్భుతంబు మరుక – యామ సాక్షి
ఆడిన మాట స–త్యంబై న దన యధా
ర్థమ్మైన రామాయణమ్ము సాక్షి
పదములన్ రసముట్టి – పడునన్న. వన్నె తె
క్కిన నవరస తరం – గిణియె సాక్షి

కుక్కుటేశ్వర ప్రియభక్తు – కూడిమంచి
తిమ్మకవి సార్వభౌముకీ ర్తికిని వెన్క
నంటి దాజిల్లుచున్న నీ – యచ్చ తెన్గు
కబ్బములె సాక్షి – నీదు వి – ఖ్యాతి కనఘ॥

ఉ॥ ఆసవహించి తత్కృతక – థార్థము జూపక చాట్యగాన వి
న్యాస మెఱుంగకే. హరిక – థాభ్యసనమ్మొనరించి యెట్లొ త
ద్దాసులు కాకయున్న హరి – దాస సమాఖ్య వహించువారు నీ
దాసుకు దాసులేక దయ – థార్థ విధాన కథాజ్ఞులాయనో;

శా॥ జంకున్గొంకును లేక భూపతుల యాస్థానమ్ములందీవు వి
శ్శంకన్నర్తన గీత వాద్యముల సం – స్కారమ్ములన్ జూపునా
తంకమ్మున్ కొనకుండ సల్లడల విద్యాపీఠమంచున్ భువిన్
శంకాపైన "థమ థమార్చటులు చా –టన్ లేదె విద్యానిధీ॥

త॥ బిరుదు మహానటుఁడని శశి
ధరునకె నారాయణాఖ్య – దాసవరునకే
పరికింపఁజెల్లు తదితర
పురుషున కెటు జెల్లు పిల్లి – పులియననగునే॥

—ఈశ్వర సత్యనారాయణశర్మ

## 23. నారాయణదాసు

1. విన్నామురా పాట
   కన్నామురా నృత్య
   విజ్ఞాన వీచికల
   విహరించు మధురిమలు
2. పలుకు తేనెల జిల్కు
   పద్మజుని రాణివిర
   కవిత వేదవ్యాసు
   గంభీర వాక్కురా – విన్నామురా॥
3. ఆ నడక లాస్నృత్య
   మా నాట్య గతులతో
   కరగించు లాస్యాల
   భరతముని యాదెరా – విన్నామురా॥
4. సంగీత విద్యలో
   చక్రవర్తివి నీవు
   మహతీ విపంచికా
   మహనీయ రూపమవు – విన్నామురా॥
5. శంభో పదమ్ములో
   యంభోధి యరచెరా
   కాళ్ల గజ్జెల మోృత
   కంపించె కులగిరులు – విన్నామురా॥
6. సప్త దళ వర్షాలు
   విప్తలై నటచెరా
   వాగ్గేయ కారాకా
   ప్రజ్ఞా ధురంధరా – విన్నామురా॥

— అత్తిలి సూర్యనారాయణమూర్తి

ఉ॥ శ్రీయుత మూర్తి ఖండిత ప్ర - శిష్య జనార్తి, సమస్త దిక్ప్రసి
ద్ధాయత కీర్తి సజ్జన చయస్తుత న్యాయపథానువర్తి, యా
ర్యా! యసమాన పూర్ణ మహీ - మాతి శయోరు గుణాళిధుర్యనా
రాయణ దాసవర్య తగ - నారయు నామనవిన్ గృపాకరా॥

గీ॥ స్వీయ ఘన పాండితీవిని - ర్జిత సమస్త
పండిత చయంబుతోఁ దమ - ప్రధిత కీర్తి
వారములు సర్వదిసలకు - జేరుచుండె
దనరు చుండు నారాయణ - దాసవర్య॥

గీ॥ అతుల పరిపూర్ణ పాండితీ - ప్రతిభ శిష్య
వితతిఁ బ్రోచెడు మిమ్ము నే - నుతి సలుపుట
గగన కుసుమమాల ధరించి - కాంతఁ గొనుట
నేతి బీరకాయనుగోసి - నేయిఁగనుట.

సీ॥ సుర గురుండెపుడు త్వచ్ఛు శ్రూషఁ జేసిన
బుద్ధి బలంబున - దోలవచ్చు
కమలాసనుండు మీ - కడ నేర్చెనేని వి
ద్యా యుక్తి మీసాటి - నందవచ్చు
శేషుండు కవిత మీ - చెంత నేర్చిన వర్ణ
నా యుక్తి మీ సరిన్ - దనరవచ్చు
పమ్మనుల్ మీతోడ - సంప్రతించిన మహీ
మావళి మీ సామ్య - మందవచ్చు

అంతెకాని సాధారణు - లైన జనులు
పోలఁ జాలుదురొక్కొ-యి - పూర్వ బుద్ధి
యుతుని, పాండిత్య సంపద - న్వితుని సుకవి
పతిని బహుమహిమా సమ - న్వితుని కెందు॥

10

గీ॥ సంస్కృత కళాలయంబునఁ జదువుచుంటి
గాన విద్యఁ గూడను నేర్వ - బూనియుంటి
త్వద్దయాలోకనముల నా - పైనఁ బరపి
త్వరగఁ జెప్పింపవే మహీ - సుర వరేణ్య॥

చం॥ సరి సరి యేటి మాటయిది - సాగునె- విద్యలరెంటి నేర్వఁగన్
దరమగుటెట్లు! వల్దనక - తండ్రి కుమారుని కోర్కెఁ దీర్చునా
కరణిఁ గరంబు ప్రేముడివి గానము నేర్పెడి వానిఁ జేయవే
పరమ దయాన్వయుక్ శ్రిత - పాలక దీనుని నన్ను వీక్షకన్॥

గీ॥ త్వత్కృపా రక్షిత సుజీవి - తంబుఁ గలుగ
సేయఁ బ్రార్థింప నల్పవె - శ్రిత జన రత
ఎట్టులైనఁ ద్వచ్చరణముల్ - పట్టువాఁడ
నేకలవ్యుండు గురుఁబోలె - విద్ద చరిత॥

—వంతుల లక్ష్మీనారాయణశాస్త్రి

ఉ॥ మన్నన నేతు పెద్దలన - మానుల మాన్యుల నాదరింతు సం
పన్ను డకించనుండనెడు - భావ మొకింతయులేక నందరన్
గన్నుల నొక్కరీతిగను - గాంచెదవార్యభవద్గుణాళి మా
కెన్నగ శక్యమౌనె పరి - కింపగ విప్రకులాబ్ధి చంద్రమా॥

ఉ॥ మానవ జన్మ మెత్తుటయె - మంచి తపః ఫల సూచకంబగున్
దానికి తోడుగాఁ జదువు - ధర్మ పరాయణ బుద్ధి శీలమున్
దానము నిర్మలాత్మయు స - దా భగవంతునియందు భక్తియున్
బూని జనించి నాఁడవని - పూజ్యులు నీదరిఁ జేరుచుండెదర్॥

ఉ॥ పెట్టెద చేతులార కడు - బెద్దలు దేహియటంచు వేడఁజే
పట్టుదు సత్కథావళులఁ బల్కెదు పండితుల న్ముదంబునన్
రట్టొక యింతసేయకని - రంతరమాశ్రిత కోటి నేలు నీ
యట్టి గుణోన్నతున్ గవిన - యట్టి మహాత్ములు ధన్యులీభువిన్॥

—నరిసిపురం సూర్యనారాయణ

శ్రీమత్ ప్రాగ్గోదావరీ తీర స్థిత మండపేట నామక విలాస పుర్యాం కథిత శ్రీ రుక్మిణీ కల్యాణం నామ హరికథా సందర్భే - అణివిళ్ళ చినవేంకటశాస్త్రిణా - శ్లోక రూపాత్మక - శ్రీమన్నారాయణ దాస సమర్పితా పంచరత్నమాలికా:-

శ్లో॥ భావై రానంద వారాశౌ మజ్జయంతాం నభాసదాన్
సమస్తశాస్త్రభిజ్ఞంతం విలాస పురుషం ద్విజం॥

శ్లో॥ రాగైః కేదారగౌళాద్యైః మధు శ్రవణయోః కరం
ప్రజ్ఞానిధిం సుధీమంతం విద్యాదానే రతం సదా॥

శ్లో॥ తాళాదిభీ రూపకాద్యైః లయబ్రహ్మ విదాం ముదం
కృతం సంగీత సునిధిం సుశిష్యే ష్వతి వత్సలం॥

శ్లో॥ సర్వం రామకథాసారం కృతం హరికథాత్మకాం
ఆ బాల వృద్ధ పర్యంతం వినుతం సర్వ భూమిషు

శ్లో॥ ఆదిభట్టాన్వయ ఇద్ధం దాసన్నారాయణాత్మకం
వందేఽహం గురు భావేన ఇష్టకామ్యార్థ సిద్ధయే॥

ఇయం శ్రీమన్నారాయణ దాస సమర్పిత పంచరత్నమాలికా అణివిళ్ళ చినవేంకటశాస్త్రిణా శ్రీరామ చంద్రకృపయా కృతేతి బోధనీయా...

10

గీ॥ చిన్నిపూదేనె తుంపురుల్ - చిందునట్లు
రాము చరితము వ్రాసినార్ - తాముతొల్లి
దానమీ జన్మమేగాకఁ - దక్కుజనుల
భవము సఫలతఁగాంచెనో - కవివరేణ్య!

ఉ॥ శంకయొకింత నైతముఁ బొ - సంగదుమీరచనమ్ములోనయే
వంకయులోకు లెవ్వరును - బట్టవి రీతిని వ్రాసితన్నయా
బింకపుఁ బల్కుఁబల్కుటకు - వీలౌకొ యొద్దకు మీకుఁగాకయా
తంకములేక మీ ప్రతిభ - ధారుణికిన్నగయై యొసంగుతన్॥

సీ॥ ఆంధ్ర దేశక్షోణి యంతట హరికథా
బీజముల్ చల్లిన - పెద్దరైతు
చెవులకు చవులార - నవకళించెడుగాన
సారంబునం గ్రొత్త - వారదుండు
అప్పటికప్పుడ - త్యానందకరమైన
సమయ స్ఫురణగల్గు - చతురబుద్ధి
నవరసామృత ధార - జవమున గురిపించు
కైత గూర్చిన నాంధ్ర - కాళిదాసు
సప్త తాళము లొకసారి సరిగ జూపి
ప్రభవెలార్చినఘన "లయ - బ్రహ్మ" నేత్ర
పర్వమౌనృత్య మొనరించు - పరమ శివుఁడు
దనరు నారాయణాహ్వయ - దాసవరుడు॥

గీ॥ అవని మితిలేవి ప్రజ్ఞచే - నలరి హరిక
థాపితామహుఁడను బిరు - దంబుగొన్న
మేటి నిర్మల గుణరత్న - పేటియగుచు
నతి మనోహర వాగ్ధాటి - నమరియుండె॥

గీ॥ కాలికడియంపు చిరుగంట ఘల్లు మనఁగ
వినెడు దాసుల గుండెగు - ఝల్లుమనఁగ
సభ్యులకు కాయము పొంగి - ఝల్లు మనఁగ
ఫెళ్ళు మనునట్లు కథవిను - పించునతఁడు॥

గీ॥ ఆదిభట్టాన్వయాంభోధి యజ్ఞవైరి
గండపెండేరము న్దాల్చి - దండి మగఁడు
రాజ పూజ్యుండు బహుశిష్య - రాజియుతుఁడు
రమ్య నారాయణాఖ్య వి - రాజితుండు॥

—కవిభూషణ: అద్దంకి వేంకట రంగాచార్య

## శ్రీ నారాయణదాస స్మృతి పద్యములు

మ॥ నుత పద్యంబుల వ్రాయు లేఖిని గొన - న్నొప్పించి నాయాదతో
స్మృతి పద్యంబుల వ్రాయఁగా వలసెని - స్సియెంత పాపాత్ముఁడన్
మతిహీనుండగు కాలుఁదొక్క నెలనీ - మాపెత్తకే యున్ననీ
స్మృతి సంతోషదమే యగు గద మహా-మేధావి; దాసోత్తమా !

చ॥ ఎనుబది యేండ్ల వానికయి - యేడువనేలనిపించలేదు యా
వనదశజ్ఞాన సంపదకుఁ - బాయనిగేయుఁడవౌటఁ జేసి యిం
కను జనతోపకార పటు - కావ్యకృతిన్వెలయింతు వన్నయా
సను మొదలంటఁద్రుంచితవి - సంతతమేద్త్తుము దాససత్తమా!

ఉ॥ నీప్రతిభావిశేషమది - నిచ్చలు మధ్యమ లోకతుష్టిదం
బైపరగించి! మాయిడిన - యద్భుత శక్తులు మాముదాప్తికై
చూపవె రావే వేగమను - చున్మొగమూటము వెట్టినారె చూ
పోశక వేల్పులెల్లి విడి - పోయితె కాదనలేక సత్కవీ!

గీ॥ విజయ నగరంబు మృగరాజ — విరహితమగు
శైల గుహయయ్యె రాయడు - శాస్త్రి వెంట
నీవు నేఁగఁగ గానసా — హిత్య గర్వ
లింక బోరలు విరచి - యూరేగవచ్చు॥

ఉ॥ రాయడు శాస్త్రి స్వర్గురుని - రాయిడి వెట్టఁగలాఁడు పాండితిన్
గేయ కవిత్వ వైభవము — నేరువ డూఁకికి మాట వచ్చునే
నీయెడ నాలసింపఁ దగ — దేగెదనంచును లేచినావె నా
రాయణదాస! వాసవ సభాంతరలక్ష్యము తోడ నింతలో.

శా॥ భాషా షట్క కవిత్వగాన మహిమల్ - భాసిల్లఁగ భారతీ
యోషాకార నృసింహ మంచును బుధ - వ్యూహస్తుతుల్ పొందునీ
కీషత్తుం గొరలేదు; నిన్గురించిమే - మెంతేద్చినన్ వ్యర్థమున్
దోషంబౌను, త్వదాత్మ శాంతికయి యెం - తున్ భక్తిశ్రీకాంతునిన్.

ఉ॥ శ్రీయుత భక్తి నీకథలు - సెప్పి జనమ్ము తరించు సన్నుతో
పాయము చూపు పెక్కు - లగు భవ్యకృతుల్ రచియించి సచ్ఛరి
త్రాయతకీర్తి నొంది, భవ - దంఘ్రులు నేరఁగ వచ్చుచున్న నా
రాయణదాసుఁడే పదవి - కర్హుఁ డొ ప్రేమనుజూడు శ్రీహరీ!

—ఈశ్వర సత్యనారాయణ శర్మ

# ఖిన్నపము

గీ॥ కలిగిన తలంపు వసుమతీ - తల దిదృక్ష
ద్రష్టమంతుఁడు దృష్టి మాం - ద్యము గలాడు
దృశ్యమితరుల కెఱిగింప - నిచ్చగించు
నకట! యీ దేరు పెట్టులీ - యార్భకుఁడు॥

ఉ॥ ఈ పృధులావనీతల స - మీక్షయనన్ యొకపాటి మాటతో
నొపనియొక్కొ పర్వతము - లా నదులా సికతాతలమ్ములా
యేపగు కాననాంతరము - లెన్ని ధరాస్థలినుండె. నవ్వితా
నా పరికించు వాడని మ - హత్తర చిత్రముగా దలంచితిన్॥

కం॥ ఉరకుండ లేక నేనా
వెఱి బాగుల వానిఁజూచి,- "బిడ్డా!" యీయు
ర్వర సర్వంబును జూతువె
యెఱింగింతువె వింతలెవ్వి - యో. మాతోడన్॥

మ॥ అనవుండా నిసుగిట్టుల బలికె "న - య్యా! యిందెయున్నట్టు - ప
ర్వాననేవేగి మహాద్భుతంబులఖిలం - బున్ జూచి మీతోడనీ
క్షణమే దెల్పెదనుండుడీ" యనుచు బె - ల్బం బారియేతెంచియి
ట్లను నాయబ్బుర మిన్నడింప, గరవి - న్యాసమ్ము దీపింపగన్॥

సీ॥ మహదాళయోత్తుంగ - తుహినాద్రి శృంగముల్
ధారాభిరామపూ - త స్రవంతు
లర్ధ సౌరభ్యగ - ద్యాత్మకారామముల్
వర్ణనాతి విచిత్ర - వారి విధులు
సార్ధక వాక్యప్ర - శస్త కేదారముల్
రసవత్ప్రద సరోవ - రవ్రజంబు
పరిశుద్ధ గీతదే - వస్థాన విచయమ్ము
వైదుష్య సైకత - ప్రథితభూము

లిన్నియేమిటి కయ్య! కో - యిలల పాట
లేమి నెమ్మల నాట్యము - లేమి, కంట
జూచియే తీరవలె నింక - సోదెగాక
సరిగ వర్ణించుచో మన - సరియె లేదు॥

కం॥ అని నాచేతం గోరబ
దిన యాకల్పకు కళాభ్ర - ధీష్ముని నారా
యణదాస సత్కవీశ్వరు
గనుపించి వచించెనిట్లు - గాంభీర్యముగన్॥

ఉ॥ మున్నొకనాడు గౌతముడు - భూమి ప్రదక్షిణ మాచరించిన
ట్లెన్నరె వేల్పుటావు ప్రస - వించుతఱిన్ వలగొంట చేత, స
ర్వోన్నత చారు కావ్యముల - నొప్పుగగన్న మహాత్ముడీయనన్
గన్నుల జూచినాడనటు - గావుననే గృతకృత్యుడం గదా॥

మ॥ అనియె[illegible]ంచె గుమారు వాక్యరసమూ - హా! యెంతరుచ్యంబొస
త్యనిరూఢంబొ వివేక సమ్మతమొ, స్వాం - తంబద్భుతాక్రాంతమై
"తనయా! ధన్యుడవోయి నీతలపుస్తు - త్యంబోయి నీకారణం
బునవాకియ్యెడ నద్గురూత్తముడు నే - వ్యుండబ్బెనీ నాటికిన్॥

సీ॥ జయదేవ కవికృతా - ష్టపద గీతికలట్లు
లౌచిత్య సూక్తిము - త్యములు జల్లి
నారాయణ తీర్థవా - జ్మయ పయోధింబలె
యుల్లాస మొదవ బీ - యుషము విదికి
రామదాసుని భక్తి - రసరచనంబోలి
యంతరంగంబును - య్యాలలూచి
త్యాగయ్యగారికీ - ర్తన మానికములట్లు
రాగబాహుళ్య స - రాగమంది

యలరు నీ కావ్యలక్ష్మి కెం - దైనవీడు
గలదె, యున్నను నుపమింప - గలమె మేము
సాత్వికాచార పరమ హంస ప్రచార
యాళయోద్గేయ నారాయణ - దానవర్య!

మ॥ రసహీనంబున సభ్య వాక్య రచనా - రంభంబు నీ చాతి నీ
చ సమర్ధంబు విలక్షణంబను భవ - జ్ఞానాంధకారం బటం
చ సదృగ్వాగ్మి యొకండు నా కవనయయ్యా! యీసుగా జూడన
భ్యసనంబున్ బొనరించె నీ విపుడు నా - యల్లారు సారస్వతో
ల్లసనం బివ్వలనెట్టి పై చెదవో కే - లందట్టి లాలింతువో

కం॥ అంత యసభ్యమె దాన
న్నంతటి పేలాపు బండి - యూఁ దూష్యంబాఁ
యింతేని రసము లేదా
చింతింపను కలది కలటు - చెప్పు! మహాత్మా!

మ॥ వయసా చిన్నది ప్రాయమాయు క్తమగుచి - ద్వద్దార్ఢ్యమాపూజ్యము
న్నయదేనిన్ సమయోచితమ్మగ స్ఫురిం - చంబోవ దట్లయ్యు బ
ద్ధియముల్ వ్రాయుట సాహసంబయగు సం - దేహంబులేదంచునే
న,యెఱింగింతును నిన్ను దేశికునిగా - నాలోనభావించినీ
దయ చే దప్పులనొప్పులందెలియ నంతర్వాణి గెంటెన్ననున్॥

—వలివేటి కామేశ్వరరావు

శా॥ శ్రీమద్రామ చరిత్ర పూర్వము రచించెన్ తాత వాల్మీకి భి
క్షామర్యాద కుశీలవుల్ పితరు లైక్యం బందగా జేసి ర
ట్లే మాకిప్డు యధార్ధ రామచరితం బేర్పాటు గావించి మా
కీ మర్యాదల భిక్ష పెట్టు హరిదాసీ తాతకున్ మ్రొక్కెదన్.

ఉ॥ ఆయన చేయి మా శిరములం దభయంబని పల్కుచుండె నా
రాయణ దాసు నేడమృతుఁడై హరిదాసుల భావియోగపు

చ్ఛాయల గజ్జ కట్టుకొని సల్పుచునుండె షికారు నాకదే
కోయని పంటగా మదిని కొల్చు కృతజ్ఞత వెల్లడింపఁగన్॥

శా॥ ఏ దివ్యాత్ముఁడు తెల్గు నాట కవితాంభల్ రసావేశయా పాడుచున్
మోద శ్రీ మెయిపూత పెట్టి నఖముల్ అసుముల్ వోనాడుచున్
యేదివ్యాత్ముడు వీధికొక్క హరిదాసిం పారగా జేసె నా
డాదివ్యాత్మకుఁ డాదిభట్ల కవి చాపైపోయె భూమాతకున్॥

ఉ॥ ఏయెడ నర్ధ గౌరవము నింపుచుఁ హాయిగ యక్షగానమున్
జేయ సమర్థుఁ డంచు కడు నేర్పురు లిచ్చిన యందెగొన్న స
ద్గాయకుఁ డాంగికాభినయ గణ్యుఁడు సత్కవి వృత్త నృత్తమున్
కోయని వంటి నా కథకు క్రొత్తులు గూర్చెడు ఆదిభట్ల నా
రాయణదాసు విన్మమన ఆంధ్రుఁడు భాగ్యమురా సహోదరా!

—పాతూరి మధుసూదనశాస్త్రి

# అశ్రుతర్పణము

మ॥ అకటాయేమిటు విన్నబోయినది మా ఆంధ్రావనీ విత్యమా
త్నకళాలంకృత మంజులాస్యముదిశాతల్పంబు నీహార బా
ష్పకణార్ద్రింబగు హేతువేమి ఒకవిద్వత్తేజమీనాడు భౌ
తికలో కోత్క్రమణం బొనర్చుటనుకాదే సందియంబున్నదే!

శా॥ జ్ఞానుల్ మెచ్చిన పండిత ప్రవరు డజ్జాడాదిభట్టాన్వయుం
డౌ నారాయణదాస వర్యుఁడిక లేడామాకు స్వర్గీయ స
న్మానం బందగ పోయెనా తెలుఁగు సీమన్ వానిపుంభారతీ
గానంబువ్వీను భాగ్యమాంధ్రులకు మృగ్యంబయ్యెనా దైవమా!

సీ॥ నీ గజ్జె కదలింపు - నేర్పున భరతశా
స్త్రంబు వినూత్న తే - జమునమించు
నీ దివ్యసాహితీ - నిపుణతకున్ బృహ
స్పతియైన మెచ్చి యం - జలి ఘటించు
నీ మేఘ గంభీర - నిస్వనంబున దిశా
వలయంబు మారుమ్రో - తల ధ్వనించు
నీయేక వాగ్గర్భ - ణీ కాంత వేయిభా
వాల బిడ్డల నవ - లీల గాంచు

ఆంధ్ర భారతి నీవయి యవతరించి
నావు శ్రీయాదిభట్ల మాన్యకులజాత
వాసిగన్న నారాయణదాసవర్య!
నన్ను దీవింపరమ్మ వందనము గొమ్మ.

—దీక్షితులు

ఉ॥ హాయనిపించునాట, యహహాయనిపించునుబాట, తేనె సో
నాయనిపించుమాట; వహవాయనిపించునుదేట, కైతవ
హ్వాయనిపించునో హరికథామృతసాగర! యాదిభట్ల నా
రాయణదాస! నీకడ సమస్తము న న్వయమయ్యెనద్దిరా !

సీ॥ అపరూప రాగంబులందు గేయమొనర్చి
రసము జిమ్మిన త్యాగరాజు వీవు
ఏకకాలమునం దనేక తాళములతో
బాడగల్గిన లయబ్రహ్మవీవు
అచ్చ తెన్గులంగ్రై తనల్లి పెంచిన మహో
ద్దండుండౌ వాంధ్ర విష్ణుండ వీవు

భరతాది మునులు జూప నివి లక్షణ
నర్తనం బొనర్చెడు మహానటుఁడవీవు
పేర్కొనగనేల పల్వురఁ బేళ్ళఁ జెప్పి
బ్రహ్మ విష్ణ్వీశమూల రూపంబవగుచు
హరికథామృత వారాసినన్వహంబు
పండియున్నాది నారాయణుండవీవె॥

గీ॥ ఔత్తరాహుఁ డాళుకవి భట్టాంతపదుఁడు
బాణుఁడు, మురారి కవియును, భాస్కరుండు
భట్టపూర్వులు. మించతవ్వారి వీవు
ఆదిభట్టుండవగుచు నారాయణుండ॥

—అవధాన శిరోమణి - మహోపాధ్యాయ - మధ్వశ్రీ కాశీకృష్ణాచార్యులు

శ్లో॥ కోయం? శాస్త్రపయోధితుంధన సుధారాశిర్వ పుష్పాన్ కిము
కోయం? వేదరహస్య బోధనవిధౌద్వైపాయనోవాకిము
కోయం? రాగలయ స్వరాది ఘటనాశౌండ సురర్షిః కిమి
త్యేవం పండితమండలైరనుమితో నారాయణః పాతునః॥

శ్లో॥ ప్రాలేయాద్రిదరీ కుటీర విసరత్ గంగాఝరీ నిర్మల
స్రోతః పూర్ణ తరంగ సంగమ బహిర్ధ్వాంతాచ్ఛ వార్బిందవో
యస్యానల్పకవిత్వ ముద్రిత కథాధారాఽతులాశ్చాభవం
స్తన్నారాయణదాస సద్గురు వరాన్ కింస్తౌమ్యహం మందధీః॥

శ్లో॥ నిదానం శాస్త్రాణాం మృదుమధుర సాహిత్య కవితా
విలాస స్యాస్థానం ప్రణతజన సౌభాగ్య ఘటనా
ధురీణం ఛాత్రాణాం పరమ కరుణా పూరమనఘమ్
హృదిధ్యాయే నారాయణ గురువరం పూర్ణయశసం॥

శ్లో॥ వర్ధంతీయ మతీవచ ప్రచలితా విద్వద్భిరానందదా
ఛాత్రాణామపిదై శికార్హ ణగతౌ శిక్షాప్రదాశోభతే
యత్కీర్త్యాధవళీకృతా చనితరామాంధ్రావనీ మోదతే
కస్యానందమ పాకరోద్ధరికథావాచస్పతేరుత్సవః॥

శ్లో॥ వర్షేవర్షే విజయతు తరాం బృంద మేతత్సు సంస్థం
వర్ధంత్యేషా సుజన హృదయాకర్షణాత్సు ప్రవృత్తా
నిత్యానందం ఘటయితు బుధగ్రామణీనాం మణీనాం
దేశౌన్నత్యం కలయతు జనానంద సందోహ పాత్రమ్॥

—సాహిత్య శిరోమణి మల్లాది చంద్రశేఖరశాస్త్రి

చార్యులు

శ్లో॥ శ్రీ నృత్య ద్విజ. మాదిభట్ కులమణిం, శిష్టాను గుణ్యాత్మకమ్
మౌనిం, ద్రావిడ రత్న, మంచిత గుణం, మాధుర్య రమ్యస్వరమ్
నానా నూన కళానుకూల మననం, న్యాయానుసారాకృతిమ్
శ్రీ నారాయణదాస, మున్నత గురుం. వృద్ధి పరిధానం భజే॥

సీ॥ సహజ విభ్రాజిత సంగీత సాహిత్య
శాస్త్రమ్ములందు ప్రశస్తి గాంచె
స్వర శబ్ద భాసిత స్థిర భావ రాగతా
ళాంచిత కల్పన వ్యాప్తి బెంచె
ప్రతిభా వికస్వర పంచ ముఖీశ్వర
స్తోత్రాదికంబులన్ శోభమించె
సంస్కృతాంధ్ర గ్రంథ సమితిని రచియించి
సంపూర్ణ కీర్తిని సాతకించె

హరికథా గాన వాగను భరిత విదిత
భాగవత శిఖామణియై ప్రతిభనందె
సత్య నిత్య విజ్ఞాన ప్రసన్నమూర్తి
వ్యాసకర్త నారాయణ దాస గురుఁడు॥

సీ॥ కాత్యాయనీ కటాక్షాత్యద్భుత ప్రాప్త
విభవంబు లెంతయు వేడ్క చేయ
రాజన్య సౌజన్య రాజ విద్వద్వర్య
సఖ్యంబు మిక్కిలి సౌఖ్య మొసఁగ
స్థైర్య ధైర్యౌదార్య వీర్య గాంభీర్యాది
గుణములు స్వాతంత్ర్య మణిని బెనుప
శిష్యాను శిష్య ప్రశిష్య పారంపర్య
భారతీ దానంబు ప్రజ్ఞఁ దెలుప
నెల్లెడల నిండు కీర్తి వహించి మించి
సకల జనములు మనములు సంత సించ,
కథల ప్రకటించి, పోషించి కళలు పెంచె
ధన్య తముఁ డు నారాయణ దాస బుధుఁడు॥

సీ॥ స్వరము నుచ్చ స్థాయి వయికొని విహరించి
అంతలో మంత్రంబు ననుకరించు
పై నుండి క్రిందకు బూనినచో స్వర
మందక మెంతయు నధిగమించు
పాట బాడుచునుండు భరత మాడుచునుండు
బహురీతి గీతుల బలుకరించు
ఆడునో పాడునో యభినయ మందునో
పైఁ బేయి యగుచు నే పన్నె గాంచు

ఇంత వఱకును లేడెందు నిట్టివాఁడు
నింక ముందును గల్గ బోఁ డెంచి చూడ
సతతముండును నింతు తేజమ్ము నొంది
ధార్మికుండు నారాయణ దాసు జగతి॥

సీ॥ కనులిచ్చి చూచిన జనపతియైనను
గద్గద స్వరముతోఁ గదలలేఁడు
చనువిచ్చి చేర్చిన ధనహీనుఁడైనను
వైభవంబుల కల్మి బ్రబలు చుండు
మనమిచ్చి నేర్పిన మందుఁడే యైనను
విద్వద్వరేణ్యుఁడై వినుతకెక్కు
అనువిచ్చి కూర్చిన సకలాంగుడైనను
సకలాంగయుతుడయి సంతసించు

బుధుఁడు, కవి, పండితుఁడు, దాత, పుణ్యతముఁడు
విభుఁడు, భోగి, వివేకి, ప్రావీణ్యుఁడన్ని
మహిమలను గాంచి మించిన మంచి జ్ఞాని
తత్వ బుద్ధి నారాయణదాసు నెంతు॥

విద్వాన్, - శతావధాని', భమిడిపాటి అయ్యప్పశాస్త్రి

శ్లో॥ ఆదిభట్టాన్వయాఽకాశే, సూర్యనారాయణో హరిః
సాహిత్య నవ్య శోభాస్తు, సర్వత్ర కృతవానహో!

శ్లో॥ వాణీ-స్వరూప-సంస్కారైః దత్తం భాషాసు జీవనమ్
సంగీత-రూప-శుభ్రాంశుః సూర్యేణహి సమో మతః॥

శ్లో॥ అమోఘ-లేఖనీ-వృష్ట్యా, భాషా-సస్యమపోషయత్
భావ-ధాన్యాని సర్వాణి, పరి పుష్టాన్యతోఽభవన్॥

పండిత కర్ణ వీరనాగేశ్వరరావు

శా॥ సద్వంశంబున బుట్టినాడవు గదా సాద్గుణ్య సంపత్తితో
విద్వత్పండిత రాజకోటికి మహా విందున్గూర్చె మీ పెద్దలున్
తద్వంశంబున బుట్టినట్టి తమకున్ ధర్మంబు తోబుట్టువే
పృధ్విన్నీ కొకరుండు సాటియగునా పుణ్యాత్మ నారాయణా!

గీ॥ ధైర్య గాంభీర్య చాతుర్య శౌర్యమాది
సుగుణ గుణముల పుంజంబు చోద్యముగను
నుగ్గునన్జేర్చి పట్టె నిన్నోము తల్లి
గాక యిటులబ్బునే గుణగణములెల్ల
రమ్య గుణసాంద్ర, శ్రీ విప్రరాజ చంద్ర।

సీ॥ శ్రీ యాది భట్టాబ్ధి శీతకరుండు నా
రాయణ దాసుండు ధీయుతుండు
గాననిబద్ధమ్ముగా బహు కావ్యముల్
విరచించు మేటి కవీశ్వరుండు
కఠిన మనంబులన్ కరగింప జేసెడి
గంధర్వులన్మీరు గాయకుండు
భావి నృత్తంబుల - తీవిగా జూపెడి
నగజాపతిన్ బోలు నర్తకుండు

పరమ ప్రీతిని మాబోటి హరికథకుల
కెల్ల జీవన మేర్పర్చు వల్లభుండు
సుందరాకారమున జిత సూనశరుడు
నగు గురూత్తము నేవేళ నాత్మ దలంతు॥

కం॥ శ్రీ యాది భట్ట పోముని
పాయక శిష్య తతినేలు భవ్య గుణుని నా
రాయణ దాసుని వేడెద
నాయపచారముల ద్రోసి నను మన్నింపన్॥

శా॥ గానంబందున మేటి యౌచు కవితన్ గళ్యాణ మౌనట్లుగా
మానాథుం గొనియాడుచున్ కథలుగా మాబొంట్లకున్భక్తిగా
దానమ్మిచ్చుచు పాడియాడి సభలన్ దాబొందు సద్గౌరవం
బా నారాయణజున మద్గురు మదిన్ భావింతు జేమోడ్పులన్॥

సీ॥ నీ గానము న్వీని నిఖిల గంధర్వులు
సిగ్గు నన్నెలవుల జెందియుండ
నీ నృత్యమునుగని నీలకంఠుడు మెచ్చి
వెండికొండను జేరి వెలయుచుండ
నీవీణ వాయింపు నేర్పును గనివాణి
బ్రహ్మపజ్జకు జేరి వరలుచుండ
నీ కవిత్వముగని నేర్పుగ శుక్రుండు
దనుజావళిన్ జేరి మనుచునుండ

నిన్నిటంబొంది యిలను నీకీవె సాటి
యనగ వరలితివాది భట్టాబ్ధిచంద్ర!
శిష్యసంతతి నభివృద్ధి జేయమదిని
దలచుచుండు నారాయణ దాసవర్య!

కం॥ నీ కరణిని వెలయగ పను
లేకరణినొ యాభరణము లెంతయు గొనుటల్
కాకంబు రెక్కవెరవున్
గైకొని జరియించునటులెగా. గురువర్యా!

సీ॥ సప్తస్వరంబుల సందర్భమెరుగడు
కంకణముద్దాల్చు ఘనుడొకండు
శబ్ద భావమెరుంగ జాలడు యెడమచే
తను కడియము దాల్చు దంభుడొకడు

గణయతి ప్రాసల కలనైన నెరుగడు
భుజకీర్తుల న్దాల్చు ముచ్చొకండు
నృత్యంబునన్ గతిన్నిల్ప నేరడుగాని
పెండెరము న్దాల్చు వెఱ్ఱి యొకఁడు

భువినిదాసుల గొందరు బుద్ధిమాలి
నిన్నుబోలగనెంచి యింకెన్నొ బిరుదు
లందినామని పల్కు లనాడు చంద్రు
వేసముల జనులను మోసగింప॥

సీ॥ అతివల ముంజేతులందు నన్మెరనెడు
గాజులౌవారల కంకణములు
సుందరులందరు నందముగా దాల్చు
పట్టాలుగా భుజ బంధనములు
ముదితల పదములన్ మొరయునూపురములు
భీరులౌ వారల పెండెరములు
ఆటగాండ్రెద్దును పాటల నాడించు
విధమౌను సభయందు వీరిపసలు

అమృతమనుపేరు విషమున కలరునటుల
వీరికిన్గల్గు భిరుదముల్ వెలయునయ్య!
రత్నమటు మెరయును గాజురాయిగూడ
రాపిడివి భేదమగపడు జూపరులకు॥

గీ॥ సింగమునకును మరిగ్రామ సింగమునకు
కోకిలంబునకు బొంత కాకమునకు
పూషునకు భువి మెరుగుడు పురువునకును
వరలు నంతరమగు నీకు వారి కరయు॥

కం॥ ఎవని కృతంబున హరికథ
భువి విశ్రుతమయ్యేనట్టి భూసుర శ్రేష్ఠుం
బ్రవిమలు నారాయణ దా
సవరుని మద్గురునినతుల సంభావింతున్.

—హరి సోమయాజుల సుబ్రహ్మణ్యం

## దాస ప్రశంస

శ్రీయుతుడాధి భట్లకుల సింధు శశాంకుడు. నాట్యశాస్త్ర వి
ద్యాయుగ కర్త, వైదిక ప్రధానుడు, ద్రావిడవంశజుండు కా
త్యాయని భక్తుడున్, సకల తత్త్వకళామహిమాన్వితుండునా
రాయణదాస నాముడు దురంధరుడున్, రసికాగ్రగణ్యుడున్.

గానకళారసజ్ఞుడు, యుగంధర తుల్య చమత్క్రియా మనో
జ్ఞాన సుధీజనుండు, సరస ప్రణవాక్షర సాధకుండు మే
ధానిధి, విప్రుడున్ హరికథా పరమేష్ఠి గుణోత్తరుండు నం
స్థానవివాసి, పండితుడు, శాస్త్రవిశారదు డార్యుడాతడున్

ఈతని సాటిలేరు పృథి వీస్థలి, నాట్యకథా విధాన సం
గీతములందు. ముద్రలను కేవలషణ్ముఖివేసి చూపుటన్
ధాతసృజించు మానుష విధాన సరస్వతిగాక మర్త్యుడే!
ఈతనికీ తదేసరి మరెవ్వరు పుట్టగలేరు లేరికన్

కవియై గాయకుడై రసజ్ఞుడయి, విజ్ఞానాత్ముడై దాసుడై
భువి కావ్యంబుల పాటలన్ గళల సంపూర్ణాత్మ సంయోగముల్
నవనవ్యంబుగ కల్పనన్ సలిపె, నానారంగ దేశంబులన్
భవమున్ ధన్యతగాంచె నాతనికి, సంభావించె శక్తులున్

ఆతని జానకీ శపథ మంచిత గాన ర సామృతాబ్ధి త
జ్ఞాత లయ స్వరావళుల సంగతి రాగ వితాన పల్లవుల్
శ్రోతృహృదంతరాళ రసశోభిత సారసచంద్ర కాంత సం
గీత వివాదనా నిపుణ కేంద్రము రాగవినోద బద్ధమున్,

నవరస తరంగిణీ కృత
కవితారస సారమాంధ్రకవి లోకమునన్
నవనవ్యంబుగ నిండెను.
భువన వ్యాప్తిన్ లగించి బోధించెజుమీ

నవరసంబుల పోషించి నడుపుటందు
షేక్స్పియరుకవి మిన్నగా సిద్ధి పొందె
కాళిదాసుని కన్నను కావ్యమంద
నెడి, నిజంబును దాసుడే నుడివినాడు.

అచ్చుతెన్గున రామాయణాది కావ్య
రచనలెన్నియో చేసియు రచ్చగెలిచె
హరికథావళి కల్పించి, వరుల. సురలు,
కవుల మెప్పును పొందెను, భువిని మిగుల

గజ్జ తగిలించి చిడతలు కరమున నిడి
పూలదండ కంఠంబున, పాలరంగు
పట్టు పుట్టంబు గట్టియు. పరిమళించు
పులుగు, కస్తూరి, మేనను, పూసికొనుచు

రాగతాళ ధ్వనులతోడ రమ్యమైన
వేషభాషల మెప్పించి వేడి కాస్థ
లంబుజేరెడి హరిదాసు లావు ఠీవి
చూచి వర్ణింప తరమె త్రిశూలికైన.

ఏతాత్వికుండు సంగీత కళాశాల
విజయనగరమందు వెలయజేసె
ఏ గాయకుండు మహీపాలురు నుతింప
సంగీత భారతిన్ సణల నిలిపె
ఏ నాట్యకాచార్య డీభుమి నాటక
ప్రక్రియల్ చూపించి ప్రవరుడయ్యె
ఏ కవిరాజిమ్మహిని యచ్చ తెనుగున
రామాయణంబును రచన జేసె

ఏ మహాత్ముడు హరికథా నామ సార్థ
కతను గా పాడెనట్టి సత్కవిని, దాసు,
హరికథా పితామహుని, గాయకుని, సుజను,
నాదిభట్ట నారాయణు నాత్మదలతు;

అతడు చేయి త్రిప్పిన, ముఖాంబుజము న్విరియంగ జేసినన్
మూతి బిగించినన్ గమలు మ్రోడ్చిన, కాళ్ళు కదల్చి మోపినన్
బాతగ చూచినన్ లయ ప్రభావము తాండవమాడుచుండు నా
జాతకుడెట్టి పుణ్యమును సల్పెనో ? తాలయ బ్రహ్మ మెంతకున్.

—శ్రీ కళ్ళా గోపాలం ఎం. ఏ.

ఉ॥ మన్నన నేతు పెద్దల సమానుల మాన్యుల నాదరింతు సం
పన్నుడ కించనుండనెడు భావ మొకింతయులేక నందరం
గన్నుల నొక్కరీతిగను గాంచెద వార్య భవద్గుణాలి మా
కెన్నగ శక్యమౌనె పరికింపంగ విప్రకులాబ్ధి చంద్రమా!

ఉ॥ మానవ జన్మ మెత్తుటయె మంచి తపఃఫల సూచకంబగున్
దానికి తోడుగా చదువు ధర్మ పరాయణ బుద్ధి శీలమున్

దానము నిర్మలాత్మయు సదా భగవంతునియందు భక్తియున్
పూని జనించి నాడవని పూజ్యులు నీ దరి చేరుచుండెదర్.

ఉ॥ పెట్టెదు చేతులార కడు పేదలు దేహియటంచు వేడ జే
పట్టెదు సత్కథావళుల బల్కెడు పండితులన్ ముదంబునన్
రట్టొక యింత సేయక నిరంతర మాశ్రితకోటి నేలు నీ
యట్టి గుణోన్నతుం గవినయట్టి మహాత్ములు ధన్యులీ భువిన్

—నరిసిపురం సూర్యనారాయణ

యక్ష గంధర్వ కిన్నర ప్రేక్షణముల
స్వర్గము శివారుల కథా ప్రసంగములను
రంగవేది సంగీత నర్తన చణత్వ
మమరులను గూడ కైవల్య మందజేయు
గురుభరతుడవా! నందివో! గిరిజపతివా!

తరుణ గోపాలు చిన్ని పాదమును బోలు
లేత పాదాన తొలిగజ్జె మోతమోసి
చిన్నిగొంతు నాదబ్రహ్మ చేర బిల్వ
పాటగా నార్చి నూరేండ్లు నేటికయ్యె.

'శారీర' మన్న వస్తాదులు వరవడి
తీర్చుకోదగు మేనితీరు నీదె
శారీర' మన్న ఉస్తాదులు సాధించి
చేరుకోదగు గొంతు సొరునీదె
వైదుష్యమన విదాంవరులు జన్మలనెత్తి
చదువుకోదగు పెద్ద చదువు నీదె

ప్రావీణ్య మన కళాపరులు పురాసుకృ
తమున పొందెడు భరతమ్మనీదె
ఆదిభట్ల వంశమ్మున నాదిభట్టు
వాంధ్ర హరిదాస విశ్రేణి నాదిదాసు
వగుడు ముమ్మూర్తు లాదినారాయణుడవు
ఆదిశేషుడు మాత్రమే నగుదు నెటులు!

ఒకచరణంపుటందె పురుష్య చిడతాఁడవ శైలిచిందవే
తొక పదనూపురమ్ము లాలలనోచితస్య విలాసమాడ నీ
వొకడవె వాచికాభినయమొప్పగ పాత్రలు పెక్కుదాల్చి నా
టకగతి యక్షగానముల దక్కక నేలితి. దాస సద్గురూ!

శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారు, ఎం. ఏ.

## శ్రీ దాసవంశావళి

తే॥ వఱలు భువిలోన శ్రీ భరద్వాజ గోత్ర
స్మార్త వైదిక విప్రవం - శంబులందు
నాదిభట్టను వంశపు - టాది పురుషుఁ
డన్నిటన్మేటిఁ దలతునా - జన్నిగట్టు॥

సీ॥ సంగీతమున కట్టు - సాహితి తుదిమెట్టు
నాగమంబుల పట్టు - నాదిభట్టు
యెట్టి దిట్టలనైన - నెదిరించు తరిమట్టు
నన్నివిద్దెల తట్టు - నాదిభట్టు
శాస్త్ర చర్చలఁబట్టి - సాహిత్యమున మట్టి
యల్పబుద్ధులనెట్టు - నాదిభట్టు

ఘన ధైర్యమున గట్టు - తనకీర్తి కడలంట
నఱయు విద్దెల గుట్టు - నాదిభట్టు

తే॥ ఆతులరస పుష్టికై తల - కాటపట్టు
ప్రకట డాంబిక పరువును - బైటవెట్టు
వితరణాద్భుత కీర్తికి - వేల్పుచెట్టు
నన్ని విద్దెల మట్టుమా - యాదిభట్టు॥

క॥ తరతరము వారి నెన్నగ
కరము భరంబౌచు వెనయు - కబ్బము లౌచున్
తర పురుషున కొక్కటిగా
వరలెడు తద్వంశమందు - వరుస గడింపన్॥

క॥ ఆ వంగడమున వెలసెను
శ్రీ వేంకట చయని విమల - శివభక్తి కళా
ప్రావీణ్య - దగ్రగణ్యుఁడు
పీవర దృఢ దీర్ఘ భుజుఁడు - పృధువక్షుడై॥

క॥ కమలాప్తుఁడు తేజంబున
కుముదాప్తుఁడు కళలకెల్ల కువలయ విద్యా
ప్రమదాప్తుఁ డనగ నొప్పును
విమలాత్ముం డాదిభట్ట - వేంకట చయనుల్॥

క॥ అజ్జల జాప్యోపాసకు
సజ్జన నుత సదయ హృదయు - శాస్త్రపుటొజ్జన్
సజ్జవభుజ విక్రమయుతు
నజ్జాడ నివాసు వేంక - టార్య విలాసున్॥

క॥ అష్టాదశ పౌరాణికు
నిష్ఠాధికు చయని నెంతు - నిర్జరభాషా

ధిష్టానర సనుననుపమ
పుష్టిరసోత్కృష్ట కవిత - పూర్ణ పటిష్టున్॥

ఉ॥ ఆ మహి దేవరాయఁడిల - నాలిగ నేలెను సాహితీఖనిన్
దామర చూలి రాణికిని - దాసరి వాగ్విభవాది వాదనన్
ధీమణియంచు భూప్రజలు - దర్ణణ యశన్గొనియాడ నర్పమన్
యామెను చద్వులవ్వయని - యందరు బిల్వగఁజొచ్చి రెన్నుదున్

క॥ జపహోమాధ్యయన వ్రత
తపములకున్ఫలములనగ - తనయులఁ గనియెన్
తపన సమతేజు లేఫర
విఫల ప్రతిభాసమాన - విద్యాన్వితులన్॥

క॥ అగ్రజుఁడు జగ్గనాఖ్యం
డుగ్రుఁడు భుజశక్తిఁ గనస - మున్నత ధైర్యం
డాగ్రహ మెరుగఁడు సుందర
విగ్రహ జిహ్వాగ్ర నిగమ - విద్యాధికుఁడై ॥

క॥ తలతెగియె ధాతకాతల
తలవాకిటి వెలదికుంది - తననాల్క తుదన్
దలచూపి నటన మాడం
గలిగెను మా వేదగాణ - ఘను, జగ్గనకున్॥

క॥ పస చెడి మంధర తిరిగె
న్వెసవంగె న్పసిడికొండ - వింధ్యయు క్రుంగెన్
రసమయ్యె వివవుఁ గొండయుఁ
గసటయ్యె న్నుపమధృతికి - గన జగ్గనకున్

క॥ అనుపమ మతియుతుఁడాతని
యనుజన్ముడు సీతరామ - యాఖ్యున కెనయౌ

మనుజన్మ నెఱుఁగ మనుచు
జ్జనులెల్ల నుతింప నెగడె - సత్కీర్తి నిలన్॥

సీ॥ తలకట్టి తగు తెల్వి - తమ్ముకుఱ్ఱలఁ దెచ్చి
పెంచి పెద్దలఁజేసి - పేరుగాంచె
భువి తత్వ మెఱుగునా - రవియేమొ యితఁడని
కృషికులు మెచ్చ స - త్కీర్తిఁ గాంచె
నాగమంబుల నేర్చె - ననుపమ వ్యవహర్త
ధీవిశాలుండన - తెల్విమించె
విసుమాన ప్రతిభచే - నసమానుడై మించి
కష్టించి తాను లక్షలు గడించె

తే॥ సోదరప్రేమ బంధు జ - నాదరమున
ధారుణీ తలసారమ - సార మెరుగు
వేద విద్యార్థ విజ్ఞాన - విత్తముండు
సీతరామయ సరిలేరు - క్ష్మాతలమున॥

తే॥ అతనిసోదరుఁ డగ్ని హో - త్రాఖ్యుఁడాని
పంచ కావ్యంబులన్నతి - యించె నెలమి
భాతృ ప్రేమాస్పదుండయి - ప్రతిభ నెరపి
పుత్రపౌత్రాభి వృద్ధిగా - ముదము గాంచె॥

క॥ ధృతియుతుడు పేరయాఖ్యుడు
మతిమంతుడు లలిత గాత్ర - మహి తందోదై
శృతి శాస్త్ర సమ్మతంబుగ
కతలందమ్మునికిఁ దోడు - గాన మొనర్చెన్॥

క॥ ధీరోదారులు నల్వురి
కూరిమి తమ్ముండు కొట్ట - కొన వాడు ధర

న్నారాయణ దాసనగా
భూరి నుతుండయ్యె సభల - బుధులెన్న గడున్॥

క॥ భారతి స్తనముల దుగ్ధ మ
పారముగా గ్రోలి వచ్చి - పటుధీశక్తిన్
గారణ జన్ముండై భువి
నారాయణదాసుఁడన న - నన్యాదృశుఁడై॥

ఉ॥ కాలిని గజ్జె కట్టె కర - కంఠుని గజ్జెను సాటిసేయగా
పోలికఁ జేయయంచ నడ - పోకడఁ జూపెను కేకి కంఠమున్
బాలనఁ జేసె షడ్జమము - నందన పంచమ సుస్వరంబునన్
హేళనఁ జేసె కోకిల న - హీన గతి న్విబుధాళి మెచ్చగన్॥

చ॥ అసదృశ గాత్ర పాటవము - నద్భుత నర్తన సంవిధానమున్
రస నవకంబులు వృతిలు - రమ్య కథా కథన ప్రపంచము
ల్వెస వివరించు శ్రోతలకు - విస్ఫుటవాక్ప్రచయంబులన్మధు
ప్రసర రసౌచిత ప్రకట - భవ్య కవిత్వ సమంజసోక్తులన్

ఉ॥ పండిత వంశ సంభవుఁడు - భాసుర విగ్రహుఁడార్య సన్నుతా
ఖండల వైభవుండు పటు - గాత్ర సమన్విత గాన మాధురి
న్దండి మగండు సత్కవిత - దర్పిత సాహితి వర్తనంబుల
న్గండల మిండఁడౌచు విల - గాయకు లెల్లను గొల్వ నేపునన్॥

సీ॥ సంగీత సాహితీ - స్వరతాళ మాన స
ద్గాన ప్రబంధము - ల్కవితఁ గూర్చె
బాసల నాల్గిట - న్పటు సాహితిం జూపె
నలుమోము లొప్పెడు - నలువయనగ
ముక్కాల లయరాగ - ముల మేటియాతండు
నర్తనంబున మహా - నటుఁడనంగ

భారతీ స్తనయుగ్మ - భార వైభవ ప్రౌఢ
ప్రత్యర్థులం గెల్చి - ప్రథిత కీర్తి

తే॥ హరికథాగాన సుధఁ జిల్కి - నమృతమూర్తి
అతుల భారతి తద్రస - నాగ్రవర్తి
సరస కవితా సుధారాప్ర - చండ కీర్తి
సహజ సంగీత సాహిత్య - చక్రవర్తి॥

తే॥ కైత సంగీత నర్తన - గాన కళల
తెన్గు ఫారసి నాంగ్లాన - దేవ భాష
లందు సభలందు తొడవుల - నందుకొనుచు
మేటినేనని చాటెదా - నాటపాట॥

క॥ సంగీత ముఖుఁడు నర్తన
భృంగీశుఁడు యక్షగాన - వీణామహతీ
సంగత వైణికుఁ డభినవ
శృంగారాంగుండు వాగ్వి - జితశేషుండున్॥

క॥ శ్రుతిలయ కాలజ్ఞత త
త్కృతి సాహితి స్వరము పల్కి - ధృతలఘుప్రతతుల్
స్తుతకంఠ మాధురి న్గాం
తతి చుల్కఁగఁ బల్కి చెవుల - నానిరి తేనెల్॥

తే॥ చిల్లి పెంకేట వాలుగ - చెర్వునందు
విసరగాఁ దేలి వలయంబు - లెసగునట్లు
పాటనారోహ నవరోహ - పాటవంబుఁ
దప్పకుండగ పాడెను - దాసొకండె॥

క॥ ఎచ్చన్లొచ్చల తాయి
వ్వచ్చిన గొంతెత్తి విసరి - విచ్చల విడిగా

రెచ్చి యయిదారు వడులం
దచ్చవు గమకంబు పాడె – నందరు మెచ్చన్॥

క॥ అంగీకరించవలె నిల
సంగీతత్రయము దాసు – సరిరారనగా
భృంగి రిట నటన చాతురి
సంగతులగపర్చునట్టి – చాతుర్యమునన్

కం॥ నవరసము లొదవ మేధాల
ప్రవణత మీరంగ భావ – ప్రకటితపద స
త్కవితం జతురత వెలయం
గవిదాసు సృజించెగావ – కవితాకృతులన్

సీ। ఆచ్చ తెన్గున మాట – అల్లికన్కబ్బంబు
వలను గాదను వారి – వాయిఁగట్టి
ఆటల నే మేటి – నని చాటియొప్పింపఁ
గడగుచు కాళ్ళకు – గజ్జెఁగట్టి
పాటలన్నా పాటి – వాఁడెందు లేడంచు
దొఱ రచ్చ తిన్నెలం – దఱసిమెట్టి
నాల్గు బాసలమేటి – నాపాటికేడని
టీకు డాకాలి పెం – డెరముగంట

తే॥ పసిడి కడెముల గంటలు – పల్కుచుండ
మీస లెగదువ్వి తొడవుల – మేనఁబెట్టి
పెక్కు దర్వులనల్లి పెం – పెక్కినట్టి
మంతుకెక్కిన దాసు నే – నెంతు మందు॥

ఉ॥ ఒక్కొకఁ డీ ధరిత్రిపయి – నొక్కొక విద్దెను వన్నెకెక్కఁ దా
నొక్కఁడె పెక్కు విద్దెలను – వొప్పుచు పాండితి దుర్దముండన

న్జిక్కని సాహితీప్రతిభ - చే సభలందున బిర్దులందుచు
న్జక్కులు పిక్కటిల్లఁ గడు - సాంద్రతనించెను కీర్తిచంద్రికల్.

క॥ గిరులందు మేరునగమును
తరులందున కల్పకంబు తారల చంద్రున్
విరులందు పారిజాతము
కరులందై రావతంబు - గాదానెన్నన్॥

క॥ మగటిమి జగతిన్మీసల
నెగదువ్విన దాసొకండె - నెక్కటికైగా
జగజెట్టి పాటనాటల
దగువిద్దెల కెల్లనెల్ల - దానొక్కఁడనన్॥

క॥ నుడులకు తడవుల విడుపడు
గడిదేరిన పాటగాడు - కైసరుఁ డాట
న్మిడి, గుమ్మడు పొగడగడు
న్డవిన పురుదేది దాసు - దలఁపనెడందన్.

క॥ ఆటల పాటల నేటొ
మాటలఁ గూర్పంగకైని - మాద్రెన్నుటలో
మేటిఁగన దీటు నాటికి
నేటికినే నాటనైన - నెఱకై సరికిన్॥

క॥ వఱలు పలు విద్దెలందున
సరుదెన్న న్వాళ్ళి యనగ - చాటెన్పటిమన్
దఱచుగ విద్దెల జగతి
న్దఱ మెన్నన్నిందు మగడు - దానొక్కఁడనన్॥

క॥ పద్దెములఁ బన్నవచ్చున్
యద్దెడలుచు బండ్ల కొలది - యైనను దర్వల్

బద్ధ మన స్సంగీతపు
విద్దెన్బన్నంగ వేల్పుఁ - బెద్దతఱింబే॥

క॥ దర్వులఁ బన్నెంబో మెయి
పర్వన నొప్పింపనాడి - పాడంగలఁడే
సర్వండు నాల్గు చట్టపు
మర్వులఁదగు కట్టు బాట్ల - మైకో పెసఁగన్॥

క॥ ఎన్నిటఁజూడన్నన్నిట
కన్నాకన ఁ జెల్లుదాసుఁ - గన విద్దెలకున్
మిన్నలగువార లెన్నిరి
మున్నెరి కెనగల్గడంచు - ముందండ తరిన్॥

క॥ ఏడుగురు గ్రుడ్డివాండ్రు
న్గూడేన్గులోళ్లిచ్చి గొప్ప - గొండాడు నటుల్
యెడనెదొ విద్దె నెరిగిన
వాడెట్టు లెరుంగు దాసు - వాసి న్నిలువున్॥

సీ॥ సంగీత సాహితీ - స్వరముల వీణియ
నృలికింప నేర్చె - నా పలుకు వెలఁది
మోళ్ళి గురింపన - మ్మోహన రాగాల
మురళి మోయించెను - ముద్దు కృష్ణుఁ
డసమాన నర్తనం - బాడెడు ఢమరుక
న్వాయించు చెలమిన్గా - పరమశివుఁడు
గాన మొనర్చిరి - గాణ లిర్వురు జంట
హాహాహూహూవులను - నమర వరులు

తే॥ ఇన్ని విద్దెలు తనయందె - నిమిడియుంట
వారి విద్దెల నెల్లని - వ్వ సుధఁ జూప

నవతరించిన నారాయ – ణాఖ్యదాము
పాటిఁ జెప్పంగ వేల్పులే – పాటి దలప॥

క॥ సురగురు డరసిక సరసత
నెరు గండని కాదె తార – యెనసెం జంద్రున్
సరసుండు రసికుఁడగు నీ
పురుషున కున్సురగురుండు – పూపగునె మహిన్॥

క॥ అందముల ప్రోవు సుందర
మందార మరంద మొలుకు – మధుర కవిత్వా
నందు సుధీజనవందితు
ముందుగ నేనెంతు చయని – ముద్దులకుఱ్ఱన్॥

తే॥ జాజి, చెంబేలి మల్లె పూ – జల్లినట్లు
జుంటి తేనియ నాల్కపై – సోకినట్లు
పలుకుపలుకున ఫల్కుండ – లొల్కుఁ బలుకు
దాసు కరవయ్యె తెన్గుల – వాసి యడఁగె.

తే॥ చతుర వాచోక్తి విఫలార్థ – సత్యసూక్తి
భక్తి శ్రీహరి కథఁబాడి – బ్రతికి తుదకు
ముక్తిఁ గవియెను లలితాది – శక్తిఁ గొల్చి
స్తవము లేదిందు సుంత వా – స్తవమిదంత.

సంగీతత్రయము = 1 ముత్తుస్వామి దీక్షితులు 2 శ్యామశాస్త్రి 3 త్యాగరాజు – నాల్గు చట్టపు మర్వులు = సారస్వతానుబంధమగు శాస్త్రములు నాలుగు 1 వ్యాకరణము 2 ఛందము 3 సంగీతము 4 భరతము ఈ నాల్గు శాస్త్రముల రహస్యములు.

—ఆదిభట్ల సూర్యప్రకాశం

The clock struck five, I rose up from my bed.
Huddled on my vesture and away led
From crafty, dusty, sultry, dinning town;
To renew my esprit, to calm fields down,

I trotted through tossing bush and brier.
When birds retired striking their pleasant lyre,
Where vernal airs blew constantly with glee.
Until I hit on an unwieldy lea.

Doleful are we, the sun sank in the vale,
But owls are hooting in the gayful gale;
To our delight there came from far off scene,
Narayanadas, brightened all the green.

He wore a turban on his sublime head,
And bore a club, and towards me he tread:
Although a hoary head his Will is still,
Both sinews and thews are strong but not ill,

He came of from high blood, his noble state
Is due to his highly talented pate:
Omniv'rous reader, and facile writer.
Our concordant and exquisite songster.

The poor well know his home and claim a share
He gives them alms with glee; as he would bear.
Listen! so meek and kind at heart is he.
So strident, hard, severe, and stern to see.

His placid touch on pen will read'ly fill,
Books after books of living matter, till

The pen begets weary! and this will tie
Sorrowful pleasure in our inward eye.

The mere opening of his vocal sack
'Pens the door of other world with a crack,
Fills with merriment and varied fragrance.
And we will be stilled with delight intense.

The mere utterance of the name of God,
At our end, fits us to heavens to trod;
If we pray Him in our limited time,
We can easily gratify our aim.

But due to Maya, we live in the sun,
Wholly deprived of what is to be done:
Besides. we believe this world phantasmal,
Run ·stray to keep up high, and turn dismal.

To bring us to right path. he wrote and spread
Harkaths all o'er the world we trod and tread
To performances; we heard him. we hear;
Thence we may spell Him out then, and go near.

It's he that revealed an easy entrance
To heveans. Observe! his benevolence:
Sweet friends, have his performances and raise
Our voice high. such a worthy man to praise.

The Gandapendaram naturally
Nicely fitted to him and him only;
Master in four languages, and three arts;
A pointed prong in all arrogant hearts.

He walks with kings, neither cringes nor fawns:
He never shows disdain towards commons;
He will never count too much praise or blame,
Always treats both Weal and Woe just the same.

Now the glimmering light faded away,
Shrill sigala set to sing by our way;
When Eternal Flowers gladly did mean
Guiding us, we plodded away the green.

—Kavlipati Suryarao.

Our mother, th' Andhra Muse, free gave thee birth:
Our grandmath' aged Sanskrit Muse, nursedthee;
Suckled thou wast by the English Muse with glee;
Pleased with thy music skill and growing werth.
Sweet Parsi wedded thee with swelling mirth:
Launching the boat of case on the wide sea
Of joy to meet fair frame thou hast sailed free.
And made thy name soon spread all o'er the earth
As fits thy holy name, true devotee
Of Narayan thou art, whose love made thee complete
the sixty years' long cycle free.
By ever blooming glory wed with glee:
May the make thee complete one cycle more
To spread thy lore and add to thy fame's store.

—Jayanti Sitharamaswami B.A.,L.T

విద్యావాచస్పతి రభినవ స్తాండవే నందికేశః
హాహాహూహూ ర్నిజగళరవే నానవిద్యా మరర్షి.
పారాశర్య శ్రుతితతిసమాలోడనే త త్తనూజః
అఖ్యావేషు త్వమసిభగవ న్నాదిభట్లా స్వయేందో.

పదానాం విన్యాసా త్ప్రచలతి ధరా నృత్యసమయే
కథానా మాలాపా త్ప్రతినదతి రోదో న్తరమపి
నినాద "శ్శంభో" ఇత్యభిమృశతి పైతామహ పదం
త్రిభిః కాన్తం సర్వం జగదపి రమేశేవ భవతా,

అంగైః పంచభి రేకదైవ భవతా మధ్యేసభం ధీమతాం
నానాతాళగతిప్రదర్శనకథా సంచారితా యాద్భుతా
ద్రష్టుం తామకృతవ్రతాని నయనా స్యస్మాదృశాంసాంప్రతం
ధన్యాని శ్రవణాని నోల్పసుకృతా చ్ఛ్రేయః కుతో మేదురం.

నిత్యల త్త్వద్వదనారవిందమకరందాస్వాదనే సువ్రతాః
ధన్యాః కేసరిణో బభూవు రితియ చ్చిత్రం నత త్ప్రత్యుత
యేతు త్వ త్పదపద్మసౌరభ మనాఘ్రాయాపి గంధాన్వితాః
తేహ్యాశ్చర్యకరా నరాః కథమపి త్వన్గౌరవం సూచ్యతే.

అర్క స్తేజసీ చంద్రమా రసజుషా మాహ్లాదనేంగారకః
శీలే శాస్త్రవిలోడనేనచ బుధ శ్శేముష్యుద న్తే గురుః
కావ్యౌఘేన కవి శ్శనై శ్చరతివై కాయాతిభారా ద్భువాన్
సఃజగ్ము స్త్వయి వాసరాధిపతయ స్సర్వేప్రసన్నాత్మనః.

వామేపార్శ్వే కృతపరిచయే వాజిపేయాస్వవాయే
పార్శ్వేవన్యస్మిం, స్తవ పరిగతే నేతివంశప్రభూతే
ఇందో ర్లక్ష్మీ మనుగతసురాచార్యకావ్యస్య బిభ్రత్
త్వం ద్రష్టౄణాం నయనకుముదోన్మేష కారీ తదాహి,

—శ్రీ నల్లాన్ చక్రవర్తి కృష్ణమాచార్యః

పారశీకగిరాబద్ధాఖైయ్యామకవిమాధురీ
ఆంగ్లభాషాసుయోగేన పరమాం ఖ్యాతి మాగతా.

సైవేదానీం కవేర్గీతి ర్దేనవాణ్యా విభూషితా
రసాతిరేకమా పన్నా మాగుణాలంకారసంశ్రితా.

వాగీశ్వరీ ప్రసాదేన హృదయాహ్లాదదాయినీ
కౌముదీవవిథోఃకస్య కృతిరేషాన నన్దినీ.

కావ్యగుణ రసాస్వాదః కృతోయేనహ్యను త్తమః
సశబ్దధ్వనిసుర్మజ్ఞో దాసో నారాయణః సుధీః

మాధుర్యస్య పరాం కోటిం వితరాం ప్రాపయన్ బుధాన్
లోచేస్మిన్ సతతం శుభ్రాం పరమాం కీర్తిమాప్నుయాత్.

—శ్రీ జ. శ. గులేరీ

ఆబాలవృద్ధు లేయార్యుని విఖ్యాతి
దిశలెల్లఁ బ్రీతి నుతించువారొ!
భక్తితోఁ బాడంగఁ బ్రజలు మైమఱచు న
ట్లమరగాన ధురీణుఁడగు నెవండొ!
నారద మౌని యనన్ నృత్యగానముల్
రాజిల్లు బహుముఖ ప్రజ్ఞుఁడెవఁడొ।
యజ్ఞ తుల్యమ్ముగ నఖిలకార్యాచర
ణముఁ జేయునట్టి ధన్యాత్ముఁడెవడొ!
దాపునకుఁ జేరు శిష్యబృందముల కెల్ల
సంశ్రయం బెవ్వఁడా బుధజనుని నాది

భట్లనారాయణాఖ్యుని, బరమ పూజ్యుఁ
జేతులను మోడ్చి ప్రస్తుతించెద సతమ్ము.

—శ్రీ సి. హెచ్. వి. నరసయ్య

ప్రణవం బక్షర శబ్ద తత్త్వమున, సర్వవ్యాప్త నాదంబుగా
గుణ సంభూన్యుఁ బరాత్పరున్ గదిసి, ద్వైగుణ్యాంచితబ్రహ్మయం
దణిమన్ జేరఁగ శారదా ప్రథను, రాగాలాపశక్తిన్ సుధీ
ప్రణిపత్తిన్ బరమేష్ఠియందె, నిగమవ్యాహార దివ్య శ్రుతిన్."

రాగవిధాన నంజనిత రశ్మివి, పద్మజుఁడాత్మకోశమం
దోగు నదల్చి, హంసవిభలోన్మిత సత్వమునంది, వాక్పతీ
యోగ సమష్టిపుష్టపురుషోత్తముఁడై విలసిల్ల, ఫీవియ స
ద్యోగ విభూతి నాకృతిగ దోఁచె నతండిల నాది భట్టుఁడై.

శబ్ద బ్రహ్మము లేకమాట నజుఁడజ్ఞాదన్ స్వకీయాత్మరూ
పాబ్దంబింద, సహస్రమాస మఖ నవ్య వ్యాహృతిన్, ధారుణిన్
శబ్దించెన్ హరిదివ్యతత్త్వ విషయ జ్ఞానమ్ము సంగీత శా
స్త్రాబ్దంబంద సుధాభి వర్షణ మభూతాదిష్టతాళధ్వనిన్!!

భాషాయోక్తగ, భావ సంపదను శ్రీ వాగీశ్వరీ భర్త దా
పోషించెన్ భువి నాట్యలాస్య జటిల ప్రోహార్ద సంవేదమున్
శ్లేషాహార్య విశిష్టహాస్య కధనోత్సేకంబునన్ శ్రీపతీ
భూషాలాలసహాసమున్ వలచి, సంపూర్ణోక్తి శృంగారియై !!

నరుఁడై, శ్రీహరిదాసుఁడై, కధకుఁడై, నారాయణజ్ఞేయుఁడై,
పరతత్త్వేంగిత శంకర ప్రథితుఁడై, బ్రహ్మప్రసిద్ధాత్ముడై.

స్వరరాగామృత సంప్రదాన పరుడై వాగ్గేయకారప్రథన్
నరనారాయణ తత్త్వ సంభృతిని, ద్వంద్వాతీతుఁడై జూపడెన్!

యోగపితామహున్ రసిక యోగ్యవచోవిభవాంఛితున్ ధరి
త్రీగణితవ్య భాగవత దీక్షను గాంచి, సరస్వతీ సతీ
నైగమ భావమాళ నొగి, న్యాయ నిధానము నందె భూస్థలిన్
రాగ వశంబు గాదె? మది రంజిలఁ బల్కెఁడు పల్కు లెయ్యదన్!

కవి విద్వాంసులె భట్లు లౌట, శత సంఖ్యాభట్టు లట్లాధిభ
ట్ల విభావంబున రూపునంది, హరిసల్లాపంబులన్ యక్షగా
న విలాసంబున ధాత్రిపై మెలఁగి, ప్రజ్ఞావ్యాహృతిన్ నించి, దా
వ్యవధాన స్మృతినంది, బ్రహ్మయగుటన్ బ్రాపించె సత్యస్థితిన్!

భూగోళంబది, నాదతేజముల సంపూర్ణావృతిన్ గాంచుటన్
యోగ ప్రాభవ శక్తి సమ్మిళిత శబ్దోపాసనల్ శశ్వదా
యోగంబంది ప్రపంచితంబగు. మనోవృష్టిన్ వినన్ సాధ్యమే
నాగానంబెపు డవ్యయస్మృతిని, భక్త్యావేగసింధుశ్రుతిన్!

శతవర్షమ్ములు బ్రాహ్మణాయనుకకున్ శశ్వద్కథాఖ్యాతకున్
ప్రతిభాసిల్లగ లిప్తమాత్రమటు; సర్వవ్యాప్త కీర్తిస్థిరున్,
శ్రుతి శారీర విముక్తు; జన్మయతను స్ఫూర్తాత్మ తేజోమయున్
మితి మానంబుల కాలమంతగలదే! మృత్యుంజయోద్భాసిగాన్!

—శ్రీమతి బుర్రా కమలాదేవి

సరస సంగీత సాహిత్య సత్కవిత్వ
నిలయ విద్యానగరిని జన్మించె గాని
భట్టవంశ సుధాంబుధిఁ బర్వపూర్ణ
చంద్రుఁడయ్యెను శైశవ సమయమందె

నవనవోన్మేష మేథ ఘనత్వమంద
నెల్లరకు నబ్రముం గూర్చుచేమి వింత
ప్రథిత విద్యత్కవుల నుతుల్ పడసెమిపుల
పిలువ ఓ యను నట్లుదేనిన్ భజించె

సంస్కృతాంధ్రి నిరర్గళ సాహితిగవి
ఉభయ భాషా కవితయుఁ దానోలగించె
ఆంగ్లభాషయుఁ దననార లబ్రమంద
నున్నతపరమ్ముఁ గొనఁజేరె సన్నుతులను

ప్రధితుఁ డానందగజపతి ప్రభువు ప్రాణ
పదముగాఁ జూచె నాస్థాన పండితులను
సంస్కృతాంధ్రంబులను కావ్యసరణి రచన
హరికథా గేయరచన మహాద్భుతంబు

గొలిపెరామాయణాదుల నలుగడలను
విజయముంగాంచె గానప్రవీణు లలర
భరతనృత్యంబు నను "లయబ్రహ్మ" యనఁగ
సప్తతాళంబులను నేక సమయమంద

నడిపె సప్తా వయవముల నిడుదవచన
ములను వర్ణనలను కథాంబుధుల యందు
పోతు పెంటి కరళ్లుగా శ్రోత యెదుట
ఉన్నదున్నట్లు ప్రకృతుల గన్నుపండు

వుగను జూపించె సభ విరాట్పురుషుఁడనుచు
దూలఁజల్లుచుఁ జూచెను బోదలున్ వి
మర్శకులు యోగులున్ మెచ్చ మహిమ జూపె
త్యాగరాజ జయన్తి పుష్యమ్మునందు

తనయుపాసన దేవితోఁ దలపు దెలిపి
పౌత్రు బ్రదికింపఁ జూపఱబ్బురము జెంద
ఆత్మయోగమ్ము నంతరాస్యమ్ము దెలుప
సరవిజగ మెన్న స్వచ్ఛంద మరణుఁడయ్యె
తవియ నారాయణ బుధుండు ధన్యతముడు.

— శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు

శ్రీయుతుఁ డాదిభట్టకుల సింధు సుధాకరమూర్తియైన నా
రాయణదాసవర్యు ధిషణాధికతన్ సరితూఁగఁ జాలు వా
ణీయులు పుట్టియుండ రవనిన్ గతమందున, వర్తమానమం
దేయెశ లేరు, ముందు జనియింపరు! మెచ్చున కొక్క రేవియున్.

సీ॥ ఇరుహస్తములతోడ చెరియొక తాళంబు
చరణద్వయాన నేమరక రెండుఁ
బచరించి పల్లవిఁ బాడుచుఁ గోరిన
జాగాకు ముక్తాయి సరిగ నిడుట;
నయమొప్ప వ్యస్తాక్షరియను, స్యస్తాక్షరి
ఆంగ్లంబులో నుపన్యాస; మవల
నల్వురకున్ దెన్గునన్, నల్వురకు నంస్కృ
తంబున వలయు వృత్తాలఁగైత;

గీ॥ సంశయాంశమ్ము శేముషీశక్తితోఁ బ
రిష్కరించుట. గంటల లెక్కఁగొంట
మరియు ఛందస్సుతోడ సంభాషణమ్ము
దనర బొనరించె నష్టావధాన మతఁడు.

సీ॥ "అహహ! యీతండు వాణ్యపరావతారమే
వేయేటి!" కని నుతిసేయువారు;
పలుబాసలందు నేర్పరి, వీరికిన్ సాటి
పుట్టఁబో రౌరు"లని పొగడువారు!
"కంఠరావము ఘనాఘన గర్జనంబుల
కెదురొడ్డు" నని యుగ్గడించువారు;
"గానసాహితు లసమానముల్, సౌందర్య
మంతకె"చ్చని కొనియాడువారు;

గీ॥ తెనుఁగు గడ్డకు వన్నియఁ దెచ్చినట్టి
యీ మహామహుఁగని తరియించినాము:
భాపురే" యంచు సంతృప్తిఁ జూపువారు
వైరి సభలందు, భావుకు లాతనిఁగని.

సీ॥ అష్టావధానంబు లవలీల సల్పుచు
వైణికవిద్యఁ గేవలతఁగనుచు.
హరికథాగానవిఖ్యాతిఁ "బితామహ"
బిరుదాన గండపెండరముఁగొనుచు,
పల్లవి ధృతవిలంబమ్ములఁ బాడుచు,
నధ్యాత్మచింత నిత్యంబు మనుచు,
భరతశాస్త్రము నృత్యపటిమ వెలార్చుచు,
ఋక్తతి సుస్వరయుక్తి నగుచు,

గీ॥ అప్రతిమమైన సర్వకళాప్రపూర్ణ
మూర్తియై, దేశదేశాల మ్రోగిన యశ
మోశలన్ వెల్లఁబూయ, నారాయణబుధు
డాంధ్రులకు గర్వకారణుడై లసించె.

సీ॥ నీగజ్జె కదలింపు నేర్పున భరతశా
స్త్రంబు వినూత్న తేజమున మించె;
నీదివ్యసాహితీనిపుణతకున్ బృహ
స్పతియైన మెచ్చి అంజలి ఘటించె!
నీ మేఘగంభీరనిస్వనంబున దిశా
వలయంబు మారుమ్రోతల ధ్వనించె
నీయేకవాగ్గర్భిణీకాంత వేయి ఖా
వాల బిడ్డల నవలీలఁ గాంచె

గీ॥ నాంధ్రభారతి వీవయి యవతరించి
శ్రీ యాదిభట్ట మాన్యకులజాత;
వాసికెక్కిన శ్రీహరిదాసవర్య!
నన్ను దీవింపరమ్మ వందనముఁగొమ్మ.

—శ్రీ దీక్షిత దాసు

కం॥ శ్రీ నారాయణదాసుని
గానవిశారదుని యక్షగానాఖ్య కళా
జ్ఞాననిధి విమల చరితము
శ్రీ నారాయణు డొకండె చెప్పఁగ నేర్చున్.

ఆ॥వె॥ ఆతఁడెన్ని విద్య లభ్యాస మొనరించె
నన్ని విద్యలందు నారితేరి
నట్టివారె కావి యమ్మహామహుఁగాథఁ
జెప్పఁజాల రొరులఁ జెప్ప నేల!

చంపక మాలిక

అతని కతండె సాటియగు
నాంధ్రుల భాగ్యపుఁ బంటయై బృహ

స్ఫతి సమబుద్ధిశాలియయి
వాగ్జిత సర్వ కులాధి నాథుఁడై
చతురత యక్షగానకృతి
సంచయమున్ రచియించి శిష్యసం
తతికవి నేర్పి సర్వజనతా
ఘనతోషణరీతిఁ దత్కృతి
ప్రతతిని బాడి యాడఁదగు
పద్ధతిఁ దా నొనరించి చూపి గ
ర్వితమతులైన పండిత కవీశ్వర
గాయకరత్న గర్వప
ర్వతపవియై విదేశ కవి పండిత
సన్నుతిఁ గూడఁ గాంచి సం
తత భగవత్పదాబ్జ యుగదత్త
మనస్కుఁడుగా జెలంగి సం
స్కృత ముఖనైక భాషల విశేషముగాఁ
గృషిఁజేసి యన్నిన్
గృతమతియై కృతార్థుఁడయి కీర్తి
లతాంగి మనోహరుండునై
యతుల విరాగియై యతుల
కందని బ్రహ్మపదార్థ శా
శ్వతముగనుండు నా ఘనుని
చారు చరిత్రముఁ జెప్పశక్యమే!

—శ్రీ వాజపేయయాజుల వేంకటరమణయ్య

శుంభన్మోహన యక్షగాన విభవాస్తోక ప్రభావమ్ము సం
రంభమ్మొచు రసజ్ఞ లోకముల కాహ్లాదమ్ము సంధింపగా
“శంభో” యన్న భవన్నుతిప్రతతి విశ్వమ్మందు మార్మ్రోగుతే
అంబోధిప్రతిమాన గర్జనలతో - ఆ నాటి కీనాటికిన్.

చిటికెల్ కేలి మనోజ్ఞనాద సుమవృష్టిన్ సృష్టి సల్పంగ ది
క్తటులన్ దిగ్భ్రమలోన ముంచినది నీ గాంధర్వమే; భవ్య సం
ఘటనమ్మాంధ్ర చరిత్రలో భవదమోఘప్రజ్ఞ - యుష్మత్కళా
చటుల ప్రోజ్జ్వలరీతి భారతికి శశ్వద్భూష విద్వన్మణీ !

తెలుగుంబోకడ లొక్క పజ్జ మమతన్ దీండ్రింప గీర్వాణ సూ
క్తుల లీలా మహిమమ్ము లింకొకయెడన్ గూర్మిన్ రగుల్కొల్పి మం
జుల శయ్యాసుకుమార సంపదలతో శోభిల్లు కావ్యాంబుజ
మ్ముల వాణీచరణమ్ములన్గొలుచు నీ పుణ్యమ్ము నగ్గించెదన్.

సిరియును జ్ఞానబలమ్మును
తరుణకళా సంపదయును ధార్మికగుణ త
త్పరతయు గవితాచణతయు
హరికథకుల నీకెయబ్బె నధికాధికమై.

యక్షగానమునకే దక్షతం గూర్చె నీ
మోహన ప్రవచనామూల్య శక్తి;
సంగీతవిధులకే సఫలతన్ దెచ్చె నీ
మధురగళస్రవన్మహితరీతి;
భరతభంగిమలకే పరువును నిల్పె నీ
నవనవోజ్జ్వల నటనాప్రశస్తి;
కావ్యవాహినులకే ఘనతను బెంచె
సత్యసంబద్ధ సాహిత్యసృష్టి.

తెలుగు జగమునకే క్రొత్త వెలుగు నిచ్చె
తావకమనోజ్ఞ రూప తత్త్వప్రదీప్తి
భారతీయతకే నవప్రతిభ బెంచె యుష్మ
దద్భుత మేధా మహోన్నతదశ.

మాయని కీర్తి గాంచితివి మానవ మానసపీఠిమీద సం
స్థాయముగా రహించు జలధుల్ రవిచంద్రులు వెల్గుదాక నీ
తీయని గానగాథ - ఘనదేశిక గౌరవ భావభాస! నా
రాయణదాస! పూర్ణదరహాసవిశేషవిలాస! తే నమో!

నటనము గానమున్ కవనమై పుణి ప్రేక్షకలోక భావనా
పటిమపయిన్ ఘటించెనట బంధురభక్తిమయ ప్రవృత్తి - ము
చ్చటపడి నీ కథాకథన చాతురిగాంచ ధన్యజీవు లి
ప్పటికిని పారవశ్యమున వాకొనుచుండెద రీయథార్థమున్.

వలపుంజూపె మహాంధ్ర మవ్యయముగా వాత్సల్యతన్ జీరి భూ
తల మెల్లన్ ఘనసత్కృతుల్ సలిపె నౌదార్యమ్ము విండార సీ
మలు కొండాడిన శేముషీవిభవ సంపన్నుండవౌ నీ కళా
బలమున్ సంస్మరియించి మ్రొక్కులిడు యావద్దేశ మీవేళలన్.

కళలు సర్వేశ్వరుని పాదకమలసేవ
కర్పితములగుటే లక్ష్యమని వచించి
వలచి వచ్చిన విద్యల బలము తోడ
హరికథల బాడి యాడినా వనఘము నీవు.

నీ సంకల్పమె నిల్పె నుద్యమముగా నేడీ మహాంధ్రమ్ము సం
దో సంగీతకళానిధీ! హరికథాయోగ ప్రవీణా! మహో
ల్లాస ప్రోజ్జ్వల సాహితీవిభవ లీలాలోల! వేదాంత వి
ద్యా సంపన్న! దయామయా! భరతనాట్యాచార్య! విద్వత్ప్రభూ!

మదికింపున్ ఘటియించు గానకళతో మాన్యుండవై జ్ఞానసం
పదలన్ బంచి హరిన్ స్తుతించి కవితా పాండిత్యసంపుల్లమౌ
హృదయమ్మున్ వివరించి మించితివహో! హేలాగతిన్ త్వాదృశుం
డుదయమ్మందిన జాలు నొక్కరుడు జాత్యుద్ధారకుం డుర్విపై.

ఎనలేని గౌరవమ్మును ధనకనకమ్ములన నన్య దర్పముతోడన్
గొనజాలిన ఘనుడా వందన శతమో హరికథా పితామహ! మావ్యా!

....శ్రీ బృందావనం రంగాచార్యులు

ఆవర్జితాంధ్ర హృదయ ఆదిభట్ట కులోద్భవః।
ఆద్యో గురుశ్చ సర్వస్యా హరికథక్ సంతతేః॥

వ్యాపయ న్కీర్తిమాంధ్రాణాం కృత్స్నే దేశే సుధీరయం।
సర్వా న్విస్మాయయామాస స్వవైదుష్యేణ పండితాన్ ॥

జయదేవోఽథవా త్యాగరాజో వా పునరాగతః।
శ్రీ నారాణతీర్థో వా నారాయణ శుభాహ్వయః ॥

ఆంధ్ర గీర్వాణ హూణాది వాణీ యద్వశగాఽభవత్ ।
యస్మిన్ సంగీతనాట్యాది కళాః పుంభావ మాగతాః॥

శ్రోత్రం గీతేన సర్వస్య నేత్రం నృత్యేన తోషయన్ ।
మనః కవిత్వశక్త్యాచ యోఽభవత్కథకాఽగ్రణీః॥

—శ్రీ జటావల్లభుల పురుషోత్తము

సాహిత్య మార్గో రస పూర్ణరూపః
ఆలోచనా నిత్య పటిష్ఠదీపః
జ్ఞానామృతః పూర్ణబుధైకగమ్యః
తత్ర ప్రసన్నకలాభిరమ్యః॥

గానం శ్రవో మాత్ర సుఖాతి రేకం
నృత్యం సమాలోక రసావ్యళీకం
త్రీణ్యేకరూపేణ సమా విశేతీకః
యథా త్రివేణీకృతదివ్యగంగాం.

శ్రీకాళిదాసః కవితాప్రసన్నః
శ్రీ నారదో గానసుధాభిగణ్యః
శ్రీశంకరోనృత్తవిధౌప్ర సిద్ధః
వాస్త్వత్ర లోకే త్రివిధేఽపి సిద్ధః.

కవితామధురో నటోద్ధతో
మృదుసంగీతకలావిశోభితో
సురవాగ్ జనవాగ్విశిష్టవాక్,
ఇతినారాయణదాస ఉచ్యతేః

సభాముఖే వాదజయప్రశస్తిమ్।
మత్తోఽద్య హర్తుం పటురత్రకోఽస్తి?
ఇతిబ్రువన్నేవ వివాద ధీరః
సభాసు నారాయణదాస ఆసీత్॥

పండిత పామరతోషణ వీరః
సత్యవచః పటుభాషణ ధీరః
అర్థతృణీకరణేగణనీయః
ఆస్త, స, కీర్తన విత్ హరిదాసః.

—శ్రీ గంటి జోగిసోమయాజి

కలౌకాలే ప్యస్మిన్ విపుల భవ పాథోధి తరణ
క్రియాయాం దుర్భేద్యాః స్మృతి శ్రుతి పురాణాది పటలాః
హృదీత్థం కారుణ్యా ద్విరచిత మభూ ద్రామచరితం
యథార్థాభిఖ్యేన ప్రణుత! భవతా తారకమయం.

షట్తంత్ర ప్రతిభావిశేష మహిత స్తత్వ ప్రబోధాదర
స్సంగీతార్ణవపారగో హరికథాగానాబ్జ జన్మ సదా
ఛాత్రాణాం వరదః ప్రసన్న హృదయో నానాసభా పూజితః
శ్రీ నారాయణదాస దేశికవరశ్శ్రేయో దదత్వవ్యయం.

— శ్రీ మల్లాది చంద్రశేఖరశాస్త్రి

సిగలో పూవులుపెట్టి, అత్తరువు వాసింపూసి మైపూతగా
నొగి గంధమ్ము నలంది, మీసముల నొహో పుట్టగాదిప్పి, శ్రీ
విగఁ దాళమ్ములు చేతఁబూనుచును బూవిల్కానిదా సోయగం
బగుపించన్, కతసెప్పు నీహొయలు మేమాసింతు మీనాటికిన్.

అడుగుల్ మువ్వలమోత నటువలకొ నా గుబ్బుగా నాడుచో
ఒడికమ్మొప్పగ వింతవింతలగు నీవయ్యారపుం బోడుముల్
కడలేకుండగఁ జూచు మానిసుల కేలా వెన్నలందోఁచు నా
బుడుతం డాడిన ఆటపాట గొనబుల్ పున్నెంపుఁ గైవారముల్.

తెలుగు పడంతి కాన్పు, గడిదేఱిన ఎక్కటి పాటగాడు, మేల్
తలపు హొరంగువాఁడు, పలుదారుల విద్దెలవాఁడు కైతకున్
నెలవగువాడు మా తెలుఁగు నేలకు సొమ్మగువాడు, ఎప్పుడీ
యిలఁ దిరమైనవాఁడనుట నెంచిన నాయెద పొంగి పాడెడున్.

